శాస్త్ర విజ్ఞానము చరిత్ర తెలుగు - ఉర్దూ అకాడమీ ప్రచురణ—౨౨

# బ్రిటను దేశచరిత్ర

( పూర్వభాగము )



గ్రంథకర్త :

ఖండవల్లి బాలేందుశేఖరం



ప్రకాశకులు :

శాస్త్రవిజ్ఞానము చరిత్ర తెలుగు-ఉర్దూ అకాడమీ

హైద్రాబాదు.

**1967**



అకాడమీ అధ్యక్షులు :

డా॥ బూర్గుల రామకృష్ణరావు

# తొలి పలుకు

కథలను వినుటకును, చదువుటకును, ఇష్టపడని వారుండరు. దేశ చరిత్రలు కూడ ఒక విధమైన కథలే. ఉత్తమ కథకుడు వ్రాయు కథ లాహ్లాదమును చేకూర్చుటయే కాక, మిక్కిలి అర్థవంతములును, ప్రయోజనకారులుగను ఉండి, ఉత్తమ లక్ష్య సాధనలో మానవునికి చేయూత నొసంగును. దేశ చరిత్రలు రాజులు, మంత్రులు, సేనా నాయకులు, మున్నగువారి వీర గాథలు మాత్రమే గాదనియు, అవి ఒక దేశమందలి సమస్త ప్రజల ఇతివృత్తములనియు, విజ్ఞానవంతులగు చారిత్రికులు చెప్పుచుందురు. దేశ చరిత్రలలో ఒక జాతివారు కావించిన సర్వతోముఖాభివృద్ధి వర్ణింపబడును. అట్టి యభివృద్ధికి గల హేతువులు చర్చింపబడును. కొన్ని కొన్ని సందర్భములలో జాతికి పతనము కల్గినచో, అందులకు గల కారణములను కూడ చారిత్రికుడు పరామర్శ చేయును. రాజులు, ఉన్నత వంశీయులు, ధనాఢ్యులైన భూస్వాములు, మత గురువులు, సామాన్య ప్రజలు మున్నగువారే యే కాలములో, ఎంత వరకు జాతీయవికాసమునకును, పతనమునకును కారణభూతులయ్యిరో, దేశ చరిత్రలు వివరించును. కావున విజ్ఞానవంతుడైన ప్రతి మానవుడును కూడ, తన దేశపు ఇతిహాసమును, ఇతర దేశముల గాథలను సవిమర్శముగ పఠించి, ఆనందమును పొందుటయే కాక, లబ్ధమైన ఐతిహాసిక విజ్ఞాన సహాయముతో, తన జాతిని, తనను, ఉన్నత స్థాయికి తెచ్చుకొనవలెను. ఆంధ్ర పాఠకులీ యుద్దేశ్యముల

సాధింపవలెనను కాంక్షతోడనే, ఈ అకాడమీవారు వివిధ దేశముల చరిత్రలను ప్రచురించు చున్నారు.

ప్రపంచ చరిత్ర యందత్యుత్తమ స్థాయి నందుకొనిన జాతుల సంఖ్య చాల స్వల్పము. అట్టి జాతులలో బ్రిటీషు జాతి వారొక్కరు. వారు తమ దేశమునందు రాజులు, ధనవంతులు, బలవంతులు అయిన జమీందారులు, మతాధికారులు మున్నగువారి నిరంకుశ దుష్పరిపాలనను పూర్తిగ నిర్మూలించి, ప్రజా పరిపాలనమును నెలకొల్పినారు. ఈ ప్రజా ప్రభుత్వము జాతీయ రంగమునందు మాత్రమే కాక స్థానిక రంగమునందు కూడ వెలసినది. వ్యక్తి స్వాతంత్ర్యమును, న్యాయ పరిపాలనను బ్రిటీషు ప్రజలు తమ దేశమున పాదుకొల్పినారు. ఈ జాతివారు రవియస్తమింపని విశాల సామ్రాజ్యమును నెలకొల్పినారు. ఆ సామ్రాజ్యమును మహా వైభవముతో పరిపాలించినారు. కాలక్రమమున పాలిత జాతులలో పెంపొందిన స్వపరిపాలనాపేక్షను గుర్తించి, వారా యా దేశములనుండి వైదొలగినారు. తాము పాలించిన అన్ని భూభాగములందును వ్యక్తి స్వాతంత్ర్యము, న్యాయపరిపాలనము, ప్రజా ప్రభుత్వము అనుభావములను బాగుగా వ్యాప్తి చెందించినారు. బ్రిటీషు జాతియందు ప్రశంసార్హమైన అనేక ఇతర సద్గుణములు నెలకొనియున్నవి. అట్టి జాతివారి చరిత్ర అవశ్య పఠనీయము.

గలరని నా విశ్వాసము. ఈ ఉత్తమ గ్రంధమును వ్రాసి నందులకు శ్రీ బాలేందు శేఖరంగారిని నే నభినందించు చున్నాను.

సికింద్రాబాదు,
మార్చి 22, 1967.

— మామిడిపూడి వెంకట రంగయ్య

# విషయానుక్రమణిక

ఖండవల్లి బాలేందు శేఖరం (1909)

జననము 1909. జన్మస్థానం, తూర్పు గోదావరి జిల్లా. విద్యాభ్యాసము — ఉసుగల్లు, [illegible]. [illegible] కళాశాల (మద్రాసు విశ్వవిద్యాలయము) నుండి 1931 వ సంవత్సరమున బి. ఏ. (ఆనర్సు) పరీక్షలో ఉత్తీర్ణులైనారు. అభిమాన విషయములు — చరిత్ర, అర్థశాస్త్రము, రాజకీయ శాస్త్రము. 1945 వ సంవత్సరమున ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి Diploma of Education పట్టమును పొందినారు. 1947 వ సంవత్సరమునందు నాగపూరు విశ్వవిద్యాలయము నుండి M.A. పట్టమును కూడ పొందినారు. అభిమాన విషయము — ఇంగ్లీషు సాహిత్యము. 1948 వరకును ఉపాధ్యాయుడు, 1948 నుండి ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు ఆంగ్ల భాషాధ్యాపకుడు. గ్రంథ రచన—అభిమాన విషయము—చరిత్ర. ప్రకటించిన పుస్తకములు: ముస్లిం [illegible] పాలనా, ఆంధ్రుల చరిత్ర, విస్మృత సామ్రాజ్యములు, ప్రాచీన జాతులు, ప్రపంచ చరిత్ర సంగ్రహము, యూరోపుల చరిత్ర, బ్రిటిషు దేశ చరిత్ర, హిందూ దేశ చరిత్ర, విద్య (Education అను ప్రసిద్ధ ఆంగ్ల గ్రంథమునకు అనువాదము) మరికొన్ని, పాఠ్య పుస్తకములు. "ఆంధ్రుల చరిత్ర — సంస్కృతి" అను పుస్తకమును వ్రాయుటలో సోదరుడు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారికి సహకరించినారు.

---



గ్రంథకర్త :

శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం

## మొదటి ప్రకరణము

# బ్రిటనులు - రోమనులు

## బ్రిటను దేశము

బ్రిటను దేశము ఐరోపా ఖండమునకు పశ్చిమభాగమున నెలకొనియున్న ఒక ద్వీపము. ఈ ద్వీపమును గ్రేటు బ్రిటన్ (Great Britain) అని కూడ పిలుచుచున్నారు. ఈ ద్వీపమునకు సమీపముననే పశ్చిమదిక్కుగ ఐర్లండుద్వీపము కలదు. బ్రిటను ద్వీపము, ఐర్లండు ద్వీపమును కలిసి బ్రిటిష్షుదీవులు అని వ్యవహరింప బడుచున్నవి. బ్రిటను ద్వీపములో ఇంగ్లండు, స్కాట్లండు, వేల్సు, అను మూడుభాగములు కలవు. ఈ ద్వీపమునందలి కొండమయమైన ఉత్తరభాగము స్కాట్లండు దేశము. పశ్చిమమందు గల పర్వత ప్రాంతములు వేల్సుదేశము. స్కాట్లండు వేల్సులకు దేశములు అను పెద్ద పేరు ఇచ్చినను, నిజమునకు అవి అంత ఘనమైన దేశములు కావు. అవి మన భారతదేశమందలి పెద్ద జిల్లాలవంటివి. బ్రిటను ద్వీపములోని మిగిలిన విశాల భాగ మంతయు ఇంగ్లాండు దేశము. భారతదేశము బ్రిటను ద్వీపము కంటె సుమారు పన్నెండురెట్లు పెద్దది. బ్రిటనుదేశము ఇప్పుడు నలువైపుల సముద్రముచే చుట్టబడియున్నది. దీనికి దక్షిణ భాగమున బ్రిటిషుఛానలు (British Channel) అను సన్నని సముద్రశాఖ కలదు. దాని వెడల్పు సుమారు ఇరువదియైదు మైళ్ళు. లోతు సుమారు 600 అడుగులు. ఇచ్చట తరచు బలవత్తరమైన తుఫాను గాలులు చెలరేగుచుండును. బ్రిటీషు

ఛానలుకు దక్షిణమున, తూర్పున, సువిశాలమైన యూరేషియా ఖండము వ్యాపించియున్నది. తొమ్మిదివేల సంవత్సరములకు పూర్వము, బ్రిటను ద్వీపము యూరేషియా ఖండముతో కలిసి యుండినట్లును, ఆ కాలమున ఇంకను బ్రిటీషుఛానలు ఏర్పడి యుండనట్లును, భూగోళ శాస్త్రజ్ఞులు తెల్పుచున్నారు. అటుపిమ్మట కాలములో, భూకంపములును, ఇతర భౌతిక ప్రళయములును సంభవించుటవలన, యూరేషియాఖండమునకు పశ్చిమతమ భాగమునగల సౌరకాయవంటి, ఈ భూభాగము విడివిడి ఒక ద్వీపముగ ఏర్పడినదట. యూరేషియా ఖండము నకును, బ్రిటను ద్వీపమునకును నడుమ క్రమముగ, డోవరు జల సంధి యేర్పడినట్లు శాస్త్రజ్ఞులు నిర్ణయించినారు. బ్రిటను ద్వీపమందలి ఉత్తర పశ్చిమ ప్రాంతములు పర్వత మయములు. ప్రాచ్య దక్షిణ ప్రాంతములు సమప్రదేశములు. ఈ సమతల ములలో థేమ్సు మున్నగు నదులు మందగమనముతో ప్రవ హించుచు, దేశమును సారవంతము కావించుచున్నవి. బ్రిటను దేశము భూమధ్యరేఖకు దూరముగ, సమశీతోష్ణ మండలమున నెలకొని యుండుటయు, ఇచ్చట సంవత్సరము పొడవునను తరచుగ వర్షములు పడుచుండుటయు, ముఖ్యముగ గమనింప దగిన యంశములు. ఈ దేశమున వర్షాభావమనునది యెన్న [illegible]ండదు. [illegible]దునల బ్రిటను వివిధ సస్యములు, ఫల వృ[illegible]కి[illegible] నచ్చిన దేశ[illegible], మానవ [illegible] అన్ని విధముల యోగ్యమైన భూభాగము. ఈ దేశమునందలి అన్ని

ప్రాంతముల వారికిని కూడ సముద్రము మిక్కిలి సమీపముగ నుండును. బ్రిటనుదేశపు తీరమున, ప్రకృతి సిద్ధమగు రేవు స్థలములు చాలా కలవు. సమీపమందలి సముద్రములో ఆహార యోగ్యమైన [illegible] పల్లెవాండ్రు అన్ని కాలములందును కూడ చేపలవేటకై పోవుచు, సముద్రయానమునందు చక్కని నేర్పును సంపాదించ గల్గిరి. ఈ పల్లెవాండ్రు బ్రిటను దేశమునకు పెట్టని కోటవంటి వారు. ఈ దేశమున భూగర్భమునందు చాల ఉపయోగకర మైన ఖనిజములు, విస్తారముగ లభించును.

## ప్రాచీన ప్రజలు

బ్రిటను దేశమునందు సుమారు రెండులక్షల యేబది వేల సంవత్సరములకు పూర్వమే మానవులు నివసించియుండి నట్లు నిదర్శనములు లభించినవి. అతి ప్రాచీనులైన ఆ మాన వుల పుర్రెలు భూమిని త్రవ్వగా దొరకినవి. జీవశాస్త్ర నిపు ణులు వీనిని పరీక్షచేసి, ఈ కాలమునాటి మన కపాలములకును, ఆ ప్రాచీన మానవుని కపాలమునకును కొన్ని ముఖ్యభేదములు కలవని నిర్ధారణ చేసినారు. కాని గుణదోషముల విషయములో ఈనాటి మానవునకును, ఆ ప్రాచీన ప్రజలకును ఏమంత భేద ముండి యుండదు. మనలోవలెనే వారిలో కూడ అభిమాన ములు, అసూయలు, ఆగ్రహములు అనుగ్రహములు చెలరేగి యుండవచ్చును. ఈ ప్రజలు ఇంచుమించుగ దిగంబరులుగ నుండుచు, పశుపక్ష్యాదులను, లేక తోటిమానవులను, చంపి

[illegible]సును వెళ్లార్చు [illegible]చుండిరి. ఆనాడు బ్రిటను ద్వీప మంతయు దట్టమైన అడవులతోడను, రొంపి నేలతోడను నిండి యుండెడిది. ఈ మానవులు రాతిపనిముట్లను, ఆయుధములను, వాడుచుండిరి. అనేక సహస్రాబ్దములు గడచిపోయినవి. ఒక శిలయుగము సమాప్తము చెందినది. ప్రాచీన రాతియుగపు మానవుడు అంతరించి, నూతన రాతియుగపు మానవుడు అవతరించినాడు. ఈ క్రొత్తదశలోని ప్రజలు జంతువులవేటతో సంతృప్తి చెందక, వ్యవసాయమును తమవృత్తిగ స్వీకరించినారు. భూమిని మెట్టమైన వెల్లగించి, ఈ మానవుడు తనకు కావలసిన ధాన్యములను, కాయగూరలను పండింపసాగినాడు. వ్యవసాయ సంరక్షణము కొరకై ఈ జనులు ఒకే ప్రదేశమున గుమిగూడి, గుడిసెలు కట్టుకొనసాగిరి. మరి కొంత కాలము గడచిన తరువాత కొండలమీద మట్టికోటలు నిర్మించుకొని, అందు తమ పశువులను, రాత్రివేళ సురక్షితముగ నుంచెడివారు. ఆ కోటలే వారి నివాసము కావచ్చును. అవర్బరీ అను ప్రదేశమునకు సమీపమున, ఇట్టి ప్రాచీననిర్మాణములు కానవచ్చినవి. బ్రిటను దేశమునందు ఆ కాలమున నివసించు ప్రజల ఆకారములో ఒక విశిష్టత కలదు. వారి తలలు పొడవైనవి. అప్పుడప్పుడు పశ్చిమ ఐరోపా ప్రాంతములనుండి, ఇతర జాతులవారు బ్రిటను దేశములోనికి దండెత్తి వచ్చుచుండెడివారు. వీరిలో కొందరు బాహ్యరూపములో తొల్లింటి ప్రజలవలెనే ఉండెడివారు. వారి తలలు కూడ పొడవైనవి. వారుకూడ శ్వేతవర్ణులు. మరికొందరు గుండ్రనైన తలలు గలవారు. బహుశః వీరు ఐరోపా ఖండ

మందలి దక్షిణ ప్రాంతవాసులు కానచ్చును. కాలక్రమమున
ఈ రెండు తెగలును సమ్మేళనముచెంది, బ్రిటను దేశపు ప్రాచీన
ప్రజ యేర్పడినట్లు, శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుచున్నారు.
కాలము గడచిన కొలదియు, క్రొత్త ప్రజలు [illegible]
లలో ప్రవేశింప సాగినారు. భూగర్భమునుండి వారు [illegible]
తగరమును సంపాదించినారు. ఈ రెండు లోహములు [illegible] సమ్మే
ళనము చెంది, కంచు ఏర్పడినది. మానవుడు రాతి పనిముట్లను
విడనాడి, కంచు పనిముట్లను వాడుకొచ్చినాడు. ఈ కంచు
యుగములో మానవుడు, మట్టి పాత్రలను [illegible]
చేయసాగినాడు. [illegible] కంచు
యుగముయొక్క తుదిభాగమున [illegible]
క్రీ. పూ. 1000 - 400 నడుమ [illegible]
యించినారు. కంచుయుగపు తుది భాగమున [illegible], క్రొత్త
ద్వీపపు మానవుడు ఇనుమును కనుగొనినాడు. ఇనుము కరగించి,
గొడ్డళ్ళు, కత్తులు సిద్ధము చేసినాడు. రాతియుగపు మాన
వుడు క్రమముగ అదృశ్యుడై, ఇనుపయుగపు వీరుడు ఉద్భవించి
నాడు. మానవులు ఒండొరులను ఖడ్గములతో [illegible]
ప్రారంభించినారు. కాని బ్రిటను దేశపు ఉత్తర భాగమున
మానవులింకను కంచు పనిముట్లను వాడుచు నచ్చిరి. క్రీస్తు
పూర్వము మొదటిశతాబ్ది ఆరంభమైనది. ఈ శతాబ్దియందు
బెల్జియన్ తెగకు చెందిన ప్రజలు బ్రిటను దేశముపై దండెత్తి
వచ్చిరి. ఇంతకు పూర్వము ఈ ద్వీపముపై దాడిచేసిన జాతు

లన్నిటికంటె వీరు నాగరకులు. ఈ బెల్జిక్కు ప్రజలు బ్రిటను దేశమందలి దక్షిణ ప్రాంతమందును, తూర్పు ప్రాంతమందును, స్థిరనివాస మేర్పరచుకొనిరి. వీరు గుఱ్ఱములపైనను, రథముల మీదను, ప్రయాణము కావించెడివారు. ఈ ప్రజలు తొల్లింటి బ్రిటీషు ప్రజలవలెకాక సమతలములపై తమ పట్టణముల నిర్మించు కొనెడివారు. ఇంతకుపూర్వము బ్రిటనులో నివసించు చుండెన జనులు, ఎత్తైయిన కొండలపై మట్టికోటలు నిర్మించు కొని, అందు పశుసంపదను సురక్షితముగ నుంచుకొనెడి వారనియు, అందే తాముకూడ తలదాచు కొనుచుండిరనియు, ఈవరకే తెల్పినాము. బెల్జిక్కు ప్రజలు, స్థానికులగు బ్రిటనులను వశపరచుకొని, వారిపై అధికారము నెరపుచుండిరి. ఇంతవర కును, బ్రిటను దేశమునుగూర్చి నాగరక ప్రపంచమునకు ఏ విశేషములును తెలియవు. కాని ఒక సంఘటనవలన బ్రిటను ప్రజలు నాగరక ప్రజల దృష్టిలోనికి వచ్చినారు. ఆ నాగరక ప్రజలు రోమనులు.

## రోమనులు

రోమనులు జగద్విఖ్యాతిచెందిన రోమునగర వాసులు. ఈ మహానగరము ఏసుక్రీస్తునకు 753 సంవత్సరములకు పూర్వము స్థాపింపబడినది. ఈ రోమురాజ్యము మొదట రాజుల పరిపాల నలో నుండెను. కొంతకాలము గడచిన వెనుక, రోము ప్రజ లకు రాచరికముపై ఏవగల్గి, వారు తమరాజులను దేశము నుండి వెడలనడచిరి. ఆ పిమ్మట వారు ప్రజాస్వామిక ప్రభుత్వ

మును నెలకొల్పుకొనిరి. రోమనులు గొప్ప వీరులు. రణకోవిదులు. రాజ్యపాలనయం దత్యంత నిపుణులు. వీరు విశాలమైన సామ్రాజ్యమును సంపాదించిరి. మధ్యధరాసముద్రమున కిరువైపులనున్న దేశముల నాక్రమించుటయే కాక, ఆసియా ఖండములోనికి కూడ చొరుచుకొనిపోయి, వీరు సిరియా, పాలస్తీనములను తమ అధికారములోనికి గైకొనిరి. క్రీ. పూ. మొదటి శతాబ్దియందు రోమకనగరమున జూలియస్ సీజరు అను మహావీరు డుద్భవించెను. ఈత డపజయమెట్టిదో యెరుగని యోధాగ్రేసరుడు. రోమకసైన్యము లీతని యాజమాన్యమున, అసంఖ్యాకములగు విజయములను సాధించెను. రోమనుల ప్రతిష్ఠ లోకమంతయు మ్రోగిపోయెను. ఇట్టి వీరాగ్రేసరుడు క్రీ. పూ. 55 వ సంవత్సరమున ఫ్రాన్సు, జర్మనీ దేశములలోని అనాగరక ప్రజలతో యుద్ధములు సాగించుచున్నప్పుడు, బ్రిటను దేశము ఆతని దృష్టి పథములోనికి వచ్చెను. బ్రిటను ద్వీపములోని అనాగరక ప్రజలును, ఫ్రాన్స్ జర్మనీదేశపు మోటు మానుసులును, సన్నిహిత జ్ఞాతులట. ఆ కారణమువలన, జూలియసు సీజరు శత్రువులైన ఫ్రాన్సు, జర్మనీలవారికి, బ్రిటను ద్వీపమువారు సైనికసహాయము పంపిరి. ఈ రోమకవీరుని ధాటికి నిలువజాలక పలాయనము చిత్తగించినవారికి, బ్రిటనుప్రజలు ఆశ్రయ మిచ్చినారు. "మంచిది. ఈ మోటుజాతివారికి బుద్ధి చెప్పవలెను. బ్రిటీషు ప్రజలకు రోమకఖడ్గముయొక్క వాడి యెట్టిదో చవిచూపవలెను. అంతేకాదు. ఈ బ్రిటను ద్వీపము

నంతటి మతాచారములు చాల వికృతమైనవట. ఇచ్చటి మత గురువులు డ్రూయిడ్లు అనువారు భీకరమగు అరణ్యములలో నివసించుచు, తమ దైవములకు నరబలుల నిచ్చుచు, ఏవేవో రహస్యమగు మతక్రియా కలాపములు జరుపుచుందురట. ఈ మతగురువులు తమ శిష్యవర్గమునంతను, భీకరమగు నిబంధనలచే వశపరచుకొని, వారిని తమ శత్రుకోటితో యుద్ధము చేయుటకై ప్రోత్సహించి, పంపుచుందురట. బహుశః ఈ ఘోరమైన మతము రోమనులకు గర్భశత్రువులగు కార్థేజి నివాసుల హేయమగు మతధర్మములకు ప్రతిబింబము కాదుకదా! ఈ యంశమే నిజమైనచో, ఈ బ్రిటిషు ప్రజలమతమును కూడ నాశనముచేసి తీరవలెను'' అని జూలియస్ సీజరు చింతించినాడు. శతాధిక యుద్ధములలో విజయలక్ష్మి కరగ్రహణము కావించిన సీజరుకు, బ్రిటిసుదేశపు మోటుమనుష్యులను జయించుట, ఏమంత గొప్పవిషయము కాదు. కావున ఈ మహావీరుడు క్రీ. పూ. ౫౫ వ సంవత్సరమునందు బ్రిటను ద్వీపముపై దండయాత్రకై సన్నాహములు చేసెను. ఐరోపాఖండపు గడ్డమీద, ఇప్పుడు రోమకసైన్యముల నెదిరించగల శక్తి యేదియును లేదు.

రోమనులు వీరులును, సాహసవంతులును అగు వారనుట వాస్తవమే కాని వారికి సముద్రము, సముద్రయానము అనిన భయము, ఏవగింపు, వారి బలము, సాహసకృత్యములు భూమిపై మాత్రమే ఇంతవరకును ప్రదర్శితమైనవి. కావున

వారికి ఐరోపాఖండపు కొనయందు నెలకొనిన బ్రిటను ద్వీపమును గూర్చి విశేషము తెలియదు. క్రీస్తు పూర్వము అయిదవ శతాబ్దియందు నివసించిన గ్రీకు చారిత్రకుడు హెరోడోటస్ అనునాతడు, బ్రిటను ద్వీపము పుక్కిటి పురాణములలోని ఏదో మాయదేశమను అభిప్రాయమును వ్యక్తీకరించెను. క్రీ. పూ. నాల్గవ శతాబ్ది మధ్యభాగములో పిథియస్ అను సాహస నావికుడు బ్రిటను ద్వీపముచుట్టును రెండుసార్లు ప్రదక్షిణము చేసి వచ్చి, ఆ దేశమును గూర్చిన అనేక సత్యవిషయములు ప్రకటించినను, రోమను ప్రపంచము, ఆతని అనుభవములు నిజమని నమ్మలేదు. బ్రిటను ద్వీపము అంధకార బంధురమైన ఐంద్రజాలిక ప్రదేశమని రోమనుల విశ్వాసము. ప్రపంచమున కదియే తుది భాగమని వారి తలంపు. కాని క్రీ. పూ. మూడవ శతాబ్ది నాటికే రోమను వర్తకులు బ్రిటను దేశముతో వ్యాపారము చేయుచు, తగరమును దిగుమతి చేసికొనుచుండెడి వారు.

బ్రిటను ద్వీపముపై దండయాత్ర చేయుటకై సంకల్పించిన రోమనువీరుడు జూలియస్ సీజరు కేవల యోధుడు మాత్రమే కాదు. అతడు చాల సూక్ష్మబుద్ధికల రాజనీతిజ్ఞుడు. ల్యాటిను భాషలో చక్కగ రచన సాగించగల ప్రజ్ఞాశాలి. బ్రిటను ద్వీపమును గూర్చి సీజరు తెల్పిన యంశములు గమనింపదగినవి. "బ్రిటను ద్వీపములో నివసించు ప్రజలు బెల్జిక్కు తెగకు చెందినవారు. మొట్టమొదట వీరు ఈ దేశమును దోచుకొనుటకై వచ్చి, కాలక్రమమున ఇచ్చట స్థిరనివాసము ఏర్ప

రచుకొనినారు. ఇచ్చట జననివాసము విస్తారముగ ఉన్నది. దేశము సారవంతమైనది పశుసంపద వలసినంత యున్నది. వృక్ష జాలము దట్టముగ పెరుగును. ఇచ్చట తగరము, ఇనుము,బంగారము బాగుగా లభించును. ఆహారయోగ్యములగు కుందేళ్లు, పక్షులును ఈ దేశములో విశేషముగ ఉన్నవి కాని ప్రజలు వీనిని తినరు. శీతోష్ణస్థితి సమధాతువుగ ఉండును. ఈ ద్వీపపు ప్రజలందరిలోను నాగరకులైనవారు కెంటు జిల్లాలో నివసించుచున్నారు. ఇది సముద్రమున కానుకొనియున్నది. ఈ బ్రిటను జాతివారికి వ్యవసాయమనిన నేమియో తెలిసినట్లు తోచదు. వీరు మాంసము, పాలుమాత్రము ఆరగింతురు. ఈ ప్రజలు జుట్టును బాగుగా పెరుగనిచ్చి, మీసములను పెంచుకొందురు. మిగిలిన దేహమంతయు ముండనము కావించుకొని, ఒడలికి నీలివర్ణమును పూసుకొందురు. యుద్ధభూమిలో వీరిని చూడగనే శత్రువులకు గుండె లవిసిపోవును. స్త్రీ ఒక తెగలోని పది పండ్రెండుగురు పురుషులకు భార్యగా ఉండవచ్చును. తండ్రికి కుమాళ్ళకు ఒకే స్త్రీ కుటుంబినిగా నుండును. కాని ఆమెకు కల్గిన సంతానము ప్రప్రథమమున ఆమెతో స్నేహము పాటించిన పురుషునిదని వారు భావింతురు."

## బ్రిటను ద్వీపముపై రోమనుల దండయాత్ర

క్రీ. పూ. 55 వ సంవత్సరము ఆగస్టునెలలో జూలియస్ సీజరు యోధాగ్రేసరులతో కూడిన రెండు పటాలములను వెంట బెట్టుకొని, ఎనుబది పడవలలో ఒకనాటిరాత్రి బయలుదేరి,

ఇంకను తెల్లవారకుండగనే బ్రిటను దేశములోని డోవరు రేవు పట్టణమును సమీపించినాడు. కాని అప్పటికే శత్రువులైన బ్రిటనులు అచ్చటి సుద్దకొండలపై - యుద్ధసన్నద్ధులై నిలువబడియుండుట చూచి, తన సైన్యమును దింపుటకై అది అనువైన ప్రదేశము కాదని నిశ్చయించుకొని సీజరు తన పడవలను సముద్రపు ఒడ్డుననే ఇంకొంత దూరము నడపినాడు. కాని బ్రిటను వీరులుకూడ సాయుధులై, రోమనుల పడవలను గమనించుచు, తీరముపైననే ముందునకు సాగినారు. సీజరు కొంత దూరము ప్రయాణముచేసి, పడవలను ఆపించి, సేనను తీరముపై దింపుటకు సన్నాహము కావించినాడు. శత్రువులు తమ దేశపు గడ్డపై దిగకుండ బ్రిటీషువీరులు వారిని నిరోధింప బూనినారు బ్రిటీషు యోధుల రథములు సముద్రములోనికి లంఘించినవి. వారి చేతులనుండి బల్లెములు [illegible] వలె శత్రువులను ముంచివేసినవి. రోమనులు జంకలేదు. ఒక రోమనువీరుడు పవిత్రమైన తమదేశపు గరుడధ్వజము (Eagle Standard) ను చేతబూని నీటిలోనికి ఉరికినాడు. సీజరు తన పడవలను సమీపమునకు రావించి, యంత్రసాధనములచే పెద్దపెద్ద రాళ్ళను శత్రువులపై వర్షింపించినాడు. మరికొందరు రోమనువీరులు ధనుర్బాణములతో శత్రువుల నెదిర్చినారు. బ్రిటనులు జంకి కొంచెము వెనుకకు తగ్గగానే, రోమను పటాలములు బ్రిటను గడ్డపై యుద్ధ వ్యూహములు పన్ని శత్రువుల నెదిరించినవి. నేలపై యుద్ధముచేసి, రోమనువీరులను పరాజితుల కావింపగలవారానాటి కెవ్వరును తలచూపలేదు. బ్రిటనులు పరాజితులై,

వెనుకకు పారిపోయిరి. కాని ఇంతమాత్రముచే రోమనుల కష్టములు గట్టెక్కలేదు. పదునెనిమిది పడవలలో సీజరు తన ఆశ్వికదళమును బ్రిటను ద్వీపమునకు రావించుటకై యత్నము సల్పెను. కాని తీవ్రమైన తుపానుగాలులు చెలరేగి, ఈ పడవలు మునిగిపోవునట్టి పరిస్థితి యేర్పడినది. అతి కష్టముమీద ఆశ్వికదళమువారు ప్రాణముల దక్కించుకొని, మరల ఫ్రాన్సు దేశము చేరుకొనగల్గిరి. ఒక పర్యాయము శత్రువుల ధాటి చవి జూచినను, బ్రిటను వీరులకు రోమనుల ఆధిక్యతపై నమ్మకము కుదరలేదు. వారు సీజరు పటాలములతో మరియొక పర్యాయము యుద్ధమునకు తలపడిరి. కాని రోమనుల సుశిక్షిత పద్ధతుల ముందు, బ్రిటనుల మొండిసాహసము సాగిరాలేదు. కవచధారులైన రోమను యోధులు బ్రిటీషు మూకను చెల్లాచెదర కావించినారు. మార్గాంతరములేక బ్రిటనులు జూలియసు సీజరుతో సంధి ప్రయత్నములు ప్రారంభించిరి. సూక్ష్మబుద్ధియైన సీజరు, ఎట్టి కఠిన నిబంధనలను విధింపక బ్రిటనులతో సంధి కావించుకొనినాడు. యుద్ధభూమిలో విజయము కల్గినను, తన స్థితిగతులు ఏమంత సంతృప్తికరముగ లేవని సీజరుకు తెలియవచ్చినది. సంధి షరతులను పాటించునట్లు హామీకొరకై, కొందరు బ్రిటను ప్రజలను, కొందరు ఖైదీలను తీసికొని సీజరు ఫ్రాన్సుదేశమునకు మరలిపోయెను.

ఆ మరుసటి సంవత్సరము (క్రీ. పూ. 54) సీజరు అయిదు పటాలముల రోమను వీరులను, ఎనుబది పడవలలో పెద్ద ఆశ్విక

దళమును వెంటబెట్టుకొని, బ్రిటను ద్వీపముపై మరల దండెత్తి వచ్చినాడు. బలవత్తరమైన ఈ రోమను సేనను చూచి బ్రిటనులు భయపడినారు. సీజరు కెంటు జిల్లాలో సముద్ర తీరమున తన ముఖ్యశిబిరము నేర్పాటు చేసికొనెను. బ్రిటనులు కాసి విలానస్ అను వీరుని యాజమాన్యములో, అతినేర్పుతో సీజరు సేనలతో యుద్ధము సాగించినారు. రథములపై యుద్ధము చేయుటలో బ్రిటీషువీరులు మిక్కిలి చతురులు. వీరు రథికులుగను, పదాతులుగను కూడ సమానమైన సమర్థతతో యుద్ధము కావింపగలరు. ఈ యంశమును జూలియసు సీజరు స్వయముగ అంగీకరించినాడు. కాని బ్రిటీషు సేనల యుద్ధనైపుణి రోమను పటాలముల ముందు ఏమియును ప్రయోజనకారి కాలేదు. బ్రిటనులు ఓడిపోయి, రోమను వీరునికి వశపడిరి. ఆ ద్వీపమును జయించినట్లు జూలియసు సీజరు ప్రకటించెను. బ్రిటను సైనికులను పలువురను బందీలుగ గైకొని, జూలియసు సీజరు విజయాట్టహాసముతో రోమునగరమునకు మరలిపోయెను. రోము నగరవీధులలో బ్రిటీషు ఖైదీలు తలలు వంచుకొని, రోమను పటాలముల వెనుక నడువవలసి వచ్చెను. కాని సీజరు సాధించిన విజయమును బలపరుచుటకై, రోమక ప్రభుత్వము ప్రయత్నింపలేదు. ఒక శతాబ్దివరకును బ్రిటనులు రోమనుల పోరు లేకుండ సుఖముగ నుండిరి.

## బ్రిటను దేశమును రోమనులు ఆక్రమించుట

జూలియసుసీజరు దండయాత్ర ముగిసిన తరువాత బెల్జిక్కు తెగవారు బ్రిటనుద్వీపమునందు తమ బలమును వృద్ధి పరచుకొని, స్థానిక ప్రజలపై అధికారము నెరపసాగిరి. రోమనులు ఇక తమ దేశముపై దండెత్తిరారని బ్రిటను ప్రజలు భ్రమచెందిరి. అచ్చటచ్చట అంతఃకలహములు చెలరేగుచుండినను, మొత్తముమీద బ్రిటిషుద్వీపము అభివృద్ధిచెందినదనియే చెప్పవలెను. ఈ ద్వీపవాసులు రోమను సామ్రాజ్యముతో వ్యాపారము సాగింపజొచ్చిరి. రోమను వర్తకులు బ్రిటను ద్వీపములో నివాసమేర్పరచుకొని, చాల ధనవంతులగుటయే కాక, ఈ దేశమును జయించిన పక్షమున రోమక సామ్రాజ్యమున కెంతయైన లాభము కలుగగలదని, రోమునగరమునందు ప్రచారము చేయసాగిరి. వారి ప్రచారము తుట్టతుదకు ప్రయోజనకారి యయ్యెను. క్లాడియసు అను చక్రవర్తి రోమక సామ్రాజ్యమున కేలికయైన కొలది కాలమునకే రోమను ప్రభుత్వమువారు బ్రిటను ద్వీపమును జయించుటకు నిశ్చయించిరి. క్రీ శ. 43 వ సంవత్సరమున ఇరువదివేల రోమక సైన్యము బ్రిటనుద్వీపముపై దండెత్తివచ్చెను. ఈ దేశములో దేశభక్తులైన వీరులకు కొదువలేదు. వారందరును దేశ సంరక్షణమునకై నడుముకట్టిరి. అట్టి వారిలో "సింబలీను" రాజు

కుమారుడు కారక్టకస్ అను నాతడు ఒకడు. ఆంగ్ల మహాకవి యైన షేక్స్పియరు సింబలీనును గూర్చి ఒక ప్రత్యేకమగు నాటకము వ్రాసి, ఈతనికి వాఙ్మయ ప్రపంచములో శాశ్వత స్థానమును కల్పించినాడు. కారక్టస్ ప్రభృతులు పట్టుదలతో రోమను సైన్యములతో యుద్ధమును సాగించినారు. ప్రత్యక్ష యుద్ధములో రోమనులను జయించుట సాధ్యము కాదని వారికి తెలియును. దుర్గమములగు అడవులలోను, రొంపి భూముల లోను దాగుకొని, బ్రిటీషు వీరులు రోమనులతో ఆరు సంవత్సరముల పాటు ప్రచ్ఛన్న యుద్ధము కావించిరి. కాని ఫలితము లేకపోయెను. కారక్టకసును రోమక సైన్యము పూర్తిగ పరాభవించి చెరపెట్టెను. రోమను చక్రవర్తి ఈతని ధైర్యశౌర్యములకు సంతసించి, ఈతనిని విడచిపుచ్చెను. బ్రిటనుద్వీపవాసులు రోమక చక్రవర్తికి వశ్యులైనట్లే కానవచ్చెను. కాని క్రీ. శ. 61 వ సంవత్సరమున బ్రిటనుద్వీపమున మరల తీవ్రమైన తిరుగుబాటు సంభవించెను. ఈ తిరుగుబాటును ప్రోత్సహించినవారు "డ్రూయిడ్లు" అను మత గురువులు. వీరు అస్త్రశస్త్రములను వాడుటకు మారుగ, శాప వాక్యములచే శత్రునాశనము కావించుటకై పూనుకొనిరి. ఫలిత మేట్టిదో వేరుగ తెలుపనవసరము లేదు. రోమక సైన్యాధ్యక్షుడగు స్యూటోనియసు మతావేశపరవశులైన ఈ ఉన్మత్తులను సులభముగ నోడించి, వారికి నిలయములగు అడవుల నన్నిటిని నరకించివైచెను.

"డ్రూయిడ్ల" క్రూరమగు మతాచారములు ఇంతటితో పూర్తిగ మాయమయ్యెను. విజయగర్వితులైన రోమనులు, ఆ కాలమున బ్రిటనుదేశపు తూర్పుభాగమున రాజ్యమును నెలకొల్పుకొని, పరిపాలనము చేయుచున్న "బోడిసియా" అను బ్రిటీషు ప్రభ్వి రాజ్యముపై దండెత్తి, ప్రజలను దోచుకొని, రాజకుటుంబము నవమానముపాలు కావించిరి. అభిమాన ధనురాలైన "బోడేసియా" ఈ యవమానమును సహింపజాలక, దెబ్బతినిన ఆడుపులివలె శత్రువులగు రోమనులపై దాడిసల్పెను. ఈమె అనేక సాహసకృత్యముల సల్పి, బ్రిటీషు వీరవర్గములో విశిష్టస్థానమును సంపాదించుకొనినది. బ్రిటీషు ప్రజలు పలువు రీమెకు చేయూత నొసగిరి. ఎనుబదివేల బ్రిటీషు సైన్యము (స్త్రీలు, పసిబిడ్డలు కూడ ఇందులో చేరియుండిరి.) జయమో, వీరస్వర్గమో ఏదైన నొకటి సాధింపవలెనని దృఢ నిశ్చయముతో, రోమనుసేనల నెదిరించెను. బోడీసియా రాణి వీరికి నాయకురాలు. రోమనులు క్రమశిక్షణ నందినవారు. యుద్ధతంత్రములో వారికి గల ప్రజ్ఞ అసమానమైనది. కావున బ్రిటీషువారి వీరావేశములు, దేశభక్తియు నిష్ప్రయోజనము లయ్యెను. బ్రిటనులు ఓడిపోయిరి. బోడీసియా విషము మ్రింగి ప్రాణత్యాగము చేసెను. అతికష్టముపై రోమనులు జయమును సాధింపగల్గిరి. కోపపరవశుడైన రోమను సేనాని స్యూటోని యను బ్రిటనుదేశములో ఒక్క పురుగు కూడ లేకుండ నాశ

నము చేసెదనని కంకణము పూనెను. కాని ఈ దారుణకృత్యము నుండి ఆతనిని మిత్రులు నివారించిరి. ఇప్పుడు బ్రిటనుద్వీపము రోమనుచక్రవర్తికి పాదాక్రాంతమయ్యెను. రోమను సూర్యుడు బ్రిటీషుద్వీపముపై దుర్నిరీక్ష్యముగ ప్రకాశింపజొచ్చెను.

క్రీ. శ. 78 వ సంవత్సరమున రోమను ప్రభుత్వము వారు బ్రిటనుదేశమును పరిపాలించుటకై, అగ్రికోలా అను అధికారిని నియమించిరి. ఈతడు వీరుడును, రాజనీతిజ్ఞుడును అగు పరిపాలకుడు. బ్రిటనుదేశములో అధికారమును పూనగానే అతడు మరల ఖడ్గమును చేబట్టెను. రోమను ప్రభుత్వమును ధిక్కరింపగల బ్రిటను తెగల నన్నిటిని ఈతడు సంపూర్ణముగ ఓడించి, పశ్చిమమున వేల్సుదేశపు టడవులలోనికి, ఉత్తరమున స్కాట్లండు దేశపు కొండలలోనికి పారద్రోలెను. రోమనుల అధికారమును తిరస్కరించగల శక్తి ఇప్పుడు బ్రిటనులో ఎవ్వరికిని లేదు. దండోపాయముచే శత్రువులబలమును భగ్నము చేసి, సామోపాయముచే వారిని వశపరచుకొనుటకై రాజనీతి విశారదుడగు అగ్రికోలా పూనుకొనినాడు. అతడు పన్నుల భారము తగ్గించెను. చక్కని వసతిగృహములు, న్యాయస్థానములు, దేవాలయములు నిర్మించుటలో ప్రజల కెంతయో ప్రోత్సాహ మొసంగినాడు. ఉన్నత వంశ సంజాతులగు యువకులకు, విద్యాభ్యాసమునకై వసతులు కల్పింపబడినవి. ఈ విధముగ బ్రిటనుదేశపు ప్రజలు రోమను పద్ధతులకు మచ్చికపడి, క్రమక్రమముగ రోమను ప్రజల జీవిత విధానము నంగీకరించిరి.

"పాపము, ఇది యంతయు నాగరకత యని ఈ బ్రిటనుల భ్రాంతి. నిజమున కిది యంతయు బానిసతనము" అని టాసిటస్ అను రోమను చారిత్రికుడు వ్యాఖ్యానము కావించినాడు. బ్రిటనుదేశ మిప్పుడు సువిశాల రోమక సామ్రాజ్యములో నొక భాగముగ నేర్పడినది. ఈ సామ్రాజ్యములో నలువదియైదు రాష్ట్రము లున్నవి. రోమను ప్రభుత్వము ఆయా రాష్ట్రములకు జాతి, మత, భాషా విషయములలో సంపూర్ణమైన స్వేచ్ఛ యిచ్చెడిది. నాగరక రోమను ప్రపంచములో, సర్వవ్యాప్తమైన సమానత్వమునకు ఒక మినహాయింపు మాత్రము కలదు. అందలి ప్రజలలో మూడు తరగతులు కలవు. ఉత్తమశ్రేణికి చెందిన వారు రోమను పౌరులు. ఇట్టి పౌరత్వము లేని ఇతర ప్రజలు అనేకులు రోమను సామ్రాజ్యములో నివసించియుండిరి. వీరు రెండవ శ్రేణిలో చేరుదురు. మూడవ తరగతివారు బాని సలు. కాని [illegible] శ్రేణిలోని [illegible]లకు సంపూర్ణ [illegible] పౌ[illegible]త్వము లభించుటకు సావకాశములు ఉన్నవి. ఇట్టి రోమను మహాప్రపంచములో ఒక భాగముగ బ్రిటనుద్వీపము సంతోషపూర్వకముగ చేరినది.

## బ్రిటను ద్వీపములో రోమనుల ప్రభుత్వము

రోమనులు బ్రిటను దేశముపై సుమారు మున్నూరు సంవత్సరములు రాజ్యపాలనము కావించిరి. ఈ దీర్ఘకాలములో బ్రిటీషుప్రజలు సౌఖ్యముగ కాలము గడపిరి. రోమను పౌరుల

మని చెప్పుకొనుటకు బ్రిటీషుప్రజలు గర్వించిరి. రోమనుల జీవిత విధానము, వారి నాగరికత, వారి రాజ్యాంగవిధానము అన్నిటిని కూడ పాలితులైన బ్రిటనుప్రజలు సంతోష పూర్వక ముగ అంగీకరించిరి. క్రీ. శ. నాల్గవ శతాబ్దిలో ఎవ్వరైన బ్రిట నులో ప్రజాభిప్రాయమును కనుగొనిన పక్షమున, ప్రజలంద రును కూడ రోమక ప్రభుత్వము శాశ్వతముగ కొనసాగవలెనని యేకగ్రీవముగ పల్కెడివారని ఒక విఖ్యాత బ్రిటీషు చారిత్రికు డభిప్రాయ పడుచున్నాడు.

రోమనులు బ్రిటను దేశమునకు శాంతిభద్రతలను ప్రసాదించిరి. ఆ కాలమున రోమక సామ్రాజ్యము దక్షిణ పశ్చిమ ఐరోపాలయందును, తూర్పున ఆసియా మైనరు వర కును వ్యాపించి యుండెను. ఈ విశాల సామ్రాజ్యమును సుశి క్షితమగు మూడులక్షల సేన యెల్లప్పుడును కాపాడు చుండె డిది. ఆధునిక యుగములో ఇంతటి గొప్ప సామ్రాజ్యమును రక్షించుటకు, ఇంతకు పదింతల సైన్యముకూడ చాలదేమో. అజేయమగు సేనావాహినులచే రక్షింపబడుచున్న బ్రిటను దేశ మునకు, బహిశ్శత్రువుల భయ మెంతమాత్రమును లేదు. ఇక దేశములో శాంతిభద్రతల నెలకొల్పి యుంచుటకై, రోమనులు బ్రిటనునందు నలుబదివేల సేనను మాత్రము నిల్పియుంచిరి. రోమకబ్రిటను రాజ్యమున కుత్తరమున స్కాట్లండునందును, పశ్చిమమున వేల్సునందును అనాగరకులగు జాతులవారు నివ సించి యుండిరి. వీరు రోమకరాజ్యమునకు ప్రక్కలో బల్లెము

వలె నుండెడివారు. కావున తమ రాజ్యమును శత్రువుల దాడి నుండి కాపాడుకొనుటకై, రోమక ప్రభుత్వము చక్కని కట్టు దిట్టములు చేసెను. పశ్చిమ ప్రాంతమందలి ఛెస్టరు అను ప్రదేశమున బలవత్తరమగు రోమనుసేన నెలకొని, వేల్సు దేశములోని శత్రువులను మెదలకుండునట్లు త్రొక్కిపట్టి యుండెడిది. ఉత్తర సరిహద్దును రక్షించుటకై రోమనులు ఇతోధికమగు శ్రద్ధను పూనిరి. క్రీ. శ. 122 వ సంవత్సరమున హేడ్రియను అను రోమను చక్రవర్తి బ్రిటను ద్వీపమునకు స్వయముగవచ్చి, నేటి యార్కు (York) జిల్లా కుత్తరభాగమున తనపేరిట డెబ్బది మూడుమైళ్ళ పొడవుగల గొప్ప రాతి ప్రాకారమును కట్టించెను. ఈ గోడ సుమారు పదిఅడుగుల మందము కలది. దీనిని రక్షించుటకై ఆయా ప్రదేశములలో పదునేడు దుర్గములు నిర్మింపబడినవి. ఇవికాక ఎనుబది రక్షక స్థానములు, అంతకు రెండింతలు కావలి బురుజులు, ఈ ప్రాకారమునందు నెలకొని యుండెను. ప్రాకారమున కుత్తరభాగమున ముప్పది అడుగుల వెడల్పుగల కందకము, త్రవ్వబడెను. అతి ముఖ్యమైన ఈ ప్రాకారము నెల్లప్పుడును, అయిదువేల సంఖ్యగల గస్తీ వాండ్రును, సుశిక్షితులును, యుద్ధనిపుణులును అగు పదునాల్గు వేల సైనికులును కాపాడుచుండెడివారు. ప్రతి దుర్గము నందును ఒక సంవత్సరమునకు కావలసినంత గోధుమ ధాన్యము కొటారులలో నిలువ యుండెడివి. వేల్సుదేశపు సరి హద్దులో కూడ, హేడ్రియను చక్రవర్తి ఇంచుమించు ఇట్టి

ప్రాకారమునే నిర్మింపించెను. ఇరువది సంవత్సరములు గడ
చిన తరువాత, ఆంటోనీనస్ అను మరియొక రోమను
చక్రవర్తి యాజ్ఞల ననుసరించి, రోమను లింకను ఉత్తరముగ
చొరుచుకొనిపోయి, స్కాట్లండు దేశపు సరిహద్దులలో ముప్పది
యేడు మైళ్ళ పొడవు గల గోడను కట్టించిరి. దీనికి ఆంటోనీ
నస్ ప్రాకారము అని పేరు. రోమనులు దీనిని చాలాకాలము
వరకును రక్షించుకొనజాలరైరి. స్కాట్లండు దేశపు ఆటవికులు,
రోమనులతో తరచు యుద్ధమునకు తలపడుచు, ఈ ప్రాకార
మును చాల నష్టపరచిరి. అందువలన క్రీ. శ. 185 వ సంవత్సర
మున రోమనులు వెనుకకు తగ్గి హాడ్రియను ప్రాకారమును
రక్షించుకొనుటతో సంతుష్టిపడిరి. మూడవ శతాబ్ది
ప్రారంభమున (క్రీ. శ. 208) సెవరస్ అను రోమను చక్ర
వర్తి బ్రిటను ద్వీపమును సందర్శించి, అచ్చట మూడు సంవత్స
రములు నిలకడగ నుండి, రోమను ప్రాకారముల పునరుద్ధరించి,
వానిని శత్రు దుర్భేద్యముగ నిర్మాణము కావింపించెను. అటు
పిమ్మట నూరు సంవత్సరములవరకును, రోమను ప్రాకారములు
చెక్కుచెదరకుండ నిలువబడి, బ్రిటను దేశమునకు భద్రత
నొసంగెను. బ్రిటీషు ప్రజలు తమ దేశమునందే కాక, విశాల
మైన రోమక సామ్రాజ్యములో కూడ యథేచ్ఛముగ ప్రయా
ణము చేయుటకును, నివసించుటకును వసతు లేర్పడెను. రోమ
నులు బ్రిటనుద్వీపములో ముఖ్యదేశము లన్నిటికిని, చక్కని
రాజమార్గములు నిర్మించిరి. వారు బాటలకు ప్రక్కగా దూర

మును చూపు మైలురాళ్ళను పాతించెడివారు. ఆ మైలు రాళ్ళు నేటికిని భూగర్భమునుండి వెలువడుచున్నవి. రోమనులు రోడ్ల నెట్లు నిర్మించుచుండిరో కూడ మనకు తెలియవచ్చుచున్నది. మొదట ఇసుక పరపించి, దానిలో రాళ్ళను అమర్చి, దానిపై అడుగున్నర మొదలు మూడడుగుల మందముగాకను గంకర ఇసుక నింపించి,వీరు తమ రాజమార్గముల నిర్మించెడివారు. బాట కిరువైపుల కాలిబాటలు నెలకొని యుండెడివి. క్రీ. శ. 340 వ సంవత్సరము వరకును, రోడ్లనిర్మాణము, వాని సంరక్షణ సక్ర మముగ సాగుచుండెను. మైలు రాళ్ళపై వానిని వేయించిన రోమక చక్రవర్తుల పేరు చెక్కుచుండెడివారు. ఈ రాజమార్గ ములకు వాట్లింగ్ వీధి, ఎర్మిన్ వీధి, మున్నగు నామములు వాడ బడెను.

రోమనుల ప్రభుత్వములోని ఒక ముఖ్య లక్షణము వారి విశాలదృష్టి; సమభావము. పాలితులగు ప్రజలు స్వామి భక్తితో మెలగినంత కాలమును, వారికి అన్ని విధములగు సౌక ర్యములును లభించుచుండెడివి. పాలకులు పాలితుల యెడల నెట్టి భేదభావమును చూపెడివారు కారు. బ్రిటను దేశమును సంరక్షించుటకై నలుబదివేల సైన్యము ఇచ్చట స్థిరముగ నెల కొని యున్నట్లు ఈ వరకే తెల్పియున్నాము. ప్రప్రథమమున ఆ సేనలో రోమనుజాతికి చెందిన వీరులు మాత్రమే; నియమితు లగుచుండిరి. కొంతకాలము గడచిన తరువాత, రోమనులకు బ్రిటీషు ప్రజలపై విశ్వాసము కుదిరెను. అందువలన వారు

బ్రిటనుదేశమును కాపాడుటకై, బ్రిటీషు సైనికులనే నియమింపసాగిరి. బ్రిటీషు జాతివారు రణభూమిలో ప్రశంసనీయ మగు ధైర్య శౌర్యముల ప్రదర్శింపగలరని రోమనులకు బాగుగా నమ్మిక కుదిరెను. అందువలన, సామ్రాజ్యమునందలి యితర భాగములలో కూడ, వీరు బాధ్యతాయుతమైన స్థానములలో నియమితులగుచు వచ్చిరి. రోమక సామ్రాజ్యములో అధికారమును చేజిక్కించుకొనుటకై, తరచుగ ఉన్నత రోమను కుటుంబములవారు తమలో తాము తగవులాడుకొను చుండెడివారు. బ్రిటనుద్వీపములోని గొప్ప కుటుంబములవారు కూడ, ఈ తగవులాటలలో పాల్గొని, అత్యంత గౌరవమునో, సర్వనాశనమునో, చెందుచుండెడివారు. రోమనుపౌరుడు అని పిలిపించు కొనుటకంటె ఆ కాలమున గౌరవాస్పదమైన యంశము మరొక్కటి లేదు. అట్టి ప్రత్యేకతను, బ్రిటనుప్రజలు పలువురు సంపాదించి యుండిరి. రోమనుల పరిపాలనా యుగములో, బ్రిటనుదేశమున సామ్రాజ్యమునందలి యితర భాగముల ప్రజలు శాశ్వత నివాసము నేర్పరచుకొని యుండెడివారు. ప్రాచీన పారసీకుల సూర్యదేవతారాధన మాకాలమున బ్రిటనుద్వీపమున పలుతావులందు వ్యాపించి యుండెను. క్రీ. శ. మూడవ శతాబ్దిలోకూడ ఈ సూర్యోపాసన బ్రిటనునందు చాల బలవత్తరముగ నుండినట్లు, ఆ కాలమునకు చెందిన దేవాలయములు చాటుచున్నవి. వాల్‌బ్రూక్ అను ప్రదేశమున ఇట్టి దేవాలయ మొకటి ఇటీవలనే (1954) వెల్వడినది. క్రైస్తవ మతమువారు

కొంత కాలమువరకును బ్రిటను ద్వీపములో సౌరమతముతో పోటీపడవలసి వచ్చెను.

రోమనుల ప్రభుత్వ కాలములో లండను నగరము చాల అభివృద్ధి చెందెను. బెల్జిక్కు ప్రజలు రాజ్యాధికారము నెరపుచున్నప్పుడు, కోల్చెస్టర్ అను పట్టణము బ్రిటను దేశమునకు ముఖ్యస్థానముగ నుండెడిది. కాని రోమనులు ఆ గౌరవమును లండనుకు కల్గించిరి. ఈ పట్టణమును నలుదెసల విస్తరింప జేయుటకై రోమనులు చక్కని పథకమును సిద్ధపరచిరి. నగరము చుట్టును బలమైన ప్రాకారము నిర్మాణమయ్యెను. ఇచ్చటనే టంకసాల నెలకొల్పబడెను. ఉత్తరమందలి యార్కునగరము రోమను సైన్యమునకు కేంద్రము. మిగిలిన రాజకీయ వ్యవహారములకును, కార్యాలయములకును, లండను నగరమే ముఖ్యస్థానము. బ్రిటను ద్వీపములో ఇంకను పెక్కుపట్టణముల నెలకొల్పి, వానిని వృద్ధి పొందింపవలెనని, రోమనుల కోర్కె. కాని వారి యాశయ మీడేరలేదు. రోమనులు సిద్ధముచేసిన పథకముల ప్రకారము బ్రిటనులోని పట్టణములు పెంపు చెందలేదు. బ్రిటను దేశములోని ఆర్థిక జీవిత మేవిధముగను వృద్ధి చెందక పోవుటయే ఇందులకు కారణము. రోమనులు ప్రసాదించిన శాంతిభద్రతల వలనను, వారు అమలుకావించిన ఉత్తమ శాసనముల వలనను, బ్రిటను ప్రజలకు సౌఖ్యము చేకూరిన మాట వాస్తవమే కాని వ్యాపారముకాని, వ్యవసాయముకాని ఈ యుగములో వృద్ధిచెందలేదు. రోమనుల ఆక్రమణలోనున్న

రాజ్యమున ఆ యుగములో సుమారు పదిలక్షల ప్రజలు మాత్రము నివసించి యుందురని అంచనా వేయబడినది.

పట్టణముల యభివృద్ధికి బ్రిటను దేశములో తగిన సావకాశములు లేవని గుర్తించి, రోమనులు వీలైనంతవరకు గ్రామములనే కాపాడిరి. ధనాఢ్యులును, విలాసప్రియులును, అయిన రోమనులు గ్రామసీమలందు తాము నివసించుటకై అందమైన భవనములను నిర్మించుకొనెడివారు. వారి ననుకరించు బ్రిటీషువారుకూడ, ఇట్టి నివాసస్థానముల కట్టుకొనుచుండిరి. అందు స్నాన గృహములు, వేడిమికొరకై ఏర్పాట్లు తదితరములగు అన్ని సదుపాయములును, అమరియుండినట్లు తెలియుచున్నది. జీవిత సౌఖ్యముకొరకై రోమనులు కావించుకొనిన సదుపాయములు బ్రిటీషుప్రజలు పందొమ్మిదవ శతాబ్ది వరకును ఎరుగరని చరిత్రకారులు వక్కాణించుచున్నారు.

బ్రిటీషువారిలో విద్యాధికులైన వారు రోమనుల ల్యాటినుభాషను నేర్చిరి. రోమనులవలె వస్త్రముల ధరించిరి. వారివలెనే స్నానగృహములలో మజ్జన మాడిరి. భోజనాదులలో రోమను ఆచారముల నవలంబించిరి. రోమక నగరమును, తత్పరిసరములును బ్రిటను దేశమున కెగిరివచ్చినవా యని ఇతరులాశ్చర్యపడునట్లు బ్రిటీషుద్వీపము మార్పు చెందెను.

రోమనుల పరిపాలనలో బ్రిటను దేశమునందు సంభవించిన రెండు ముఖ్యమైన మార్పులు ఇచ్చుట ప్రశంసింపక

తప్పదు. రోమను జాతివారు రాక పూర్వము బ్రిటనుద్వీపము ఐరోపా ఖండముతో ఎట్టి సంబంధమును లేక ఒకమూరు మూల యందు ఒంటరిగ పడియుండెను. సమీపమందున్న యితర దేశములతో ఈ ద్వీపమునకు ఎట్టి సంబంధములును ఉండెడివికావు. ఎవరో కొందరు వర్తకులు, వ్యాపారము నిమిత్తము మాత్రము బ్రిటను దేశమునకు వచ్చుచు పోవుచు ఉండిరి. రోమక సామ్రాజ్యములో అంతర్భాగముగ మారిన తరువాత, బ్రిటనుదేశము సువిశాలమైన ఒక నూతన ప్రపంచములో అడుగు పెట్టినది. రోమనుల సంస్కృతివలన బ్రిటీషుప్రజలు లాభము పొందిరి. రోమనులు ప్రభుత్వము చేయుచున్న కాలములో బ్రిటను ద్వీపమునందు క్రైస్తవమతము కాలుపెట్టెను. ఈ నూతన ధర్మము బ్రిటీషు ప్రజలలో క్రమముగ వ్యాప్తి చెందసాగెను. గ్రామసీమలలో కూడ క్రైస్తవ దేవాలయములు తలచూపజొచ్చెను. కాని ఇంతలో అనాగరకులును, క్రైస్తవేతరులును అగు ఇతర జాతులవారు వెల్లువవలె బ్రిటను ద్వీపమును ముంచి వేయుటవలన నూతనముగ నాటబడిన క్రైస్తవ మతమనెడి యీ మొక్క కూకటివ్రేళ్ళతో కదలిపోయెను. ఆ విషయమును ముందు ముందు సవిస్తరముగ తెలిసికొందము.

అఖండమగు బలమును, కీర్తి ప్రతిష్ఠలను సంపాదించిన రోమక సామ్రాజ్యములో కాలక్రమమున క్షీణత ప్రవేశించెను. నిరంతరములగు నంతఃకలహములవలన రోమనుల సైనికబలము క్షీణింపదొడగెను. రోమను నాగరకత ఉచ్చతమ

స్థితిని చెంది, చేకూరిన యదృష్టమును నిలువబెట్టుకొనిన చాలు
నను ఉదాసీన భావముతో పడెను. సామ్రాజ్యమునకు వెలుపల
నూతనోత్సాహముతోడను, నూత్నములగు ఆశయముల
తోడను, ఉప్పొంగుచున్న కొత్త జాతులవారు, కోలాహలము
చేయుచు ఒక క్రొత్త ప్రపంచమును ప్రవేశించి, సౌఖ్యమును
సాధింపవలెనని యువ్విళ్ళూరుచుండిరి. రోమక సామ్రాజ్యము
నకు అగ్నిపరీక్ష ఆసన్నమయ్యెను.

## బ్రిటను ద్వీపములో రోమనుల అధికారము
### అంతమగుట

క్రీస్తుశకము మూడవశతాబ్ది తుది భాగమునుండి
బ్రిటను దేశములో రోమనుల అధికారమునకు పెద్ద సవాలు
ఏర్పడసాగెను. స్కాట్లండు దేశములో నివసించు అనాగరికులు
"పిక్టులు" అనువారును, ఐర్లాండు ద్వీపవాసులగు "స్కాటు"
తెగవారును, రోమను రాజ్యమగు బ్రిటనుపై తరచుగ దండ
యాత్రలు చేయుట ప్రారంభించిరి. రోమను చక్రవర్తుల కాల
ములో నిర్మింపబడిన హాడ్రియన్ ప్రాకారముపై ఈ మూకలు
ఒత్తిడి చేయసాగెను. వీరిలో కొందరు సముద్రమార్గము మీదుగ
బ్రిటను ద్వీపవాసులపై పోరాటమునకు తలపడజొచ్చిరి. ఇంచు
మించు ఆదేకాలమున "సాక్సనులు" అను మఱియొక అనాగ
రక సంఘమువారు ఉత్తర సముద్రముమీదుగ, మిక్కిలి పొడ
వైన తమ పడవలలో ప్రయాణముచేసి, బ్రిటనుదేశపు తూర్పు

తీరముపై దాడులు మొదలుపెట్టిరి. క్రమక్రమముగ బ్రిటను ప్రజలలో భయభ్రాంతులు వ్యాపింపసాగెను. "రోమను చక్రవర్తుల పరిపాలనలోనున్న మనకు భయమేమి?" అనెడి నిర్భీకత నశించెను. రోమనుల కాలములో ప్రశాంతమగు గ్రామసీమలందు అనేక సుందరహర్మ్యములు వెలసెనుకదా! ఇప్పుడు వానిలో నివసించుట ప్రమాదకరముగా పరిణమించినది. అందువలన పలువురు ధనాధికులును, పెద్ద కుటుంబముల వారును ప్రశాంతమైన గ్రామజీవితమునకు తిలాంజలులు కావించి, మానప్రాణముల దక్కించుకొనుటకై పట్టణములకు పారిపోయి రాసాగిరి. ఆ కాలమందు ఇంచుమించుగ అన్ని పట్టణములకును ప్రాకారము లుండెడివి. శత్రుజాతుల దాడులు ప్రారంభము కాగానే, నగర ప్రాకారములన్నియు గట్టిపడెను. పాత బురుజులపై ఇప్పుడు కావలివారు కోలాహలముతో గస్తీలు ప్రారంభించిరి. సువిశాలమగు కోట గుమ్మములు చాలవరకు పూడ్పఒడినవి. ఇప్పుడు బ్రిటీషుప్రజల కెంతసేపును ఆత్మసంరక్షణ మెట్లు కావించుకొనవలెనా యనియే తహతహ. రోమను యుగమునాటి ఆత్మవిశ్వాసము, ధైర్యము, నిర్భీకత, హుందా జీవనము క్రమముగ మటు మాయము కాసాగెను.

ఇట్లు మేము వ్రాయుటవలన రోమను పాలకులు అకస్మాత్తుగ నిర్వీర్యులై, తమ రాజధర్మముల విస్మరించి పరారి యైనట్లు పాఠకులు తలంపకూడదు. పై దండయాత్రలు ప్రారంభమైన తర్వాత ఒక శతాబ్దిపైబడి వారు ధైర్య సాహస

ములతో శత్రువర్గము నెదిరించిరి. దేశరక్షణకై తగిన యేర్పాట్లను కావించిరి. బ్రిటనుదేశపు దక్షిణ తీరమందును, తూర్పు తీరమందును పెద్దపెద్ద దుర్గములు నిర్మింపబడెను. ఇవి నూతన్నముగ నెలకొల్పబడిన నౌకా బలమునకు కేంద్రస్థానములు. రోమనులకు సముద్రమనిన ఒక విధమైన భీతి. కావున వారు తమ బలమును పూర్తిగ స్థలసేనలయందే కేంద్రీకరించి యుంచెడివారు. కాని బ్రిటను దేశమునకు సంభవించిన ఈ యాపదను గుర్తించి, వారు తమ యుద్ధనీతిని మార్చుకొనిరి. శత్రునౌకల నెదుర్చుటకై రోమనులు బ్రిటీషు నౌకాదళము నొకదానిని సిద్ధము చేసిరి. దూరముననున్న శత్రువులు తమ్ము గుర్తించకుండుటకై ఈ నౌకాదళమువారు ఒక చక్కనిపద్ధతిని అవలంబించిరి. తమ నౌకలకును, తెరచాపలకును, నావికుల దుస్తులకును, వారి ముఖములకును కూడ సముద్రజలమును పోలిన ఆకుపచ్చని రంగు వారు పూయుచుండిరి. బ్రిటను దేశముయొక్క ప్రాగ్దక్షిణ తీరములను శత్రువుల బారినుండి కాపాడుటకై రోమక ప్రభుత్వము వారొక ఉన్నతోద్యోగిని ప్రత్యేకముగ నియమించిరి.

బ్రిటను ద్వీపమును కాపాడుటకై రోమను ప్రభుత్వము కావించిన ప్రయత్నములన్నియు నిరర్థకము లయ్యెను. క్రమక్రమముగా శత్రువుల బలము వృద్ధిచెందెను. క్రీ. శ. 367 వ సంవత్సరమున బ్రిటీషు ప్రజలకు గొప్ప యాపద సంభవించెను. "పిక్టులు", "స్కాటులు", "సాక్సనులు" అనబరగు మూడు

అనాగరక జాతులవారును ఒక్కుమ్మడి దండెత్తి వచ్చిరి. రోమక సామ్రాట్టుల సేనలు శత్రువులతో హోరాహోరి పోరాడినవి. ఉత్తర సరిహద్దులను కాపాడు సేనాధీశుడును, ప్రాగ్దక్షిణ తీరముల సంరక్షించు చమూపతియును కూడ, రణ రంగమునకు బలియైరి. అనాగరకుల దండ్లు ఉత్తరమునగల ప్రాకారమును పగులగొట్టి రోమనుల (బ్రిటీషు) రాజ్యము లోనికి చొరుచుకొని వచ్చెను. గ్రామసీమలలో నివసించు ధనాఢ్యులు, తమ వెండి బంగారములను భూమిలో పూడ్చిపెట్టి పికాపికలై పారిపోయి, ప్రాకార పరివేష్టితములగు పట్టణము లలో తలదాచుకొనిరి. మిల్డెన్‌హాల్ (Mildenhall) అను ప్రదేశమున రోమనుల కాలమునాటి యొక సంపన్న కుటుంబ మునకు చెందిన వెండి భోజనపాత్రలు లభించినవి. వానిని బ్రిటీషు మ్యూజియంవారు భద్రపరచి యున్నారు. పరాజయ ములు సంభవించినను, రోమను ప్రభుత్వమువారు బ్రిటను దేశ మును సంరక్షించు బాధ్యతను కొంతకాలమువరకును విడనాడ లేదు. క్రీ. శ. 367 వ సంవత్సరమున "వాలంటీనియను" అను రోమక సార్వభౌముడు "థియోడోసియస్" అను సేనానాయ కుని బ్రిటను ద్వీపమును సంరక్షించుటకై, గొప్ప సేనతో పంపెను. ఈ యోధుడు బ్రిటీషు ప్రజలను కొంతకాలము వర కును కాపాడెను. "స్టిలీకో" అను మరియొక సేనా నాయ కుడు రోమను ప్రభుత్వము తరపున, బ్రిటీషు ద్వీపమును మరి కొంతకాలము సంరక్షణ కావించెను. కాని సమర్థులగు రోమను అధికారు లెవ్వరును, బ్రిటను ద్వీపములో నిలువబడి, దానిని

రక్షించుటకై నిలుకడగ ఉండరైరి. సామ్రాజ్యమునకు ముఖ్య పట్టణమగు రోమునగరము పైననే, అనాగరక జాతులవారు దండెత్తి రాసాగిరి. తమ అధికారమును, రాజ్యమును, కాపాడుకొనుటకై రోమను చక్రవర్తులు సామ్రాజ్యపు మూలమూలల నుండి సేనలను తమవద్దకు రావించుకొనజొచ్చిరి. ఈ విధముగ బ్రిటను దేశములోని రోమక సైన్యముకూడ తొలగింపబడెను. ఈ యదను చూచుకొని "పిక్టులు" మున్నగు శత్రువులు ఉత్తర మందలి రోమను ప్రాకారమును కూలద్రోసి, దేశములోనికి తండోపతండములుగ వచ్చి పడజొచ్చిరి. వారు బ్రిటనులను దోచుకొని, చాలమంది ప్రజలను సంహరించి, దేశము నల్లకల్లోలము కావించిరి. మరియొకవంక సముద్రము మీదుగ సాక్సను మూకలు దేశములో చొరబడి, ప్రజానీకమును సర్వ విధముల బాధింపసాగెను. కాని రోమను చక్రవర్తులు హతభాగ్యులైన బ్రిటనుప్రజల రక్షణకొరకై ఏమియును చేయజాలరైరి. తుదకు క్రీ. శ. 410వ సంవత్సరమున "హనోరియస్" అను రోమక సార్వభౌముడు తన బ్రిటీషుప్రజలు కావించుకొనిన విన్నపమునకు సమాధానముగ "సామ్రాజ్యాంతర్గతములగు దేశములన్నియు తమ రక్షణకై వలయు ఏర్పాట్లు తామే చేసికొనవలెను" అని సందేశము పంపెను. ఇంతటితో బ్రిటను ద్వీపములో రోమనుల యధికారము సమాప్తమైనట్లు తెలుపవచ్చును.

## బ్రిటీషుప్రజలు సాక్సనుల నెదిరించి పోరాడుట

ఇప్పుడు బ్రిటను దేశీయులకు, ఆత్మరక్షణకొరకై స్వయం సహాయము తక్క వేరొండు మార్గము లేదయ్యెను. కాని సుమారు నాల్గు శతాబ్దులకాలము, పరదేశీయులపై ఆధారపడియుండిన ఈ ప్రజలు, తమ్ము తాము రక్షించుకొనుట సాధ్యముకాని పని. అందువలన వారు, ఈ ఆపత్కాలమున తమ్ము కాపాడవలసినదిగ మొరపెట్టుకొనుచు, ఫ్రాన్సు మున్నగు ప్రాంతములలోని రోమను సైన్యాధ్యక్షులకు, విన్నపములు పంపుకొనసాగిరి. క్రీ. శ. 446 వ సంవత్సరమున బ్రిటీషు ప్రజలు ఫ్రాన్సు దేశములో తన సేనల నెలకొల్పియుంచిన "ఏటియస్" అను రోమక సైన్యాధ్యక్షునికి హృదయ విదారకమగు నీ మహాజరు పంపుకొనిరి. "అనాగరకులగు శత్రువుల బాధ పడలేక మేము సముద్రుని శరణు వేడగా, సముద్రపు దొంగలు మమ్ము మరల ఈ యనాగరకులవైపు తరిమి వేయుచున్నారు. మాకు వేరొండు దిక్కు లేదు. కావున మమ్ము కాపాడుటకు రండు. చేయూత నొసంగుడు" అని ప్రార్థించిరి. కాని ఇందువలన నెట్టి ఫలితమును లేదయ్యెను. మార్గాంతరములేక బ్రిటను దేశమును పాలించుచున్న "వార్టిజర్న్" అను ఒక ప్రభువు సాక్సను మూకలను తరిమివేయు నుద్దేశ్యముతో "జ్యూట్లు" అను విదేశీయ తెగవారి సహాయమును కోరెనట (క్రీ. శ. 449). వారు సహాయము నొసంగుట కంగీకరించిరి. కాని ఆ సంవత్సరమే వారి నాయకులగు

"హెంజిస్టు", "హోర్సా" అను వారలు (ఈ పదములకు గుఱ్ఱము, ఆడు గుఱ్ఱము అని అర్థము) బ్రిటీషురాజుపై తిరుగుబాటు కావించి, బ్రిటీషుదీవులలో అంతర్భాగమైన "థానట్" అను లంకను వశపరచుకొనిరి. విదేశీయులగు సాక్సనులును, వారి మిత్రులును బ్రిటను ద్వీపమును వశపరచుకొనుటకు, ఇది నాందీవాక్యము. ఈ యాక్రమణ పూర్తి యగుటకు సుమారు నూట యేబది సంవత్సరములు పట్టెను. బ్రిటను దేశమును ఆక్రమించుటలో సాక్సను జాతివారికి "ఆంగిలులు" అను మరి యొక తెగవారును, ఈ వరకే ప్రశంసింపబడిన "జ్యూట్లు" అను ప్రజలును సహాయపడిరి. విదేశీయులు క్రమక్రమముగ, స్థానికులగు బ్రిటీషుప్రజల నోడించుచు, మొదట దేశమధ్యమునకును, అటుపిమ్మట పశ్చిమతమ భాగములకును తరిమివైచిరి. కాని బ్రిటనులు నిర్వీర్యులై ఒక్కసారిగ వెనుకకు పారి పోలేదు. వారు విదేశీయులతో ధైర్య సాహసములతో పోరాడిరి. ఈ యుద్ధములలో ఇరుపక్షముల వారును కూడ, రెండవ వారిపై ఎట్టి దయాదాక్షిణ్యములు చూపలేదు. "జయమైన సాధింపవలెను. లేదా రణరంగమున ప్రాణములనైన బలికావింపవలెను" అనెడి భీషణ నిశ్చయముతో, రెండు జాతులును కూడ పోరాడెను. బ్రిటను దేశీయులును, సాక్సనులు, ఆంగిలు తెగలవారును కావించిన యుద్ధములలో మూడు పోరాటములు అతిముఖ్యముగ భావింపబడుచున్నవి. అందు మొదటిది క్రీ. శ. 520 వ సంవత్సరమున "మౌంట్ బాడన్" (Mount Badan) అను ప్రదేశమున సంభవించెను.

## "ఆర్థరు రాజు"

మౌంట్ బాడన్ యుద్ధములో "పశ్చిమ ప్రాంతపు సాక్సనులు" సంపూర్ణముగ పరాభవము పొందిరి. ఇందువలన వారి ఆక్రమణకు కొంతకాలము వరకును అంతరాయము కల్గెను. ఇది బ్రిటీషు పక్షమువారికి గొప్ప విజయము. అయినచో ఈ విజయమును సాధించిన వారెవరు? ఈ యంశమును గురించి బ్రిటీషు చారిత్రికులలో ఆధునికులు పలువురు ఒక నిశ్చితాభిప్రాయమునకు వచ్చినారు. మౌంట్ బాడన్ విజయమును సాధించినది సుప్రసిద్ధుడగు ఆర్థరురాజు. ఈతడు బ్రిటీషు జాతికి చెందిన యొక ఉత్తమ ప్రభువను నంశమును బ్రిటీషువారు చిరకాలమునుండియే అంగీకరించి యున్నారు. కాని ఇటీవల వరకును ఆతడు చారిత్రిక పురుషుడు కాడనియు, కేవల పురాణ ప్రపంచమందలి యొక వీరశ్రేష్ఠుడనియు, ఊహాకల్పితుడనియు వీరు భావించుచుండిరి. ఆధునిక చారిత్రికులా యభిప్రాయముతో నేకీభవింపక ఆర్థరురాజు చారిత్రిక యుగమునాటివాడే యనియు, మహా క్రూరులును, పాషండులును అగు సాక్సనులు తమ మాతృదేశముపై దండెత్తివచ్చి, ప్రజలను సర్వవిధముల బాధపెట్టి, వారనుసరించుచున్న సత్యమగు క్రైస్తవమతమును రూపుమాపుటకై ప్రయత్నించినప్పుడు, మాతృభూమిని, క్రైస్తవమతమును సంరక్షించుటకై కత్తిదూసిన మహాపురుషుడనియు తలంచుచున్నారు. సుప్రసిద్ధ రాజనీతిజ్ఞులును, పండితులును, చారిత్రికులును అగు సర్ విన్‌స్టన్

చర్చిల్ మహాశయులు పై వాదమును సమర్థించుచున్నారు. అర్థరు రాజు క్రీ. శ. ఆరునవ శతాబ్ది మధ్యభాగమున జన్మించి, రాజ్యపాలనము కావించి యుండవచ్చునని, వారి భావన. అర్థరు రాజునకును, అతని అనుయాయులకును వీరాంగ్రేసరులకును, ఆంగ్లవాఙ్మయము నందపారమగు ప్రతిష్ఠ, గౌరవమును కలవు. కోసలాధీశుడగు శ్రీరామచంద్రునకును, భారత వీరశ్రేష్ఠుడగు అర్జునునకును, భారతీయ సారస్వతములో గల స్థానము అర్థరు ప్రభువున కాంగ్లవాఙ్మయములో కలవు. అర్థరురాజు మిత్రవర్గమునకు "గుండ్రబల్ల వీరులు" (Knights of the Round - Table) అని ప్రఖ్యాతి. వీరెల్లరును మహాయోధులు. సకల సద్గుణ సంపన్నులు. ధర్మరక్షణము కొరకును, దుష్టసంహారము కొరకును, ప్రభుసేవకొరకును తమ జీవితము నంకితముచేసిన ఉత్తమ చారిత్రులు. అర్థరురాజు యొక్కయు, ఆతని సహచరులగు గుండ్రబల్ల వీరులయొక్కయు, గాథలను నేటికిని కూడ బ్రిటీషు ప్రజలు ఆబాలగోపాలమును ఆశ్చర్యానందములతో పఠింతురు. ఈ గాథలను మధ్యమ యుగమందు జఫరీ అను నాతడును, ఆ పిమ్మట మాలోరి (Mallory), స్పెన్సరు (Spenser) అను వారలును, గ్రంథస్థము కావించిరి. ఆధునిక యుగమునందు మహాకవియగు టెనిసన్ ప్రభువు అర్థరు పురాణమును పునరుద్ధరించి, ఆ రాజకంఠీరవునకును, ఆతని అనుయాయులకును తన "Idylls of King Arthur" (అర్థరు రాజు యశోగీతకలు) అను ఉత్తమ కావ్యమున, అజ

రామరత్వము కల్పించి యున్నాడు. ఆర్థరు రాజు వంటి ఉత్తమ ప్రభువు కేవల కల్పిత మానవుడు కాడనియు, ఆతడును అతని మిత్రబృందమువారును ఒకానొక కాలమున బ్రిటను దేశమున జీవించి, దేశసేవ కావించిన వారనియు నిరూపణ యగుట బ్రిటను దేశమునకు గౌరవహేతువు. ఇట్టి యుత్తమ పురుషుల జీవితములు మానవజాతియందు దినదినము విలుప్తమగుచున్న ఆత్మవిశ్వాసమును పునరుద్ధరింపజాలును.

## సాక్సనుల విజయము

బ్రిటీషు ప్రజలు విదేశీయులగు సాక్సనులపై సాధించిన విజయములలో, మౌంట్ బాడన్ యుద్ధమే తుట్టతుది గెలుపు. ఈ యుద్ధము తరువాత కొంతకాలము వరకును సాక్సనుల పురోభివృద్ధి యాగిపోయెను. కాని బ్రిటనుప్రజలు తమ యసమర్థతను, అజేయమగు శత్రుబలమును గుర్తించి, క్రమముగ బ్రిటను దేశపు పశ్చిమ, ఉత్తర ప్రాంతములకు వెడలిపోయిరి. ఇవియన్నియు పర్వతమయమైన అటవీ ప్రాంతములు. బ్రిటనుప్రజలు వేల్సుదేశపు ప్రాంతములకు పారిపోయిన కారణమున సాక్సనులు వీరిని వేల్సుప్రజలు (The Welsh) అని వర్ణింప సాగిరి. క్రీ. శ. 577 వ సంవత్సరమునను, క్రీ. శ. 613 వ సంవత్సరమునను సాక్సనురాజులు వరుసగ డర్హామ్, ఛెస్టరు అను ప్రదేశములలో బ్రిటను దేశీయుల సేనలను సంపూర్ణముగ నోడించి, విజయమును చేపట్టిరి. ఛెస్టరు యుద్ధములో సాక్సను ప్రభువైన

ఎథల్ ఫ్రిత్ అను నాతడు బ్రిటను వీరులను మాత్రమే కాక, వారికి సహాయముగ వచ్చిన అనేక క్రైస్తవ మతగురువులను కూడ దయాదాక్షిణ్యము లేక తన ఖడ్గమున కెరగావించెను. "మా శత్రువుల విజయముకొరకై దైవప్రార్థనలు కావించు వారుకూడ మా శత్రుకోటిలోనివారే" యని క్రైస్తవేతరుడగు నీ రాజు పల్కినట్లు చెప్పుదురు. డర్హామ్, ఛెస్టరు, యుద్ధములతో బ్రిటను సాక్సను జాతుల సంఘర్షణలో ఒక ముఖ్యఘట్టము పూర్తియైనది. అటుపిమ్మట కూడ, ఈ రెండుజాతుల వారును అప్పటప్పటి యుద్ధములు కావించి యుండవచ్చును. కాని అవి నామ మాత్రములు. బ్రిటను దేశము సాక్సను జాతివారికి శాశ్వతముగ వశమైన యంశము 613 నాటితో ధ్రువపడిపోయెను. అంతేకాదు. పైని తెలుపబడిన రెండు అపజయములవలన, బ్రిటను జాతివారికి తీరని నష్టము సంభవించెను. డర్హామ్ పరాజయమునందు వేల్సు దేశమునందలి బ్రిటనులు బ్రిటనుదేశపు నైరుతి భాగమందలి స్వజాతీయులనుండి వేరు పడిపోయిరి. ఈ రెండు ప్రాంతములకును మధ్యగల భాగమును సాక్సనులు వశపరచుకొనిరి. అట్లే ఛెస్టరు పరాజయమువలన వేల్సు దేశమందలి బ్రిటనులు ఉత్తర ప్రాంతమందలి లాంకషైర్, కంబర్లాండ్ జిల్లాలలోని సోదర బ్రిటను ప్రజలనుండి, వేరు చేయబడిరి. ఈ ప్రాంతములకు రెంటికిని నడుమ, సాక్సనులు తమ రాజ్యమును నెలకొల్పిరి. విధి ప్రాతికూల్యమువలన బ్రిటను జాతివారు, తమ మాతృభూమిని విదేశీయులకు విడిచివైచి, దేశపు మారుమూలలకు పారిపోవలసి వచ్చెను.

క్రీ. శ. 520 వ సంవత్సరమున బ్రిటీషు జాతివారు సాధించిన మౌంటుబాడన్ విజయముతో రోమక బ్రిటను యొక్క తేజోదీప్తి యంతరించినట్లు చారిత్రికులు తలంచుచున్నారు. రోమకయుగము సమాప్తమై సాక్సనుల యుగము ప్రారంభ మగుచున్నది. రోమక ప్రపంచమును సంపూర్ణముగ తెరమరుగునకు పంపివేయుటకు పూర్వము ఒకటి రెండు విషయములు తెలుపక తప్పదు. రోమనులు సుమారు నాలుగు శతాబ్దుల కాలము బ్రిటను దేశమున అధికారము నెరపిన మాట వాస్తవమే కాని, ఆ పరిపాలనవలన శాశ్వతఫలితము లేవియు కలుగలేదు. అనతి కాలములో రోమనులకు బ్రిటనుతోగల నాల్గు శతాబ్దుల సంబంధము పదో కలలోని వార్తగ మారిపోయెను. బ్రిటను దేశీయుల భాషపైగాని, వారి రాజ్యాంగ సంస్థలపై కాని రోమనుల ప్రభావము ముద్రితముకాలేదు. బ్రిటను వలెనే రోమనుల యధికారములోనికి వచ్చిన ఫ్రాన్సు, స్పైను దేశముల విషయము మాత్ర మందులకు పూర్తిగ విరుద్ధముగ నున్నది. ఫ్రెంచి, స్పైను, భాషలపై రోమనుల భాషాప్రభావము బాగుగా ప్రతిఫలించెను. తదితర విధములుగ కూడ ఫ్రాన్సు, స్పైను దేశముల చరిత్రలో రోమనులతో వారి కేర్పడిన సంబంధము, స్ఫుటముగ కానవచ్చును. సాక్సనుల రాకతో బ్రిటనుల ప్రాచీన జీవనసూత్రము తెగిపోయినది. మరియొక స్రవంతి యేర్పడుచున్నది. రోమనుల ఆక్రమణకు నిదర్శనముగ బ్రిటనుదేశమున కొన్ని భౌతిక చిహ్నములు మాత్రము నేటికిని కానవచ్చుచున్నవి. రోమనుల కాలమునాటి ప్రాకా

రములు, ఆ కాలమునాటి క్రీడాస్థలములు, రోమనులు పెంపొం దింప దలచిన పట్టణముల పునాదులు, మున్నగు వాని శిథిల ము-లు మాత్రము బ్రిటను దేశీయులకు, అప్పుడప్పుడు ప్రాచీన రోమనుల పరిపాలనను జ్ఞప్తికి తెచ్చుచుండును. ఆధునిక బ్రిటీషు ప్రపంచములో ఎవరో కొందరు పురాతత్త్వ పరిశోధకు లును, థామస్ హార్డీ (Thomas Hardy) వంటి విచిత్ర ప్రకృతి గల నవలాకారులును తప్ప, రోమను బ్రిటనును గూర్చి యెవ్వ రును తలంపరనియే చెప్పవచ్చును.

———

రెండవ ప్రకరణము

# సాక్సనులు - డేనులు

## సాక్సనులు - బ్రిటను దేశపు ఆక్రమణ

క్రీ. శ. 5, 6 శతాబ్దులలో బ్రిటను దేశమును కొందరు పరదేశీయులు క్రమక్రమముగ ఆక్రమించినట్లు పైన తెలిసి కొని యున్నాము. ఈ విదేశీయులను సూచించునప్పుడు తరచుగ సాక్సనులు అను పదమే విస్తారముగ వాడబడినది. కాని నిజమునకు బ్రిటను దేశము నాక్రమించిన వారు సాక్సనులు ఒక్కరు మాత్రము కారు. "ఆంగిలులు", "జ్యూట్లు" అను రెండు వేరు తెగలవారుకూడ ఈ యాక్రమణలో పాల్గొనిరి. ఇందు జ్యూటు తెగ వారి సంఖ్య గణనీయమైనది కాదు. కావున బ్రిటను దేశమును వశపరచుకొనినది ముఖ్యముగ ఆంగిలులు, సాక్సనులు అని చెప్పవలసి యున్నది. బ్రిటను దేశములో నేడు సార్వత్రికముగ నివసించు ప్రజలు, ప్రాచీనులైన ఆంగ్లో సాక్సను ప్రజల సంతతివారు. కావున బ్రిటీషుజాతికి ఆంగ్లో సాక్సను (Anglo Saxon) జాతి అను నామాంతరము కల్గినది. ఆంగిలుల దేశము ఇంగ్లండు (England). ఈ పదము మన నిత్య వ్యవహారములో తరచుగ కానవచ్చు చున్నది. నేటి ఇంగ్లీషు (English) భాషకు మూల స్వరూపము Anglo Saxon (ఆంగ్లో సాక్సను) అను ప్రాచీన (అసంస్కృత) భాషయందు కానవచ్చు చున్నది. ఇంగ్లాండు దేశములోని పెక్కు పట్టణములకు సాక్సను

సాంప్రదాయ బద్ధములగు పేర్లు కలవు. ఇంగ్లాండు దేశపు ఆర్థిక రాజకీయ సంస్థలందు ప్రాచీనులగు సాక్సనుల సంస్థల యొక్కయు, ఆచారముల యొక్కయు ప్రభావము ప్రస్ఫుట ముగ చూడనగును. కావున ఈ ఆంగ్లో సాక్సనుల పుట్టుపూర్వోత్తరము లెట్టివో విమర్శించుట ముఖ్యము.

ప్రప్రథమమున సాక్సనులు, ఆంగిలులు, జ్యూట్లు అను తెగలవారు నేటి జర్మనీ, డెన్మార్కు దేశములలో నివసించు చుండెడివారు. క్రీ. శ. నాల్గవ శతాబ్ది యందు మధ్య ఆసియా యందు నివసించుచుండు అనాగరక జాతులలో గొప్ప సంచల నము కల్గి, వారు జీవనోపాధికై నూతన రాజ్య పిపాసతో పశ్చిమాభిముఖముగ ప్రయాణము సాగించిరి. మధ్య ఆసియా నుండి బయల్వెడలిన ఈ యనాగరకులు, మిక్కిలి బలశాలులు. రణకుశలులు. అంతేకాక కటిక దరిద్రమువలనను, క్షుద్బాధా దికమువలనను, ఎంతెంత బాధలకైనను, సిద్ధపడియున్నవారు. ఇట్టి అనాగరకులు తండోపతండములుగ, ఐరోపాఖండమును ప్రవేశించి, ఇటలీదేశమునందును, జర్మనీదేశమునందును చొర బడిరి. ఆగంతకుల రాకవలన రోమక సామ్రాజ్యమునకు గొప్ప ప్రమాదమేర్పడెను. కాని అది వేరు గాథ. ఈ ప్రమాదము నకు తట్టుకొనజాలక పోవుటవలననే, రోమను సార్వభౌములు తమ సామ్రాజ్యపు వివిధ ప్రాంతములనుండియు, బ్రిటనుద్వీపము నుండియు తమ సైన్యముల వెనుకకు రావించుకొని, రోము నగరమును రక్షించుకొనుటకై, సర్వవిధముల కృషిచేసిరి.

రోమను సైన్యములు బ్రిటనుద్వీపమును విడచిపోవుటవలన కల్గిన ఫలితములగూర్చి, ఈవరకే మేము ప్రశంసచేసినారము. మధ్య ఆసియానుండి దండెత్తివచ్చిన ఈ అనాగరకులు, జర్మనీ మున్నగు దేశములలో నివసించు సాక్సనులు మున్నగు ప్రజలకు చాల ఒత్తిడి కల్గించిరి. సాక్సనులు, ఆంగిలులు తదితరులును, స్వదేశ రక్షణము కొరకై సర్వవిధముల కృషిచేసిరని మన మూహింపవచ్చును. కాని ఫలితము లేదయ్యెను. వారి జీవితము సర్వవిధముల ప్రమాదభరితమయ్యెను. కావున సాక్సను, ఆంగిలు ప్రజలు, తమ కుటుంబములతో సహా ప్రశాంత జీవనము గడపుటకు యోగ్యమైన దేశముల వెదకికొనుచు, తమ పడవలలో పశ్చిమాభిముఖముగ ప్రయాణము సాగించిరి. అభివర్ణితములగు పరిస్థితులే వారు బ్రిటనుద్వీపముపై దాడులు చేసి, కాలక్రమమున నీ ద్వీపమును శాశ్వతముగ వశపరచుకొనుటకును, అందు స్థిరనివాసమేర్పరచుకొనుటకును కారణభూతమయ్యెను.

## ఆంగ్లో సాక్సను సంస్థలు

ఆంగ్లో సాక్సను తెగవారు అనాగరకులనుట సత్యమే కాని వారి సంఘ వ్యవస్థయందు కొన్ని చక్కని లక్షణము లుండెను. ఈ లక్షణములే కాలక్రమమున బాగుగా వృద్ధిపొంది, ఆధునిక యుగమున బ్రిటనుదేశమునకొక విశిష్టత సంపాదించినవి. పై తెగలవారు తమ మాతృభూమియందు స్వయముగ

కష్టపడి పనిచేయుట కలవాటుపడినవారు. కావున బ్రిటను ద్వీపమున స్థిరనివాస మేర్పరుచుకొనిన తరువాత కూడ వారీ యభ్యాసములనే నిల్పుకొనిరి. వారిలో బానిసలచే పనులు చేయించు అలవాట్లు ఎంతమాత్రమును లేవు. ఆంగ్లో సాక్సనులు మొదటినుండియు, స్వపరిపాలనమున కలవాటుపడిన వారు. పరిపాలనకు సంబంధించిన యంశములన్నిటిని "ప్రజా సభ" యను సమితి నిర్ణయించెడిది. ఈ సమితి సమావేశములో నాయకుల నెన్నుకొనుట, యుద్ధప్రకటనము, సంధి నిర్ణయము మున్నగు ముఖ్య విషయములు పరిష్కరింపబడు చుండెను. సమితి సభ్యులు తమ సోదరులను, వాదనైపుణిచే తమ వంకకు త్రిప్పుకొనవచ్చును కాని, ఎవ్వరును వేరొకరి నట్లు చేయవలసిన దని నిర్బంధ పరచుటకు వీలులేదు. ఏదైన విషయము తమ కంగీకారమైన పక్షమున ప్రజాసభ యందలి సభ్యులు తమ ఈటెలతో డాలును తాకి ఆమోదమును సూచించెడివారు. లేనిచో అనంగీకార సూచకముగ కేకలు వేసెడివారు. ప్రజా సభకు ఆంగ్లమున "Folk-moot" అని పేరు. సాక్సను జాతి వారు బ్రిటనుదేశమందు శాశ్వతముగ నివాసమేర్పరచుకొనిన తరువాత క్రమముగా రాజ్యము లేర్పడెను. ఈ కాలమున చిన్నచిన్న ప్రజాసభలు (Folk-moots) అంతరించి, వాని స్థానమున పెద్దపెద్ద "జిల్లాసమితులు" (Shire-moots) ఏర్పడెను. ఈ జిల్లా సభలు సంవత్సరమునకు రెండు పర్యాయములు సమావేశమై, అభియోగముల విచారించి, న్యాయప్రదానము

కావించుచుండెడివి. ఈ సమితియందు జిల్లా అధికారి (Ealdorman), రాజునకు ప్రతినిధియైన షరీఫ్ (Sheriff) అను ఉద్యోగి, మతాధికారియగు బిషప్పును (Bishop) ఆ జిల్లా యొక్క ప్రజా ప్రతినిధులును సభ్యులుగ నుండెడివారు. ప్రతి జిల్లాయందును "శతములు" (Hundreds) అను విభాగములును, ప్రతిశతమందును కొన్ని చిన్న విభాగములును ఉండుచు వచ్చెను. శతములందును, వాని అంతర్భాగములందును కూడ, ప్రజాసంఘములు నెలకొని యుండెడివి. ఏ జిల్లాలో జరిగిన నేరములను, ఆ జిల్లా ప్రతినిధుల సమక్షమున విచారించు ఆచారమును, మొదటినుండియు సాక్సను జాతివారు పాటించుచుండిరి. ఈ యలవాటే కాలక్రమమున న్యాయస్థానములలో "జ్యూరీ" అను ఏర్పాటుచేయునట్టి ఉత్తమాచారమునకు పునాదివంటిది. సాక్సనులలో మరియొక చక్కని ఏర్పాటు అమలులో నుండెను. వారు తమ ప్రజలను చిన్నచిన్న సంఘములుగ విభజించుచుండిరి. ఈ చిన్న సంఘములోని వ్యక్తి ఎవ్వడైన ఏదైన నేరముచేసిన పక్షమున, అందలి యితర వ్యక్తులందరును కూడ, ఈ నేరమునకు బాధ్యులుగ నిర్ణయింపబడుచుండిరి. దోషియగువాడు పరారియైనచో, ఆతని చిన్న సంఘమువారు న్యాయస్థానమునందు నిలువబడి, దోషినిగూర్చి సంజాయిషీ చెప్పుకొనవలెను. దోషిపై విధింపబడిన జుర్మానాను చెల్లింపవలసిన బాధ్యతకూడ వీరే వహించుచుండిరి. న్యాయరీత్యా నిందితుడైన ప్రతివ్యక్తికిని, మరియొక పెద్దమనుష్యుడు

హామీగ నుండునట్టి ఆచారముకూడ సాక్సను సంఘములో వ్యాపించి యుండెను. పరిపాలనావ్యవహారములను పరిష్కారము కావించుటకై సాక్సనులు "ప్రజా సభలు" (Folk-moots) మున్నగు సభలు ఏర్పాటుచేసెడివారని తెలిపియే యున్నాము. ఈ సభలలో సభ్యులగు వారు లోక వ్యవహారముల చక్కగ నెరుంగని సామాన్య ప్రజలు. ఈ ప్రజా సభలో ఎవరికి తోచిన విషయములు వారు పెద్దగ అరచుచు వ్యక్తీకరించెడి వారు. సాక్సను రాజులు తమకు అన్ని ముఖ్య విషయములలోను సలహా నిచ్చుటకై "విజ్ఞానుల సమితి" (Witan) అను నొక ప్రత్యేక రాజ్యాంగ సంస్థను నియమించెడివారు. ఇందు జిల్లా అధికారులును (Ealdormen), రాజునకు అంగరక్షకులగు వీరులును (వీరు సాక్సను సంఘమునందలి ఉన్నత కుటుంబముల వారు), సాక్సనులు క్రైస్తవ మతమును స్వీకరించిన పిమ్మట ఆర్చిబిషప్పులు అను మతాధికారులును సభ్యులుగ నుండెడి వారు. ఈ విజ్ఞానుల సమితిలో ప్రజాప్రతినిధు లుండెడివారు. కావున దీనిని ఈ కాలము నాటి బ్రిటీషు పార్లమెంటు నందలి "ప్రభువుల సభ" (House of Lords) తో పోల్చవచ్చును. ఈ సమితివారు ఆధునిక యుగమున పార్లమెంటు సభవారు నిర్వర్తించు రాజ్యాంగ విధులను, నిర్వర్తించెడివారు. విజ్ఞానుల సమితివారు శాసనములు కావించెడివారు. యుద్ధము, సంధి నిర్ణయము, మతసంబంధమగు అంశములు, మున్నగు విషయములందు సాక్సను రాజులు, పై సమితి వారి యభిప్రాయమును తీసికొనుచుండెడివారు. ఈ విజ్ఞానుల సమితి కొన్ని నియమము

లకులోనై రాజులను ఎన్నుకొనెడిది. రాజును పదభ్రష్టుని చేయుటకుకూడ వీరి కధికార ముండెను. బలవంతులగు రాజులు పై "విజ్ఞాన సమితి" ని ఒక సలహా సంఘముగ మాత్రము భావించెడివారు. రాజు అసమర్థుడైనను, వారసత్వమును గూర్చి రాజ కుటుంబములో భిన్నాభిప్రాయము లేర్పడినను, విజ్ఞానుల సమితి రాజకార్యముల నన్నిటిని పరిష్కరించెడిది.

సాక్సనుల మాతృదేశమగు జర్మనీయందు రాజు లుండెడివారు కారు. వేరువేరు తెగలకు వేరువేరు నాయకు లుండుట వారిలో ఆచారము. ఈ నాయకులు తెగలోని వారితో రక్త సంబంధము కలవారు. ఆంగ్లభాషలోని King (రాజు) అను పదము కూడ రక్తబంధువు అను సంబంధమును సూచించు నట్టిదని పండితులు తెల్పుచున్నారు. తెగల నాయకుడు, యుద్ధకాలమున తన బంధువుల కగ్రగామియై, రణక్షేత్రమున కేగుచుండెడివాడు. జర్మనీ దేశములోని సాక్సనులకు నాయకులుగ నుండిన యిట్టి వీరపురుషులే, బ్రిటనుదేశమునకు వచ్చిన తరువాత, రాజులుగ మారిరి. కాని నాయకు లేర్పడుటకు సంబంధించిన నియమములు మాత్రము, మరికొంతకాలము యథాతథముగ నుండిపోయెను. రణరంగమున నాయకుడు కాదలచిన వాడు యుక్తవయస్కుడుగ నుండవలెను. బాలురును, స్త్రీలును, ఈ పదవి నాక్రమించుట కనర్హులు. కావున సాక్సను ప్రజలు తమ నాయకుని మరణానంతరము, యుక్తవయస్కుడును, సమర్థుడును అగు ఆతని కుమారుని తమ కగ్రేసరునిగ

ఎన్నుకొనెడివారు. చనిపోయిన వీరపురుషుని కుమారుడు బాలుడుకాని, అసమర్థుడుకాని యైనచో, అట్టి వానిని నాయకత్వమున కనర్హునిగ భావించి త్రోసిపుచ్చి, సాక్సనులు, కీర్తిశేషుని సోదరుని కాని, తదితర సమీప బంధువును కాని, నేతగ వరించుచుండిరి. ఈ పద్ధతులే బ్రిటను దేశములో కూడ మొదటి సాక్సను రాజుల నియమించుటలో అనుసరింపబడెను. బ్రిటను దేశ చరిత్రలో గొప్ప విఖ్యాతిచెందిన ఆల్ఫ్రెడ్ రాజు వారసత్వ రీతిచే రాజు కాదగినవాడు కాడు. ఆతని యన్న యగు ఎథల్రెడ్ అను నాతడు మరణించినప్పుడు, ఆతనికి కొందరు కుమాళ్ళు ఉండిరి. కాని విజ్ఞానుల సమితి, వారు బాలురైన కారణమున వారిని నిరాకరించి, ప్రాప్తవయస్కుడును, సమర్థుడును అగు ఆల్ఫ్రెడ్‌ను (ఎథల్రెడ్ రాజుసోదరుడు) రాజుగ ఎన్నుకొనిరి. బ్రిటను దేశమందు కాలక్రమమున రాజులు బలపడిరి. చిన్న చిన్న రాజ్యములుగ మారినప్పుడు రాజుల బలము సహజముగ వృద్ధి పొందెను. సాక్సను రాజులను అంగరక్షకు లగు పలువురు వీరులు సేవించుట ఆచారముగ నుండెను. వారు రాజుతో సహా యుద్ధమునకు పోయి, అందలి కష్టనిష్ఠురములను సహించెడివారు. యుద్ధమున లభించిన ధన కనక వస్తు వాహనములలో, రాజు వారి కొక భాగము నిచ్చుచుండెను. శాంతి సమయములో వారు రాజు వద్దనే, నివసించుచు, ఆతని పంక్తినే భోజనము చేసెడివారు. రాజు ఇట్టి వీరపురుషులకు, తరచు పెద్ద భూఖండములు

జాగీరులుగ ఇచ్చుట వాడుకగ నుండెను ఈ వీరపురుషులు స్వామిభక్తి ప్రమాణములు తీసికొని, ఎల్లప్పుడు రాజసేవ కావించెదమని వాగ్దానములు చేయుచుండిరి. ఈ వీరపురుషులు విజ్ఞానుల సమితి యందు సభ్యులుగ నుండుచు, ప్రభువునకు సలహాదారులుగ వర్తించెడివారు. ఈ అంగరక్షక వీరులకు థేన్స్ (Thegns) అని పేరు. వీరు ఉన్నత వంశ జాతులు కాని, జిల్లా అధికారులు కాని కాకపోయినను, రాజు సాహచర్యము వారికి సంఘమున నొక విశిష్టమగు ఘనతను సంపాదించి పెట్టెను. రాజు బలము వృద్ధిచెందినకొలదియు అంగరక్షక వీరుల హోదా వృద్ధిచెందెను. తమ ఘనతను నిలువబెట్టుకొనుటకై వారు రాజపదవి కితోధికమైన ఘనతను సమకూర్పసాగిరి. ఈ విధముగ రాజును, అంగరక్షక వీరవర్గమును, అన్యోన్యాశ్రయులుగ పరిణమించిరి. పై వీరవర్గము రాజుల బలము వృద్ధిచెందుటకు మరియొక విధముగ కూడ తోడ్పడిరి. ఏదైన ముఖ్యమగు యుద్ధము సంభవించునప్పుడు, సాక్సను ప్రజలందరును కూడ రణరంగమున కేగి, పోరాడెడివారు. ఈ సేనకు fyrd (జాతీయ సైన్యము) అని పేరు. కాని ఈ జాతీయ సేనలోని వారు జాతి రక్షణకొరకై తాత్కాలికముగ కత్తి చేపట్టిన వారు కాని, వృత్తిచే వీరులు కారు. కాని రాజు యొక్క అంగరక్షక వీరు లట్లు కాక శాశ్వతముగ వీర వృత్తి నవలంబించి, ఖడ్గజీవులుగ మెలంగుచుండిరి. కావున రణరంగమున వీరే విశేష సామర్థ్యము ప్రదర్శించెడివారు. ప్రజా సేనను నమ్ముకొని,

దానిపై ఆధారపడియున్నంతకాలమును, రాజు ప్రజలకు కొంతవరకు లొంగి యుండవలసివచ్చెడిది. యుద్ధ నిపుణులగు అంగరక్షక వీరుల సహాయము లభించిన తరువాత, రాజునకు ప్రజాసేన సహాయము అంతగ ఆవశ్యకమనిపించెడిదికాదు. అందువలన నాతడు ప్రజా సహాయము నాశింపక, స్వతంత్ర శక్తికల్గి బలవంతుడు కాసాగెను.

## బ్రిటనుద్వీపము ఇంగ్లాండుగ మారినది

బ్రిటనుదేశపు ప్రజలు రోమనుల సహాయముతో నూరు సంవత్సరములును, అటుపిమ్మట స్వతంత్రముగ నూట యేబది సంవత్సరములును ఆగంతకులతో ధైర్య సాహసములతో పోరాడి, తుదకు పరాభూతులై ఇంగ్లండు ప్రాంతమును శత్రువులకు విడచిపెట్టి, దుర్గమములగు పర్వత ప్రదేశములలోనికి పారిపోయి, అచ్చట తలదాచుకొనిరి. సర్వనాశనము పాలుగాక, తమ వ్యక్తిత్వమును నిలుపబెట్టుకొనుటకు బ్రిటను జాతి వారికి పర్వతములే శరణ్యమయ్యెను. సాక్సనులు వానిలోనికి చొరుచుకొని పోజాలరైరి. ముఖ్యముగ ఇంగ్లాండు దేశము మాత్రము, ఆంగ్లో సాక్సనులకు వశపడెను. అయినచో ఈ ప్రాంతములో నివాసులుగనున్న బ్రిటనుప్రజల గతి యేమైనది? వారందరును సాక్సనుల ఖడ్గముల కెరయయ్యిరా? లేక మరి ఏమైనది? అను ప్రశ్న ఉత్పన్నమగుట సహజము. ప్రసిద్ధ చారిత్రకుడగు విన్‌స్టన్ చర్చిలు మహాశయుడు తాను

రచించిన బ్రిటనుదేశ చరిత్రయందీ యంశమును చక్కగ చర్చించినాడు. ఆంగ్లో సాక్సనుప్రజలు ఇంగ్లాండు దేశమును ఆక్రమించిన మాట వాస్తవమే కాని, వారు స్థానిక ప్రజలను పూర్తిగ నాశనము కావింపలేదు. ఒక తెగకుచెందిన ప్రజనంతను సమూలముగ నాశనము చేయుటకు, ఎంతటి క్రూరులును కూడ ఒడిగట్టజాలరు. అది మానవ ప్రకృతికే విరుద్ధము. అంతే కాక స్వప్రయోజనాపేతుతోకూడ, ఆంగ్లో సాక్సనులు బ్రిటను జాతివారిని పలువురను కాపాడియుందురు. సాక్సనులు బ్రిటను దేశమును మొదట ఆక్రమించినప్పుడు, వారితో వారి కుటుంబములు రాలేదు. కేవల కామ ప్రవృత్తివలన నైనను, పలువురు సాక్సనులు బ్రిటనుదేశపు కన్యలను చేరదీసి యుందురు. ఈ విధముగ కూడ బ్రిటనుప్రజలు పలువురు, శత్రువుల ఖడ్గాఘాతములకు గురికాకుండ తప్పించుకొని, సాక్సనుజాతితో సమ్మేళనము చెందిరి. మానధనులును, శూరులును అగు బ్రిటనులు సాక్సనులతో యుద్ధము చేయుచు, రణరంగమున కెరవైరి. మిగిలిన వారు వేల్సు దేశము మున్నగు ప్రాంతములకు పారిపోయిరి. మరికొందరు ఫ్రాన్సు దేశమందలి బ్రిటనీ అను జిల్లాకు వెడలి పోయిరి. ఉన్నత కుటుంబముల వారందరును కూడ నశించిరి. ఇక సామాన్యప్రజలు మాత్రము సాక్సనులకు వశపడి, వారికి బానిసలవలె మెలగసాగిరి. ఆంగ్లో సాక్సనురాజుల కాలము నాటి శాసనములు పరిశీలించిన పక్షమున, అందు స్థానిక ప్రజలగు బ్రిటీషు భూస్వాములు, రాజునకు వార్తాహారులగు సేవ

కులు, తదితరులయొక్క ప్రశంస కానవచ్చును. అంతేకాక ఆగంతకులగు సాక్సను ప్రజలు, తమదేశమున చదునైన మైదానములలోనే కాని పర్వత సానువులు, పర్వత ప్రదేశములు మున్నగు చోటులలో వ్యవసాయము చేయుట యెరుంగరు. మైదానములలో అడవులు కొట్టివేసి, వ్యవసాయము ప్రారంభమగు వరకును, వారికి భుక్తి గడచుట యెట్లు? స్థానికులగు బ్రిటీషు వ్యవసాయదారులు పంట పండించి, వారి కందజేయవలెను. ఇందుకొరకై పలువురు బ్రిటనులు విజేతలగు సాక్సనుల కవసరమైరి. కావున మొత్తముమీద సాక్సనుల ఆక్రమణ కాలములో కూడ. స్థానికులగు బ్రిటీషుప్రజలు పూర్తిగా నశింపలేదని నిర్ధారణ యగుచున్నది. కాని ప్రాచీన బ్రిటనుల భాషమాత్రము ఇంగ్లాండు దేశములో పూర్తిగ నశించినది. ఇంగ్లాండు దేశమందలి గ్రామనామములు కూడ ఆంగ్లో సాక్సనుభాషకు చెందినవే యని చారిత్రికులు నిర్ణయించినారు. ఒక పర్యాయము సాక్సనులు బ్రిటను దేశములో స్థిరనివాసము కల్పించుకొనిన తరువాత, స్థానిక ప్రజలుకూడ తమ భాషను విడిచిపెట్టి, విజేతల భాషనే వాడుట ప్రారంభించినట్లు దీనికి మనము సమాధానము చెప్పుకొనవలెను. స్వదేశమగు జర్మనీయందు, ఆంగ్లో సాక్సను జాతులవారికి సుఖముకాని, విశ్రాంతికాని, లేదయ్యెను. తూర్పు దేశములనుండి, తమ మాతృభూమిలోనికి తండోపతండములుగ వచ్చిపడుచున్న శత్రువులతో యుద్ధము చేసి చేసి, వారు విసుపు చెందిపోయిరి. అట్టి

సాక్సనులకు బ్రిటను దేశములో సంపూర్ణమగు స్వాస్థ్యము, సుఖము, విశ్రాంతి లభించెను. కావున బ్రిటనుభాగము ఇంగ్లాండుగా మారినది.

## బ్రిటను ద్వీపములో క్రైస్తవమత వ్యాప్తి

బ్రిటనుద్వీపము బలవంతులైన సాక్సనులకు సంపూర్ణముగ స్వాధీన పడినది. కాని ఇందువలన ఆ దేశమునకు లాభమునకు మారుగ నష్టము సంభవించినది. ప్రపంచ వ్యాప్తమైన రోమక సామ్రాజ్యము నుండి విడివడిపోయి, యీద్వీపము మరల ఒక మారుమూలలో ఒదిగిపడి యుండవలసి వచ్చెను. బ్రిటనుకు ఇంతకు పూర్వముగల ప్రతిష్ఠ నశించెను. రాజకీయముగ బ్రిటను ద్వీపమందలి కేంద్ర ప్రభుత్వము విచ్ఛిన్నమయ్యెను. దేశమందా యా ప్రదేశములలో, రాజనామకులు చిన్నచిన్న రాజ్యముల నెలకొల్పుకొని, పరిపాలనము చేయసాగిరి. ఈ రాజులు నిరంతర కలహములలో మునిగి తేలుచుండెడివారు. దేశమున శాంతి భద్రతలు క్షీణించెను. దానితోపాటు నాగరకత కూడ మాయమయ్యెను. రోమనులు రాజ్యపాలనము కావించిన యుగములో, సంఘము న్యాయ సూత్రములకు కట్టుబడి యుండెను. ప్రజల మానధనములకు, ఎట్టి ప్రమాదమును లేకుండెను. రోమనులు చక్కని పద్ధతులపై నూతన పట్టణములకు పునాదులు వైచియు, ప్రాత పట్టణముల విస్తరించియు, అందు నివసించెడివారు. వారి కాలమున దేవాలయములు,

విపణిస్థలములు, విద్యాసంస్థలు, పెక్కు వెలసెను. అనేకులు వృత్తి నిపుణులు, ఈ కాలమున వెలసి వన్నె కెక్కిరి. వర్తకులు వ్యాపారమును పెంపొందించిరి. విద్వాంసులు వాఙ్మయము, అలంకార సంభరితమగు వాగ్ధోరణిని, వృద్ధి చెందించిరి. ఈ విధముగ బ్రిటను దేశీయుల సంస్కృతి ఉన్నతస్థాయిని చెందెను. సాక్సనుల రాకతో, ఇవి యన్నియు నశించెను. ఆగంతకులు బ్రిటను దేశమునకు మరియొక గొప్ప అపకారము కావించిరి. రోమక రాజ్యములో క్రైస్తవమతము క్రమక్రమముగ వృద్ధి చెందుచుండెను. కాని సాక్సనుల రాకచే క్రైస్తవ మతాభివృద్ధికి సంపూర్ణముగ అంతరాయము కల్గెను. బ్రిటనులో నాటబడిన క్రైస్తవ మతవృక్షమును, సాక్సనులు మొదలంట నరకివైచిరి. మరల యీ ద్వీపమునందు ధార్మిక అంధకారము వ్యాపించెను. సాక్సనులు మూఢాచార పరాయణులు. వారు "వోడెన్". "థార్" అను క్షుద్ర దైవములను పూజించెడివారు. బ్రిటను ద్వీపమునం దెల్లెడల గాఢతిమిరము వ్యాపించెను. ఆ కటిక చీకటిలో ఒక నూతనజ్యోతిని వెలిగించి, బ్రిటను ద్వీపమున నూత్న చైతన్యమును కలిగించినది, క్రైస్తవ మతము. ఈ మతము వేరు వేరు మార్గములగుండా, ఈ ద్వీపములో ప్రవేశించి, ప్రజలకు తరణోపాయమును చూపెను. క్రైస్తవ మతము వ్యాపించుటకు పూర్వము బ్రిటను ఒక నరకలోకమనియు, ఐరోపా ఖండపు గడ్డపై మరణించినవారి యాత్మలను, మృత్యుదేవత అధికారులు ఓడలపై దాటించి, ఈ నిర్భా

గ్యాపు దీవికి పంపుచుండిరనియు, క్రైస్తవ ప్రముఖు డొకడు వ్రాసినాడు.

రోమక ప్రభుత్వము విశాలదృష్టియు, సహనబుద్ధియు కలది. కావున ఆ దొరతనము వారు తమ యేలుబడిలో అన్ని మతములకును, తాను ఇచ్చిరి. క్రీస్తుశకము ఒకటి రెండు శతాబ్దులలో క్రైస్తవమతము రోమక సామ్రాజ్యములో వ్యాపించెను. అట్లే బ్రిటనుదేశములో కూడ ఈ ధర్మము ప్రవేశించెను. కాని మొదటినుండియు బ్రిటీషు క్రైస్తవులు స్వతంత్రముగ వ్యవహరించెడివారే కాని, క్రైస్తవ ప్రపంచమునకెల్ల ఉత్తమ గురువగు పోపు ఆజ్ఞల ననుసరించుట కలవాటు పడలేదు. ఇందువలన రోమక క్రైస్తవమునకును, బ్రిటీషు క్రైస్తవమునకును ప్రప్రథమమునుండి భేదాభిప్రాయము లుండుచువచ్చెను. సాక్సనులు బ్రిటనుపై దండెత్తివచ్చి, బ్రిటీషుప్రజల నోడించి, పారద్రోలిన సందర్భములో బ్రిటీషు క్రైస్తవులు కూడ వేల్సు ప్రాంతములకు పారిపోయిరి. బ్రిటనులకును సాక్సనులకును గల వైరము అతి తీవ్రమైనది. కావున బ్రిటీషు క్రైస్తవ ప్రచారకు లెవ్వరును కూడ సాక్సనులలో క్రైస్తవ ధర్మమును వ్యాప్తి కావించుటకు ప్రయత్నము చేయరైరి. ఇది యిట్లుండగా సైంటు డేవిడ్ (St. David) అను నొక క్రైస్తవ ప్రముఖుడు ఈనాటి వేల్సు దేశమందంతటను క్రీస్తు మతమును వ్యాప్తి కావించెను. అదే విధముగ సైంటు పాట్రిక్ (St. Patrick) అను మరియొక మహాపురుషుడు ఐర్లాండు ద్వీపమునందు

క్రైస్తవ మతధర్మమును ప్రతిష్ఠించెను. పాట్రిక్ ఋషి మరణించిన తరువాత, ఆతనికి శిష్యతుల్యుడగు కొలంబాయను నొక ధర్మవీరుడు బ్రిటను ద్వీపములోని ఉత్తర భాగమున అనగా నేటి స్కాట్లండు దేశమున క్రైస్తవ మతజ్యోతిని వెల్గించి, తద్దీప్తిని స్కాట్లండుసందంతటను వ్యాపింపజేసెను. ఈ విధముగ క్రైస్తవ ధర్మము క్రమక్రమముగ ఇంగ్లాండునకు చుట్టు ప్రక్కల వ్యాపించెను.

బ్రిటీషు క్రైస్తవ ప్రచారకులు కావించుచున్న మత వ్యాప్తి, వారి కార్యదీక్ష మున్నగు వానిని గూర్చి విని, క్రైస్తవులకు ప్రధానాచార్యుడగు పోపు, మిక్కిలి సంతసించెను. ఆయన కేంద్రస్థానము జగత్ప్రసిద్ధిగాంచిన రోము నగరము. ఆయన యాజమాన్యమున క్రైస్తవ ధర్మము క్రమముగా ఐరోపా ఖండమందంతటను వ్యాపించుచుండెను. బ్రిటీషు క్రైస్తవులకును, పోపు మతగురువు యాజమాన్యమున పని చేయు రోమ క్రైస్తవ వర్గమునకును, మతవిశ్వాసములందును, మత సంఘవ్యవస్థయందును కొన్ని భేదములుండెను. ఈ భేదము లించుమించు శాశ్వత రూపమును పొందెను. కావున ఇంకను అజ్ఞానాంధకారములోపడి ప్రాకులాడుచుండిన ఇంగ్లాండు దేశపు సాక్సనులను, సత్యమార్గమునకు మరలించు నుద్దేశ్యముతో పోపు మతగురువు తన అనుయాయులలో నొక్కరిని బ్రిటనుకు పంపుటకై యేర్పాటు చేసెను.

ఆకాలమున రోము నగరమున గ్రెగరీయను పోపు అధికారము వహించి యుండెను. ఆతడు ఇంగ్లాండు దేశమున క్రైస్తవమత వ్యాప్తి కావించుటకై "ఆగస్టైన్" అను మత గురువును నియోగించెను. ఈతనికి "సైంటు ఆగస్టైన్" అను విఖ్యాతి యుండెను. ఈ మతగురువు క్రీ. శ. 596 వ సంవత్సరమున ఇంగ్లాండునకు వచ్చెను. ఆ కాలమందు "కెంటు" రాజ్యము (కెంటు అనునది ఇప్పుడు ఇంగ్లాండు దేశములో ఒక జిల్లా) ను ఎథల్బర్టు అను రాజు పాలించుచుండెను. ఆతడు ప్రాచీన జర్మను దేవతలగు "వోడెన్","థార్"లను పూజించెడి వాడు. ఆతని భార్య బెర్థా అను నామె ఫ్రాంకు రాజకుటుంబమునకు చెందిన యొక రాజకన్య. ఈమె ఇంతకు పూర్వమే క్రైస్తవ మతమును స్వీకరించి యుండెను. భార్యయొక్క ప్రోత్సాహమువలన ఎథల్బర్టు (Ethelbert) రాజుకూడ క్రైస్తవ ధర్మమునకు సుముఖుడై యుండెను. కాని ఇందులకు కేవలము క్రైస్తవ ధర్మమునందు ఆతనికి గల గౌరవ భావము మాత్రమే కారణము కాదు. నూతన మతమును స్వీకరించుటవలన తన రాజకీయ ప్రతిష్ఠ కూడ హెచ్చునలెనని ఆ రాజు ఆశయము. ఏది యెట్లున్నను, ఆగస్టైను మతగురువు కెంటు రాజ్యమున కేతెంచి, ఎథల్బర్టు రాజునకు క్రైస్తవమత దీక్ష నొసంగెను. ఆ రాజ్యములో సుప్రసిద్ధమైన కాంటర్బరీ (Canterbury) నగరము నెలకొనియున్నది. అచ్చట తొల్లింటి బ్రిటీషు క్రైస్తవులు సైంటు

మార్టిన్ (St. Martin) గౌరవార్థ మొక దేవాలయమును నిర్మించియుండిరి. ఎథల్బర్ట్ ప్రోత్సాహమువలన ఈ దేవాలయము పునరుద్ధరింపబడెను. నాటికిని నేటికిని కూడ కాంటర్బరీ యందలి దేవాలయమే ఆంగ్ల క్రైస్తవులకు పరమ పూజనీయమై విలసిల్లుచున్నది. ఆంగ్ల ధార్మిక జీవనమునకు నాయకుడు నేడు కూడ కాంటర్బరీ మతగురువే. ఆయనను ఆంగ్లమున Arch Bishop of Canterbury అందురు. క్రైస్తవ మతమును స్వీకరించిన తరువాత, ఎథల్బర్టు రాజు వేల్సు దేశమునందు తల దాచుకొనియున్న బ్రిటీషు మతగురువులను రావించి. రోమక క్రైస్తవ శాఖకును, బ్రిటీషు క్రైస్తవ శాఖకును సామరస్యము కుదుర్చుటకై ప్రయత్నించెను. ఈ యత్నములలో ఆతనికి ఆగస్టైను మతగురువు చేయూత నొసంగెనని వేరుగ తెలుప నక్కరలేదు. ఈ విధముగ రోమక క్రైస్తవ శాఖను బలపరచవలెనని ఆగస్టైనును, తన రాజకీయాధికారమును పెంపు చేసికొనవలెనని ఎథల్బర్టురాజును, ఉద్దేశ్యపడిరి. బ్రిటీషు క్రైస్తవులును రోమక పంథాకుచెందిన క్రైస్తవులును ఒకచోట సమావేశమైరి. కాని బ్రిటీషు జాతివారికి సాక్సనుల యెడలగల వైరభావము ఆ సమావేశమును భగ్నము కావించెను. రోమను క్రైస్తవ సంఘముతో స్నేహమును చెడగొట్టుకొనుట కొరవితో తల గోకికొనుటవంటి దనియు, ఆత్మ వినాశమున కది త్రోవ దీయగలదనియు, ఆగస్టైను మతగురువు

బ్రిటీషు క్రైస్తవులను బెదరించెను. కాని వారు లక్ష్యము చేయలేదు. బ్రిటీషు రోమక క్రైస్తవ శాఖలకు సంధి పొసగ లేదు.

పైన సూచించిన విధముగ క్రైస్తవ మత మింగ్లాండు దేశమున నడుగుపెట్టెను. ఆ కాలమున ఇంగ్లాండు దేశమందు నార్థంబ్రియా (Northumbria), మెర్షియా (Mercia) అను మరి రెండు రాజ్యములుండెను. వీని రాజకీయ గాథను మేము స్థలాంతరమున వర్ణింపగలము. ఈ కథాకాలమున నార్థంబ్రియా రాజ్యమును ఎడ్విన్ (Edwin) అను మహాబలశాలి యైన యొక సాక్సనురాజు పరిపాలన చేయుచుండెను. ఈతని ముఖ్యపట్టణము యార్కు (York) నగరము. క్రీ. శ. 625 వ సంవత్సరమున నిచ్చటికి పాలినస్ (Paulinus) అను రోమక క్రైస్తవ ప్రచారకు డేతెంచెను. ఎడ్వినురాజు ఈతని బోధనలకు చెవియొగ్గి, క్రైస్తవ మతమును స్వీకరించెను. పాలినస్ సంతసించెను. క్రమముగ ఇంగ్లండుదేశపు టుత్తర ప్రాంతమం దంతటను క్రైస్తవమతము సులభముగ వ్యాపింపగలదని యందరును భావించిరి. కాని అట్లు సంభవింపలేదు. మెర్షియా రాజ్యమును పాలించుచున్న పెండా (Penda) అను క్రైస్తవేతర మతస్థుడు ఎడ్విన్ రాజుపై యుద్ధము ప్రకటించి, ఆతనిని రణరంగమున సంహరించెను. ఎడ్విన్ అనంతరము నార్థంబ్రియా రాజ్యమున కేలికయైన ఆస్వాల్డు (Oswald) రాజునకు కూడ ఈ గతియే పట్టెను. ఆస్వాల్డు అనంతరము ఆతని సోద

రుడు ఆస్వీ (Oswy) అను నాతడు రాజ్యాధికారమును పూని, తన యన్నను చంపిన పెండారాజుపై కసి తీర్చుకొనెను. పెండా యుద్ధభూమియందు మడసెను. ఇక నార్ధంబ్రియా రాజ్యమున క్రైస్తవ మతాభివృద్ధి కెట్టి యాటంకమును లేకుండ పోయెను. కాని ఎడ్విను రాజు మరణానంతరము ఇంగ్లండు దేశమున క్రైస్తవ మతమునకు పెద్ద ప్రమాదము ఏర్పడెను. ఈ కాలమున క్రైస్తవ ధర్మజ్యోతిని నిలుపబెట్టి, మత ప్రచారమును సాగించి, ఈ నూతన ధర్మమును కాపాడినవారు బ్రిటీషు క్రైస్తవులు కాని రోమక శాఖవారు కారు. నార్ధంబ్రియా, తూర్పు ఆంగ్లియా, మెర్షియా రాష్ట్రములలో బ్రిటీషు క్రైస్తవ మతగురువులే ఈ నూతన ధర్మమును వ్యాపింపజేసిరి. క్రైస్తవ మతవ్యాప్తి దృష్ట్యా చూచిన పక్షమున పై సంఘటన మిక్కిలి ప్రశంసనీయమైనది. కాని సాక్సను బ్రిటీషు జాతుల సామరస్యమను దృక్కోణము నుండి యుపలక్షించిన పక్షమున, నియ్యది చెడు పరిణామములకు దారితీసినదనియే చెప్పవలసియున్నది. సాక్సనుల దండయాత్రలు ప్రారంభమైననాటి నుండియు బ్రిటీషు సాక్సను జాతులవారికి సహజముగ వైరమేర్పడెను. ఇప్పుడు మత విషయములలో వారికి తీవ్రమైన భేదాభిప్రాయము లంకురించెను. సాక్సను ప్రజలలో కొందరు క్రైస్తవ ధర్మమును తమ పద్ధతుల ప్రకారము కాకుండ రోమక ప్రచారకుల మూలమున నేర్చుట బ్రిటీషు క్రైస్తవులకు కోపకారణమయ్యెను. రోమక పక్షమునకును,

బ్రిటీషు పక్షమునకును, క్రైస్తవ ధర్మమును గూర్చి వాదోప వాదములు సాగెను. ఇంగ్లాండు దేశపు ప్రజలు రోమక క్రైస్తవ పద్ధతుల నవలంబింపవలయునా, లేక బ్రిటీషు క్రైస్తవ మార్గము ననుసరింపవలయునా యను సమస్య తీవ్ర రూపమును దాల్చెను. తుదకు నార్థంబ్రియా పరిపాలకుడగు ఆస్వీ రాజు క్రీ. శ. 664 వ సంవత్సరమున విట్బీ (Whitby) అను ప్రదేశమున నొక ధార్మిక సభ (Synod) ను సమావేశ పరచెను. ఇందు బ్రిటీషు క్రైస్తవులును, రోమక క్రైస్తవు లును తమతమ మత పద్ధతుల ప్రాశస్త్యమునుగూర్చి యుపన్య సించిరి. ఆస్వీ రాజు ఇరుపక్షముల వాదములను విని, తుదకు నార్థంబ్రియా ప్రజలు రోమక క్రైస్తవ మార్గమునే అనుస రింపవలెనని నిర్ణయించెను. ఆస్వీ రాజు కావించిన ఈ నిశ్చ యము చాల ముఖ్యమైనది. ఆంగ్లదేశమునకు దీనివలన ఎంతో మేలు కల్గెను. బ్రిటీషు క్రైస్తవ సంఘము కఠిన నిబంధనలకు లోనైన యొక సంకుచిత సమాజము. ఈ పంథా ననుసరించు వారు, ఎక్కడనో మారుమూల ప్రాంతములలో మాత్రము నివసించుచుండిరి. రోమక పంథావారు, విశాలదృష్టి కలవారు. అంతే కాక రోమక క్రైస్తవము అనేక దేశములలో వ్యాప్తి చెందినది. ఈ సంఘమునకు నాయకుడైన పోపు జగద్గురువుగ విఖ్యాతిగాంచినవాడు. ఇట్టి జగద్గురువు యాజమాన్యమున మెలగుచున్న క్రైస్తవ మత సంఘములో చేరుటచే, ఆంగ్ల క్రైస్తవులకు ఒక నూతన గౌరవము లభించెను. వారు మరల

ఒక విశాల ప్రపంచమున ప్రవేశించి, ప్రపంచ వ్యాప్తమగు సమాజమున మెలగుచు, ధార్మిక రాజకీయ రంగములలో చాల లాభముల పొందగల్గిరి. ఆంగ్ల ప్రజలు విశ్వవ్యాప్తమగు నొక సంస్కృతీ సౌరభము నాఘ్రాణించు అదృష్టమును పొందిరి. ఆస్వీ రాజు కావించిన నిర్ణయము వలన బ్రిటను ద్వీపమునందలి క్రైస్తవ సంఘమునందు ఐక్యత యేర్పడెను. ఇచ్చటి ప్రజలలో ఆరింట ఐదువంతులవారు రోమక పంథా ననుసరించు క్రైస్తవులుగ మారిరి. వీరందరికిని అంగీకారమైన ధార్మిక విశ్వాసములు, నైతిక ప్రమాణములు, మత విషయిక ప్రభుత్వము ఏర్పడెను.

బ్రిటనుద్వీపమునందలి క్రైస్తవ మత సంఘమును సువ్యవస్థిత మొనర్చుటకై పోపు మత గురువు మిక్కిలి సమర్థుడైన యొక మతాధికారిని క్రీ. శ. 668 వ సంవత్సరమున నిచ్చటికి పంపెను. ఆ మతాధికారి పూర్తి పేరు థియోడోర్ ఆఫ్ టార్సస్ (Theodore of Tarsus). ఈతడు బ్రిటనుదేశమున క్రైస్తవ సంఘమును బలపరచి, అందు సంఘీభావమును పెంపుచేసెను. దేశమును ధార్మిక పరిపాలనకై కొన్ని భాగములుగ విభజించి, ఒక్కొక్క విభాగమునకు బిషప్పు అను మత గురువును అధికారిగ నియమించెను. క్రీ. శ. 690 వ సంవత్సరమున థియోడోర్ మరణించు సరికి బ్రిటను ద్వీపమున, పదునాల్గురు బిషప్పులు నెలకొని, బ్రిటీషు క్రైస్తవులకు ధార్మిక జీవితమున నేతలై మెలగసాగిరి.

క్రైస్తవ మతస్వీకారము వలన సాక్సను సంఘమున కెన్నియో విధముల మేలు చేకూరెను. క్రైస్తవ మతగురువుల బోధనలవలన నిరంతర కలహశీలురైన సాక్సను ప్రజలలో మైత్రీభావ మేర్పడెను. అంతే కాదు. క్రీస్తు మతమును అంగీకరించుటకు పూర్వము. సాక్సనులు వట్టి మోటువారు. వారికి న్యాయము, ధర్మము. అను అంశములు తెలియవనియే చెప్పవలెను. దేహబలమును, రణ కౌశల్యము మాత్రమే వారి దృష్టిలో ముఖ్యమైన మానవలక్షణములు. ధర్మబద్ధముగ జీవించుట యను భావము.వారి కించుకయు తెలియకుండెను.సాక్సను సంఘములో ఒకడు వేరొకనిని చంపిన పక్షమున, మరణించిన వాని దాయాదులు హంతకుని వెన్నంటి వానిని వధించుట సర్వ సామాన్య విషయముగా నుండెడిది. ఇదియే వారికి తెలిసిన ధర్మము. హత్య మున్నగు నేరములకు, మరి యితర విధములగు పరిహారములను కూడ సాక్సను లంగీకరించుచుండిరి. హంతకుని దాయాదులు హంతకుని వెదకి తెచ్చి, మృతుని దాయాదుల మ్రోలకు తేవలెను. అట్లు హంతకుడు పట్టుబడని పక్షమున, అతడు సంఘ బహిష్కృతి పొలగుచుండెను. ఇట్లు బహిష్కరింపబడిన మానవుని, ఎవ్వరైన చంపవచ్చును. అట్లు చేయుట నేరము కానేరదు. హంతకుడు పట్టువడి, మృతుని దాయాదులకడకు అతడు వచ్చుట తటస్థించిన పక్షమున, తాను నేరము కావింపనట్లు అతడు ప్రమాణము చేయవలెను. ఈతడు కావించిన ప్రమాణమును గౌరవనీయులైన కొందరు పెద్దమను

ష్యులు బలపరచవలెను. అట్టి పెద్దమనుష్యుల సహాయమును పొందజాలని దోషి తన నిర్దోషిత్వమును ఋజువు చేసికొనుటకై సాక్సను సంఘమున అపూర్వమగు నొకపద్ధతి వాడుకలో నుండెను. నిందితుడగువాడు ఎఱ్ఱగ కాలిన ఇనుపకమ్ములపై ఎట్టి పాదరక్షలును లేకుండ నడువవలెను. లేదా ఎఱ్ఱగ కాలిన ఇనుపకడ్డీని చేతితో పట్టుకొని మూడడుగులు వేయవలెను. వానికి కాళ్ళయందును, చేతులందును ఏర్పడిన పుండ్లు మూడు దినములలో మానిపోవలెను. లేని పక్షమున నిందితుడు దోషిగ నిర్ణయింపబడుచుండెను. అట్టిదోషి నిర్ణీతమగు కొంత అపరాధ ధనమును చెల్లింపవలెను. ఈ అపరాధపు మొత్తములో కొంతభాగము రాజునకు చెందుచుండెను. మిగిలిన సొమ్ము ఆపద పొందినవానికి కాని, మృతుని దాయాదులకు కాని చెందుచుండెను. మృతునికి సంఘ జీవితములోగల స్థాయినిబట్టి, హంతకుడు చెల్లింపవలసిన అపరాధపు మొత్తము మారుచుండెను. ఉన్నత కుటుంబముల వారిలో నెవ్వరినైన చంపిన హంతకుడు, ఒక పెద్ద మొత్తమును అపరాధ ధనముగ చెల్లింపవలసి యుండెను. క్రైస్తవ మతవ్యాప్తికి పూర్వము వ్యాపించియున్న ఈ విధానములను మతగురువులు మార్పు కావించిరి. ఒక మానవుని హత్య కావించుట అతని దాయాదుల యెడ కావించిన నేరము మాత్రమే కాదు. అయ్యది సంఘము నెడలను, సృష్టికర్తయగు పరమేశ్వరుని యెడలను కావించిన నేరము. కావున హత్య మున్నగు నేరములకు అపరాధధనము

చెల్లించుట పరిహారము కానేరదు. దోషియగువాడు దైవ ప్రార్థనాదికముల వలనను, పశ్చాత్తాపమువలనను, పాప పరిహారము కావించు కొనవలెను. పాపి యిట్టి పశ్చాత్తాపమును ప్రదర్శించువరకును, అతనికి మత సంఘమునందు స్థాన ముండ జాలదు. మతసంఘ మాతనిని రక్షింపదు. మతగురువు లిట్టి పద్ధతు లవలంబించుటవలన ప్రజలలో పాపకార్యములయెడ భీతి హెచ్చెను. వ్యక్తులయెడ దౌర్జన్యము కావించుట సంఘము నెడలను, పరమేశ్వరుని యెడలను, అపరాధము చేయుట యను భావము సర్వత్ర వ్యాపించెను. సంఘమున న్యాయ ధర్మ ములకున్నత తరమగు ప్రమాణము లేర్పడెను.

సాక్సను సంఘమునందు విద్యావ్యాప్తిని, సారస్వత కృషిని ప్రారంభించినవారు క్రైస్తవ మత గురువులే. కారణాంతరములవలన విట్బీ మఠమునందు తలదాచుకొనిన యొక గొల్లవాడు కాలక్రమమున విద్యావంతుడై ఆంగ్లభాషయందు ప్రథమ కవియను కీర్తిని గాంచెను. ఈతని నామము కాడ్మన్ (Caedmon). ఈతని కవిత ధార్మిక విషయములకు సంబంధించినది. ఈ కవి భగవత్ప్రేరణవలన కవితాగానము చేసినవాడనియు, ఇతరుల కీతనిస్థాయి లభించుట దుస్సాధ్యమనియు సమకాలీనులు కాడ్మనును కీర్తించిరి. ఈ కవికాలము క్రీ. శ. 664 ప్రాంతము. బీడ్ (Bede) అను మరియొక క్రైస్తవసన్యాసి కూడ బ్రిటీషు సారస్వత రంగములో విఖ్యాతిని సంపాదించిన ప్రముఖుడు. ఈతనికి "గౌరవనీయుడైన బీడ్"

(Venerable Bede) అను ప్రశస్తి కలదు. క్రైస్తవ మత సంఘమువారు బ్రిటీషు ప్రజకు ప్రసాదించిన ఉత్తమ విద్వాంసులలో ఈత డొక్కడు. ఈతడు తన కాలమునంతను విద్యా వ్యాసంగము నందును, గ్రంథ రచనము నందును గడపెడి వాడు. ఈ సన్యాసి స్థాపించిన పాఠశాల యందు ఆరునూర్ల క్రైస్తవ సన్యాసులు విద్యార్జనము కావించెడివారు. బీడ్ బ్రిటను దేశపు ప్రప్రథమ చారిత్రికుడు. ఆతడు సమకాలీన చరిత్రను రచించి, వైజ్ఞానికమగు గొప్ప సేవ కావించి యున్నాడు. ఈ సత్పురుషుడు తన జీవితపు తుది భాగమును బైబిలు గ్రంథమునందలి సైంట్ జాన్ (St. John) అను అధ్యాయమును ఆంగ్లభాషలోని కనువాదము కావించుటలో గడపెను. కాలపరిగణనముకొరకై క్రీస్తుశకమును వాడు పద్ధతిని ఆచరణలోనికి తెచ్చిన వాడు బీడ్ మహాశయుడే. నిరంతర మానసిక పరిశ్రమవలన, ఈతని ఆరోగ్యము చెడెను. అయినను జీవితాంతము వరకును, ఈ విద్వాంసుడు జ్ఞాన సముపార్జనముకొరకును, తద్వితరణముకొరకును కృషి చేయుచునే యుండెను. ఈతని కాలము క్రీ. శ. 735 ప్రాంతము.

క్రైస్తవ మత సంఘము బ్రిటీషు దేశపు ప్రజకును, ప్రభువులకును చేసిన మరియొక సేవ ముఖ్యముగ స్మరింపదగి యున్నది. ఐరోపాఖండపు చరిత్రయందు క్రీ. శ. 400 నుండి 1400 వరకును గల వేయి సంవత్సరముల కాలమును మధ్యమ

యుగముగా భావింపబడుచున్నది. ఈ కాలమున సామాన్య ప్రజలును, అమీరులును, కేవల దేహ పాటవమును మాత్రము సంపాదించి, యుద్ధప్రియులుగ నుండుచు వచ్చిరి. వారికి విద్యా గంధము బొత్తుగ లేకుండెను. ఆ అంధకార యుగమున శాస్త్ర మును, కళలను చక్కగ నేర్చి జ్ఞానదీప కాంతిచే ఐరోపా ప్రపంచమును నుజ్జ్వలము కావించినవారు క్రైస్తవ మతముల లోని వారు మాత్రమే యని మనము గుర్తింపవలెను. ఆ కాల మున రాజనీతి కౌశల్యము క్రైస్తవ సన్యాసులకు మాత్రమే అలవడియుండెను. కావున పదునారవ శతాబ్దమున బ్రిటనుదేశ మును పాలించిన ఎనిమిదవ హెన్రీ రాజు కాలము వరకును కూడ రాజునకు సలహాదారులును, మంత్రులును, ఇతర రాజ నీతిజ్ఞులును, క్రైస్తవ సన్యాసులే యని మనము తెలిసికొన వలెను. మత గురువులును, రాజనీతిజ్ఞులును అగు ఇట్టి విశిష్ట వ్యక్తులు బ్రిటీషు చారిత్రిక రంగమున మనకు పలువురు కాన వత్తురు. అట్టి వారిలో డన్‌స్టన్ (Dunstan) అను మత గురువు ప్రథముడు. ఈతడు గొప్ప విద్వాంసుడు, రాజనీతిజ్ఞుడు. ఈతడు కాంటర్బరీ పీఠమునకు మతాధికారి (Archbishop of Canterbury). ఈ మత గురువు ఇరువురు బ్రిటనురాజులకు మంత్రిగను, ఒకరికి సంరక్షకుడుగను వ్యవహరించెనని తెల్పినప్పు డాతని కెంత పలుకుబడియు, ప్రాముఖ్యతయు నుండెనో మన మూహింపనగును. ఇట్టి మత గురువులు చిరకాలమువరకును బ్రిటను దేశమునకు సుపరిపాలనము కల్పించుటయే కాక,

జ్ఞానాభివృద్ధికై అపారమగు సేవ కావించిరి. క్రైస్తవ మత సంఘమువారి ప్రోత్సాహమువలన బ్రిటను ద్వీపమునందనేక ప్రాంతములలో ఉత్తమములగు క్రైస్తవ దేవాలయములు వెలసెను. ఇయ్యవి సుందరమగు శిల్పకళకు నిధానములు. క్రైస్తవ మత సంఘములు పెక్కు మఠములను నెలకొల్పెను. ఇందు క్రైస్తవ సన్యాసులు జ్ఞాన సముపార్జనము కావించుచు కాలము పుచ్చుచుండెడివారు. వారి కార్యక్రమములో ఉత్తమ గ్రంథములకు ప్రతులు వ్రాయుట ఒకటి. కావున ఈ సన్యాసులు పలువురు ముద్దులుమూటగట్టు దస్తూరిని కుదుర్చుకొని, వ్రాతప్రతులను సిద్ధము కావించెడివారు. క్రీ. శ. 700 సంవత్సరమున నొక ఉత్తమ గ్రంథముయొక్క వ్రాతప్రతి తయారు చేయబడెను. అందలి అక్షరముల సొంపు, వంపుల సమ్మేళనము, చిత్రవిన్యాసము, వివిధజంతువులు పక్షుల ఆకృతి చిత్రణమును అపూర్వమైనవి. ఈ విధమున క్రైస్తవ మత సంఘము వారు కళాభివృద్ధికి కూడ దోహద మొసంగిరి.

## సప్త రాజ్యములు

పైన తెలుపబడిన యంశములవలన మన కొక్క విషయము స్పష్టమగుచున్నది. రోమనులు బ్రిటను దేశమును విడచి పోయిన తరువాత, అచ్చటికి వలసవచ్చిన సాక్సనులును, వారి మిత్రులును కలసి, ఆనాటి బ్రిటీషు నాగరకతను ధ్వంసముచేసిరి. రాజకీయైక్యత నశించెను. దేశమున చిన్నచిన్న రాజ్యములు

నెలకొనెను. పాలకులలో అంతఃకలహములు నిరంతరము సాగ జొచ్చెను. అజ్ఞానాంధకారము సర్వత్ర వ్యాపించెను. ఇట్టి దుస్థితినుండి క్రైస్తవ మతసంఘము వారు బ్రిటను దేశము నుద్ధరించిరి. మత విషయములందు దేశప్రజలలో ఏకత్వమును, సంఘీభావమును. నెలకొల్పిరి. ఈ విధముగ జాతీయ జీవితము పునరుద్ధరింప బడెను. ధార్మిక విషయములం దేర్పడిన యేకీ భావము క్రమముగ రాజకీయ రంగములో కూడ యెట్లు స్థిర పడెనో ఇంచుక విమర్శింపవలసి యున్నది.

సాక్సనులు బ్రిటను దేశము నాక్రమించిన తరువాత ఇచ్చట ఏడు రాజ్యము లేర్పడెను. ఇయ్యవి కెంట్, నార్థంబ్రియా, మెర్షియా, వెస్సెక్స్, ససెక్స్, ఎస్సెక్స్, ఈస్టు ఆంగ్లియా (Kent, Northumbria, Mercia, Wessex, Sussex, Essex, East Anglia) అనునవి. వీనిలో తుది మూడు రాజ్యములును విశేషము గణనీయమైనవి కావున మిగిలిన నాల్గు రాజ్యములును ఒకదానివెనుక వేరొక్కటి బ్రిటను దేశమున ప్రాధాన్యత వహించెను. ఆయా కాలములం దాయా రాజ్యముల ప్రభువులు బ్రిటను దేశమున కేకచ్ఛత్రాధిపత్యము వహించునట్లు కాన వచ్చెను. కాని తుట్టతుదకు వెస్సెక్సు (Wessex) రాజ్యమును పాలించిన రాజులు తమ యాధిక్యతను నెలకొల్పి, బ్రిటను దేశమున కంతకును ఏలికలైరి. ఏడు స్వతంత్ర రాజ్యములు నెలకొనియున్న ఈ కాలము బ్రిటీషు రాజకీయ చరిత్రయందు సప్తరాజ్య యుగము (Heptarchy) అని వర్ణింపబడుచున్నది.

మొట్టమొదట కెంటు రాజ్యపాలకుడైన ఎథల్బర్టు బ్రిటను దేశమునకెల్ల ముఖ్య పరిపాలకుడుగ భావింపబడెను. ఈతడు క్రైస్తవ మతమును స్వీకరించి, దాని మూలముగ తన రాజకీయపు పలుకుబడినికూడ వృద్ధిచేసికొని నట్లీవరకే సూచించి నారము. క్రీ. శ. 616 వ సంవత్సరమున నీతని మరణముతో కెంటురాజ్యపు ప్రాముఖ్యత నశించెను. క్రీ. శ. 616 నుండి 685 వరకును నార్దంబ్రియా ప్రభువులు బ్రిటను దేశమునందు ప్రముఖ స్థానము వహించిరి. వీరిలో ప్రథముడగు ఎడ్విన్ అను రాజు కెంటురాజ్యపు రాకుమారిని వివాహమాడి, క్రైస్తవమతమును స్వీకరించెను. ఈ ప్రభువు గొప్పవీరుడు. ఈతడు ఉత్తరమున స్కాట్లండు దేశముపై కూడ దండయాత్రలు సాగించి, విజయములు సాధించెను. కాని ఆ కాలమున మెర్షియా (Mercia) రాజ్యమును పాలించిన పెండా (Penda) అను బలవంతుడైన క్రైస్తవేతర ప్రభువు, క్రైస్తవమతమును స్వీకరించిన ఎడ్విన్ తోడల [illegible]యచెంది, అతనిని యుద్ధమున నోడించి సంహరించెను. నార్దంబ్రియా రాజులకును మెర్షియా రాజులకును నిరంతర యుద్ధములు సాగజొచ్చెను. ఇట్టి యుద్ధములలో నొకదానియందు పెండావీరుడు మరణించెను. కాని అంతమాత్రముచే ఈ రెండు రాజ్యముల వైరమును సమసిపోలేదు. నార్దంబ్రియా ప్రభువులు మెర్షియా రాజులతో యుద్ధములు సాగించుచునే వచ్చిరి. తుదకు క్రీ. శ. 685 వ సంవత్సరమునాటికి నార్దంబ్రియా రాజ్యము క్షీణించెను. మెర్షియా రాజ్యపు అధిక్యత

ప్రారంభమయ్యెను. మెర్షియా రాజ్యమును పాలించిన ప్రభువులలో ఆఫా (Offa) అను నాతడు సర్వశ్రేష్ఠుడు (క్రీ. శ. 757- 796). ఈతడు చాల బలవంతుడైన రాజు. ఈతడు కెంట్, ఎస్సెక్సు రాజ్యములను జయించి, తన రాజ్యములో కలుపుకొనెను. వేల్సు దేశమున నెలకొనియున్న బ్రిటనులను ఓడించి, వెనుకకు తరిమివైచెను. వెస్సెక్సు రాజ్యమును కూడ ఆక్రమించెను. ఈ రాజు క్రైస్తవ మతాభిమాని. తన రాజ్యమున నెలకొనియున్న లిచ్‌ఫీల్డు అను ఒక పట్టణమున, ఒక క్రైస్తవ మతపీఠమును నెలకొల్పుటకై ఈతడు యత్నించెను. ఆ కాలమున ఐరోపా ఖండమునందు ఫ్రాంకుల కేలికయైన ఛార్లస్ అను గొప్ప ప్రభువు పరిపాలించుచుండెను. ఆఫారాజు ఈ ఫ్రాంకురాజుతో వివాహ సంబంధములు కల్పించుకొనెను. కాని ఆఫారాజు మరణముతో మెర్షియారాజ్యపు ఘనత సశించెను. వెస్సెక్సు ప్రభువుల యాధిక్యత ప్రారంభమయ్యెను (క్రీ. శ. 796). క్రీ. శ. 802 నుండి 839 వ సంవత్సరము వరకును వెస్సెక్సు రాజ్యమును పాలించిన ఎగ్బర్టురాజు ఈ వంశమున ఘనత వహించిన పాలకులలో మొదటిరాజు. ఈతడు కెంట్, సస్సెక్సు, ఎస్సెక్సు రాజ్యముల నాక్రమించి, మెర్షియా రాజ్యముపై దండెత్తి అచ్చటిరాజుల నోడించి, నార్దంబ్రియా రాజులచే కూడ, తన యాధిక్యత నంగీకరింప జేసెను. ఈ విధమున ఎగ్బర్టురాజు బ్రిటనుదేశమున నింతకు పూర్వము మరే ప్రభువును, సాధింపజాలని విజయములను, పలుకుబడిని సాధిం

చెను. కాని ఈతడు మరణించిన తరువాత ఈతని కుమారులు వెస్సెక్సు రాజ్యమును, తునకలుగా చేసి, ఒక్కొక్క భాగమున కొక్కరు ప్రభువులైరి. ఈ విధముగ వెస్సెక్సు రాజ్యము యొక్క బలముకూడ క్షీణించి, నార్దంబ్రియా, మెర్షియా రాజ్యములకు పట్టిన గతియే దీనికిని పట్టునట్లు కానవచ్చెను. కాని తలవని తలంపుగ నేర్పడిన కొన్ని పరిణామములు లీ అనర్థము రాకుండ జేసెను. అయ్యది డేనులు (Danes) అను అనాగరకుల దండయాత్ర. బ్రిటను దేశపు రాజ్యముల యునికికిని, ప్రజల సౌఖ్యమునకును గొప్ప ప్రమాద మేర్పడెను. ఈ ప్రమాదమును గుర్తించి, సాక్సను ప్రభువులును, ప్రజలును తమ అంతః కలహములను మరచి, తమ స్వాతంత్ర్యమును, ప్రజా క్షేమమును నిలువబెట్టుకొనుటకై నడుములు బిగించి సంసిద్ధులైరి. జాతికి సంభవించిన ఈ ప్రమాదము వెస్సెక్సు రాజ్యమును బలపరచెను.

## ఉత్తర దేశముల ఓడదొంగలు

క్రీ. శ. ఎనిమిదవ శతాబ్ది తుదిభాగమున, నార్వే, స్వీడను, డెన్మార్కు అను ఉత్తర దేశములనుండి బయలుదేరిన కొందరు ఓడదొంగలు మొట్టమొదటి పర్యాయము బ్రిటను దేశముపై దాడి చేసిరి. 789 వ సంవత్సరము వేసవికాలమున ఒకనాడు, బ్రిటను దేశపు రైతులు ప్రశాంతమగు వాతావరణములో, తమ వ్యవసాయపు పనులు సాగించుచుండిరి. ఆ సమ

యమున కొందరు పరదేశీయులు మూడు పడవలలో బ్రిటను
దేశపు తూర్పు తీరమున విడిది చేసియుండిరి. ఈ విషయమును
తెలిసికొని రాజుయొక్క సాక్సను ఉద్యోగి యొకడు తన అను
చరులతోసహా వారిని సమీపించెను. ఆగంతకులను విదేశీయు
లగు వర్తకులుగా భావించి, ఆ అధికారి వారిని తమ రాజు
కడకు తీసికొని పోవలసినదిగా అనుచరుల నాజ్ఞాపించెను. కాని
అట్లు సంభవింపలేదు. ఆగంతకులు తక్షణమే ఆ సాక్సను ఉద్యో
గిని, అతని అనుచరులను చంపివైచిరి. ఈ యాగంతకులు
ఉత్తర దేశములనుండి వెడలివచ్చిన ఓడదొంగలు. వీరు క్రూరత్వ
ములో రాక్షసులు. అపారమగు బలసంపద కలవారు. మత
విషయములలో పాషండులు. నీతినియమముల నించుకయును
పాటింపని బందిపోటులు.

ఎనిమిదవ శతాబ్దియందు డెన్మార్కు, నార్వే, స్వీడను
దేశములలో గొప్ప సంచలనము కల్గెను. అచ్చటిప్రజలు నూత
నోత్సాహ పరవశులై, ఘనకార్యముల సాధింపవలెనని తొందర
పడసాగిరి. ఈ ప్రజలలో కొందరు రష్యా దేశమునందు ప్రవే
శించి, అచ్చట స్థిరనివాస మేర్పరచుకొనిరి. మరికొందరు దక్షి
ణాభిముఖులై ప్రయాణము సల్పి, కాన్‌స్టాంటినోపులు నగర
మును చేరిరి. సముద్ర యానములో నిపుణులైన వీరు, మధ్య
ధరా సముద్రమును ప్రవేశించి, ఆఫ్రికా ఖండపు టుత్తర భాగ
మందును, స్పైను దేశమందును నెలకొనియున్న అరబ్బు రాజ్య
ములపై దాడిచేసి, అచ్చటి ప్రజలను వేధించిరి. ఈ ఔత్తరా

హులలో మఱియొక శాఖవారు బ్రిటీషు దీవులపై దాడులు ప్రారంభించిరి. తదితరులు ఐస్‌లాండు ద్వీపమును, అమెరికా ఖండమును కన్గొనిరి. మఱికొంత కాలము గడచిన వెనుక ఈ బందిపోటులలో నొక వర్గమువారు ఐర్లాండు ద్వీపమును చేరి అచ్చట నొక రాజ్యమును స్థాపించిరి. ఈ దేశమునందలి ప్రసిద్ధ నగరమగు డబ్లిన్ (Dublin) ను ఈ సముద్రచోరులే స్థాపించినట్లు తెల్పుదురు. వీరు ఫ్రాన్సు దేశముపై కూడ దాడిచేసి ముఖ్యపట్టణమగు ప్యారిస్ (Paris) నగరమును ముట్టడించిరి. కాని ఇచ్చట వీరికి విజయము చేకూరలేదు.

ఈ దొంగల బలమునకు మూలము వారి పడవలు. ఈ పడవలు మిక్కిలి బలమైనవి. వీని పొడవు సుమారు 77 అడుగులు. వెడల్పు 18 అడుగులు. కాని లోతు తక్కువ. ఈ నావలలో ప్రయాణముచేయుచు, సై బందిపోటులు వివిధ దేశములకు పోయెడివారు. బందిపోటుతనమునకై బయలుదేరెడి ఈ ప్రజలలో అతి కఠినమైన క్రమశిక్షణ యుండెడిది. ఈ గుంపులో చేరు గౌరవ మందరికిని లభించెడిదికాదు. పదునారు మొదలు అరువది సంవత్సరముల వరకు వయస్సు కలవారికి మాత్రమే చోరసంఘములో ప్రవేశము దొరకెడిది. విశిష్ట శక్తి సామర్థ్యములు కలవారు ఈ పడవలలో నావికులుగ ఎన్నుకొనబడుచుండిరి. వారు నౌకా నిర్వహణమునందు నిపుణులుగ నుండవలయును. యుద్ధభూమియందు వీరు ధైర్య సాహసముల ప్రకటింపవలెను. ఇందులకు ఫలితముగ,

బందిపోటులకు దోపిడి మొత్తములో, ఒక భాగము లభించెడిది. ఈ ఔత్తరాహ నావికులకు ముఖ్య కార్యక్రమము ప్రజలను దోచుకొనుటయే. వీరైనంతవరకు వారు ఇతరులతో యుద్ధము నకు తలపడెడివారు కారు. పల్లెలను, పట్టణములను, దేవస్థాన ములను దోచుకొని వీలైనంత శీఘ్రముగా, వారు తమ పడవ లకు పారిపోవుచుండిరి. శీఘ్ర గమనమున కనువుగ నుండునను ఉద్దేశ్యముతో వారు తఱచు గుఱ్ఱములనుకూడ వాడుచుండెడి వారు.

క్రీ. శ. 793 వ సంవత్సరమున ఈ చోరవర్గమువారు (వీరికి ఆంగ్లమున Danes అను పేరు వాడఁబడుచున్నది. డెన్మార్కు దేశవాసులు కావున వీరికీ పేరు తగియున్నది.) నార్దంబ్రియా రాజ్యమునకు సమీపమున నెలకొనియున్న యొక పవిత్ర ద్వీపముపై దాడి కావించిరి. డేనులు ఆ ప్రదే శమును దోచుకొని, పశువులను చంపి తిని, అచ్చటి సన్యాసుల పలువురను నిర్దయులై సంహరించిరి. కొందరు సన్యాసులను చెరపట్టి ఐరోపా ఖండములో బానిసలుగ అమ్ముటకై ఈ చోరులు తీసికొనిపోయిరి. వారికి ఎంతో విలువగల నగలును, బంగారమును, పవిత్రములగు క్రైస్తవమత చిహ్నములును [illegible] బ్రిటను దేశమునందే కాక, ఐరోపా ఖండ మంతటను వ్యాపించి, క్రైస్తవ మతాభిమానులగు వారి కెల్లరకును, ఎంతయో విచారము కల్గించెను. ప్రథమ దశ యందు డేనులు సాక్సను ప్రజలను, వారి క్రైస్తవ దేవాలయ

ము లను దోచుకొని, అపార ధనముతో స్వదేశమునకు వెడలి పోవు చుండుట ఆచారముగ నుండెను. కాలక్రమమున వారి ధైర్యము హెచ్చెను. క్రీ. శ. 865 వ సంవత్సరపు ప్రాంతమున [illegible] నార్థంబియా. [illegible] ఆంగ్లియా [illegible] రాష్ట్రము [illegible] ముగ నివాస మేర్పరచుకొని. ఇందులకు ప[illegible] అనుకూలించెను. బలవంతులైన ఈ బందిపోటు దొంగలను, సముద్రముపైననే ఎదిరించి, వెనుకకు తరిమివేయుటకు సమర్థ మగు నౌకా సేనకాని, బ్రిటను గడ్డపై వారు కాలు పెట్టిన తరువాత వారి నోడించి పారద్రోలగల శక్తివంతమైన స్థల సైన్యము కాని, సాక్సనులవద్ద లేకుండెను. అందులకు తోడు బ్రిటను దేశపు రాజు లొండొరులపై అసూయపడి, అంతఃకలహ ముల సాగించుచునే యుండిరి. డేనులు ఒక ప్రదేశమున స్థిర పడి, అచ్చట నొక సురక్షితమగు సైన్య స్థావరము నేర్పరుచు కొనెడివారు. ఇచ్చట వారి వీరులు ఎట్టి ఆపదయులేక నివ సించుచుండిరి. కాలక్రమమున నీ బందిపోటులు తమ దారా పుత్రాదులనుకూడ ఇచ్చటకు తెచ్చుకొనసాగిరి. క్రీ. శ. 867 వ సంవత్సరమున, ఒక బలవత్తరమగు సేనతో డేనులు ఇంగ్లాండు దేశములో చొరబడిరి. ఉత్తర ప్రాంతమందలి యార్కు (York) పట్టణము వారికి వశపడెను. మెర్షియా రాష్ట్రమునుకూడ డేను లాక్రమించిరి. స్కాట్లండు దేశమునుకూడ వీరు జయిం చిరి. ఈ బందిపోటులు అనాగరకులగు నాస్తికులు. వీరికి క్రైస్తవ మతము నెడల యేమాత్రమును గౌరవములేదు.

కావున వారు ప్రజలను దోచుకొని, సర్వవిధముల హింసించు టయే కాక, అనాటి బ్రిటీషు నాగరకతకు పట్టుకొమ్మయైన క్రైస్తవమత సంఘమునుకూడ రూపుమాప జొచ్చిరి. మరల నొక అంధకార యుగము ప్రారంభ మగుచున్నట్లు కాన వచ్చెను. కాని వెస్సెక్సు రాష్ట్రపు రాజు లీ ప్రమాదమునుండి బ్రిటను దేశమును కాపాడిరి.

---

## మూడవ ప్రకరణము

# సాక్సనుల ఉచ్ఛ్రదశ - పతనము

## మహనీయుడైన ఆల్ఫ్రెడురాజు

(Alfred the Great)

వెస్సెక్సు రాజ్యము ఇంగ్లండు దేశమునందలి దక్షిణ ప్రాంతమున నెలకొని యున్నది. ఈ భాగము సారవంతమైన ప్రదేశము. కావున ఇచ్చటిరాజు లితర ఆంగ్లపాలకులకంటె బలవంతులై యుండిరి. ఈ ప్రాంతము శత్రువులకు సులభముగ వశపడునదికాదు. దీని కుత్తరమున దుర్లంఘ్యములగు కొండల వరుసలు కలవు. నౌకాయానమున కనువైన మంచి వేగము లగు నదు లిచ్చట ఏవియును లేవు. డేనులు ఇతర రాష్ట్రముల లోని నదులలో తమ నౌకలను నడపుకొనుచు ముందునకు సాగిపోయెడివారు. వెస్సెక్సు రాష్ట్రమున వారి కిట్టి అనుకూలతలు లభింపవయ్యెను. ఈ రాజ్యము నందలి స్థానికాధికారుల కడ కొంత సేన యుండెడిది. ఆపత్కాలమున వారు రాజు నాజ్ఞలకై వేచియుండక, తామే స్వతంత్రముగ వ్యవహరించి, శత్రువులను వెనుకకు తరుముచుండుట ఆచారముగ నుండెను. ఇంగ్లండు దేశపు దక్షిణభాగమందలి ప్రజలే ఆ దేశపు చరిత్రయందు ముఖ్యమగు పాత్రను ధరించినట్లు చారిత్రికుల యభిప్రాయము. బ్రిటను దేశపు స్వాతంత్ర్యమునకును, క్రైస్తవ మత సంఘమునకును గొప్ప ప్రమాదము సంభవించిన యీ

కాలమున, దాక్షిణాత్యులే దేశ గౌరవమును కాపాడిరి. మత ధర్మములను, సంస్కృతిని సంరక్షించిరి.

క్రీ. శ. 828 వ సంవత్సరపు ప్రాంతమున బందిపోటులగు డేనులు వెస్సెక్సు రాష్ట్రముపై మొదటిసారి దండెత్తిరి. ఆ దేశమును పాలించుచున్న ఎగ్బర్టురాజు వీరితో పోరాడి పరాజితుడయ్యెను. పది సంవత్సరములు దాటిన తరువాత ఆత డొక యుద్ధమున డేనుల నోడింప గల్గెను. కాని ఇంతమాత్రముచే విశేషమగు నెట్టి ఫలితములును లభింపలేదు. బందిపోటులు ప్రతి సంవత్సరమును విడువకుండ వెస్సెక్సు ప్రాంతముపై దాడులు సల్పుచు, లండను, రాఛెస్టర్, కాంటర్బరీ పట్టణముల దోచుకొనుచుండిరి. ఇది యిట్లుండగా 839 వ సంవత్సరమున ఎగ్బర్టు రాజు మరణించెను. ఆతని కుమారుడు ఇరువది సంవత్సరములు పరిపాలనచేసి కాలధర్మమును చెందెను (859). ఈ ప్రభువు నామము ఎథెల్ వుల్ఫు (Ethelwulf). ఎథెల్ వుల్ఫు రాజునకు నల్వురు కుమారులు. వారిలో మొదటి యిరువురును క్రీ. శ. 866 నాటికి చనిపోయిరి. మూడవ కుమారుడగు ఎథెల్రెడ్ అను నాతడు సింహాసన మధిష్ఠించెను. ఈ రాజు యోగ్యుడు. పాపభీతియు, దైవభక్తియు కలవాడు. కాని శత్రు సంహారమునకు కావలసిన కార్య శూరత్వము, చురుకుతనము, ధైర్య సాహసములు అతనివద్ద కొరవడియుండెను. అదృష్ట వశమున ఆతని కనిష్ఠ సోదరుడగు ఆల్ఫ్రెడు రాకుమారుడు ఆతని కండగా నుండెను. ఆల్ఫ్రెడు (Alfred) కూడ అన్నగారివలెనే

దైవభక్తి మున్నగు సద్గుణములు కలవాడు. కాని ఈతడు శత్రు విజయమునకై దైవ సహాయముతోపాటు, పురుష కారముకూడ కావలయునని ఎరింగిన లోకజ్ఞుడు. నానాటికిని మితిమీరి పోవుచున్న డేనుల ఆగడములను అరికట్టుటకై ఈ రాజ సోదరు లిరువురును తీవ్ర ప్రయత్నముల చేయసాగిరి.

క్రీ. శ. 871 వ సంవత్సరమున వెస్సెక్సు రాజునకును, ఓత్తరాహ చోరులకును, యుద్ధము సంభవించెను. ఆనాటికి లండను నగరము డేనుల ఆక్రమణలో నుండెను. రీడింగు అను పట్టణమువద్ద వారి స్కంధావార మేర్పడియుండెను. డేనులు మేలైన బంగారు నగలు ధరించి తళతళ మెరయు పతాకముల తోడను, చిత్రవర్ణ రంజితములగు తను త్రాణములతోడను, యుద్ధరంగమున కేతెంచిరి. ఆష్‌డౌన్ (Ashdown) అను ప్రదేశమున సాక్సను సేనలు వారి నెదిరించెను. భయంకరమగు యుద్ధము ప్రవర్తిల్లెను. రణరంగమందు ఆల్ఫ్రెడు రాకుమారుడు మహా ధైర్యముతో తన సేనలను నడపి, ఆనాటి సాయం కాలమునకు శత్రువులను సంపూర్ణముగ నోడించి పారద్రోలెను. ఇరుపక్షముల వారును ఆనాటి ఉదయమున రణసన్నద్ధులై యున్న సమయమున, రాజగు ఎథెల్రెడ్ దైవప్రార్థనాదికముల జరుపుచు పూజామందిరమందే ఉండిపోయెను. అన్న యేతెంచి యుద్ధము నుపక్రమించుట కాజ్ఞ యొసంగగలడని ఆల్ఫ్రెడు కొంతవరకు వేచియుండెను. కాని ఎంతకును రాజు రాలేదు. ఆలసించిన పక్షమున ప్రమాదము సంభవింపక తీర

దని యెరింగి, ఆల్ఫ్రిడు శత్రువుల దాకవలసినదిగా వెస్సెక్సు వీరుల కాజ్ఞ యొసంగెను. పూజాదికముల పూర్తి కావించుకొని ఎథెల్రెడ్ రాజు మరి కొంతకాలము గడచినమీదట రణరంగమున కేతెంచెను. ఆష్‌డౌన్ విజయము ఆల్ఫ్రిడు సాధించిన మొదటి గెలుపు. ఇందువలన డేనుల బలము నశింపలేదు. కాని వెస్సెక్సు రాజ్యము నిలువబడెను. స్వదేశ స్వాతంత్ర్యమును, క్రైస్తవ మత ధర్మమును, నాగరకతను, సంరక్షించుకొనుటకు అవకాశము కలదని ఇంగ్లాండు ప్రజలు సంతసించిరి. ఆల్ఫ్రిడు రాకుమారుడు సాధించిన ఈ మహత్తర విజయమును, ఆంగ్లో సాక్సను ప్రజలు చిరకాలము వరకును మరువలేదు.

వెస్సెక్సు రాజ్యము వారికిని డేనులకును, యుద్ధములు నిరంతరము సాగుచునే యుండెను. రాజగు ఎథెల్రెడు కూడ వీనిలో పాల్గొనెడివాడు. కాని విశేష పరిశ్రాంతివలన ఈతని ఆరోగ్యము చెడెను. అనతికాలములో ఎథెల్రెడు రాజు మరణించెను. ఈతనికి కుమారులుండిరి. కాని వారింకను బాలకులు. ఆల్ఫ్రిడు సంప్రాప్త వయస్కుడు. గొప్ప శూరుడు. కావున వెస్సెక్సు ప్రజ లాతనినే రాజుగ వరించిరి. 871 వ సంవత్సరమున ఆల్ఫ్రెడు వెస్సెక్సు రాజ్య సింహాసనము నధిష్ఠించెను. రాజ్యాధికారము వహించిన ఒక నెల తరువాత ఆల్ఫ్రెడు రాజునకును, డేనులకును, మరల యుద్ధము సంభవించెను. ఈ పర్యాయము ఆల్ఫ్రెడు సేన లోడిపోయెను. పలువురు సైనికులు మరణించిరి. అనేకులు భీతిచే పారిపోయిరి. ఇంతమాత్రముచే

ఆల్ఫ్రెడు నిరుత్సాహము చెందలేదు. తన బలమును దృఢపరచు
కొనుటకును, రాజ్య ప్రజలకు కొంత విశ్రాంతి యొసంగుట
కును, కొంత విరామము కావలయును. ఈ యుద్దేశ్యముతో,
రాజనీతిజ్ఞుడగు ఆల్ఫ్రెడు డేనులతో సంధి చేసికొనెను; వారిని
సుతృప్తి పరచుటకై కొంత ధనమును వారికి చెల్లించెను.
తత్ప్రతిఫలముగ డేనులు వెస్సెక్సు రాజ్యమునువిడి యుత్తరము
నకు వెడలిపోవుట కంగీకరించిరి. ఈ సంధి అయిదు సంవత్స
రముల కాలము అమలులో ఉండునట్లు ఇరుపక్షములవారును
అంగీకరించిరి. తమకు తాత్కాలిక విజయములు కొన్ని లభించి
నను, వెస్సెక్సు రాజ్యమును జయించుట సులభము కాదనియు,
ఎన్నియో యుద్ధములు కావించి, ఎన్నియో ప్రాణముల బలి
పెట్టినగాని, ఆల్ఫ్రెడును ఓడించుట సాధ్యపడదని యెరింగి
డేనులు ఈ సంధి షరతుల కంగీకరించిరి.

ఆల్ఫ్రెడు రాజు డేనులతో కావించుకొనిన ఈ సంధివలన,
అతిముఖ్యములగు కొన్ని ఫలితములు కల్గెను. ఇంతవరకును
దోపిడీదారులుగ మాత్రమే ప్రవర్తించిన డేనులు, బ్రిటను దేశ
మున స్థిరనివాస మేర్పరచుకొని, శాంతియుత జీవనమును
గడపుటకు యత్నింప జొచ్చిరి. ఈ కాలపు డేనులు తమ్ము
తాము రెండు శాఖలుగ విభజించుకొనిరి. మొదటి శాఖవారు
కొంత భూమి నాక్రమించుకొని, తాము స్వయముగను, స్థానికు
లగు ప్రజల సహాయముతోడను, సేద్యము సాగింపజొచ్చిరి. వీరు
తమ కుటుంబములను పోషించుకొనుటయే కాక, తమ జాతి

ప్రజల కందరకును కూడ ఆహార పదార్థములను సమకూర్చు చుండిరి. డేనులలో రెండవ శాఖవారు నిరంతరము యుద్ధ సన్నద్ధులై, వెస్సెక్సు రాజ్యమును, తదితర ప్రాంతములను ఎప్పుడు కబళించివేయుదమా యని ఎదురు చూచుచుండెడి వారు. బ్రిటనుదేశము నంతను ఆక్రమింపవలయు ననెడి డేనుల కోర్కె యీడేరలేదని, మనము ముందుముందు తెలిసికొన గల్గుదుము. అది యట్లుండ, కృషీవల వృత్తి నవలంబించి బ్రిటను దేశమున శాశ్వతముగ నిలువబడిపోయిన డేనులు నార్థంబ్రియా, ఈస్టు ఆంగ్లియా రాష్ట్రములలో ముఖ్యముగ వసతిని కల్పించుకొనిరి. వీరు అసాధారణమైన దేహబలమును, ధైర్య సాహసములును, ఆత్మాభిమానమును కలవారు. క్రమశిక్షణకు లోనై. వీరు తమ యోధలయందలి అధికారులను మాత్రము మన్నించెడివారు. తదితరు లెంతటి వారికినికూడ వీరు తలవంచెడివారు కారు. ఇంతే కాక ఈ బందిపోటులకు కాలక్రమమున, తాము సేద్యముచేయు భూములపై అపారమగు మక్కువ యేర్పడెను. ఈ భూమి అన్యాక్రాంతము కాకుండుటకై, వీరెంత త్యాగములనైనా కావించుటకు సిద్ధపడెడివారు. వ్యక్తి స్వాతంత్ర్యము, తమ భూవతుసలయెడ గాఢమగు మమతయు, వీరి ముఖ్య లక్షణములు. ఈ లక్షణములు భావితరములందు బ్రిటీషు ప్రజానీకమున ప్రస్ఫుటముగ ద్యోతకమై, ప్రజారాజ్య స్థాపనమునకు మూలకారణము లయ్యెను. డేనులు కైస్తవేతరులైనను, జాతిచేతను, భాషచేతను, సాక్సను ప్రజలకు

మిక్కిలి సన్నిహితులు. కావున ఈ రెండు జాతులవారును, అతి సులభముగ కలిసిపోయిరి. డేనులు బలశాలురును, ధైర్యవంతులును అగుట నిజమేకాని, వారికి వ్యవసాయమునుగూర్చి కాని, తదితర విషయములనుగూర్చి కాని, ఏమంత విశేషములు తెలియవు. కావున వారు సేద్యమును గూర్చి అనేక విషయములు, సాక్సను ప్రజలనుండి తెలిసికొనసాగిరి. సాక్సనులు బ్రిటనులను సంపూర్ణముగ హతమార్చి, పారద్రోలిన విధముగ డేనులు సాక్సనుల యెడల వర్తింపలేదు. అట్లు వర్తించుటకు సాధ్యముకూడ కాలేదు. డేనుల ఆచారముల కొన్నింటిని, సాక్సను ప్రజలు అవలంబించిరి. అట్టివానిలో గణనపద్ధతి యొక్కటి. వారు పదులకు మారుగ పండ్రెండు సంఖ్యలో వస్తువుల లెక్కించెడివారు. వారి నూర్లు మన నూట యిరువదికి సమానము. ఇంగ్లండు దేశపు తూర్పు భాగమున "పొడుగునూరు" (Long Hundred) అను పదమును నేటికిని వాడుదురట. పొడుగునూరు అనగా నూట యిరువది యని మనము తెలిసికొనవలెను.

ఆల్ఫ్రెడురాజు డేనులతో కావించుకొనిన సంధి అయిదు సంవత్సరముల తర్వాత మరల ధ్రువపరచవలెను. లేదా అది రద్దు పడిపోవును. పై కాలములో ఈ నౌకాచోరులు తమ బలమును వృద్ధి పరచుకొని, మరల వెస్సెక్సు రాజ్యముపై దండెత్తివచ్చిరి. ఆల్ఫ్రెడు రాజు వారికి మరల ధనమునొసంగి సంధి చేసికొనెను. తాము వెస్సెక్సు రాజ్యమున కెట్టి హానియు కల్గింపమని ప్రమా

ణములుచేసి డేనులు వెనుకకు మరలిపోయిరి. కాని ఈ వాగ్దానములను పాటించు నుద్దేశ్యము వారి కెంతమాత్రమును లేదు. ఆల్ఫ్రెడురాజు రాజ్యమును దోచుకొనుటకై ఈ బందిపోటులు తమ పడవలలో అనేకులు యోధులతో బయలుదేరిరి. కాని వారి దుష్ప్రయత్నములు సంపూర్ణముగ భగ్నమయ్యెను. సముద్రమున ప్రచండమైన తుఫాను చెలరేగి, డేనుల పడవలు నూట ఇరువది మునిగిపోయెను. అయిదువేల బందిపోటు దొంగలు మరణించిరి. మార్గాంతరము లేక డేనులు ఆల్ఫ్రెడు రాజుతో సంధి చేసికొని, ఆతని రాజ్యమున కెట్టి నష్టమును కల్గింపమని, మరల ప్రమాణములు చేసిరి. ఈ కాలమున గత్రమ్ (Guthrum) అనువాడు డేనులకు నాయకుడు. పై సంధి జరిగిన ఒక సంవత్సరము తరువాత అనగా క్రీ. శ. 878 వ సంవత్సరమున గత్రమ్ సేనలు అకస్మాత్తుగ వెస్సెక్సు రాజ్యముపై దండెత్తి వచ్చెను. ఆల్ఫ్రెడురాజు ఈ దండయాత్ర నెదుర్కొనుటకు సంసిద్ధుడై యుండలేదు. కావున ఆతడు ప్రాణము దక్కించుకొని పారిపోయెను. ఆతని యనుచరులగు నితర వీరులుకూడ, ఇదే మార్గము నవలంబించిరి. సామాన్య సైనికులు చెల్లా చెదరగ పారిపోయి, తమ యిండ్లకు చేరుకొనిరి. డేనులు ఇంగ్లండు దేశమును పూర్తిగ ఆక్రమించినట్లు కానవచ్చెను. కాని త్వరలోనే ఆల్ఫ్రెడురాజు అదృష్టచక్రము తిరిగెను. ఆతనియందు భక్తి విశ్వాసములు గల వీరులును, సైనికులును ఆతనికడకు తిరిగివచ్చిరి. వీరుడగు ఆల్ఫ్రెడురాజు ఈ సేనతో డేనులతో

మగల యుద్ధమునకు దిగెను. ఎథండన్ (Ethandun) అను ప్రదేశమున, వెస్సెక్సు సేనలు డేనులను సంపూర్ణముగ నోడించెను. బందిపోటులు ఆల్ఫ్రెడు రాజునకు పాదాక్రాంతులై, అతడుకోరిన అన్ని షరతులను అంగీకరించుటకు సిద్ధపడిరి. ఇప్పుడు డేనుల ప్రాణములు సాక్సను ప్రభువుల చేతియందుండెను. తలచుకొనినచో ఆల్ఫ్రెడురాజు డేనులను ఒక్క పురుగుకూడ లేకుండ మట్టుపెట్టగలడు. కాని ఆత డట్టిదారుణ కృత్యమునకు పూనుకొనలేదు. అందులకు మారు సర్వోత్కృష్టమగు శాంతి మార్గమున, వారిని తనవంకకు త్రిప్పుకొనుటకై ఆ రాజు పూనుకొనెను. డేను లెల్లరును క్రైస్తవ మతమును స్వీకరించి, ఇంగ్లాండు దేశపు ఉత్తర ప్రాగ్భాగములందు స్థిర నివాస మేర్పరచుకొని, ఇంగ్లాండు దేశపు ప్రజలతో కలసి పోవలెనని ఆల్ఫ్రెడు ప్రభువు నిర్ణయించెను. ఈ నిర్ణయము ప్రకారము డేనులందరును, క్రైస్తవమతమును స్వీకరించిరి. ఆల్ఫ్రెడు రాజు డేనుల నాయకుడగు గత్రమ్‌నకు, ఆధ్యాత్మిక సంరక్షకుడుగ నిలచి, ఆతనికి నూతన మతమునందు ప్రవేశము కల్పించెను. అటుపిమ్మట ఆ రాజు డేను వీరుని తనవద్ద కొన్ని దినములు అతిథిగా నుంచుకొని, ఆతనికి పెక్కు బహుమానముల నొసంగి వీడ్కొల్పెను. ఇయ్యది బ్రిటనుదేశ చరిత్రయందొక అపూర్వ సంఘటన. ఈ సందర్భమున ఆల్ఫ్రెడు రాజు ప్రదర్శించిన అపూర్వమగు ఔదార్యమును, క్షమాగుణమును, ఆతని యితర సౌభాగ్యతలను సర్ విన్‌స్టన్ చర్చిలు మహాశయు డిట్లు కీర్తించియున్నాడు.

"This Sublime power to rise above the whole force of circumstances, to remain unbiased by the extremes of Victory or defeat, to persevere in the teeth of disaster, to greet returning fortune with a cool eye, to have faith in men after repeated betrayals, raises Alfred far above the turmoil of barbaric wars to his pinnacle of deathless glory."

"ఆల్ప్రేడురాజు పరిసర వాతావరణమునకు లొంగిపోక అతీతుడై నిలచెను. ఈతడు గెలుపును, ఓటమిని సమదృష్టితో నుపలక్షించెను. ఘోర విపత్తులోకూడ నాతడు లక్ష్యసిద్ధి కొరకై కృషిని మానలేదు. విజయము లభించినప్పు డాత డుప్పొంగిపోలేదు. తన్ననేక సమయములలో మోసగించిన వారియందు కూడ ఈతడు సంపూర్ణ విశ్వాసమును నిల్పెను. కావున ఆల్ఫ్రేడు రాజునకు అనాగరకులగు డేనులతో పోరాడి విజయముల సాధించిన కీర్తియేగాక మహోన్నతమగు అజరామర విఖ్యాతికూడ లభించినది."

ఆల్ఫ్రేడురాజు కేవల తాత్కాలిక విజయమునకు ప్రాకులాడెడివాడు కాడు. ఆతడు ప్రజానీకమునకు శాశ్వతమగు సేవ చేయవలెనని ఆకాంక్ష గలవాడు. కావుననే ఆతడు తన ప్రతిష్ఠ కొరకై ప్రాకులాడక, సాక్సనులకును, డేనులకును శాశ్వతమగు మైత్రి కుదురునట్టి పథకము నాలోచించెను. ఆల్ఫ్రేడు రాజును, డేనులును, కావించుకొనిన ఈ సంధి వెడ్మోర్ సంధి (Treaty of Wedmore) యనబరగుచున్నది (879). ఈ సంధి ఏర్పాట్లవలన దేశమునకు శాంతి లభించెను. మరి పదునాల్గు

సంవత్సరముల వరకును సాక్సనులకును డేనులకును యుద్ధములు సంభవింపలేదు.

శాంతిని కాపాడుటకును, శత్రుభయమునుండి దేశమును రక్షించుటకును ఆల్ఫ్రెడురాజు చాల కృషిచేసెను. అతడు క్రీ. శ. 886 వ సంవత్సరమున తన జ్యేష్ఠపుత్రికను మెర్షియా రాష్ట్రప్రభువున కిచ్చి వివాహము కావించెను. ఇదే సంవత్సరమున ఈ ప్రభువు డేనుల యధికారమునుండి లండను పట్టణమును తప్పించి, దానిని తన యధికారములోనికి గైకొనెను. రోమనుల కాలమునుండియు ఈ పట్టణము అనేక రాజ మార్గములకును సముద్ర మార్గములకును కేంద్రముగ నుండుటయే కాక, వ్యాపారమునకును, సేనల యునికికిని ఆటపట్టుగ ఖ్యాతిగాంచి యుండెను. ఆల్ఫ్రెడురాజు ఈ నగరమును వశపరచుకొని, చుట్టును కోటకట్టించి, దాని పరిపాలనకై ఒక ప్రత్యేకోద్యోగిని నియమించెను. డేనుల దాడులనుండి బ్రిటను దేశమును కాపాడు ఉద్దేశ్యముతో, ఈ రాజు నౌకాబలము సిద్ధముచేసెను. ఈతడు నిర్మాణము కావింపించిన నౌకలు పొడవైనవి.బలమైనవి. వీనిని నడపుటకై అరువది తెడ్లను వాడెడివాడు. ఈ పడవలు డేనులు వాడు నౌకలకంటెకూడ బలముగ నుండెడివి. ఆల్ఫ్రెడు రాజు కావించిన ఈ సంస్కరణము చాల ముఖ్యమైనది. బ్రిటను వంటి ద్వీపమును సంరక్షించుటకై, నౌకాసైన్యము చాల ఆవశ్యకమని యెరింగి, దానిని సృష్టించినవాడు ఆల్ఫ్రెడురాజు. కాలక్రమమున నౌకాబలమును వృద్ధి కావించుకొని, "సముద్ర

ములకు రాణి" అను గొప్ప గౌరవమును బ్రిటనుద్వీపము పొందగల్గుటకు కారణము ఆల్ఫ్రెడు రాజు కృషియేయని తెల్పుట సత్యదూరము కానేరదు. ఈ ప్రభువు స్థలసైన్యమును కూడ సంస్కరించి, దానిని ఎక్కువ ఉపయోగకరముగ మార్చెను. ఆల్ఫ్రెడురాజునకు పూర్వముకూడ బ్రిటను దేశము నందు "జాతీయ సైన్యము"ను సమకూర్చుకొనుపద్ధతి అమలులో ఉండెను. కాని ఇందలి సైనికులు సంవత్సరమున కొకనెల మాత్రము, దేశరక్షణకొరకై సేవచేసి, ఆ పిమ్మట తమతమ వృత్తులను సాగించుకొనుటకై, మరలిపోయెడివారు. దేశమున కెట్టి ప్రమాదస్థితి యేర్పడినను కూడ, వీరు గడువుమించి, ఒక్క దినముకూడ సైన్యమునందు పని చేసెడివారు కారు. ఇందలి లోపమును గుర్తించి, ఆల్ఫ్రెడురాజు సైన్యవ్యవస్థలో నొకమార్పు కావించెను. దేశరక్షణకొరకై పోరాడగల వ్యావసాయదారుల నీతడు రెండు శాఖలుగ విభజించెను. అందు ఒక శాఖవారు రాజు సేనలోచేరి దేశసంరక్షణకై సంసిద్ధత వహించి యుండవలెను. రెండవ శాఖవారు పై శాఖవారి వ్యవసాయ భూములను చక్కగ సేద్యముచేయుచు, వారివృత్తి కెట్టి భంగ మును రాకుండ కాపాడుచుందురు. నియమితమగు కొంత కాలము గడచినవెనుక, జాతీయసైనికులు తమ స్వస్థలములకు వెడలిపోయి, వ్యవసాయ వృత్తిలో నిమగ్నులగుదురు. ఇది వరలో కృషీవలులుగ నున్నవారు జాతీయసేనలోచేరి, దేశరక్ష ణకై ప్రభుత్వమునకు తోడ్పడుదురు. ఈ విధమున దేశ రక్షణ

మునకై ఎల్లప్పుడును కొంతసేన సంసిద్ధమై యుండునట్లు, ఆల్ఫ్రెడురాజు జాగ్రత్త వహించెను. తన రాజ్యములోనికి డేనులు దండెత్తివచ్చి, ప్రజలకు తొందర కలుగజేయకుండు టకై ఈ రాజు కట్టుదిట్టములు చేసెను. రాజ్యపు సరిహద్దు లందలి ప్రదేశములలో ఈతడు కోటలు కట్టించెను. ఈ కోట లలో సేనలు కాపుదల చేయుచుండెడివి. వీనిని పరిసర ప్రాంతములందలి ప్రజలే యెల్లప్పుడును, సంరక్షించుచు, మర మ్మత్తులు చేయుచుండవలెను.

ఈ ప్రభువు ప్రజారంజకముగ పరిపాలన కావించుచు, ఎల్లప్పుడును విజ్ఞానుల సభవారి సలహాను గైకొను చుండెడి వాడు. ఈతని పరిపాలనా విధానము, అనాగరకులగు డేను రాజులకు వరవడి యయ్యెను. ఆల్ఫ్రెడురాజు తన కాలమందు సర్వజనాంగీకారము నందిన ఆచారములకు శాసన రూపమును కల్పించి, గ్రంథస్థము కావించెను. "ఒరు లేయవి యొనరించిన మన కప్రియమగు, మనమవి యొరులకు సేయకునికి పరమ ధర్మము" అని ఆల్ఫ్రెడురాజు తన శాసనముల కుపోద్ఘాతముగ ప్రజల కాదేశించెను. ఈ ప్రభువు నూతన శాసనముల కావించు టకు పూనుకొనక, ప్రాచీన ధర్మముల నమలు కావించుట తోడనే, సంతుష్టి పడెను. "నేనేర్పైన నూతన శాసనముల కావించినచో, అయ్యవి భావి ప్రజానీకమున కెంతవరకు రుచిం చునో నాకు తెలియదు" అని భావించి ఈ రాజు క్రొత్త మార్గ ములు త్రొక్కలేదు. ఆల్ఫ్రెడు ప్రభువు క్రోడీకరించిన ఈ శాస

[illegible] శాసనము స్పష్టపఱచి క్రోడీకరించిరి. వీనిని స్థానిక న్యాయస్థానములలో అనుగత న్యాయశాసనము (Customary Law) లుగ అంగీకరించెడివారు. కొంతకాలము గడచిన తరువాత, వీనినే ఋషికల్పుడగు ఎడ్వర్డురాజు (King Edward the Confessor) శాసనములని ప్రజలు వ్యవహరింప సాగిరి. నార్మను రాజు లీ శాసనముల గౌరవించి, ఆచరణలోనుంచిరి. తరములు గడచిపోయిన తరువాత జమీందారీయుగపు న్యాయవాదులు, పై శాసనములలో తగు మార్పులు కొనివచ్చిరి. ఇప్పుడా శాసనములు ఇంగ్లాండు దేశమున ప్రజా న్యాయశాసనములు (Common Law) అని వ్యవహరింప బడుచున్నవి.

బ్రిటను ద్వీపముపై డేనుల దాడులు సాగుచున్న కాలమందు, ఈ దేశపు టుత్తర భాగమున విద్యయు, ధార్మిక జీవితమును చాల నష్టపడెను. సామాన్య ప్రజలును, మతగురువులును కూడ వ్రాత, చదువులను, పూర్తిగ మరచిపోయిరి. అందువలన విజ్ఞానమును, మతాభినివేశమును ఎచ్చటను కానరావయ్యెను. ఈ దుస్థితినుండి బ్రిటీషు ప్రజలను కాపాడు నుద్దేశ్యముతో ఆల్ఫ్రెడురాజు విద్యావ్యాప్తి కొరకై, చాల కృషిచేసెను. ఈ విషయమై ప్రత్యేకశ్రద్ధ వహించవలసినదని ఈతడు మతగురువులను హెచ్చరించెను. ఔత్తరాహచోరుల అలజడులవలన క్షీణించిన మఠములను, ఈతడు పునరుద్ధరించెను. అందు నివసించు సన్యాసులును, సన్యాసినులును పవిత్ర జీవితము గడపవలయునని యీతడు కట్టడి చేసెను. తన దేశపు సమకాలీన

చరిత్రను, పూర్వగాథను, గ్రంథస్థము కావించి యుంచుటకై ఆల్ఫ్రెడురాజు ఏర్పాటు చేసెను. ఈతని ప్రోత్సాహము వలన "ఆంగ్లో సాక్సనుల చరిత్రము" (The Anglo-Saxon Chronicle) అను ప్రామాణిక గ్రంథమును కొందరు పండితులు వ్రాయుట ప్రారంభించిరి. ఈ గ్రంథము ఇంగ్లండు దేశ చరిత్రకు సంబంధించిన అనేక విషయములను ఎట్టి అతిశయోక్తులును లేక సత్యగర్భితముగ చక్కని భాషలో ప్రదర్శించుచున్నది. ఆల్ఫ్రెడురాజు సమకాలీనులగు పండితులచే, ఇతర భాషలలోనుండి ఉత్తమ గ్రంథముల నాంగ్లములోనికి, పరివర్తనము కావించెను. ఈతడు స్వయముగ పెక్కు గ్రంథముల ననువాదముచేసి గొప్ప భాషాసేవ చేసెను. ప్రతి ఆంగ్లేయుడును వ్రాయను, చదువను, నేర్చియుండవలెనని, ఈ ప్రభువు ఆశయము.

894-896 సంవత్సరముల నడుమ డేనులు మరియొక పర్యాయము ప్రబలమగు సేనతో, ఇంగ్లండు దేశముపై దండెత్తి వచ్చిరి. కాని దేశసంరక్షణకై సర్వసన్నాహములను కావించుకొని యుండిన ఆల్ఫ్రెడురాజు, ఈ పరిణామమును చూచి ఎంతమాత్రమును జంకలేదు. ఆనాటికే ఆల్ఫ్రెడురాజు కుమారుడు సంప్రాప్త వయస్కుడై, తండ్రికి కుడిభుజమువలె సర్వకార్యములందును తోడ్పడజొచ్చెను. ఆల్ఫ్రెడు ప్రభువు అల్లుడగు మెర్షియా పాలకుడుకూడ వీరికి అండగ నిల్చెను. సాక్సను సేనలు డేనులను సంపూర్ణముగ ఓడించి పారద్రోలుటయే కాక, వారి నౌకలను పెక్కింటిని వశపరచుకొనెను. డేనుల

స్త్రీలును, బిడ్డలును సాక్సనుల చేతజిక్కిరి. ఇట్లు బందీలుగ గైకొనబడిన వారిలో డేనుల నాయకుడగు హేస్టెను భార్యయు బిడ్డలును ఉండిరి. ఆల్ఫ్రెడురాజు హేస్టెను భార్యను సగౌరవముగ ఆమె భర్తవద్దకు పంపివైచెను. డేనుల నాయకుని యిరువురు కుమారులను మాత్రము, ఆల్ఫ్రెడురాజు తనవద్ద కొంతకాలము నిల్పుకొని, వారికి క్రైస్తవమతము నిప్పించి ఆపిమ్మట తల్లిదండ్రులకు అప్పజెప్పెను. తొమ్మిదవ శతాబ్దపు మొరటు ప్రజలు ఆల్ఫ్రెడురాజు ఉదారగత నర్థము గావించుకొనలేక, ఆతని నెంతయో విమర్శించిరి. కాని అపూర్వమగు నీ క్షమాగుణమే ఈ రాజునకు "మహనీయుడు" అను బిరుదమును సంపాదించినదని నేడు మనము గ్రహించుచున్నారము. కర్కశప్రకృతిగల హేస్టెన్‌నందు కూడ ఆల్ఫ్రెడురాజు ప్రవర్తన గొప్ప మార్పు తేగల్గెను. ఈ సంఘటన జరిగిన వెనుక డేనులును, సాక్సనులును చాల దినములు యుద్ధములు చేయుచునే వచ్చిరి. కాని హేస్టెన్ అందు పాల్గొనలేదు. ఆల్ఫ్రెడు ప్రభువు స్వదేశమును విదేశీయుల బారినుండి కాపాడి రక్షించిన విధమును ఆంగ్లో సాక్సను చరిత్రము కీర్తించినది.

ఆల్ఫ్రెడురాజు క్రీ. శ. 901 వ సంవత్సరమున కాలధర్మము నొందెను. ఈతడు బ్రిటను దేశపు చరిత్రయందు ఉత్తమోత్తముడగు ప్రభువు. అంతేకాదు, ప్రపంచ మందలి అత్యుత్తమ పరిపాలకులలో నీత డొక్కడని వర్ణించుట ఎంతమాత్రమును అతిశయోక్తికాదు. ఏ విధముగ చూచినను, ఈతని

యందు ఉత్తమ లక్షణములు కానవచ్చుచున్నవి. ఆల్ఫ్రెడురాజు గొప్ప పేరుడు. ఈ రాజు దేశమును విదేశీయులనుండి కాపాడి, శాంతి భద్రతలను నెలకొల్పెను. ఈతడు పరాభవములు సంభవించినను, గెలుపు కల్గినను, పమాత్రమును తొందరపడక ఉద్రిక్తుడు కాక లభించిన అవకాశములన్నిటిని, తన ఉత్తమ లక్ష్యముల సాధించుటకై వినియోగించెను. శత్రువులగు డేనులనుకూడ ఈతడు ద్వేషింపలేదు. డేనులను సాక్సనులను ఈరాజు క్రైస్తవ ధర్మమను స్వర్ణ సూత్రముచే బంధించి, వారిరువురును శాశ్వతముగ మిత్రులగుటకై కృషిసల్పెను. ఇందీతని మానసత్వమును, దూరదర్శిత్వమును ప్రస్ఫుటముగ కానవచ్చుచున్నది. ఆల్ఫ్రెడురాజు ఉత్తమ క్రైస్తవుడు. ఈ మత ధర్మములలో సర్వశ్రేష్ఠమైన క్షమాగుణము, ఈ ప్రభువునందు మూర్తీభవించిన దనుటకు, ఈతడు పరాజితులైన డేనులతో వ్యవహరించిన విధానమే తార్కాణము. రాజ్యాంగ సంస్కరణములందును, శాసన సంపుటీకరణము నందును, ఈ రాజు గొప్ప ప్రజ్ఞను చూపెను. విద్యావ్యాప్తికై ఈ ప్రభువు చేసిన సేవ అపారము. ప్రజా సౌఖ్యమే ఆల్ఫ్రెడు నరపాలునికి పరమ ధ్యేయము. ఇన్ని యుత్తమ లక్షణములు కలవాడయ్యును, ఆల్ఫ్రెడురాజు మిక్కిలి వినీతభావ సంపన్నుడు. ఇట్టి గొప్ప రాజును మహనీయుడని వర్ణించుట ఎంతమాత్రమును అతిశయోక్తి కానేరదు.

# సాక్సనుల ఉన్నతి - క్షీణత (901-1066)

ఆల్ఫ్రెడురాజు సింహాసన మధిష్ఠించినది క్రీ. శ 871 వ సంవత్సరము. 1066 వ సంవత్సరమున నార్మనులు అను విదేశీయ ప్రభువులు బ్రిటనును జయించి, ఒక నూతన రాజవంశమును నెలకొల్పిరి. ఈ రెండు సంఘటనలకును నడుమగల సుమారు రెండు శతాబ్దుల కాలమును ఒక ఆంగ్ల చారిత్రికుడు అతి సరసముగ ఒక ఆంగ్ల సంవత్సరమునకు పోల్చినాడు. ఋతు ధర్మముల ననుసరించి ఆంగ్ల సంవత్సరము మార్చి నెలనుండి ప్రారంభమగును. మార్చి, ఏప్రిలు, మే నెలలు వారికి వసంత కాలము. ఆనంద సమయము. భావి సౌఖ్యమున కిచ్చట పునాది వేయబడును. సాక్సను ప్రజల యున్నతికిని, గౌరవ ప్రతిష్ఠలకును, ఆల్ఫ్రెడురాజు పరిపాలనా యుగము (871-901) నాందీదశ. సాక్సనుల స్వర్ణయుగమున కియ్యది వసంత కాలము. ఆల్ఫ్రెడు ప్రభువు శత్రువులగు డేనులను పరాభవించి, దేశమున శాంతిభద్రతలను నెలకొల్పుటయే కాక, అనేక సంస్కరణములచే ఆంగ్లేయ ప్రభుత్వమును, సంఘమును, సంస్కృతిని ఉన్నత స్థితికి గొనిపోయెను. 901 నుండి 959 వరకునుగల కాలములో అయిదుగురు రాజులు పరిపాలన చేసిరి. ఈ కాలమందు సాక్సను రాజుల ప్రతిభ యత్యున్నతస్థాయి నందుకొనెను. ఇంచుమించు బ్రిటను ద్వీపమంతయు వెస్సెక్సు ప్రభువులకు స్వాధీనమయ్యెను. దేశ శత్రువులగు డేనులు, సాక్సను వీరుల ప్రతాపమునకు భయపడి, వెస్సెక్సు రాజులకు వశంవదులై, శాంతముగ బ్రిటను దేశ

మున కాలము పుచ్చసాగిరి. ఇయ్యది సాక్సను యుగమునందలి వేసవి. జూను, జూలై, ఆగష్టు నెలలు బ్రిటను ద్వీపమున వేసవి కాలము. ఇయ్యది వారి కత్యంత సుఖప్రదమగు కాలము. సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు నెలలు బ్రిటీషు వారికి శిశిర ఋతువు. ఈ నెలలు ప్రశాంతముగ గడచిపోవును కాని, ఇందు వేసవికాలమందలి ఉజ్జ్వలత, ఆనంద సంపూర్ణమగు వాతావరణ మును ఉండవు. రాబోవనున్న హేమంతమునకిది వేగుచుక్క. సౌఖ్యానందములకు భరత వాక్యము. 959 నుండి 975 వరకును పాలించిన శాంతిప్రియుడైన ఎడ్గార్ (Edgar the Peaceful) రాజు కాలము సాక్సను యుగములో నిట్టి శిశిరకాలము. ఈ రాజు తన వంశీయుల ప్రతిష్ఠను నిలువబెట్టెను. 975 నుండి సాక్సను యుగపు క్షీణదశ ప్రారంభమగుచున్నది. మహనీయుడగు ఆల్ఫ్రెడురాజు వంశములో చేవ లోపించెను. ఇందు జన్మించిన రాజు లసమర్థులును, దుర్బలురునై దేశ గౌరవమును కాపాడ జాలక పోయిరి. డేనులు మరల బ్రిటను ద్వీపముపై దండ యాత్రలు సాగించి, దేశమునంతను అల్లకల్లోలము కావించిరి. కొంతకాలముపాటు డేనురాజులే బ్రిటనును పరిపాలించిరి. అటు పిమ్మట ఆల్ఫ్రెడు వంశమువారు తిరుగ ఆంగ్లసింహాసనము నధి ష్ఠించినను, సాక్సను రాజుల ప్రతిష్ఠ పునఃప్రతిష్ఠితము కాలేదు. రాజుపేరిట స్వార్థపరులగు మంత్రులును, సలహాదారులును రాజ్యము చేయసాగిరి. ప్రభుత్వ పటిమ పూర్తిగ క్షీణించెను. అంతఃకలహములు వృద్ధిచెందెను. ఇట్టిపరిస్థితిలో 1066 వ సంవత్స

ధమున విదేశీయులగు నార్మనులు బ్రిటను రాజ్యముపై దండెత్తి వచ్చి, ఈ దేశమును వశపరచుకొనిరి. బ్రిటనునందు మరల పరదేశీయుల పరిపాలన ఆరంభమయ్యెను. 975-1066 సంవత్సరములకు నడుమగల కాలములో సాక్సనుల యున్నతి నశించుటయే కాక, దేశ మనేక కష్టములకును, అవమానములకును గురయై తుదకు విదేశీయులకు వశపడెను. పై కాలము సాక్సను యుగమునకు హేమంతము. డిసెంబరు, జనవరి, ఫిబ్రవరి నెలలు బ్రిటనునందు హేమంత ఋతువు. ఈ నెలలలో చలి దుర్భరముగ నుండును. మానవులకును, పశు పక్ష్యాదులకును కూడ, ఇయ్యది మిక్కిలి బాధాకరమగు కాలము. హేమంతమున బ్రిటనునందు ప్రకృతి నిర్జీవముగ కానవచ్చును. ఆంగ్లకవులు హేమంతమును దుఃఖమునకు పర్యాయపదముగ వాడుచుందురు. 975-1066 సంవత్సరముల నడుమగల పరిస్థితులు సాక్సను ప్రజలకు మిక్కిలి దుఃఖ హేతువులని వేరుగ తెలుపనక్కరలేదు.

ఆల్ఫ్రెడు రాజు కుమారుడగు ఎడ్వర్డు (901-925) ప్రభువు కూడ తండ్రివలెనే గొప్ప వీరుడు. ఈతని సోదరి మెర్షియా రాష్ట్ర పాలకుని రాణి. ఈమె భర్త 911 వ సంవత్సరమున మరణించెను. అంతట రాణియే తన ప్రజలకు నాయకత్వము వహించి, మిక్కిలి సమర్థతతో పరిపాలన సాగించెను. ఈమె తన సోదరుడగు ఎడ్వర్డునకు అన్ని విధముల చేయూత నొసంగెను. వీరిరువురును కలసి, వెస్సెక్సు, మెర్షియా రాష్ట్రములందలి డేనులను సంపూర్ణముగ పరాభవించి, సాక్సను ప్రభువుల యాధిక్యతను

ప్రతిష్ఠించిరి. డేనులు సాక్సను పాలకులకు సంపూర్ణముగ వశ పడిరి. అంతట వారికి వారి జాగీరులలో శాంతముగ జీవించుట కును, తమ స్కాండినేవియా ఆచారముల నవలంబించుచు కాలము పుచ్చుటకును, అనుమతి యొసంగబడెను. 917 వ సంవత్సరమున మెర్షియారాణి చనిపోయినందున, ఆమె సోద రుడగు ఎడ్వర్డు ఈ రాష్ట్రమునకు కూడ పలికయయ్యెను. వేల్సు దేశమందలి రాజులుకూడ ఎడ్వర్డును తమకు ప్రభువుగ అంగీకరించిరి. హంబరునదికి ఉత్తరముననున్న డేనులు, బ్రిట నులు, స్కాటు ప్రజలునుకూడ, ఎడ్వర్డు ఆధిక్యతను మన్నించి నట్లు కొందరు చారిత్రకులు తెల్పుచున్నారు. ఎడ్వర్డు రాజు కుమారుడు ఎథల్‌స్టన్ (Athelstan 925 - 940) అను రాజు సైతము తండ్రి తాతలవలెనే మహావీరుడు. ఈతడు తనతో యుద్ధము ప్రకటించిన డేనులు, స్కాట్లండు ప్రజలు, ఐర్లాండు పాలకుని, తదితరులను సంపూర్ణముగ ఓడించి, విజయలక్ష్మిని చేపట్టెను. ఈతనిని బ్రిటను ద్వీపమునందలి సమస్త ప్రజలును తమ రారాజుగ మన్నించిరి. 940 నుండి ఆరు సంవత్సరములు ఎడ్మండు (Edmund) అను రాజు ప్రభుత్వము నెరపెను. ఈతడుకూడ సమర్థుడును, వీరుడును అగు ప్రభువు. స్కాట్లండు పాలకుని ఈతడు సంపూర్ణముగ పరాభవించి, తనకు సామంతుని కావించుకొనెను. ఈతని యనంతరము తొమ్మిది సంవత్సర ములు (946 - 955) పరిపాలన కావించిన ఎడ్రెడు (Edred) అను ప్రభువు కాలమున స్మరింపదగినవి మూడు విషయములు

కలవు. ఈ రాజు ఎడ్మండురాజు సోదరుడు. ఎడ్మండు రాజునకు పురుష సంతానమున్నను విజ్ఞానులసభ (Witan) వారు ఈతనిని తమ రాజుగ ఎన్నుకొనిరి. ఈ విజ్ఞానుల సభయందు సాక్సను ప్రముఖులు మాత్రమేకాక, డేను పీరులును, భూస్వాములును, కూడ చేరియుండుట గమనింపదగిన యంశము. సాక్సను డేనుప్రజల సమ్మేళనము అతి త్వరితముగా సాగుచున్న దనుటకు ఇదియొక ప్రబల నిదర్శనము. ఈ రాజు పరిపాలనారంగమున కావించిన యొక సంస్కరణ ముందుముందు చాల ప్రమాద భూయిష్ఠముగ పరిణమించెను. ఎడ్రెడు రాజు మెర్షియా, నార్దంబ్రియా, అను రెండు పెద్ద పరగణాలను ఏర్పాటుచేసి, వానిని పాలించుటకై ఉన్నతాధికారులను నియమించెను. ఈ అధికారులు తమకుగల బలమును చూచుకొని, గర్వించి, తమ యేలికపైననే తిరుగుబాట్లు కావించుట సంభవించెను. ఎడ్రెడు రాజునకు పరమాప్తుడైన డన్‌స్టన్ (Dunstan) అను గొప్ప మతాధికారి ఈ సందర్భమున స్మరింపదగినవాడు.

డన్‌స్టన్ అను బ్రిటీషు ప్రముఖుడు బాల్యమున గ్లాస్టన్ బరీ (అను ప్రదేశమున గల) మఠము (Abbey of Glastonbury) నందు నివసించి విద్యాబుద్ధులు నేర్చెను. ఈతడు గొప్ప సమర్థత కలవాడు. ఈతడు ఏథల్‌స్టన్ రాజు కాలమునందే ఆంగ్ల ప్రభువుల దర్బారులో కొలువు కుదిరెను. ఎడ్మండు రాజు ఈతనిని గ్లాస్టన్బరీ మఠమున కధికారిగ నియమించెను. ఎడ్రెడ్ రాజునకు డన్‌స్టన్ మిక్కిలి ఇష్టుడు. ఎడ్రెడ్ అనంతరము రాజ్యము

చేసిన ఎడ్వీ (Edwy 955 - 959) రాజు ఇంచుక అవ్యక్తుడు. కావున డన్‌స్టన్ మతాధికారి ఈతని నొక సందర్భమున కఠిన ముగ మందలింపవలసి వచ్చెను. ఎడ్వీరాజు ఈతనియెడ వైరము పూనెను. కాని శాంతి ప్రియుడైన ఎడ్గార్ రాజు (959-975) డన్‌స్టనును మిగుల మన్నించెను. 960 వ సంవత్సరమున ఎడ్గారు రాజు డన్‌స్టనును కాంటర్బరీ పీఠమునకు మతాధికారి (Archbishop of Canterbury)గ నియమించెను. ఎడ్గారు రాజు కాలము ప్రశాంతముగ గడచిపోవుటకు, ఈ మతాధి కారియే చాలవరకు కారణము. డన్‌స్టను డేనులకును సాక్స నులకును సామరస్యము కుదుర్చుటకై చాల కృషి చేసెను. ఈతని సలహావలన, రాజు డేనులను విజ్ఞానులసభలో సభ్యులుగ నియమించెను. కొందరు డేనులు గొప్ప రాజకీయ పదవులను పొందిరి. మరికొందరు మతాధికారులు (Bishops) గ నియ మితులైరి. డన్‌స్టను బ్రిటను దేశమునందలి మఠముల స్థితిగతు లను సంస్కరించి, మఠములందలి సన్యాసులు పవిత్ర జీవితము గడపునట్లు కట్టుబాట్లు చేసెను. ఈతడు విద్యావ్యాప్తికై కావించిన కృషి యపారమైనది. డన్‌స్టను మహాశయుడు గొప్ప రాజనీతిజ్ఞుడును, విజ్ఞాన సంపన్నుడును అగు మతాధికారి. బ్రిటనుదేశ చరిత్రలోని యుత్తమ వ్యక్తులలో నీత డొక్కడు.

శాంతి ప్రియుడగు ఎడ్గారురాజు ఆల్ఫ్రెడు రాజవంశ మందలి ఉత్తమ ప్రభువులలో తుదివాడు. ఈతని కాలమున సాక్సనుల యున్నతి అత్యుచ్చదశను పొందెను. దేశమున

శాంతి నెలకొనెను. ఈ రాజు పరిపాలనా రంగమందు చక్కని వ్యవస్థ నేర్పాటుచేసెను. ఇంగ్లాండుదేశమందలి జిల్లాలు (Shires) పునర్విభజన కావింపబడెను. ఒక్కొక్క జిల్లాను పాలించుటకై, షరీఫ్ (Sheriff) అను అధికారి రాజుచే నియమింపబడెను. జిల్లాలలో విభాగములగు శతములు (Hundreds)కూడ ఈ విధముగనే సుపరిపాలనా విధానమును పొందెను. పట్టణములన్నియు, శత్రువుల నెదుర్చుటకై చుట్టును ప్రాకారముల నిర్మించుకొనెను. ప జిల్లాలో ప్రజలు అచ్చట శాంతి భద్రతల నెలకొల్పి యుంచుటకు బాధ్యులైరి. నేరస్థులను వారే పట్టి తేవలెను. జిల్లాలయందును, తద్విభాగములందును, న్యాయస్థానము లేర్పాటయ్యెను. పన్నుల విధానము సంస్కరింపబడెను. డన్‌స్టను మతాధికారి కావించిన మత సంస్కరణముల ప్రశంస, యీవరకే కావింపబడినది. ఈ మతాధికారియు, ఆతని సహాయకులును విద్యాభివృద్ధికై చాల దోహద మొసంగిరి. ఆంగ్ల వాఙ్మయ ప్రారంభ మీ యుగముననే జరిగెను. ఎల్ఫ్రిక్ (Elfric) అను ఆంగ్ల మతాధికారి స్వభాషయందు కొన్ని ధార్మిక ప్రసంగముల రచించెను. మఠములందలి సన్యాసు లిట్టి యుత్తమ కృతులకు, చక్కని దస్తూరీలో ప్రతులు వ్రాయుచుండెడివారు. ఈ ప్రతులు చూపులకు మిక్కిలి ఆకర్షకముగ నుండెడివి. ఇట్టి వ్రాత పుస్తకముల కితర దేశములలో కూడ చాల గిరాకీ యుండెడిది. సామాన్యప్రజ లీ పుస్తకముల మూలమున జ్ఞానమును సంపాదించెడివారు. ఈ విధమున ఆంగ్ల

సంస్కృతి కీ యుగమున పునాది వేయబడెను. ఎట్టి విషమ పరిస్థితులును కూడ ఈ పునాదిని కదల్పలేదు.

శాంతి ప్రియుడగు ఎడ్గార్ రాజు మరణముతో సాక్సను రాజుల స్వర్ణయుగము అంతరించెను. ఆతని కుమారుడగు ఎడ్వర్డు (975 - 978) తన సవతితల్లిచే చంపింపబడెను. ఎడ్వర్డు సవతితమ్ముడు ఎథెల్రెడ్ (Ethelred 978 - 1016) అను వాడు ఆంగ్ల సింహాసనము నధిష్ఠించెను. ఈతడు పిరికివాడు. అసమర్థుడు. ఈతని సలహాదారులందరును దుష్టులు లేక స్వార్థపరులు. ఈ రాజునకు బ్రిటనుచరిత్ర యందు "ప్రమత్తుడు" (Unready) అను దుష్కీర్తి కల్గెను. ఈతడు బలవంతులైన తనదేశపు టుద్యోగులను, జమిందారులను అదుపులో నుంపజాలడయ్యెను. విదేశీయులగు డేనులు బ్రిటను ద్వీపముపై మరల దండయాత్ర ప్రారంభించిరి. ఈ ప్రమాదము నెదుర్కొనుట ఎథెల్రెడ్ రాజునకు సాధ్యము కాలేదు.

ఆ కాలమున ఫ్రాన్సు దేశమందలి నార్మండీ రాష్ట్రమును యుద్ధప్రియులును, బలశాలురునగు నార్మను ప్రజలు పాలించుచుండిరి. వీరి పాలకుడు "డ్యూక్ ఆఫ్ నార్మండీ" (Duke of Normandy) అని పిలువబడుచుండెను. నార్మనులు అను పదము "Northmen" (ఔత్తరాహులు) అను పదము నుండి ఉద్భవించినది. వీరుకూడ డేనులవలెనే బందిపోటులు. వీరు సైతము ఐరోపాఖండపు టుత్తర భాగమున నివసించు

ప్రజలు. కాలక్రమమున వీరు ఫ్రాన్సుదేశమును ప్రవేశించి, అచ్చట కొంతరాజ్యమును ఆక్రమించి, రాజ్యపాలనము ప్రారంభించిరి. ఫ్రాన్సుదేశపు రాజు వీరిని తరిమి వేయజాలడయ్యెను. కొంతకాలము గడచిన తరువాత, నార్మండీ ప్రభువులు ఫ్రాన్సు దేశపు రాజుతో సంధి కావించుకొని, నామమాత్రమున కాతని యాధిక్యత నంగీకరించిరి. ఫ్రాన్సు దేశమున స్థిరనివాస మేర్పరచుకొనిన అనతి కాలములోనే ఈ ఔత్తరాహులు ఫ్రాన్సు దేశపు భాషను, అచ్చటి ఆచార్య వ్యవహారములను, అంగీకరించి, ఫ్రెంచిజాతిలో కలిసిపోయిరి. పరిసర వాతావరణమున కనుగుణ్యముగ మారగల్గుట ఈ అనాగరక ప్రజలలోగల యొక ముఖ్య లక్షణము. నార్మనులు క్రమశిక్షణను, కఠినమగు న్యాయపద్ధతులను, సంతోష పూర్వకముగ అంగీకరించు నైజము కలవారు. కావున వారు త్వరలోనే సుశిక్షితమగు సేనను సిద్ధము కావించుకొనిరి. నార్మండీ ప్రభువు దర్బారులో ఆతని దేవిడీకి సంబంధించిన ఉద్యోగులును, పెద్ద భూస్వాములును, మతాధికారులును ఉండిరి. వీరు తమ ప్రభువునకు అవసరమగు సైన్యసహాయమును చేయుటయేకాక, దర్బారులో స్వయముగ హాజరు కావలెను. రాజ్యమందలి సర్వాధికారములును "డ్యూకు" హస్తములందు నిక్షిప్తమై యుండెను. రాష్ట్రమందలి వివిధజిల్లాలను పాలించు అధికారులు, పన్నులు వసూలు చేయుచు, నేరస్థులను దండించుచు, అన్ని విషయములందును తమ యేలిక చెప్పు చేతలలో నుండవలెను. నార్మండీ ప్రభు

వులు క్రైస్తవ మతసంఘము వారియెడల స్నేహాభావముతో వర్తించి, తమ బలమును వృద్ధి కావించుకొనిరి. కాని మతాధికారుల నందరను నియమించు అధికారము ప్రభువు తనచేతియం దడికొనెను. ఈ కథా కాలమున నార్మండీ రాష్ట్రమును రాబర్టు అను ప్రభువు పాలించుచుండెను. ఆంగ్ల ప్రభువైన ఎథెల్రెడ్ రాజు రాబర్టు మేనత్తయైన "ఎమ్మా"ను వివాహమాడెను. ఈ విధముగ తనకు బలవంతులగు నార్మండీప్రభువుల సహాయము లభింపగలదని ఎథెల్రెడ్ రాజు ఆశ. ఈ వివాహాముువలన ఆంగ్ల రాజు దర్బారులో కలతలు హెచ్చెను. రాణియైన "ఎమ్మా" పలుకుబడివలన అనేకులు నార్మను ఉద్యోగులు, మతాధికారులు, లేఖకులు మున్నగువారు ఇంగ్లండు దేశమునకు వచ్చి చేరిరి. స్థానికులగు సాక్సను, డేను ప్రముఖుల కీ విదేశీయులరాక ఎంత మాత్రమును కిట్టలేదు. కావున ఆంగ్ల దర్బారులో ఒక జాతీయ పక్షమును, ఒక నార్మను పక్షమును ఏర్పడెను. వారిరువురికిని ఎల్లప్పుడును పోటీలును, స్పర్ధలును సాగుచుండెను.

ఇది యిట్లుండగా డేనులు తరచుగ బ్రిటను ద్వీపముపై దండెత్తి రాసాగిరి. ఎథెల్రెడ్ రాజు వారితో యుద్ధముచేసి పారద్రోలజాలక, అపారమగు ధనమును వారికి ముట్టచెప్పి, వారిని వెనుకకు పంపివేసెను. 991, 994, 1002 సంవత్సరములలో నీ విధముగ ఆంగ్లరాజు డేనులకు సంతృప్తి కల్గించెను. కాని మాటిమాటికిని ధనము నిచ్చి, బంధిపోటుల బాధనుండి తప్పించుకొనుట సాధ్యము కానిపని యని తెలిసికొని, ఎథెల్రెడ్

రాజు ఒక దురాలోచన కావించెను. ఇంగ్లండు దేశములో నివసించుచున్న డేనుల నందరను చంపించినచో, తన దేశమునకు ఈ బందిపోటుల బాధ శాశ్వతముగ వదలిపోగలదని మూఢుడైన ఈ రాజు చింతించెను. ఈ పథకము ననుసరించి 1002 సంవత్సరమున నొక పవిత్ర దినసమున, ఇంగ్లండునందలి డేను ప్రజ లాబాలగోపాలమును, స్త్రీ శిశు వివక్షతలేకుండ చంపింపబడిరి. ఈ ఘోరవార్త వినుసరికి ఐరోపా ప్రపంచమంతయు ఘూర్ణిల్లిపోయెను. మృతులలో డెన్మార్కుదేశపు రాజు సోదరి యొకతె యుండెను. తనచెల్లెలి చావునుగూర్చి విని, ఈ రాజు బ్రిటను దేశముపై ఘోరమగు ప్రతీకారము గైకొందునని ప్రతిన బూనెను. డేనులు తండోపతండములుగ బ్రిటను దేశముపై దండెత్తివచ్చి, ప్రజలను చంపి, వారి ఆస్తులను దోచుకొని, దేశమునంతను అల్లకల్లోలము కావించివైచిరి. వీరి నోడించి పారద్రోలుటకు ఎథెల్రెడ్ రాజు అసమర్థుడు. ఈ కాలమున ఇంగ్లండు ప్రజ లనుభవించిన బాధలు వర్ణనాతీతములు. తుదకు 1013 నాటికి డెన్మార్కురాజు ససైన్యుడై ఇంగ్లండు దేశమును ప్రవేశించి, దేశము నాక్రమించెను. ఎథెల్రెడ్ రాజు కుటుంబముతోసహా నార్మండీ రాష్ట్రమునకు పారిపోయెను. ఒక సంవత్సరము మాత్రము పరిపాలన కావించి డెన్మార్కు రాజు మరణించెను (1014). ఆతని కుమారుడు ప్రసిద్ధుడగు కాన్యూటు (Canute) రాజు.

ఎథెల్రెడ్ రాజు పెద్ద కుమారుడు మహావీరుడైన ఎడ్మండు (Edmund) అనునాతడు. ఈతనికి ఆంగ్లమున Ironside (లోహ కఠినమగు దేహము కలవాడు) అని బిరుదు కలదు. తండ్రి బ్రిటనుదేశమును వీడి పారిపోయిన తరువాత రెండు సంవత్సరముల కాలము ఈ రాకుమారుడు శత్రువులగు డేనులతో హోరా హోరి పోరాడి, పెక్కు యుద్ధములలో వారి నోడించి, లండను నగరమును వశపరచుకొనెను. 1016వ సంవత్సరమున ఎథెల్రెడ్ రాజు మరణించెను. ఆంగ్ల ప్రజ లత్యంతోత్సాహముతో ఎడ్మండు వీరుని తమ రాజుగ ఎన్ను కొనిరి. ఆంగ్ల రాజ్యమునకై తనతో పోటీపడుచున్న ఎడ్మండును ఓడించుట దుస్సాధ్యమని తెలిసికొని, కాన్యూటు అతనితో ఒక ఒడంబడిక చేసికొని, ఇంగ్లండును తామిద్దరును పంచుకొను నట్లు ఏర్పాటు చేసెను. కాని దురదృష్టవశమున ఎడ్మండు వీరుడు ఆ సంవత్సరమే తన యిరువదిరెండవ యేట మరణించెను. బ్రిటను దేశమున నిరాశ వ్యాపించెను.

డెన్మార్కు రాజకుమారుడు కాన్యూటు బ్రిటను ద్వీపమున కేకైక పాలకుడుగ నిలిచిపోయెను. ఈతడు గొప్ప వీరుడు. మిక్కిలి సమర్థత కలవాడు. కావున బ్రిటీషుప్రజ లాతనిని గాంచి భయపడిరి. విజ్ఞానులసభ (Witan) వారు కాన్యూటును తమ రాజుగ ఎన్నుకొనిరి. ఈతడు 1016 నుండి 1035 వరకును రాజ్యము చేసెను. కాన్యూటు ఉపాయశాలి. బలవంతులగు నార్మను ప్రజలు, సాక్సను రాజకుటుంబము పతన

మున తనతో యుద్ధమునకు దిగుదురేమోయని శంకించి, ఈతడు ఎథెల్రెడ్ భార్యయైన "ఎమ్మా"ను వివాహమాడెను. దీని వలన ఆతనిమార్గము నిష్కంటక మయ్యెను. ఈ రాజు ఇంగ్లండు, స్కాట్లండు, డెన్మార్కు, నార్వే మున్నగు దేశముల పాలించెను. ఈతడా కాలమునాటి ఐరోపీయ ప్రభువులలో ప్రముఖ స్థానము వహించెను. ఈ రాజు ఇంగ్లాండు దేశమును మిక్కిలి సమర్థతతో పాలించి శాంతిని నెలకొల్పెను. ఈతని కాలమున దేశమున నెట్టి అల్లరులును లేవు. కాన్యూటు కఠినుడైనను, న్యాయబద్ధముగ పరిపాలన సాగించెను. ఈ ప్రభువు కాలమున ఆంగ్లేయుల వ్యాపారము వృద్ధి గాంచెను. పట్టణములు ధనవంతము లయ్యెను. ఈతడు డేనులకును, సాక్సనులకును, సామరస్యము కుదుర్చుటకై యత్నించెను. సాక్సనులను డేనులను కూడ నిష్పక్షపాతముగ ఉన్నతోద్యోగములలో నియమించెను. కాన్యూటు రాజు మన్ననలకు పాత్రుడై, వెస్సెక్సు రాష్ట్రపు జమీందారుగ నియమితుడైన, గాడ్విన్ అను సాక్సను ప్రముఖునిగూర్చి మనము ముందుముందు వినగలము. కాన్యూటు ప్రభువు శాసనములు డేనులకును, సాక్సనులకును, సమానముగ వర్తించుచుండెను. రెండు జాతులవారును వానిని అనుసరించి మెలగెడివారు. కొంతకాలము గడచిన తరువాత కాన్యూటు [illegible] ప్రవేశించు, గౌరవింపసాగిరి. ఆతడు కూడ ప్రజలయందు తనకుగల విశ్వాసమును ప్రకటించుటకై తన డేను సేననంతను స్వదేశమునకు

పంపివైచి, కొందరు అంగరక్షకులను మాత్రము తనవద్ద ఉంచుకొనెను. కాన్యూటురాజు వివేకవంతుడు. తన్ను మిక్కిలి పొగడుచుండెడి అమీరులకును, ఉద్యోగులకును ఈతడు తగు విధముగ బుద్ధి చెప్పినట్లు "కాన్యూటు సముద్రము" అను ప్రసిద్ధమగు కథవలన తెలియవచ్చును. ఈ రాజు క్రైస్తవమతమును నవలంబించి, ఆ మతధర్మములను చక్కగ పాటించెను. రోము నగరమునకు యాత్ర కావించెను.

కాన్యూటు రాజుతో ఇంగ్లాండు దేశమున డేను రాజుల అధికారము నశించెను. ఆంగ్లేయు లాతని కుమారులను రాజుగ నంగీకరింపలేదు. ఆల్ఫ్రెడు రాజు కుటుంబములో నొక్కరిని, తిరుగ తమరాజుగ కానించుకొనవలెనని వారి యిచ్ఛ. ఇది యిట్లుండగా ఆంగ్లరాజుల దర్బారులో సాక్సను డేను పక్షమునకు నాయకుడైన గాడ్విన్ (Godwin) అను ప్రముఖుడు ఆ కాలమున చాల పలుకుబడి సంపాదించి యుండెను. ఈతడు వెస్సెక్సు రాష్ట్రమునకు అధికారి (Earl). ఈతనికి ఆంగ్లరాజుల కడ నార్మనుల పలుకుబడి హెచ్చుట యెంత మాత్రమును ఇష్టములేదు. కనుక ఆతడు నార్మండీలో నివసించుచున్న ఎథెల్రెడ్ రాజు కుమారుల పునరాగమనమునకు మొదట అంగీకరింపలేదు. తుదకు ఆతడు ఎథెల్రెడ్ కుమారుడగు ఎడ్వర్డు ఇంగ్లాండు సింహాసన మధిష్ఠించుటకు సమ్మతించెను. కాని అట్లు చేయుటకు పూర్వము ఎడ్వర్డు నార్మను అనుచరుల నెవ్వరిని ఇంగ్లండు దేశమునకు కొనిరాకుండునట్లు వాగ్దానము పొందెను.

జమీందారగు గాడ్విన్ సహాయముతో ఎడ్వర్డు ఆంగ్ల సింహాసన మధిష్ఠించెను (1042 - 1066). అప్పటి కాతని వయస్సు 35 సంవత్సరములు. 25 సంవత్సరముల కాల మాతడు నార్మండీ రాష్ట్రమందే గడపెను. ఆతని మిత్రులందరును నార్మనులు. ఆతనికి నార్మనుల ఫ్రెంచి భాషయందును, వారి ఆచార వ్యవహారములందును ఎక్కువ మక్కువ. ఈతనికి ఆంగ్ల దేశమును గూర్చి కాని, అచ్చటి ప్రజలనుగూర్చి కాని విశేషము తెలియదు. ఆంగ్లప్రజలకు కూడ ఆతడు క్రొత్తవాడు. కావున వీలైనంతమంది నార్మను మిత్రులను తనచుట్టును ఎల్లప్పుడును ఉంచుకొనవలెనని ఈ రాజు కోరిక. ఈతడు రాజకార్య నిర్వహణమునం దెంత మాత్రమును సమర్థుడు కాడు. ఈ రాజు మిక్కిలి సౌమ్యుడు. ఎల్లప్పుడును దైవప్రార్థనాదికములందును, మత కర్మానుష్ఠానమునందును, నిమగ్నుడై యుండెడివాడు. కావున ఈతనికి Confessor (మతగురువు) అను నామము లభించెను. కాలము గడచినకొలదియు ఎడ్వర్డురాజు మతాభినివేశము హెచ్చెను. ప్రప్రథమమున ప్రజలీతనిని అసమర్థుడని నిరసించెడివారు. కాని క్రమముగ వారి కీ రాజుపై భక్తిభావము కుదిరి, ఈతనిని St. Edward అనగా ఎడ్వర్డు ఋషియని మన్నింపసాగిరి. 1042 నుండి 1066 వరకును, ఎడ్వర్డురాజు నామమాత్రమునకు, ఆంగ్ల రాజ్యమునకు పాలకుడుగ నుండెను. కాని నిజమైన అధికారము వెస్సెక్సు జమీందారగు గాడ్విన్ చేతియందుండెను. ఈ జమీందారు చాల సమ

ర్థుడు. ఈతని కుమారుడగు హారోల్డు (Harold) అను వాడు కూడ తండ్రివలెనే రాజ్య కార్యనిర్వహణమునందు కడు నిపుణుడు. వీ రిరువురును కలసి 24 సంవత్సరములు ఇంగ్లాండు దేశమును పాలించినట్లు తెలుపవచ్చును. గాడ్విన్ కుమార్తెయైన Edith (ఎడిత్) అను యువతిని ఎడ్వర్డు రాజు వివాహమాడెను. ఈ జమీందారు కుమారులు హారోల్డు మున్నగువారు పెద్దపెద్ద జమీందారులుగ నియమితులైరి. ఇట్లు అధికారమంతయు గాడ్విన్ వంశము వారిచే అనుభవింపబడుట రాజునకును, ఆతని నార్మను అనుచరులకును కిట్టలేదు. వారు కుట్రచేసి 1051 వ సంవత్సరమున గాడ్వినును, ఆతని కుమారులను దేశమునుండి తరిమివేసిరి. నార్మను అధికారుల పలుకుబడి ఇప్పుడు ఆంగ్ల దర్బారులో బాగుగా హెచ్చెను. ఇదే సంవత్సరమున నార్మండీ ప్రభువైన విలియం అను నాతడు ఎడ్వర్డురాజును సందర్శించి, ఆతని (ఎడ్వర్డు) యనంతరము తాను ఆంగ్ల దేశమునకు రాజు కావలెనని రాజుచే అనిపించెను. దీనిని సాకుగ చేసికొని ఎడ్వర్డు రాజు తన్ను ఆంగ్లదేశ సింహాసనమునకు వారసునిగ నియమించినట్లు, విలియం ప్రచారముచేసెను. విలియం ఎడ్వర్డు రాజునకు దూరబంధువు. వరుసకు మేనల్లుడు. (ఎడ్వర్డురాజు తల్లి ఎమ్మా నార్మండీ ప్రభువగు రాబర్టుయొక్క మేనత్త. విలియం పై రాబర్టు ప్రభువుయొక్క ఉంపుడుకత్తెకు జన్మించిన పుత్రుడు.) గాడ్విన్ జమీందారు చిరకాలము ప్రవాసములో గడపలేదు. ఆతడు సైన్యమును ప్రోగుచేసి, ఇంగ్లాండు దేశమునకు తిరిగి

వచ్చి, రాజుయొక్క నార్మను అనుచరుల పలుకుబడిని పూర్తిగ నాశనము చేసెను. ఎడ్వర్డురాజు మరల గాడ్విసును తన సలహా దారుగా అంగీకరించెను (1052). కాని త్వరలోనే గాడ్విను మరణింపగా ఆతని కుమారుడు హారోల్డు ఆతని పదవికిని,హోదా లకును వారసుడయ్యెను. ఈతడు పదునాల్గు సంవత్సరములు ఎడ్వర్డు రాజునకు సలహాదారుగ నుండి, మిక్కిలి సమర్థతతో రాజ్యాంగ వ్యవహారముల చక్కబెట్టెను. కాని 1064 వ సంవ త్సరమున ఈతడు ఒక ప్రమాదమున నార్మండీ ప్రభువగు విలియమునకు బందీగ చిక్కెను. విలియం ఈతనిని చాల గౌర వించి, ఎడ్వర్డురాజు తరువాత తన్ను (విలియమును) ఆంగ్ల దేశపు ప్రభువుగ అంగీకరింతునని హారోల్డుచే వాగ్దానము పొందెను. ఈ వాగ్దానము హారోల్డు ఇష్ట పూర్వకముగ ఇచ్చి నది కాదు. 1066 వ సంవత్సరమున ఋషియగు ఎడ్వర్డు రాజున కంత్యకాలము సమీపించెను. సమర్థుడగు హారోల్డును తన యనంతరము రాజుగ ఎన్నుకొనవలసినదని ఆతడు మరణ శయ్యపై విజ్ఞానుల సభకు సిఫారసు చేసెను. 1066 వ సంవ త్సరమున ఈ రాజు మరణించెను.

ఎడ్వర్డురాజు మరణముతో ఆల్ఫ్రెడురాజు వంశమును, సాక్సను ప్రభువుల పరంపరయు నశించెను. అంతకు పూర్వము సుమారు ఒక శతాబ్దినుండియే (975) మహావీరుడైన ఆల్ఫ్రెడు రాజు వంశము నిర్వీర్యమయ్యెను. ఋషియగు ఎడ్వర్డు రాజు కాలమున ఇంగ్లాండు దేశము పై చూపులకు యథాప్రకారముగ

కానవచ్చినను, ప్రభుత్వమునందలి చేవయు, జాతీయ జీవితము లోని జిగియు లుప్తమయ్యెను. జిల్లాలను పాలించు రాజ కీయోద్యోగులు, ప్రతి సంవత్సరమును ప్రభుత్వమువారి బొక్కసమునందు పన్నులు యథాప్రకారము చెల్లించుచు వచ్చిరి. కాని యీ జిల్లా అధికారులను రాజు తన అదుపు ఆజ్ఞ లలో చక్కగ నిలుపుకొన జాలడయ్యెను. రాజునకు కొన్ని స్వంత జాగీరులు ఉండెడివి. వీనినుండి లభించు ఆదాయముతో, ఆతడు కాలము పుచ్చుచుండెను. ఈ జాగీర్లను రాజుయొక్క ఆంతరంగికులగు ఉద్యోగులు, పర్యవేక్షణ కావించెడివారు. మిగిలిన రాజ్యాంగ వ్యవహారము లన్నిటిని "విజ్ఞానులసభ" వారు చక్కబెట్టెడివారు. ఈ సభవారు తాము ఇంగ్లండు దేశ మున కంతకును ప్రతినిధులమని భావించుచుండిరి. కాని ఇది యెంతమాత్రమును సత్యముకాదు. సాక్సను, డేనుజాతులకు చెందిన కొందరు జమీందార్లు అధికారము నంతను చేజిక్కించు కొని, రాజు తరఫున ప్రభుత్వము నెరపసాగిరి. ఈ జమీందార్లు కూడ తమలో తాము తరచు కలహించుచు, స్వలాభ పరా యణులై మెలగుచుండిరి. ప్రభుత్వాధికారము రాజుచేతినుండి తొలగి, పెద్దపెద్ద జమీందారీ కుటుంబముల వారికి వశపడుటచే ప్రజలకు ప్రభుత్వమునెడ గౌరవము క్షీణించెను. వేరువేరు జిల్లాలవారు, వేరువేరు రాజోద్యోగుల యధికారమును మన్నిం చుచు, జాతీయభావ మనునది లేక స్వార్థజీవితము గడుపసాగిరి. ఇందులకు తోడు కొన్ని జిల్లాలలో సాక్సనులును, కొన్ని జిల్లా

లలో డేనులును అధిక సంఖ్యాకులుగనుండిన కారణమున, విభేద ములు మరింత దృఢపడెను. దేశమందు భూవసతులు కలవారు పెక్కురుండిరి. కాని వారికి రాజునకు సేవచేయవలసిన బాధ్యత విస్పష్టముగ లేకుండెను. సముద్రతీరమును కాని, దేశమందలి వేర్వేరు పట్టణములను కాని, రక్షించుటకై కట్టుదిట్టముగల సేనలు లేకుండెను. ఆంగ్ల సంఘమునందును, రాజ్యపరిపాలనము నందును, సైన్య వ్యవస్థయందును, దౌర్బల్యము బాగుగా నెల కొనియున్న ఈ కాలమున బలవంతులగు నార్మనులు ఇంగ్లాం డుపై దండెత్తి వచ్చిరి.

ఎడ్వర్డుఋషి (Edward the Confessor) మరణించిన తరువాత విజ్ఞానుల సభవారు హారోల్డును రాజుగ ఎన్నుకొనిరి. ప్రజలు ఈ యెన్నికను బలపరచిరి. కాని ఇంగ్లండు దేశములో హారోల్డుకు విరోధులు లేకపోలేదు. ఈ క్రొత్తరాజు ఎంత సమర్థుడైనను, రాజవంశమునకు చెందినవాడు కాడు. కేవలము ఒక పెద్ద జమీందారీ కుటుంబములోనివాడు. కావున ఉన్నత తరగతులకు చెందిన ప్రముఖులలో పలువురు ఆంగ్ల సింహాసనము తమకేల దక్కరాదని సవాలు చేయజొచ్చిరి. మెర్షియా రాష్ట్ర మునకు పాలకులగు ఎడ్విన్ (Edwin), మోర్కార్ (Morcar) అను వారలు హారోల్డుకు లభించిన యీ గౌరవము చూచి, మిక్కిలి అసూయ పడసాగిరి. హారోల్డు రాజపదవిని గైకొనక పూర్వమే తన తమ్ముడైన టోస్టిగ్ (Tostig) అను వానిని నార్థంబ్రియా రాష్ట్రమునకు పాలకునిగ నియమించెను. కాని

టాస్టిగ్ తన యసమర్థత వలనను, దుష్పరిపాలన వలనను, నార్థంబ్రియా ప్రజల సానుభూతిని సంపూర్ణముగ కోల్పో యెను. అందువలన హారోల్డు తనతమ్ముని ఆ యున్నత పదవి నుండి తొలగింపవలసి వచ్చెను. అందులకు కోపగించి టాస్టిగ్ దేశమునుండి వెడలిపోయి, నార్వేదేశము చేరి, అచ్చటి రాజగు హారోల్డు హర్డ్రాడా (Harold Hardrada) అను నాతనిని తన అన్నయగు హారోల్డుపై యుద్ధము ప్రకటింపవలసినదని ప్రోత్స హించెను. కాన్యూటు రాజునకు వారసుడైన కారణమున తనకు ఇంగ్లండు రాజ్యముపై హక్కు గలదని భావించి నార్వే రాజు గొప్ప సేనా సన్నాహముతో, ఇంగ్లండుదేశపు టుత్తర భాగముపై దండెత్తి వచ్చెను. హారోల్డు సోదరుడు టాస్టిగ్ కూడ అతని ననుసరించెను. ఇది యిట్లుండగా, నార్మండీ ప్రభు వగు విలియం కూడ ఇంగ్లండు దేశముపై దండెత్తుటకు సన్నా హములు చేయుచుండెను. తాను ఆంగ్లరాజ్య సింహాసనమునకు హక్కుదారుడననియు, ఎడ్వర్డు ఋషి తన్ను ఆ రాజ్యమునకు వారసునిగ ఎన్నుకొనెననియు, హారోల్డుకూడ తన్ను (విలి యము) ఆంగ్లదేశపు రాజుగ అంగీకరించుచు వాగ్దానము చేసె ననియు, విలియం ప్రకటించెను. విలియం స్వయముగ గొప్ప వీరుడు. రణకుశలుడు. అనేక యుద్ధములలో విజయమును సాధించిన మేటి శూరుడు. ధనమును, భూములను, ఆశచూపి, ఈతడు ఫ్రాన్సుదేశమందలి పలువురు జమీందార్ల యొక్కయు వీరపురుషుల యొక్కయు సహాయము పొందెను. నార్మండీ

ప్రభువు ఇంగ్లండుపై దండెత్తివచ్చిన యెడల అతని నెదిర్చి యుద్ధము చేయుటకై హారోల్డురాజు సర్వ సన్నాహములను కావించుకొని, ఇంగ్లండు దేశపు దక్షిణ తీరమును రక్షించు చుండెను.

ఇంతలో నార్వేరాజు ఇంగ్లండు ఉత్తర భాగమున ప్రవేశించినట్లు వార్త వచ్చెను. హారోల్డు తన సైన్యముతో అతి శీఘ్రముగ యార్కు పట్టణమును చేరి, అచ్చటికి సమీపమున నున్న స్టాంఫర్డ్ బ్రిడ్జి (Stamford Bridge) అను ప్రదేశమున నార్వే సేనలను తాకెను. యుద్ధము ప్రారంభముకాక పూర్వము నార్వేరాజు హారోల్డుకు ఒక సందేశమంపి, తనకు ఇంగ్లాండు రాజ్యములో ఎంత భాగమును అతడు (హారోల్డు) ఇచ్చుటకు సంసిద్ధుడో తెలుపవలసినదిగ కోరెనట. "నిన్ను పాతిపెట్టుటకు ఏడు అడుగుల భూమిని మాత్రము ఈయ గలను" అని ఇంగ్లాండు రాజగు హారోల్డు ప్రత్యుత్తర మొసగి నట్లు ప్రసిద్ధమగు కథ గలదు. అంతట ఘోరమైన యుద్ధము ప్రవర్తిల్లెను. (సెప్టెంబరు 1066.) నార్వే రాజును, హారోల్డు సోదరుడు టాస్టిగ్‌ను యుద్ధభూమికి బలియైరి. నార్వే సేనలు చాల నష్టమునకు లోనై పారిపోయెను. ఈ పరాజయము తరువాత డేనులు మున్నగు ఔత్తరాహులు, మరల బ్రిటను ద్వీపముపై దండెత్తి రాలేదు. కాని స్టాంఫర్డ్ బ్రిడ్జి విజయముతో హారోల్డు రాజు కష్టములు గట్టెక్కలేదు. అతడు యార్కు నగరమున నుండగనే ఇంగ్లండు దక్షిణతీరమున

నార్మను సేనలు దిగినట్లు వార్త వచ్చెను. విలియముతో పోరాడుటకై హారోల్డు తన సేనలను అతిశీఘ్రముగ నడిపించు కొనుచు, దక్షిణమునకు వచ్చి చేరెను. హేస్టింగ్సు అను ప్రదేశమున సాక్సను సేనలకును, నార్మండీ సేనలకును భయంకరమగు యుద్ధము జరిగెను. (14-10-1066) హారోల్డును, ఆతని సాక్సను వీరులును, అద్భుత ధైర్యసాహసములతో పోరాడిరి. కాని విధి వారియెడల ననుకూలత చూపలేదు. సాయంకాలమగు సరికి సాక్సను లోడిపోయిరి. హారోల్డు రణభూమికి బలియయ్యెను. నార్మండీ ప్రభువగు విలియం విజయలక్ష్మిని చేపట్టెను. ఇంగ్లండు రాజ్యమాతనికి పాదాక్రాంత మయ్యెను.

హేస్టింగ్సు యుద్ధము ఆంగ్లదేశ చరిత్రలో చాల ముఖ్యమైనది. దీని ఫలితముగ ఇంగ్లాండు మరల పరాధీన మయ్యెను. విదేశీయులగు నార్మనులు ఆంగ్లదేశమునకు రాజులైరి. స్థానికులగు సాక్సను ప్రజలు విదేశీయుల పరిపాలనకు లోనై అవమానమునకును, కష్టములకును గురియైరి. హేస్టింగ్సు యుద్ధపు ప్రశంస కావించినప్పుడు క్రీ. శ. 1192 వ సంవత్సరమున భారతదేశమందు జరిగిన రెండవ స్థానేశ్వరపు యుద్ధము తప్పక జ్ఞప్తికివచ్చును. ఈ రెంటికిని ఎంతయో సామ్యము గలదు. స్థానేశ్వర యుద్ధమున రాజపుత్రులకు పరాజయమును, మహమ్మదీయులకు విజయము లభించెను. హిందూ ప్రజల స్వాతంత్ర్యము నశించెను. విదేశీయులగు ముసల్మానులు భారతదేశమున కేలికలైరి. ఇంగ్లండులోని సాక్సను ప్రజలవలెనే,

భారతీయ ప్రజలగు హిందువులు ముసల్మానుల పరిపాలనలో అవమానమునకును పెక్కు కష్టములకును లోనైరి. నార్మను లును, సాక్సనులును కూడ, క్రైస్తవ మతావలంబకులు. జాతిచే కూడ వారికి సన్నిహితత్వము కలదు. కావున అనతికాలములో వారు ఏకజాతిగ మారిపోయిరి. భారతదేశమందు అట్టి సమ్మేళనము జరుగుటకు అవకాశములు లేవయ్యెను. అది యట్లుండ నిత్తము. హేస్టింగ్సు యుద్ధమున సాక్సనులును, స్థానేశ్వర యుద్ధమున హైందవులును, పరాభూతులగుటకు ఇంచుమించు ఒకే విధమగు కారణములు కానవచ్చుచున్నవి. హారోల్డు రాజును, ఆతని సాక్సను అనుచరులును గొప్ప వీరులు. వారు దేశ స్వాతంత్ర్యముకొరకై అసామాన్యమగు పరాక్రమముతో పోరిరి. కాని సాక్సను పక్షములో గల అంతఃకలహములును, టాస్టిగ్, ఎడ్విన్, మోర్కర్ అను వారల ద్రోహమును, సాక్సనుల పరాజయమునకు కారణమయ్యెను. స్థానేశ్వర వీరుడగు పృథ్వీరాజు చౌహానుడును, ఆతని అనుచరులగు రసపుత్ర సింహులును, వీరులు కారని యెవ్వరనగలరు? కాని రాజపుత్రులలో గల అంతఃకలహములును, జయచంద్రుని వంటి దేశద్రోహి ప్రవర్తనయు, హిందువులకు సంపూర్ణ పరాభవమును, దేశారిష్టమును తెచ్చిపెట్టెను. చరిత్ర పునరావృత్తమగునని విద్వాంసులు పల్కెడి వాక్యములకు పై సంఘటనలు తార్కాణమని చెప్పనగును.

ఈ సందర్భమున మహాకవియైన షేక్స్పియరు పల్కిన వాక్యములు మనసుకు జ్ఞప్తికి రాకమానవు.

"This England never did, nor never shall,
Lie at the proud foot of a conqueror,
But when it first did help to wound itself."

ఇంగ్లండు ప్రజలు తమకు తాము హానికల్గించుకొని దుర్బలులైనప్పుడు తప్ప, వారికి మరెన్నడును ఇతరులచే ఓటమిచెంది, వారికి పాదాక్రాంతులగు నట్టి దుస్థితి సంభవింప దని దీని తాత్పర్యము.

సాక్సను యుగపు చరిత్రను ముగించుటకు పూర్వము ఆ ప్రజలను గూర్చి యొకటి రెండు విషయములు తెలుపవలసి యున్నవి. సాక్సనులు బ్రిటను దేశమునకు వలసవచ్చినప్పుడు వారు నాస్తికులు. వోడెన్, థార్ అను దైవతములను కొల్చు అనాగరికులు. కాలక్రమమున వారు క్రైస్తవ మతమును అంగీకరించి, ఆ ధర్మమందలి ఆచారములను, నీతి నియమములను అవలంబించిరి. ఇంగ్లాండు దేశమున క్రైస్తవమత వ్యాప్తికై ప్రత్యేక కృషిచేసిన యాతడు గ్రెగరీ (Gregory) అను పేరుగల పోపు. ఈ మతాధికారి క్రైస్తవ మతమును ప్రపంచమందంతటను వ్యాప్తిచెందింపలెనను పట్టుదలగలవాడు. ఆత డొకనాడు రోము నగరమున విపణి వీధిని పోవుచు, బానిసలుగ అమ్మబడుచున్న కొందరు ఆంగిలు (Angle) బాలురను చూచెను. ఇంగ్లండు దేశమునకు వలసవచ్చిన జాతులలో ఆంగి

లులు, సాక్సనులు, జ్యూట్లు అను వారు ఉండిరి. గ్రెగరీ పోపు చక్కని యీ ఆంగ్లబాలురను చూచి ఆశ్చర్యమును, కనికరమును పొంది, "వీరు ఆంగిలులు (Angles) కాదు. ఏంజిల్సు (Angels)" అని పల్కెనట Angels అనగా దేవతలని అర్థము. పాషండమతస్థులైన ఆంగిలులును, సత్యమగు క్రైస్తవమతము వైపునకు మరలింపవలెనని యాతడు తక్షణమే నిశ్చయించుకొనెను. తత్ఫలితముగ గ్రెగరీ పోపు, ఆగస్టైన్ అను మత గురువును క్రీ. శ. 597 వ సంవత్సరమున మత ప్రచారము కొరకై ఇంగ్లాండునకు పంపెను. క్రైస్తవ మతము క్రమముగా దేశమందంతటను వ్యాపించెను. దేశమం దెల్లెడల దేవాలయములును, మఠములును వెలసెను. రాజులును, ప్రజలును, వీనిని పోషించెడి వారు. పాపకార్యాచరణమునకు పరిహారముగ ధనధాన్యములు, నగలు, వెండి, బంగారము ఇచ్చి పాప విముక్తిని పొందవచ్చునని ఆ కాలపు క్రైస్తవులు దృఢముగ నమ్మియుండిరి. కావున అకార్యకరణము కావించిన ప్రజలు క్రైస్తవ మఠములకును, సన్యాసులకును దానములు చేయుట ఆ కాలమున వాడుకగ నుండెను. ఈ విధముగ క్రైస్తవమత సంస్థలు చాల ధనవంతములయ్యెను. మఠములలో సన్యాసులును, సన్యాసినులును నివసించుచు, నిరంతర ప్రార్థన లందును, విద్యా వ్యాసంగమునందును కాలము పుచ్చెడివారు. ఆ కాలమున క్రైస్తవమత సంస్థలే ఆంగ్ల సంస్కృతికి నిలయములు. సన్యాసులు పవిత్ర జీవితము గడుపుచు సామాన్య ప్రజల

కాదర్శముగ నుండెడివారు. క్రైస్తవ మఠములు పాంథులకును, దుఃఖితులకును, రోగులకును ఆశ్రయము నొసంగుచుండెడివి. ప్రజలు మత గురువులను చాల గౌరవించుచు, అనేక విషయములలో వారి సలహాలను పొందుచు వచ్చిరి. ఏ ముఖ్య కార్యమైనను చేయుటకు పూర్వము వారు మతాధికారుల ఆశీర్వాదము పొందెడివారు. ఇంగ్లండు దేశముపై దండెత్తిపోవుటకు పూర్వము నార్మండీ ప్రభువగు విలియం పోపు మతాధికారి యాశీర్వాదమును పొందెను. హారోల్డు రాజునకీ యదృష్టము లభింపలేదు.

వాగ్దానములు చేయుట, మత గ్రంథములను తాకి ప్రమాణములు కావించుట మున్నగు ఆచారములు నేటికిని ఆచరణలో నున్నవి. ఆ కాలమున మరణించిన యొక ఋషి అస్థికలను సాక్షిగ నుంచుకొని, ప్రమాణముచేయు ఆచారము వాడుకలో నుండెను. వాగ్దానమును మన్నింపకుండుట పాపము. అందును ఎవరైన ఋషి అస్థికలను సాక్షిగ నిడికొని కావించిన వాగ్దానమును త్రోసిపుచ్చుట, మహాపాపము. అది దైవము నెడల అపరాధము కావించుట యను భావము ఆ యుగమందలి క్రైస్తవ ప్రజలలో వ్యాపించియుండెను. నార్మండీ ప్రభువగు విలియం ప్రజలలో ప్రబలియున్న ఈ విశ్వాసమును తన స్వార్థమునకై యెట్లు వినియోగించుకొనెనో గమనింపదగి యున్నది. 1064 వ సంవత్సరమున హారోల్డు విలియమునకు బందీగ చిక్కెను. ఆ సందర్భమున, విలియము హారోల్డు వలన ఒక వాగ్దానము పొందెను. ఎడ్వర్డు ఋషి

మరణించిన వెనుక విలియం ఆంగ్లరాజ్యమునకు ఏలిక కావలె ననియు, ఆ విషయమున హారోల్డు విలియంకు సహాయముచేయ వలెననియు, ఆ వాగ్దానపు సారాంశము. ఈ సందర్భమున విలియం ఒక కుయుక్తి పన్నెను. హారోల్డు పై వాగ్దానము చేయుటకై ఒక బల్లవద్దకు వచ్చెను. ఆ బల్లక్రింద విలియం ఆజ్ఞచే, ఎడ్మండు అను ఋషి అస్థికలు రహస్యముగ నిక్షిప్తము కావింపబడెనట. కాని యీ విషయము హారోల్డు యెరుంగడు. తెలిసినను తెలియకపోయినను, హారోల్డు ఒక ఋషి అస్థికల సాక్షిగ ఒక ఘోరప్రమాణము కావించినట్లు ఆ కాలపు జను లందరును భావించిరి. 1066 వ సంవత్సరమున హారోల్డు ఇంగ్లాండు దేశమునకు రాజైనప్పుడు, అతడు (హారోల్డు) 1064 వ సంవత్సరము నాటి ప్రమాణము నుల్లంఘించినట్లును, అతడు మహాపాపి యనియు, నార్మండీ ప్రభువు ప్రచారము కావించి, ఈ విధముగ తనకు ఆంగ్లరాజ్యముపై గల హక్కును బలపరచుకొనెను. ప్రపంచమునందలి యితర దేశములలోవలెనే ఐరోపాదేశములలో కూడ ఆ కాలమున కొన్ని విచిత్రమగు విశ్వాసములు ప్రబలియుండెను. అందు కొక నిదర్శనము. 1066 వ సంవత్సరమున నార్మండీ ప్రభువు విలియం తన సేనతో సహా, ఇంగ్లండు దేశముపై దండెత్తుటకై ఫ్రెంచి తీరమున సంసిద్ధుడై యుండెను. ఇంగ్లీషు ఛానలును దాటుటకై ఎన్నియో పడవలు రావింపబడినవి. ఈ పడవలు ముందునకు సాగిపోవుటకై అనుకూలమగు వాయువులు- అనగా దక్షి

దక్షిణమునుండి ఉత్తరమునకు వీచునట్టివి- కావలెను. కాని ఆరు వారములు వేచియున్నను, ఇట్టి అనుకూల వాయువులు వీచ వయ్యెను. విలియం సేనలలో అశాంతి బయలుదేరెను. తుదకు విలియం ప్రభువు దైవ సహాయ మపేక్షించెను. సమీపమందలి యొక దేవాలయములో నిక్షిప్తము కావింపబడిన ఎడ్మండు ఋషి అస్తికలను ఈ ప్రభువు తెప్పించెను. వానిని మత సంబంధములగు కార్యకలాపములతోడను, సైన్య లాంఛనముల తోడను మిక్కిలి ఆడంబరముతో, సముద్రతీరమున ఊరేగించిరి. ఆ మరునాడే వాతావరణములో మార్పు కానవచ్చెను. గాలి ఉత్తర ముఖముగ మారలేదు కాని ఈశాన్య దిశకు వీవసాగెను. దైవము అనుకూలించినట్లుగ నిశ్చయించి, విలియం ప్రభువు తన సేనలను పడవలలో ఎక్కించి, ఇంగ్లండు తీరమునకు ప్రయాణము సాగించెను. నావలు పెవిన్సీ (Pevensey) అను ప్రదేశమున ఒడ్డుచేరెను. విలియం ఆంగ్లతీరమున కాలుపెట్టుసరికి, కాలుజారి అతడు బోరగిలపడెను. ఇది యేమంత మంచి శకునము కాదు. కాని అట్టి భావము తన అనుచరులలో కలుగకుండుటకై విలియం వారివైపు తిరిగి, "చూచినారా! నేను ఇంగ్లండును రెండు చేతులతో గట్టిగ పట్టుకొనినాను" అని చమత్కారముగ పల్కెను. నార్మను సైనికు లేమి తలంచిరో మనకు తెలియదు.

మనము సమీక్ష కావించిన యీ కథా కాలములో బ్రిటనులు, రోమనులు, సాక్సనులు, డేనులు, నార్మనులు అను

జాతుల పేర్లు వినియున్నాము. వీరు అందరును కూడ యుద్ధ ప్రియులే. కాని వీరి యుద్ధ విధానమునందు కొన్ని భేదము లుండెను. బ్రిటనులు రథములపైనను, పదాతులుగను కూడ యుద్ధముచేయుచుండిరి. వారి ఆయుధములు ఖడ్గము, బల్లెము, గండ్రగొడ్డలి మున్నగునవి. రోమనుల బలము ముఖ్యముగ పదాతి సైన్యమందే నెలకొనియుండెను. కాని వారు అశ్విక సేనను కూడ వాడెడివారు. రోమను సేనయందు అద్భుతమగు క్రమశిక్షణ యుండెడిది. వారి పదాతి దళములు ఎట్టి ఘోర యుద్ధమునందైనను, చెక్కుచెదరక ఉక్కు గోడలవలె నిలువబడెడివట. ఇందువలననే వారి సేన లజేయములని పూర్వకాల మున విఖ్యాతి కల్గెను. సాక్సనులును, డేనులును కూడ ఇంచు మించు ఒకే విధమగు యుద్ధ పద్ధతుల నవలంబించెడివారు. వారి యందు క్రమశిక్షణ ప్రత్యేకమగు నున్నతిని పొందినట్లు తెల్పుటకు వీలులేదు. భుజబలముపైననే వారు ఎక్కువగ ఆధారపడెడివారు. విజయమును సాధించుటకై డేనులు వంచన, మాయోపాయములను, తరచు వాడుచుండిరి. సుప్రసిద్ధమగు హేస్టింగ్సు యుద్ధము (1066) ను గూర్చిన కొన్ని యంశములు యిచ్చట మనము తెలిసికొనవలెను. సాక్సనులు తమ ప్రాచీన పద్ధతుల ననుసరించి పాదచారులై యుద్ధము కావించిరి. వారి ఆయుధములు ఖడ్గము, ఈటె, బల్లెము, గండ్ర గొడ్డలి మున్నగునవి. సాక్సనులకు నాయకుడైన హారోల్డునకు ఈ గొడ్డలి సైనికులపై చాల విశ్వాస ముండెనట. సాక్సనులు శత్రువులపై ఈటెలను విసరెడివారు. నార్మను వీరులు కవచ

ములు ధరించి హాయూఘులై రణరంగమున కేతెంచెడివారు. వారి కడ ధానుష్క సైన్యము కూడ యుండెడిది. అయినను నార్మనుల ఆశ్వికదళము కాని, వారి అమ్ముల వాన కాని సాక్సను సేనలను జయింపజాలక పోయెను. సాక్సనులు మొక్కవోని ధైర్యముతో, ఇంచుమించు దినమంతయు పోరాడిరి. అంతట నార్మండీ ప్రభు వా కాలమున సర్వసాధారణముగ వాడుకలో నున్న యొక కూటోపాయమును ప్రయోగించెను. సాక్సను సేనలు ఒక ఎత్తైన ప్రదేశముపై నిలువబడి యుద్ధము సాగించుచుండెను. నార్మనులు దిగువ భాగమున నుండిరి. ఓటమి నంగీకరించి పారిపోవుచున్నట్లు నటింపవలసినదని విలియం తన సేనల కాజ్ఞ యిచ్చెను. వారట్లే కావించిరి. కాని వారి క్రమశిక్షణ చెడకుండ విలియం కట్టుదిట్టము కావించెను. శత్రువులు పలాయనము కావించుచున్నట్లు భావించి, సాక్సనులు కొండనుండి దిగివచ్చి, నార్మనులను తరుమసాగిరి. వారి యుద్ధవ్యూహము చెడిపోయెను. సైనికులు చెల్లాచెదరగ అయిపోయిరి. ఈ అవకాశము చూచుకొని విలియం తన ఆశ్వికులను, ధానుష్కులను తిరుగరావించి, శత్రువులపై మరల తిరుగబడెను. వ్యవస్థలేని సాక్సను సేన యిప్పుడు సులభముగ నోడిపోయెను. హెరోల్డునకు కంటివద్ద ఒక బాణము గుచ్చుకొనగా అతడు ప్రాణముల విడచి నేలపై బడెను. హేస్టింగ్సు యుద్ధ మీ విధముగ నార్మనుల విజయముతో సమాప్తమయ్యెను.

---

నాలుగవ ప్రకరణము

# నార్మనుల యుగము - ప్రారంభదశ

## బ్రిటనులో జమీందారీ యుగము (Feudal Age)

## దాని ముఖ్యలక్షణములు

క్రీ. శ. 1066 వ సంవత్సరము నుండి 1485 వరకును గల నాలుగుశతాబ్దుల కాలమును మనమిప్పుడు సమీక్షించ బోవు చున్నాము. మన సౌకర్యము కొరకై ఈ యుగమును జమీందారీ యుగమని వర్ణింపనగును. జమీందారీ విధానమును గూర్చిన అనేక వివరములు మనము ముందు పుటలలో తెలిసి కొనగలము. వర్ణింప బడుచున్న యీ కాలమున ఇంగ్లాండు దేశపు రాజులు అనేక పర్యాయములు జమీందారులతో పోటీ పడవలసి వచ్చెను. రాజు బలవంతుడైన పక్షమున జమీందారులు ఆతనికి లొంగెడివారు. లేనిచో వారు స్వతంత్రులై స్వేచ్ఛముగ వ్యవహరించెడివారు. రాజు బలవంతుడైనప్పుడు ఆతనిని లొంగ దీయుటకై జమీందారులు మఱియొక మార్గమును కూడ అవలంబించుచుండిరి. ప్రాచీన కాలమునుండియు బ్రిటీషు ప్రజానీకమునకు రాజ్యాంగసంబంధమగు కొన్ని హక్కులుండెడివి. జమీందారులు పై హక్కులను రాజులచే అంగీకరింప జేయుటకై కూడ రాజులతో వివాద పడెడివారు. రాజ కుటుంబముతో సంబంధముగల జమీందారులు రాజ్యాధికారము కొరకై తమలో తాము కలహించుచు, దేశమంతను అల్లకల్లో

లము కొనించుచుండిరి. పైన సూచింపబడిన నాల్గు శతాబ్దులలో ఇంగ్లాండు దేశ చరిత్ర యందు జమీందారు లనేకవిధముల ప్రాముఖ్యము వహించిన కారణమున ఈ యుగమును జమీందారీ యుగమని మేము వర్ణించినారము. ఈ కాలపు లక్షణములలో ముఖ్యమగు వానిని రెండింటినిగూర్చి కూడ ఇచ్చట వివరింపవలసి యున్నది. మధ్యమ యుగము (Middle Ages) నందు ఐరోపా ఖండమునందలి యితర దేశములలో వలెనే బ్రిటను దేశమున కూడ క్రైస్తవ మతసంఘము చాల పలుకుబడియు, బలమును కల్గియుండెను. ఇందుకు ప్రజల మతాభిమానమే ముఖ్య కారణము. మతాధికారులు మొట్టమొదట ధార్మిక ఆధ్యాత్మిక విషయములలో మాత్రమే అభిరుచి చూపుచు, ప్రజల కారంగమున నాయకులుగ నుండుచు వచ్చిరి. కాని కాలము గడచిన కొలదియు మతాధికారులకు అపారముగు [illegible], [illegible] లభించెను. దానితోపాటు వారి [illegible] కూడ హెచ్చెను. అంతట మతాధికారులు ధార్మిక విషయముల యెడ ఉదాసీనత చూపుచు, రాజకీయాధికారములకై ప్రాకులాడ జొచ్చిరి. వివిధ దేశములందలి క్రైస్తవ మతాధికారులు తాము రోము నగరమునందలి పోపు మతగురువు అధికారమునే కాని, మానవ మాత్రులైన రాజుల యధికారమును మన్నింపమని యెదురు తిరుగసాగిరి. రాజునకు తాము తల యొగ్గమని పలువురు మతాధికారులు ధిక్కరించిరి. ఇది మిక్కిలి ప్రమాదకరమైన పరిస్థితి. ఒక దేశపు

ప్రజలలో కొందరు రాజు అధికారమును పూర్తిగ మన్నించు వారును, మరికొందరు ఆ యధికారమును పూర్తిగ మన్నింపక, పర దేశమందలి మరియొక రేలిక యాజ్ఞలకు బద్ధులగు వారును, అయియున్న పక్షమున నా దేశమునకు బలమును, ఐక్యతయు సిద్ధించుట కష్టసాధ్యము. జమీందారీ యుగమందు బ్రిటను దేశపు రాజులకును, అచ్చటి క్రైస్తవ మతగురువులకును తమతమ యధికారముల పరిమితిని గూర్చి వివాదములు సంభవించుచుండెను. జమీందారులును, క్రైస్తవ మత సంఘము వారును, తమకు గల యధికారములను దుర్వినియోగ మొనర్చుటచే ప్రజలలో అశాంతి, తిరుగుబాటులు సంభవించుట ఈ యుగమునందలి యొక ఆనుషంగిక లక్షణము. జమీందారీ యుగములోని రెండవ లక్షణము ఇంగ్లాండు దేశపు రాజులు ఫ్రాన్సుదేశపు ప్రభువులతో కావించిన యుద్ధములు. నార్మండీ ప్రభువగు విలియం అను నాతడు క్రీ. శ. 1066 వ సంవత్సరమున హేస్టింగ్సు యుద్ధములో విజయమును సాధించి, తత్ఫలితముగ బ్రిటను దేశమున కేలిక యయ్యెను. ఈతనికిని ఈతని వంశమునందలి యితర రాజులకును కూడ ఫ్రాన్సుదేశము నందలి విశాల భూభాగములు వశపడి యుండెను. ఈ విధముగ విదేశీయ ప్రభువులైన ఆంగ్లరాజులు తమ దేశమునందలి కొన్ని రాష్ట్రములకు పాలకులుగ నుండుట ఫ్రాన్సుదేశపు నరపాలురకు చాల కంటకముగ నుండెను. కావున ఫ్రాన్సుదేశమునుండి ఆంగ్లేయులను తరిమి వేయుటకై ఫ్రెంచిరాజులు ప్రయత్నిం

చెడివారు. ఈ ప్రయత్నములు బ్రిటను ఫ్రాన్సు దేశములనడుమ అనేక ఘోర సంగ్రామములు సంభవించుటకు హేతువయ్యెను. 1485 వ సంవత్సరమున ట్యూడరు వంశపురాజులు ఆంగ్ల సింహాసనము నధిష్ఠించుటతో జమీందారీయుగ మంతరించి, మఱియొక నూతనశకము ప్రారంభమైనట్లు తెలుపనగును.

## విజయ భూషణుడు

## (William the Conqueror)

హేస్టింగ్సు విజయమునకు ఫలితముగ బ్రిటనుదేశమునకు ప్రభువైన నార్మను ప్రభువు విలియమునకు చరిత్రయందు "విజయ భూషణుడు" అను బిరుదు గలదు. ఈతనితో బ్రిటను దేశమున విదేశీయులగు నార్మనుల ప్రభుత్వము ప్రారంభ మగుచున్నది.

హేస్టింగ్సు విజయముతో ఇంగ్లండుదేశ మంతయు విలియం రాజుకు వశపడినట్లు తలంపరాదు. అది యాతడు సాధించిన ప్రథమ విజయము మాత్రమే. ఆతడు మిక్కిలి మెలకువతో తన సేనలను ముఖ్యపట్టణమగు లండను నగరము దిక్కుగ నడపెను. తన్నెదిర్చినవారి నీ రాజు క్రూరముగ అణచివైచెను. ఇది జూచి ప్రజలందరును భయపడి, విజయ భూషణుని అధికారము నంగీకరించిరి. విజ్ఞానుల సభవారు విలియమును తమ ప్రభువుగ ఎన్నుకొనిరి. ఈ విధముగ విజయ భూషణున కాంగ్లరాజ్యముపై బలవత్తరమగు హక్కు ఏర్ప

డెను. పూర్వయుగమందలి ఆల్ఫ్రెడు రాజును, కాన్యూటు రాజును ఆంగ్లభూమి కీ విధముగనే యేలికలైరి. 1066 వ సంవత్సరమున క్రిస్టమస్ దివసమునాడు నార్మండీ ప్రభువగు విలియం ఆంగ్లరాజ్య సింహాసన మధిష్ఠించెను. యార్కు మతగురువు (Arch bishop of York) ఆతనిని రాజ్యాభిషిక్తుని కావించెను. ఇంగ్లండు దేశపు టుత్తర ప్రాంతమునగల జమీందారులు విలియం రాజునకు వశపడలేదు. అంతట నా ప్రభువు యార్కు-మండలములోనికి తన సేనలను నడపి, ఆ జిల్లానంతను ధ్వంసము చేసి, ప్రజలను అడవి మృగములను వేటాడినట్లు సంహరించెను. విలియంరాజు కాఠిన్యమునకు వెరచి ఇంగ్లండు ప్రజలందరును, ఆతనికి క్రమముగ వశపడిరి. తనపై ఎదురు తిరిగిన సాక్సను జమీందారులను కూడ విలియంరాజు అవలీలగ నోడించివైచెను. ఈ తిరుగుబాటుల నణచి వేయుటలో ఈతనికి సాక్సనులతో కూడిన జాతీయ సైన్యము (fyrd) సహాయము కావించెను. క్రమముగ ఇంగ్లాండు దేశమునం దంతటను ఈ ప్రభువు తన యధికారమును నెలకొల్ప గల్గెను. తన్ను ధిక్కరించిన సాక్సను జమీందారులను పదభ్రష్టుల కావించి, విలియంరాజు వారి జాగీరులను విదేశీయులగు నార్మనువీరుల కిచ్చివైచెను. ఈ విధముగ సాక్సను జమీందారుల స్థానమున నార్మనులు నెలకొనిరి. నార్మనులు స్థానికులగు సాక్సనులను, చాల నిరసనభావముతో చూచెడివారు. ఇయ్యది స్థానిక ప్రజలకు చాల బాధాకరమయ్యెను. కాని యీ పరిస్థితులు త్వరలో మారిపోయెను.

సాక్సనులు పలువురు నార్మనుల భాషను నేర్చి, వారివలెనే వర్తింపసాగిరి. నార్మనులు కూడ అనతి కాలములో సాక్సనుల ఆచారములను, జీవిత విధానమును అవలంబించి, వారిలో కలిసి పోయిరి. సాక్సను నార్మను ప్రజల సమ్మేళనమువలన యేర్పడిన నూతనజాతిలో యీ రెండు తెగల మంచి లక్షణములును ద్యోతకము కాసాగెను.

విలియం రాజు మిక్కిలి ప్రజ్ఞాశాలియైన ప్రభువు. స్థానికు లగు సాక్సను జమీందారుల జాగీరులను ఆతడు బలవంతముగ తీసికొని, వానిని తన నార్మను అనుచరులకు పంచిపెట్టినట్లు మన మీవరకే తెలిసికొని యున్నాము. ఈ విధముగ ఆతడు సాక్సను ప్రభువర్గము (Aristocracy) ను అణచివైచెను. తన వలన జాగీరులను పొందిన నార్మను యోధులు తనకు వశవర్తులై యుండ వలయునని ఈరాజు ఆశయము. కాని నిజమునకు నూతన జమీందారులు కూడ తమ ప్రభువు నెడల తగినంత భక్తి విశ్వాసములు చూపెడి వారు కారు. జమీందారుల బలము క్షీణించుటకై విజయభూషణుడు కావించిన ప్రత్యేకపు ఏర్పాట్లను గూర్చి స్థలాంతరమున మనము గ్రహింపగలము. తన పదవిని దృఢపరచుకొను నుద్దేశ్యముతో, ఈ రాజు స్థానికులగు సాక్సనుల భక్తివిశ్వాసముల చూరగొనుటకై కృషిచేసెను. కేంద్రప్రభుత్వములు స్థిరముగ ఏర్పడియుండని ఆ కాలమున, స్థానికు లగు జమీందారులు సామాన్యప్రజలను తరచు పీడించుచుండెడి వారు. అందువలన పేదప్రజకు జమీందారు లనిన భయమును, అనిష్టతయు నుండెడివి. ఈ విషయమును గ్రహించిన విలియం

రాజు ఇంగ్లాండులోని సామాన్య ప్రజను సంరక్షించుట తన ప్రత్యేక బాధ్యతగ భావించి, వర్తించెను. ఈ ప్రభువు దేశమున శాంతిని, న్యాయమును నెలకొల్పెను న్యాయవిరుద్ధముగ ప్రవర్తించిన ఉన్నతోద్యోగులును, జమీందారులును, తుదకు రాజబంధువులును కూడ కఠినముగ శిక్షింపబడుచుండిరి. దేశమందెల్లెడలను శాంతిభద్రతలు నెలకొనిన కారణమున ప్రజలు నిర్భయముగ జీవించుచు, తమ కిచ్చవచ్చిన చోట్లను రాకపోకలు జరుపుచుండిరి. వారి ధనధాన్యముల కెట్టి నష్టమును సంభవించెడిది కాదు. విలియం రాజు ధనలోభము కలవాడు. కావున ఆతడు ప్రజలను పీడించి, హెచ్చు పన్నులను గైకొనెడివాడు. కాని ఆ ప్రజలను మరెవ్వరును పీడించుట ఆతడు సహించెడి వాడు కాడు. ఎవడైన పురుషుడు స్త్రీపై అత్యాచారము కావించిన పక్షమున, తక్షణమే వానిని నపుంసకుని కావింపవలసినదని ఈ రాజు కఠినమగు ఆజ్ఞను కావించెను. విలియం రాజు అనేక సందర్భములలో క్రూరముగ వర్తించినను, ఆతడు సమర్థతతో రాజ్యపాలనము కావించిన కారణమున, ప్రజలు ఆతని యెడల అనురక్తులైరి. సాక్సను ప్రజల యభిమానమును సంపాదించుటకై విజయభూపుడు డొక చక్కని యుపాయము నాలోచించెను. రాజ్య కార్యనిర్వహణమునకై ఈ రాజు తన సార్మను ఉద్యోగులతో కూడిన యొక సమితి నేర్పాటు కావించెను. కాని ఈ సమితి స్థానిక ప్రభుత్వముపై పర్యవేక్షణమాత్రము కావించెడిది. న్యాయ ప్రదానము విష

యములో పై సమితి ఉన్నతతమ న్యాయస్థానముగ వ్యవహా రించుచుండెను. విలియంరాజు చిరకాలమునుండియు ఇంగ్లాండు దేశమున నెలకొనియున్న స్థానిక స్వపరిపాలనమును, అందులకు సంబంధించిన సంస్థలను, అధికారులను యథాతథముగ నుంచివైచెను. పూర్వకాలమందలి జిల్లా అధికారులు తమతమ మండలములలో యథాప్రకారముగ అధికారము నెరపుచు, తమ జిల్లా న్యాయస్థానములలో నేరముల విచారించి, నేరస్థులను దండించెడివారు. ఈ విధానము కొత్తరాజుకి ఉపయోగకరమైనదని గ్రహించి విలియం రాజు సాక్సను సంస్థలను బలపరచెను. వాని ద్వారా ఈతడు ప్రజాసామాన్యముతో సంబంధములు నెలకొల్పెను. తనకు కావలసిన విశేషముల నన్నిటిని ఈ రాజు పై జిల్లా అధికారుల మూలముగనే తెలిసికొనెడివాడు. విజయభూషణుని యాజ్ఞచే తయారుచేయబడిన "చిత్రగుప్తుని చిఠా పుస్తకము" (Demesday Book) కూడ ఈ స్థానికాధికారుల సహాయముతోడనే ఆవిర్భవించెను. పన్నులను వసూలుచేయుటలో కూడ ఈ ప్రభువు సాక్సనుల ఆచారములను, పద్ధతులను నిలిపియుంచెను. జమీందారుల తిరుగుబాట్లు నణచివేయుటకై విలియం రాజు జాతీయ సైన్యమునే ఉపయోగించినట్లు మనము తెలిసికొని యున్నాము. విదేశీయుడైన విలియం రాజు తమ ప్రాచీన పద్ధతులను రద్దుచేయక పోవుటయే కాక, వానిని ప్రత్యేకముగ ప్రోత్సహించుట సాక్సను ప్రజకు సంతోష హేతువయ్యెను. వారికి రాజునెడల భక్తిశ్రద్ధలు కుదురసాగెను.

సాక్సను ప్రజలను తనవంకకు త్రిప్పుకొనుటకై విలియం రాజు కావించిన ప్రయత్నములు భావి తరములందు మహత్తర మగు పరిణామములకు మూలమైనట్లు చారిత్రికులు భావించు చున్నారు. కాని తన యేర్పాట్లవలన నిట్టి ఫలితములు కలుగ వలెనని విలియంరాజు కోరెనని కాని, వాని నాత డూహించె నని కాని తెల్పుటకు వీలులేదు. బలవత్తరమగు ప్రభుత్వమును నెలకొల్పుటయే విజయభూపణుని యాశయము. తన రాజ్యమునందలి పెద్ద పెద్ద భూస్వాములు తనకు పూర్తిగా లొంగి యుండరనియు, వారు తరచుగ తిరుగుబాట్లు కావించు చుందురనియు, ఈ రాజు గ్రహించెను. ఈ ప్రభువర్గము నదుపులో నుంచుటకై తనకొక బలవత్తరమగు పక్షము కావలయు నని కూడ విలియంరాజు తెలిసికొనెను. ఇంగ్లాండునందలి సామాన్య ప్రజలను తనవంకకు త్రిప్పికొనగల్గినచో, తనబలము మిక్కిలి వృద్ధిచెందునని సూక్ష్మగ్రాహియగు ఈ భూపాలుడు కనిపెట్టెను. ఈ లక్ష్యమును సాధించుటకై విలియంరాజు చేసిన కృషిని పైన మనము చూచియున్నాము. విజయ భూపణుడు అవలంబించిన పద్ధతులవలన ఇంగ్లాండు దేశమునందు జమీందారుల ఔద్ధత్యము తగ్గెను. రాజు యాజమాన్యమున కేంద్ర ప్రభుత్వము బలపడెను. ఇయ్యది రాజునకును సామాన్య ప్రజకును క్షేమంకరముగ పరిణమించెను. కాని విలియంరాజు చేసిన యేర్పాట్లవలన ఆత డించుకయును ఊహింపని యొక ఉత్తమ పరిణామము కూడ కల్గెను. విజయభూపణుడు పెద్ద తరహా

జమీందారులను. భూస్వాములను తనకు ప్రతిస్పర్థులుగ భావించి వారి బలమును నశింపజేయుటకై యత్నించెనే కాని, వివిధ మండలములలో నివసించెడి చిన్న [illegible] భూఖామందులను, భద్ర పూరుషులను (Gentlemen) [illegible]టకై ఎట్టి యత్నమును చేయలేదు. వీరు బిరుదులు, హోదాలు, సేనలు, గడీలు మున్నగు అధికార లాంఛనములు లేని సామాన్యులు. వీరికి శాంతియుతమగు జీవితమే చాల యిష్టము. కావున జమీందారీ యుగములో వీరు రాజునకు అండగానిల్చి, కేంద్ర ప్రభుత్వమును బలపరచి, తుదకు [illegible] వినాశమునందు ముఖ్యపాత్రను వహించిరి. ఈ చిన్న భూస్వాములు [illegible] అధికారులుగను, జిల్లా ప్రతినిధులుగను, [illegible] (Justices of the Peace) గను వ్యవహరించెడివారు. ట్యూడరు రాజుల యుగమునందీ వర్గమువారు కేంద్ర ప్రభుత్వమును రాజును బలపరచిరి. కాని స్టూవర్టు రాజుల యుగమును ప్రారంభించుసరికి ఈ చిన్న భూ భామందుల వర్గము బాగుగా పుంజుకొనెను. వీరికి చిరకాలము నుండియు రాజ్యాంగ వ్యవహారములతో సంబంధ ముండెను. స్థానికులగు ఈ పెద్ద మనుష్యులకు గ్రామసీమలందు విస్తారమగు పలుకుబడియు గౌరవము నుండెడివి. స్టూవర్టు యుగమునాటికి జమీందారుల బాధ వదలి కేంద్రప్రభుత్వము బలపడెను. కాని ఆ కేంద్రప్రభుత్వము నిరంకుశ స్వరూపమును దాల్చకుండ, ప్రజా సమ్మతముగ నుండవలయునను కోర్కె ప్రజలలో అంకురించెను. ఆ యాశయమును సాధించుటకై

పైన మేము సూచించిన చిన్న తరగతి భూస్వాములు పూను
కొనిరి. వారే పార్లమెంటు సభయందు సభ్యులుగ నుండెడి
వారు. ఈ పార్లమెంటు సభ్యులే పదునేడవ శతాబ్దియందు
అనేక సందర్భములలో రాజులతో ఘర్షణపడి, ప్రజాస్వత్వముల
నాతనిచే మన్నింప జేయుటకై ఘనమైన కృషి సల్పిరి.
తుదకు వారి కృషి ఫలవంత మయ్యెను. ఆ విశేషములు మనము
ముందు ముందు తెలిసికొనగలము. కాని ప్రస్తుతము మన
మొక్క యంశమును గమనింపవలసి యున్నది. రాజు అధి
కారమును బలపరచు ఉద్దేశ్యముతో విజయభూపాలుడు సంర
క్షించి, పోషించిన స్థానిక స్వపరిపాలనా సంస్థలును, వానికి
సంబంధించిన ఉద్యోగులును కాలక్రమమున బలపడి, రాజు నధి
కారములను సంకుచిత పరచుటకు సాధనములగుట అనూహిత
చారిత్రిక పరిణామముల కొక యుత్తమ నిదర్శనము.

విజయభూపాలుని రాజ్యకాలమున క్రైస్తవమత సంఘము
నందు కూడ చక్కని అభివృద్ధి కానవయ్యెను. పూర్వపు
సాక్సను మతాధికారులు తమ హోదాల నుండి తొలగింప
బడిరి. వారి స్థానమున నార్మను మత గురువులు నియమితు
లైరి. ఆ కాలమున పోపు మతాధికారిగ నున్న ఏడవ గ్రెగరి
యను నాతడు మిక్కిలి సమర్థుడు. ఈతని ప్రోత్సాహమువలన
క్రైస్తవ మత సంఘమునందు పెక్కు సంస్కరణలు ప్రవేశ
పెట్టబడెను. నూతనముగ బ్రిటను నందు నియమితులైన మత
గురువులు పై సంస్కరణోద్యమముచే విశేషముగ ప్రభా

వితులైన వారు. కావున వారు బ్రిటీషు మత సంస్థలను సంస్కరించి, అందు నూతనోత్తేజము కల్గించిరి. విజయఘోష ఋని యాజ్ఞచే పెక్కు క్రైస్తవ మఠములు నిర్మింపబడెను. ఈ మఠములు గొప్ప విద్యాకేంద్రములుగ ప్రఖ్యాతిగాంచెను. విలియం రాజు, Lanfranc అను మత గురువును కాంటర్బరీ పీఠమున కధికారిగ నియమించెను. ఈతడు బ్రిటీషు ప్రజల ధార్మిక జీవితమును, వారి విద్యలను, విజ్ఞానమును చక్కగ పెంపొందించెను. మొట్టమొదట నార్మను మతాధికారులు సాక్సను ప్రజలను, వారి మతాచారములను, వారు మన్నించెడి ఋషులను, తగుపధముగ గౌరవించెడివారు కారు. కాని కాలము గడచిన కొలదియు, ఈ స్వల్ప విభేదములు సమసిపోయి, నార్మనులును, సాక్సనులును, ఒకే మత సంస్థయందలి సభ్యులుగను, క్రైస్తవ సోదరులుగను మారిపోయిరి.

మధ్యమయుగము (Middle Ages) నందు క్రైస్తవ మత సంఘమునకు ఐరోపా ప్రపంచమున నుండిన ప్రాముఖ్యమును మనము గుర్తింపవలెను. పోపు మతగురువు మతాధికారి మాత్రమే కాని రాజకీయ పరిపాలకుడు కాదు. ప్రజల లాతని యాజ్ఞలను ధార్మిక నైతిక విషయములలో మాత్రమే మన్నించెడి వారు. కాని ఈ పోపు మత గురువులలో పూర్వ కాలమునాటి రోమక చక్రవర్తుల యంశ సామాన్య ప్రజలకు కానవచ్చెడిది. ఒకానొక కాలమున రోమక చక్రవర్తులు ప్రపంచమునంతను పాలించిరి. ఈ కాలమున పోపు మతాధికా

రులు క్రైస్తవ ప్రపంచమున కత్యుత్తమ నాయకులు. కావున నీ యిరువురును ఒకే కోవకు చెందిన వారని అమాయకులగు ప్రజలు భ్రాంతిచెందుటలో ఆశ్చర్యము లేదు. మధ్యమయుగపు ప్రజలలో జాతీయభావ మింకను అంకురింప లేదు. వారందరును విశాలమగు క్రైస్తవ సంఘమునందలి సభ్యులు. క్రైస్తవ సోదరులు. రాజుల కా కాలమున ప్రత్యేకమగు నెట్టి గౌరవ స్థానమును లేకుండెను. దేశమందలి పెద్ద జమీందారుల నెల్ల అదుపు ఆజ్ఞలలో నుంచి, ప్రజా సామాన్యమునకు శాంతి సౌఖ్యములను చేకూర్చుటకై సర్వశ్రేష్ఠుడైన యొక నాయకుడు కావలెను. ఆ నాయకుడే రాజు. ఐరోపా ప్రజలలో వ్యాపించియున్న యీ భావములను గుర్తించిన పక్షమున, ఆనాటి సంఘటనలకు మూలము మన కవగతమగును.

## జమీందారీ విధానము (ఫ్యూడలు విధానము)
## విలియంరాజు సంస్కరణలు

విజయభూషణుడు ఇంగ్లాండు దేశపు రాజ్యాంగము నందు కొనివచ్చిన మార్పులలో జమీందారీ విధానమును సంస్కరించుట యొకటి. ఇంగ్లండు దేశమున కేలికయగుటకు పూర్వము విలియము ప్రభువు ఫ్రాన్సు దేశమునందలి యొక పెద్ద జమీందారు. ఆ పదవియం దున్నంతవరకును ఆతడు ఫ్రాన్సు దేశపు రాజునకు సామంతుడు. రాజు నాజ్ఞలను సామంతులు మన్నింపవలెను. కాని బలవంతుడైన విలియం ఫ్రాన్సుదేశపు ప్రభు

వును మన్నింపక, తరచు ఆతని యాజ్ఞలను ధిక్కరించెడివాడు. కొన్ని సందర్భములలో నితడు తన యేలికయగు ఫ్రాన్సుదేశపు ప్రభువుపై తిరుగబడి, యుద్ధము కావించి, ఆతనిని రణరంగమున నోడించెడివాడు. ఇంగ్లండు దేశమున కేలికయైన తరువాత అనేకులు జమీందారులు విలియం అధికారమునకు లోనైరి. ఫ్రాన్సుదేశపు రాజును తాను ధిక్కరించి, యెదిరించి, పరాభవించిన విధముగా, తన జమీందారులు తన్ను న్యూనత పరచరాదని విలియము [illegible] కోరెను. జమీందారుల యధికారమును, బలమును తగ్గించి, దేశమందంతట తన యాధిక్యతను నెలకొల్పుటకై ఈ రాజు ప్రత్యేకమగు కృషిని గావించెను. ఆ కృషి యెట్టిదో తెల్పుటకు పూర్వము ఐరోపా ఖండమునందలి జమీందారీ విధానము, పుట్టుపూర్వోత్తరములను, అందలి విశేషములను తెలిసికొనుట సమంజసము.

జమీందారీ విధానము అను పదమును వాడినప్పుడు మనకు భారతదేశమందలి జమీందారులు జ్ఞప్తికి వచ్చుట సహజము. కాని యీ జమీందారులకు, మధ్యమ యుగమందు ఐరోపా ఖండమునందలి జమీందారులకును చాల భేదము కలదు. మన దేశపు జమీందారులు పెద్ద భూస్వాములు. వారు రైతుల నుండి పన్నులు వసూలుచేసి, అందు ఒక భాగమును తమ స్వంత ఉపయోగమునకై నిలువ యుంచుకొందురు. సజ్జనులగు జమీందారులు తమకుగల ఆదాయములో కొంతభాగమును ప్రజాహిత కార్యములందు వినియోగించుటకూడ మన మెరుంగు

దుము. కాని మన దేశపు జమీందారులకు సైన్యములను సిద్ధము చేసికొను నధికారము కాని, ఇతర ప్రభుత్వాధికారములు కాని లేవు. మన జమీందారులు కేంద్రప్రభుత్వమువారి తరఫున ప్రజలనుండి పన్నులను వసూలుచేయు గుత్తేదారులవంటివారు. ఐరోపా ఖండపు జమీందారు లట్టివారు కారు. వారు చిన్న తరహా రాజులు. వారికడ సేనలుండెడివి. వారు తమ చిన్న రాజ్యములో నిరంకుశ ప్రభువులు. తమ యాజమాన్యములో నున్న ప్రజానీకమునం దెవరైన నేరములు కావించినచో, అట్టి నేరస్థులను విచారించి, దండించునట్టి అధికారమును కూడ పై జమీందారులు వహించుచుండిరి. దేశమునంతను పాలించు రాజునకు వీరు సామంత ప్రభువులు. ఆ రాజునకు నిర్ణీతమగు కొంత సేవచేయుటతో ఈ జమీందారుల విధులు పూర్తి యయ్యెడివి. ఐరోపా ఖండపు జమీందారీ విధానమును సర్వ సాధారణముగ Feudalism అను పేరుతో చారిత్రికులు సూచించుచున్నారు.

జమీందారీ విధానము ఇంగ్లాండు దేశమున సాక్సను ప్రజల కాలమునుండియు రూపాంతరమున నెలకొనియుండెను. సాక్సను ప్రజలు అనాదినుండియు స్వాతంత్ర్య ప్రియులనియు, ప్రజాస్వామ్య విధానము వారి సంఘమున మొట్టమొదటి నుండియు ప్రబలియుండెననియు, మన మిదివరకే తెలిసికొని నారము. ఈ స్వాతంత్ర్య లక్షణములతో పాటు కొంత అధికారత త్త్వము కూడ వారియందు నెలకొనియుండెను. క్రీస్తు శకా

రంభము నుండియును కూడ, ఫ్రాన్సు యువకులు ప్రసిద్ధ వీరు
డగు నొక ప్రముఖుని వద్దకు సేవగ భావించి, ఆతనికి పరివార
ముగ నుండుట గౌరవానుగ నుండెను. ఈ యనుచరులు
తమ నాయకుని కడనే నివసించుచు, అతడు యుద్ధమునకు
పోయినప్పుడెల్ల అతని ననుసరించు చుండెడివారు. యుద్ధరంగ
మున నీయువక వీరులు నాయకుని సామాన్యమున శత్రువు
లతో పోరాడుట యేకాక, నాయకుని రక్షించుట తమ విధ్యుక్త
ధర్మములలో నొకటిగ భావించు చుండిరి. నాయకుడు రణ
రంగమునకు బలియైనచో ఆతని యనుచరులుకూడ యుద్ధ
భూమిలో ప్రాణములు విడువవలయునే కాని సజీవులై మరలి
రాకూడదని, వారి విశ్వాసము. ఇంత స్వామిభక్తి గల్గిన యను
చరులను నాయకుడు మిక్కిలి యభిమానముతో మన్నించుచు
వారికి మజ్జన భోజనాది వసతులను తనవద్దనే కల్పించుట సమం
జసమగు విషయము. ప్రాచీన మధ్యమ యుగములందలి వీర
పురుషులు జీవనోపాధికొరకై యెట్టి కాయ కష్టమును చేసెడి
వారు కారు. అట్లు చేయుట యవమానకరమని కూడ వారు
భావించెడివారు. ఈ వీరులు ఖడ్గజీవులు. బలహీనులగు వారిని
పీడించి, వారి ధనధాన్యముల గ్రహించుట వారి యేకైక
వృత్తి. దానిని వారు దూష్యముగ నెంచెడివారు కారు. వీర
వర్యుడగు నాయకుడును, ఆతని యనుచరులును, పేదప్రజలను
దోచుకొనిన వెనుక, నాయకుడు లూటీ మొత్తములో కొంత
భాగమును తన సహచరులకు పంచి యిచ్చుచుండెను. ఇదే విధ

ముగ నాయకుడు ఏదైన నొక రాజ్యమును జయించి, దాని కేలిక యైనప్పు డాతడు తన వీరవర్గమునకు పెద్దపెద్ద భూఖండ ములను పారితోషికముగ నొసంగు చుండెడివాడు. ఈ విధ ముగ వీర నాయకుడు రాజుగను, ఆతని యనుచరవర్గము జమీం దారులుగను, మారుచుండిరి. జమీందారీ విధానమున కిది ప్రాతి పదిక. కాని యీ సందర్భమున నొక యంశము జ్ఞప్తియం దుంచుకొనవలెను. సాక్సను సంఘమునందు నాయకునకును, అనుచరునకును గల సంబంధ మైచ్ఛికము. అనుచరుడు తన యిష్టప్రకార మొక నాయకుని సేవను మాని, వేరొక నాయ కుని కొలువవచ్చును. అట్టి సందర్భమున నాతడు పారితోషిక ముగ సంపాదించుకొనిన భూమి యాతని స్వంత ఆస్తిగ భావింప బడును. కాన ఆ భూమిని గూర్చి అనుచరుడు తన పూర్వ నాయకుని కెట్టి సేవలును చేయనక్కరలేదు. సాక్సను సంఘ ములో నాయకులకును అనుచరులకును గల సంబంధములు వైయక్తికములు కాని, భూముల నిచ్చి పుచ్చుకొనుటపై ఆధారపడినవి కావు. పెద్దపెద్ద భూస్వాములు తమ భూము లను చిన్న భూస్వాములకును, చిన్న భూస్వాములు తమకంటె తక్కువ వారికి తమ భూములను పంచియిచ్చుట, ఆ కాలము నుండియు వాడుకలో నుండెను. కౌలుదారుడు (Tenant) భూస్వామికి వివిధములగు సేవలను కావించుట కూడ చిర కాలమునుండి వాడుకలో నుండెను. ఈ విధముగ జమీందారీ విధానపు లక్షణములు కొన్ని అతి ప్రాచీన కాలము నుండియు సాక్సను సంఘమునందు నెలకొనియున్నట్లు స్పష్టమగుచున్నది.

క్రీస్తుశకము అయిదవ శతాబ్ది ప్రారంభమునాటికి రోమక సామ్రాజ్యము కూలిపోయెను. రోమనుల యధికారము సాగినంతకాలమును, ఐరోపా ఖండమున శాంతి భద్రతలు నెలకొనియుండెను. కాని వారి బలము క్షీణించుటతో, ఐరోపా ప్రపంచమున నరాజకత్వము ప్రబలసాగెను. ప్రజల కెవ్వరును రక్షకులు లేరైరి. బలవంతునిదే రాజ్యమయ్యెను. పేదవారికి రక్షణ మృగ్యమయ్యెను. బలవంతుడగు వాడు కొందరు అనుచరులను కూడగట్టుకొని, వారి సహాయముతో సామాన్య ప్రజలను దోచుకొనుట పరిపాటి యయ్యెను. ఈ విధముగ ధనార్జనము కావించిన దోపిడీదారు ఆత్మరక్షణ కొరకై యొక కొట్టాను కట్టుకొని, అందు తన దండునునిల్పి, అవకాశము లభించినప్పుడెల్ల కోటనుండి వెల్వడి, ప్రజలను దోచుకొని సురక్షితముగ తన గూటికి చేరుకొనెడివాడు. బలవత్తరమగు కేంద్ర ప్రభుత్వము లేని యీ అరాజక పరిస్థితియందు దుర్బలులగు సామాన్య ప్రజలీ దోపిడీదారునే రక్షకునిగ అంగీకరింపవలసి వచ్చెడిది. ఈ విధమున చోరవృత్తిచేతను, ఘాతుక కృత్యములచేతను, తన అధికారమునకు పునాదివైచికొనిన ధూర్తులు ప్రజారక్షకులుగ మారిరి. తొమ్మిదవ శతాబ్దియందు డేనులు ఐరోపా ఖండమునందలి వివిధ దేశములపై దాడులు సాగించినప్పుడు, వ్యవసాయదారులకును, ఇతరులగు పేదలకును, ఎట్టి శాంతియు లభించెడిదికాదు. వారి బాధలు దుర్భరములయ్యెను. అందువలన వారు తమ గ్రామములకు సమీపమున దుర్గముల నిర్మించు

కొని, గొప్ప నాయకులుగ మన్నన పొందుచున్న వీరపురు
షుల శరణు జొచ్చెడివారు. అంతట పై దుర్గాధిపతి ఈ ప్రజ
లను తన పోష్యవర్గములోనికి గైకొని, వారిని తాను స్వయ
ముగ దోచుకొనక పోవుటయే కాక, వారి నితర దోపిడిదారుల
యాగడములనుండి రక్షించునట్లు వాగ్దానము గావించుచుం
డెను. అందులకు ప్రతిఫలముగ వ్యవసాయదారుడు తాను
పండించిన పంటలో కొంత భాగమును ఖిలేదారుకు సమర్పిం
చెడివాడు. లేదా ఖిలేదారు స్వంత భూములలో ఎట్టి జీత
భత్యములును లేకుండ కొన్ని దినములు పనిచేసెడివాడు.
భూవసతులు లేనివారికికూడ ఒక రక్షకుడు కావలెను. కావున
వారుకూడ బలవంతుడగు నాయకు నొకనిని తమ ప్రభువుగ
అంగీకరించి, అతనిని సేవించుచుండిరి. ఆ నాయకునిచే విధింప
బడిన దుస్తులను, ఇతర చిహ్నములను వీరు ధరించుచుండిరి. ఇట్టి
ప్రజలు పై నాయకుని పోష్యవర్గములోని వారని దీని భావము.
అరాజక యుగమున నేర్పడిన ఈ యాచారములు జమీందారీ
పద్ధతికి దోహద మొసంగెను.

నార్మనులు ఇంగ్లాండు దేశమును జయించిన వెనుక వారు
జమీందారీ విధానమును సర్వత్ర వ్యాపింప జేసిరి. ఇప్పుడు జమీం
దారునకును కౌలుదారునకును గల సంబంధము భూమిని ఇచ్చి
పుచ్చుకొనుటపై ఆధారపడసాగెను. నార్మను యుగమునందు
భూమికి సంబంధించిన మౌలిక సిద్ధాంతమునం దొక ముఖ్యమగు
మార్పు కానవచ్చెను. దేశమందలి భూమియెల్ల రాజునకు

చెందనదని నార్మను న్యాయశాస్త్రజ్ఞులు సిద్ధాంతీకరించిరి. రాజు తన కిష్టులగువారికి పెద్ద భూఖండముల నొసంగును. వారు పెద్ద జమీందారులు. ఈ పెద్ద భూస్వాములు చిన్న భూస్వాములకును, వారు తమకంటె చిన్నతరహా భూస్వాములకును భూమిని పంచియిచ్చు నేర్పాటు నార్మను యుగమున పూర్తిగ స్థిరపడెను. తమకు లభించిన భూవసతులకు ప్రతిఫలముగ కౌలుదారులు తమ యజమానులకు పెక్కు సేవలు కావింపవలెను. పెద్ద భూస్వాములు సూటిగ రాజువలన జాగీరులను పొందినవారగుటచే వారు తమ ప్రభువునకు స్వామిభక్తి ప్రమాణము కావించి, అతని కెల్లప్పుడును వశవర్తులై యుండి, అతని యాజ్ఞలను పాలింతుమనియు, యుద్ధకాలమునందాతనికి తమ సేనలతో సహాయము కావింతుమనియు వాగ్దానము చేయుచుండిరి. పై జమీందారులు తమ స్వంత ఖర్చుపై కొంత సేనను సిద్ధముచేసి యుంచుకొనవలెను. రాజు పిలువనంపినప్పుడు వారాతనికి సహాయము కావించుటకై సేనలతో పోవలెను. ఇంతేకాక రాజకుమారుడు యుక్తవయస్కుడై యువరాజ బిరుదమును పొందినప్పుడును, రాజు కుమార్తెకు వివాహమైనప్పుడును, రాజు పరరాజులచే నిర్బంధింపబడినప్పుడాతనిని విడిపించుటకును, పెద్ద జాగీర్దారులు కొంత రుసుము నీయవలసి యుండిరి. ఒక జమీందారు చనిపోయి, ఆతని కుమారుడు తన తండ్రియాస్తి కధికారియగు సందర్భమున, రాజు కొంత ధనమును నూతన జమీందారువద్ద గైకొనుచుండెను.

మృతుడగు జమీందారుని కితర వారసులులేక ఆతని కుమార్తె జమీందారీకి యజమానురాలైన పక్షమున, రాజు ఆమెను తన కిష్టుడగు పురుషునకిచ్చి వివాహము చేయవచ్చును. రాజుచే ఎన్నుకొనబడిన వరుని పరిణయము కావించుకొనుటకు, జమీందారురాలు ఇష్టపడని పక్షమున, ఆమె ప్రభువునకు కొంత అపరాధ ధనమును చెల్లింపవలెను. జమీందారు అల్పవయస్కుడైన పక్షమున, రాజు ఆతనికి సంరక్షకత్వము వహించి, జాగీరు వ్యవహారములను సరిచూచుచుండెను. ఈ విధముగ రాజు జాగీర్దారులను వివిధ నియమములచేతను, నిర్బంధముల చేతను తనకు దాసులుగ కావించుకొనుచుండెను. తన వలన భూమిని గ్రహించి, లాభమును పొందిన జమీందారులు తన కెల్లప్పుడును చేదోడు వాదోడుగ నుండవలెననియు, ఎట్టి సందర్భములందును కూడ ఈ భూవసతులు తన కమిత్రులగు వారికి వశపడరాదనియు, రాజు కట్టుదిట్టములు కావించెడివాడు. పెద్ద జమీందారులు తమ భూములలో కొంత భాగమును చిన్న జమీందారులకు కౌలుగానిచ్చి, వారివలన స్వామిభక్తి ప్రమాణములను పొందుచుండిరి. పెద్ద జమీందారులు రాజునకుచేయు సేవలను చిన్న జమీందారులు, తమ ప్రభువగు పెద్ద భూస్వామికి చేయుచుండిరి.

జమీందారు వశమందున్న భూఖండములను, ఇంగ్లీషు భాషలో Manor అనుచున్నారు. ఈ భూస్వామి తనకుగల జాగీరులలో కొంత భాగమును చిన్నతరహా రైతులకు కౌలుగ

నిచ్చి, మిగిలినదానిని తన యాజమాన్యమున సేద్యము కావించు చుండెడివాడు. ఇట్టి భూఖండములలో నివసించుచు, సేద్యము కావించు రైతులలో పెక్కు తరగతులుండెడివి. వారిలో కొందరు స్వతంత్రులు. అనగా వీరు తమ కంగీకారమైనంత వరకును జమీందారునికి కౌలుదారులుగ నుండవచ్చును. లేని పక్షమున వారు భూములను విడచిపెట్టి, వేరొకచోటికి పోవచ్చును. కౌలుదారులుగ నున్న కాలమున వారు నియమిత సమయములలో, జమీందారు భూములను దున్నుట మున్నగు సేవలు కావింపవలెను. మరియొక తరగతి రైతులకు పై వర్గమువారికి గల స్వతంత్రము లేకుండెను. వారు తమ జమీందారు భూమిని విడచి, వేరొకచోటికి పోరాదు. వారిని భూమినుండి తప్పించుటకు జమీందారున కధికారము లేదు. వీరు తమ ప్రభువు పొలములందు వారమునకు కొన్ని దినములు విధిగ పనిచేయవలెను. ఇదికాక భూములు దున్ను సమయమందును, నాట్లువేయుట, కోతలు కోయుట మున్నగు సందర్భములందును కూడ, ఈ రైతు ప్రభువునకు సహాయపడవలెను. తన ప్రభువు ఉపయోగముకొరకై ఈ వ్యవసాయదారుడు కోడి పెట్టలు, గ్రుడ్లు మున్నగు ఉపాయనముల కూడ ఈయవలసి యుండెను. ఇట్టి రైతులకు ముప్పది యెకరముల భూవసతి లభించుచుండెడిది. మరికొందరు రైతులకు రెండు మూడెకరముల భూమి మాత్ర ముండెడిది. జాగీరులో నివసించు ప్రజల వలన జమీందారు ఇతర విధములుగ కూడ లాభమును పొందెడి

వాడు. ప్రజలు తమ జాగీర్దారుచే నెలకొల్పబడిన పిండి మర యందే తమ ధాన్యములను విసిరించుకొనవలెను. వారు తమలో తమకు సంభవించిన వివాదముల పరిష్కారముకొరకై జాగీరులోగల న్యాయస్థానమునకే పోవలెను. జమీందారుచే నియమింపబడిన న్యాయాధిపతి యీ నేరములను విచారించి తీర్పు చెప్పును. ఈ న్యాయస్థానములలో అపరాధిపై జుర్మానా విధించు పద్ధతి ఎక్కువగ వాడుకలో నుండెను. ఈ జుర్మానాల వలన ప్రభువునకు చాల ఆదాయము లభించెడిది. పన్నులను వసూలు చేయుటకును, తన ఆస్తులను రక్షించి కాపాడుటకును, జమీందారు కొందరు ఉద్యోగులను నియమించెడి వాడు. పైన మేము వర్ణించిన యేర్పాట్లు సాక్సనుల యుగమందు కూడ ఉండెడివి. కాని నార్మనుల రాకవలన నవ్యాపి దేశమం దెల్లెడల వ్యాపించెను.

బలవంతులగు జమీందారులు తమలో తాము కలహించుచు దేశమునందు శాంతిని భగ్నము కావించుటయు, ప్రజా సామాన్యమును పీడించుటయు, లేదా తమ కేలికయగు రాజు పైననే తిరుగుబాట్లు కావించి, అతని యధికారమును నామ మాత్రావశిష్టముగ నొనర్చుటయు విలియంరాజు తాను ఫ్రాన్సు దేశమున గడించిన యనుభవమువలన తెలిసికొనెను. అందువలన ఇంగ్లాండు దేశమందలి జమీందారు లిట్టి యాగడములు కావింపకుండుటకై, విలియంరాజు చక్కని యుపాయముల నాలోచించెను. జమీందారులకు భూముల నిచ్చునప్పు డాతడు

భూఖండము నంతను ఒకే ప్రదేశమున నుండనీయక వివిధ ప్రాంతములందు తునకలుగ నుండునట్లు శ్రద్ధగైకొనుచుండెను. ఇట్లు కావించిన పక్షమున జాగీర్దారులు తమ బలమును కేంద్రీకరించుకొనుట కవకాశములు తగ్గిపోవును. ఒక జమీందారు వేరువేరు జిల్లాలలో నివసించు తన యనుచరులను, తనకు రావలసిన ధనధాన్యములను సేకరించుకొని, రాజుపై తిరుగుబాటు కావించుట కష్టసాధ్యమగు పని. వివిధ ప్రాంతములలో గల భూములనుండి పన్నులు రాబట్టుకొనుటయందే అతని శక్తిసామర్థ్యములన్నియు వ్యయపడిపోవును. కావున నిట్టి సూక్ష్మోపాయముచే విలియంరాజు తన యనుచరులగు జమీందారుల బలమును క్షీణింపజేసెను. తన ప్రజలలో నెవ్వరి కెంత ఆస్తియున్నదో, ఎంత భూవసతి కలదో, ఎంతటి పశుసంపద నెవ్వరు సేకరించియున్నారో తెలిసికొనిన పక్షమున వారిపై తగు విధముగ పన్నులు విధింపవచ్చునను నుద్దేశముతో విలియంరాజు ఒక అపూర్వ పద్ధతి నవలంబించెను. 1085 వ సంవత్సరమున నాతడు ఒక ఆర్థిక విచారణా సంఘము నేర్పాటు కావించెను. ఈ పర్పాటు ననుసరించి, రాజోద్యోగులు ప్రతి జిల్లాయందును, దాని యంతర్భాగములందును, గ్రామములందును పర్యటనము కావించిరి. వారికి స్థానికోద్యోగులు సహాయపడిరి. ఈ విచారణా సంఘమువారు ప్రతి గ్రామ నామమును తెలిసికొని, అందు నివసించు గ్రామీణుల పేర్లు, వారికి గల భూముల వివరము, భూముల వలన వచ్చు రాబడి, ఏ వ్యవసాయదారునివద్ద

ఎన్ని నాగళ్ళు ఉన్నవో, ఎన్ని పాడిపశువులు, పందులు మున్నగు వానిని ఆతడు పెంచుచున్నాడో, సూక్ష్మాతిసూక్ష్మ ములతో సహా తెలిసికొని, తమ చిఠాలలో వ్రాసికొనిరి. విచారణ పూర్తియైన వెనుక వివిధ ప్రాంతములకు సంబంధించిన యంశముల నేకత్రము కావించి ఈ రాజు Domesday Book అను బృహత్సంపుటమును సిద్ధము చేయించెను. ఇందువలన దేశపు టార్థిక పరిస్థితి రాజునకు స్పష్టముగ తెలియవచ్చెను. ఎవ్వరును కూడ తమ ఆస్తిపాస్తులను రాజునకు తెలియకుండ దాచుటకు సాధ్యపడదయ్యెను. విలియం రాజు ప్రజలపై వారి వారి ఆర్థిక స్థోమత ప్రకారము పన్నుల విధించి, ఏ పౌరుడును కూడ తన రాజుపై తిరుగుబాటు కావించుటకై చాలినంత ధనమును, ఇతర వసతులను సేకరింపకుండునట్లు శ్రద్ధవహించెను. విజయభూషణుడు తయారు కావించిన ఈ ఆర్థిక నివేదిక సుమారు తొమ్మిది శతాబ్దుల పూర్వమునాటిది. అందు తెలుపబడిన యంశములను ఇంగ్లాండునందలి ఆధునిక పరిస్థితుల దృష్టిచే నుపలక్షించిన పక్షమున, ఆంగ్ల గ్రామీణ జీవితము చెక్కుచెదరక, నిరంతర స్రవంతిగ నెట్లు ప్రవహించుచు వచ్చినదో తెలియనగును. జమీందారుల బలమును క్షీణింప జేయుటకై ఈ ప్రభువు మరియొక చర్యను కూడ గైకొనెను. పూర్వపు టాచారముల ప్రకారము ఏ కౌలుదారు డే ప్రభువు వద్దనుండి భూమిని గ్రహించెనో, ఆ ప్రభువునకు మాత్రమే ఆతడు స్వామిభక్తి ప్రమాణము కావించి, లొంగి యుండెడి

వాడు. పెద్ద జమీందారు రాజునకు స్వామిభక్తి ప్రమాణము
కావించినట్లే. చిన్న భూస్వామి తన జమీందారునకు వశ్యు
డనై యుండగలవాడ నని వాగ్దానము చేయుచుండెను. ఇందు
వలన దేశమునంతను పాలించు రాజునకు ప్రమాద పరిస్థితి
యేర్పడెడిది. రాజునకును పెద్ద జమీందారులకును వివాదము
లును, సంఘర్షణలును సంభవించినప్పుడు, చిన్నతరగతి
జమీందారులు తమకు ప్రభువులగు పెద్దజమీందారులకే సహాయ
పడుచుండిరి. ఈ విధముగ రాజు దుర్బలుడగుచుండెను. రాజు
నకు చెందిన భూమి ననుభవించు చిన్న జమీందారులు అనేక
సందర్భములలో ఆతనికి విరుద్ధముగ వర్తించుటయు, రాజుతో
యుద్ధము కావించుటయు సంభవించుచుండెడిది. యూరోపా
ఖండమున నేర్పడిన జమీందారీ విధానములో నీ లక్షణము
బాగుగ నెలకొనియుండెను. ఇంగ్లాండునందీ దుష్ట సాంప్రదా
యము వ్యాపించకుండుటకై విలియం రాజు ఒక చక్కని
యేర్పాటు కావించెను. 1086 వ సంవత్సరమున నాతడు సాలి
స్బరీ అను ప్రదేశమున నొక సభను సమావేశపరచెను. ఆ సమా
వేశమునకు దేశమందలి భూస్వాములందరును, పెద్ద చిన్న తార
తమ్యము లేకుండ ఆహ్వానింపబడిరి. అంతట రాజు వారందరి
వలనను ప్రత్యేకముగ స్వామిభక్తి ప్రమాణముల గైకొనెను.
కౌలుదారులు ఎవ్వరివలన భూవసతులను పొందినను, వారు
రాజునకు మాత్రమే వశ్యులై యుండవలయుననియు, రాజు
నకు విరుద్ధముగ వారు మరే భూస్వామిని కాని, జమీందా

రుని కాని సేవింప నక్కరలేదనియు విజయభూషణుడు నిర్ణయము కావించెను. సాలిస్బరీ సభయందు జరిగిన ఏర్పాటు వలన బలగర్వితులును, రాజవైరులును నగు జమీందారులకు ఱెక్కలు తెగిన పక్షుల గతి పట్టెను.

విలియంరాజు చిన్నతనమునుండియే అనేక కష్టముల నెదుర్కొని, స్వయంశక్తిచే వానినుండి గట్టెక్కి అపారమగు అనుభవమును, రాజ్యపాలనా నైపుణిని సంపాదించినవాడు. అందులకు తోడు అతడు పెక్కు యుద్ధములలో పాల్గొని ఆరితేరిన వీరుడు. కావున నీతడు ఇంగ్లాండు దేశమును జయించి, అచ్చట శాంతిభద్రతలను, సుపరిపాలనా వ్యవస్థను నెలకొల్పగల్గెను. ఈతడు కావించిన యేర్పాట్లయందీతని దూరదృష్టి వ్యక్తమగుచున్నది. విజయభూషణుడు కావించిన రాజ్యాంగ సంస్కరణముల నాతని కుమారుడగు మొదటి హెన్రీ రాజును, మొదటి హెన్రీ రాజు మనుమడు రెండవ హెన్రీరాజును కూడ యథాతథముగ నిలిపియుంచి, వానికి మెరుగులు దిద్దిరి. విద్రోహులను, తిరుగుబాటుదారులను అణచివేయుటలో ఈ రాజు క్రూరమగు పద్ధతుల నవలంబించెను. ప్రకృతిచేకూడ నీతడు కఠిన స్వభావుడు, నిరంకుశ తత్త్వము కలవాడు. కావున ప్రజలును, ఉద్యోగులును, జమీందారులును, ఈతనిని గాంచి భయపడెడివారు. ప్రజా సామాన్యమునందు అజ్ఞానమును, మొరటుతనమును, జమీందారులలో ధూర్తత్వమును ప్రబలియున్న యా కాలమున కఠినస్వభావుడగు ప్రభువుమాత్రమే రాజ్యాంగ

వ్యవహారములను నడుపగల్గెడివాడు. లేనిచో దేశమున అల్లకల్లోలము వ్యాపించుట తథ్యము. కావున విజయభూషణుడు తన యుగమునకు తగిన ప్రభువని నిస్సంశయముగ తెలుపనగును.

1087 వ సంవత్సరమున విలియంరాజు ఫ్రాన్సుదేశపు ప్రభువుపై యుద్ధము ప్రకటించెను. ఈ యుద్ధము సాగుచుండగా ఆతడు గుఱ్ఱముపైనుండి క్రిందపడి, ఆ ప్రమాదము వలననే అనతికాలములో మరణించెను.

## విలియంరాజు కుమారులు

విజయభూషణునికి మువ్వురు కుమారులు, ఒక కుమార్తె. ఆ కుమార్తెను విలియంరాజు ఫ్రాన్సుదేశమందలి యొక జమీందారుని కిచ్చి వివాహము కావించెను. కుమారులలో రాబర్టు పెద్దవాడు. ఈతడు వీరుడు, యుద్ధప్రియుడు. కాని మిక్కిలి తొందర స్వభావము కలవాడు. ఈ రాకుమారుడు తండ్రిపై తిరుగుబాట్లు కావించి, ఆతని యప్రీతికి గురియయ్యెను. అందువలన విజయభూషణు డాతనికి నార్మండీ రాజ్యమును మాత్రము వదలి, తాను భుజబలముచే జయించిన ఇంగ్లండు రాజ్యమును రెండవ కుమారుని కొసంగెను. ఈ రెండవ కుమారుడు కూడ విలియం అను పేరు గలవాడు. కావున నీతనికి రెండవ విలియం అను పేరును, ఎఱ్ఱని జుట్టు గలవాడగుటచే Rufus (రూఫస్) అను వెక్కిరింపు బిరుదును లభించెను. రెండవ విలియం రాజు

పదమూడు సంవత్సరములు (1087-1100) రాజ్యపాలనము కావించెను. విజయభూషణుని జ్యేష్ఠకుమారుడు నార్మండీ రాష్ట్రమున కధికారిగ నుండెను. నార్మను జమీందారులలో పలువురకు ఇంగ్లండు దేశమందును, నార్మండీ రాష్ట్రములోను కూడ భూవసతు లుండెడివి. వీరు రాబర్టు విలియం సోదరులలో కలహములు కల్పించి, ఇరువురను కూడ దుర్బలురుగ కావించు టకై కుట్రలు కావించిరి. ఏలిక బలహీనుడైన పక్షమున తాము యథేచ్ఛముగ వ్యవహరింపనగునని జమీందారుల యాశయము. కొందరు జమీందారులు రెండవ విలియం రాజుపై తిరుగుబాటు కావించిరి. స్కాట్లండు దేశపు ప్రభువు ఇంగ్లండుదేశపు టుత్తర జిల్లాలలోనికి దండెత్తి వచ్చెను. కాని విలియం రాజు విద్రో హుల నణచివైచి, స్కాట్లండు రాజు నోడించి పారద్రోలెను. తన దేశపు టుత్తర సరిహద్దులను బలపరచి, పరరాజుల దండ యాత్రలు సాగకుండ కట్టుదిట్టము కావించెను. వేల్సురాష్ట్రపు టెల్లలకడ నార్మను జమీందారులను పలువురను స్థానిక పరిపా లకులుగ నియమించి విలియం తన రాజ్యమునకు ప్రమాదము లేకుండ చేసికొనెను. అంతేకాక ఈ నార్మను ప్రభువులను వేల్సు రాష్ట్రమును జయింపవలసినదిగా ప్రోత్సహించెను. ఏ నార్మను జమీందారు ఎంత భూభాగమును జయించునో, దాని నంతను ఆతడు తన జాగిరుగ అనుభవింపవచ్చునని కూడ ఈ రాజు వాగ్దానము కావించెను. ఈ విధమున ఇంగ్లండు రాజ్య మునకు పరరాజ్యములనుండి ప్రమాదములు తప్పెను. రెండవ

విలియంరాజు తండ్రివలెనే ధనాశ గలవాడు. కర్కశ స్వభావుడు. కాని విజయభూషణునికి గల రాజనీతి చతురత యీతని కడ లేకుండెను. ఈతడు తన జమీందారులనుండియు, క్రైస్తవ మతాధికారుల నుండియు, ఎంతో ధనమును గుంజుకొనెడివాడు. ధనార్జనము కొరకై యీతడు ఉపయోగించిన కఠోర విధానమువలన ఎల్లరును ఈ రాజునెడ తీవ్రముగ నసంతుష్టులైరి. విలియంరాజు సోదరుడగు రాబర్టు మిక్కిలి యుద్ధప్రియుడు. ఈ కథాకాలమున ఐరోపా ఖండమునందలి క్రైస్తవులు మహమ్మదీయులపై మతయుద్ధము ప్రకటించి యుండిరి. ఇట్టి మతయుద్ధముల కాంగ్లమున Crusades అని పేరు. ఈ యుద్ధములందు పాల్గొనవలయునను ఉత్సాహముతో రాబర్టు నార్మండీ రాజ్యమును తమ్ముడగు విలియంవద్ద పదివేల నాణెములకు కుదువబెట్టి, ఆ ధనమును తీసికొని వెడలిపోయెను. ఈ విధముగ నార్మండీ రాష్ట్రము కూడ విలియమునకు వశపడెను. కాని నానాటికిని ప్రజల కాతనియెడల అనిష్టత హెచ్చుసాగెను. 1100 వ సంవత్సరమున నొకనాడు ఈతడు అడవిలో వేటాడుచుండగా, ఎవ్వడో యొక శత్రు వాతనిని బాణముతో కొట్టి చంపివైచెను. విజయభూషణుని మూడవ కుమారుడగు హెన్రీ అనువాడు మొదటి హెన్రీ అను పేరుతో ఇంగ్లండు దేశమునకును, నార్మండీ రాష్ట్రమునకును, ఏలికయయ్యెను.

విజయభూషణుని మొదటి కుమారుడు రాబర్టును గూర్చియు, ఆతని నాకర్షించిన మత యుద్ధముల గూర్చియు

ఇచ్చట సూక్ష్మముగ తెలుపవలసియున్నది. క్రీ. శ. 635 వ సంవత్సరము వరకును క్రైస్తవుల పుణ్యక్షేత్రమగు జెరూసలేమ్ పట్టణము తూర్పు రోమక సామ్రాజ్యములో నొక భాగముగ నుండెను. ఆ సంవత్సరమున అరబ్బులు ఈ నగరమును వశపరచుకొనిరి. అయినను వారు క్రైస్తవ యాత్రికుల నేవిధముగను బాధింపక, జెరూసలేమ్ పట్టణమునకు రాకపోకలు జరుపుట కనుమతించెడివారు. పదునొకండవ శతాబ్ది తుది భాగమున ఆసియా ఖండమునందు సెల్జూకు తురుష్కు లున్నత స్థితికి వచ్చిరి. తురుష్కులు సిరియా రాజ్యముపై దాడులు సల్పుటయేకాక ఆ రాష్ట్రముగుండా క్రైస్తవ పుణ్యక్షేత్రమగు జెరూసలేమ్ పట్టణమునకు పోవు యాత్రీకులను బాధింపసాగిరి. ఇయ్యది క్రైస్తవులకు మిక్కిలి కోపకారణ మయ్యెను. కాన్‌స్టాంటినోపులు నగరమునందలి రోమక చక్రవర్తియు, రోము నగరము నుండి పోపు మతాధికారియు, క్రైస్తవ ప్రపంచమునకు సందేశము లంపి, జెరూసలేమ్ పట్టణము నుండి మహమ్మదీయులను తరిమివైచి, క్రైస్తవరాజ్యము నెలకొల్పవలెనని విజ్ఞాపనము కావించిరి. 1095 వ సంవత్సరమున వివిధ ఐరోపా దేశముల నుండి కొందరు సాహసులు జెరూసలేము పట్టణమును వశపరచుకొనుటకై బయలువెడలిరి. వీరిలో ఉత్సాహము తప్ప కార్యసాధనమునకై వలయు యోగ్యత మరేదియు లేదు. కావున నీ మత యుద్ధమునందు క్రైస్తవులకు సంపూర్ణ పరాభవము సిద్ధించెను. 1099 వ సంవత్సరమున

క్రైస్తవులు ఒకానొక మత యుద్ధమును ప్రకటించిరి. ఇందు యూరోపా ప్రపంచమందలి పెక్కు జమీందారులును, వీరులును పాల్గొనిరి. నార్మండీ ప్రభువగు రాబర్టు క్రైస్తవ వీరులలో నొక్కడు. ఈ రెండవ ప్రయత్నమునందు వీరికి విజయము లభించెను. 1099 వ సంవత్సరము జూలై నెల యందు జెరూసలేమ్ నగరము క్రైస్తవుల వశపడెను. గాడ్ఫ్రే డీ బొయిలన్ (Godfrey de Bouillon) అను క్రైస్తవ వీరుడు జెరూసలేమ్ రాజ్యమునకు ప్రభువుగ నియమింపబడెను. కాని మహానీయుడగు ఏసుక్రీస్తు కంటక కిరీటమును ధరించిన పట్టణమున తాను స్వర్ణ కిరీటమును ధరింపనని ఈ వీరుడు నిరాకరించినందున అతనికి "పవిత్ర సమాధి సంరక్షకుడు" అను బిరుదు మాత్ర మొసంగబడెను. ఈ క్రైస్తవ రాజ్యము సుమారు ఒక శతాబ్ది కాలము తన యధికారమును నిలువబెట్టుకొనగల్గెను. మత యుద్ధము పూర్తి కాగానే క్రైస్తవ వీరులు తమతమ స్థలములకు వెడలిపోయిరి. అట్లే రాబర్టు ప్రభువు కూడ నార్మండీ రాష్ట్రమునకు మరలివచ్చెను. కాని ఆతని సోదరుడగు హెన్రీ రాజునకు నార్మండీ రాష్ట్రమును వదలుకొనుట యెంత మాత్రమును ఇష్టము లేదు. కావున 1106 వ సంవత్సరమున మొదటి హెన్రీ రాజు నార్మండీ రాష్ట్రముపై దండెత్తిపోయి తన యన్న యగు రాబర్టును ఓడించి, చెరపట్టి ఇంగ్లాండునకు బందీగ గైకొని వచ్చెను. ఇంతటితో విజయఘోషణుని రాజ్యమంతయు ఆతని మూడవ కుమారునికి వశపడెను.

విజయభూషణుని కుమారులలో కెల్ల హెన్రీ సమర్థతముడు. అవసానకాలమున మొదటి విలియం రాజు తన కనిష్ఠ పుత్రుడే అందరిలోను అదృష్టవంతుడు కాగలడని జోస్యము చెప్పెనట. మొదటి హెన్రీ రాజ్యాధికారమును వహించగనే తన బలమును వృద్ధికావించుకొనుటకై చక్కని పద్ధతు లవలంబించెను. రెండవ విలియం రాజు న్యాయవిరుద్ధముగ జమీందారుల నుండియు, మతాధికారుల నుండియు ఎంతో ధనమును నిర్బంధముగ గైకొనుచుండుటచే ఆత డపకీర్తి పాలయ్యెను. ఈ విషయమును గ్రహించి హెన్రీ రాజు తాను ప్రజల నుండి న్యాయ సమ్మతమగు పన్నులను మాత్రమే గ్రహింతుననియు, జమీందారులను, మత గురువులను ఏ విధముగ బాధింపననియు, సామాన్య ప్రజలను ఎడ్వర్డుఋషి (Edward the Confessor) కాలమునాటి శాసనముల ప్రకారము పాలింతుననియు, వాగ్దానము చేయుచు ఒక రాజకీయ పత్రమును ప్రకటించెను. 1100వ సంవత్సరమున ప్రకటింపబడిన ఈ రాజ్యాంగ పత్రము ఆంగ్ల దేశ పరిపాలనా విధానమునం దొక ముఖ్యమగు విభాగమని పండితుల భావము. ఆంగ్లమున నీ రాజకీయ పత్రమునకు "Charter of Liberties" అని పేరు. ప్రజాస్వత్వములకు సంబంధించిన యీ ప్రకటన హెన్రీరాజు తన యిష్టపూర్వకముగ, ఎట్టి నిర్బంధమును లేకుండ చేసినది. కావున దీనికొక ప్రత్యేక ప్రాముఖ్యత కలదు. భావికాలమున నితర ఆంగ్లప్రభువుల యంగీకారమును పొందిన హక్కుల దస్తావేజులు ప్రజలచే నిర్బం

ధముగ గ్రహింపబడినవని మనము తెలిసికొనగలము. ఇంగ్లాండు దేశపు ప్రజలలో పలువురు సాక్సను జాతికి చెందినవారు. కావున వారిని సంతుష్టి పరచుటకై హెన్రీ రాజు ప్రాచీన సాక్సను రాజ కుటుంబమునకు చెందిన మాటిల్డా (Matilda) యను యువతిని వివాహమాడెను. ఆమె స్కాట్లండు దేశపు రాజు చెల్లెలు. ఈ వివాహము సాక్సను ప్రజల కెంతయో ఆనందమును కూర్చెను. మహనీయుడైన ఆల్ర్ఫెడు రాజు వంశమందలి రాకుమారి తమకు రాణియగుట వారికి చాల సంతుష్టి కల్గించెను. ఆంగ్ల ప్రజలకు రాజభక్తి మెండు. రాజ్యాధికారమును గోల్పోయిన సాక్సను రాజకుటుంబము నార్మను రాజవంశముతో బాంధవ్య మేర్పరచుకొని, ఆ విధముగ ఇంగ్లాండు దేశముపై మరల ఆధిపత్యము వహించుటగాంచి, తాము గోల్పోయిన పెన్నిధి మరల తమకు లభించినట్లు సాక్సను ప్రజలు తలంచిరి. సాక్సనుల హృదయ పూర్వకమగు సహకారమును పొంది, ఈ రాజు తన బలము నినుమడించుకొనెను.

మొదటి హెన్రీరాజు పరిపాలనా వ్యవస్థయందు నూతన పద్ధతుల ప్రవేశపెట్టి, ఇంగ్లాండు ప్రజలకొక యుత్తమమైన పరిపాలనా యంత్రమును సిద్ధముచేసి యిచ్చెను. సాక్సను రాజుల కాలమున రాజునకు సలహా ఇచ్చుటకును, రాజ్యాంగమును చక్కగ నడపుటలో ఆతనికి సహాయ పడుటకును "విజ్ఞానుల సభ" (Witan) ఏర్పడియుండెను. నార్మను ప్రభువు లధికారము పూనినవెనుక ఈ సభ రద్దు అయ్యెను. దాని స్థానమున "రాజ్య

సభ (సమితి)" (Curia Regis) అను సంస్థ నెలకొల్పబడెను. ఈ నూతన సమితి యందలి సభ్యులును, తొల్లిటి విజ్ఞానుల సభ యందలి సభ్యులును ఇంచుమించు ఒక్కరే. కాని సాక్సనుల నాటి విజ్ఞానుల సభలో సభ్యత్వమును సంపాదించుటకు వలసిన అర్హత విజ్ఞానము లేక వివేకము. అందు ఉన్నత రాజకీయో ద్యోగులు, గొప్ప భూస్వాములు, మతాధికారులు మున్నగు వారు సమావేశ మగుచుండిరి. నార్మను రాజుల రాజ్యాంగ సమితియందు మతాధికారులు, రాజులవలన సూటిగ భూవసతు లను పొందిన ముఖ్య కౌలుదారులు (Tenants-in-Chief) ను సభ్యత్వము వహించెడివారు. ఈ సమితియందు సభ్యు డగుటకై "విజ్ఞానము" అను అర్హత అవసరములేదు. రాజునుండి సూటిగ భూమిని పొందుటయే ఇచట కావలసిన యోగ్యత. సర్వసాధా రణముగ రాజుయొక్క ముఖ్య కౌలుదారులు సమితి సమా వేశములలో పాల్గొనెడివారు కారు. ఇందలి ముఖ్యసభ్యులు రాజ ప్రతినిధి (Justiciar), రాజుయొక్క కార్యదర్శి (Chancellor.), రాజాంతఃపుర పాలకుడు (Chamberlain), సైన్యాధికారులగు దండనాథుడు, దండవిధాయి (Marshal, Constable) అనువారలు. ఈ సభవారనేక ముఖ్య ధర్మము లను నిర్వర్తించుచుండిరి. ఈ సమితియే రాజ్యపరిపాలనా సమితిగను, ఉన్నత న్యాయస్థానముగను, ఆదాయ వ్యయ శాఖగను వ్యవహరించెడిది. కాని యీ విషయము మన కాశ్చర్యము గొలుపనక్కరలేదు. ప్రాచీన కాలమున

రాజు తన తెగకు సర్వాధికారిగ నుండెడివాడు. ఆత డనేక ధర్మముల నిర్వర్తించెడివాడు. యుద్ధకాలము నందు రాజు తెగకు సర్వసైన్యాధిపతి. అతడే శాసన నిర్మాత, అతడే ఉత్తమ న్యాయాధికారి. కాని ఆచరణయం దీ అధికారముల నన్నిటిని ఒక కార్య నిర్వాహక సభవారు వహించుచుండిరి. కాలము గడచినకొలదియు రాజ్య పరిపాలన కావించుట ఒక్క సమితివారికి సాధ్యపడలేదు. అందువలన వివిధ రాజ్యాంగ ధర్మముల నెరవేర్చుటకై వేరువేరు సంఘము లేర్పడవలసి వచ్చెను. శాసన నిర్మాణము, న్యాయ ప్రదానము, ఆదాయవ్యయ పర్యవేక్షణము, సైన్య పరిపాలన మున్నగు రాజ్యాంగ ధర్మములను వేరు వేరు సంఘములు నిర్వర్తించెడివి. ఆధునిక యుగమున నీ రాజ్యాంగ వ్యవహారములను వివిధ పరి పాలనా శాఖలవారు చక్కబెట్టుచున్నారు. ఈ యేర్పాట్లు మొదటి హెన్రీరాజు కాలమున ప్రారంభమైన యంశమును మనము గుర్తింపవలెను.

రాజ్య పరిపాలనము విజయవంతముగ సాగుటకై ధన ప్రపూర్ణమగు కోశాగారము చాల అవసరము. ఈ యంశమును చక్కగ గుర్తించిన మొదటి హెన్రీరాజు రాజ్యాధికారము వహింపగనే వించెస్టరు పట్టణమునందలి రాజ కోశాగారమును వశపరచుకొనెను. అంతటితో సంతుష్టిచెందక, ఈ రాజు ప్రభు త్వాదాయము సక్రమముగ లభించు చుండునట్లును, అయ్యది క్రమముగ వృద్ధి చెందునట్లును శ్రద్ధ వహించెను. ఆ కాలమున ఇంగ్లాండు రాజునకు లభించు ఆదాయము రెండు విధములైనది.

రాజుయొక్క స్వంత ఆస్తివలన లభించు ధనమును, పెద్దపెద్ద భూస్వాములనుండి అనేక మార్గముల రాజునకు రావలసిన విత్తమును కలసి, ప్రభుత్వాదాయ మేర్పడెడిది. ఈ ఆదాయమును వసూలుచేసి, దానిని సక్రమముగ రాజభాండారమున కంద జేయువారు షరీఫ్ (Sheriff) అను జిల్లా అధికారులు. ఈ అధికారులు సమర్పించు లెక్కలను సరిచూచి, ఆదాయమును జమ కట్టుకొనుటకై హెన్రీరాజు ఒక ప్రత్యేక రాజ్యాంగ కార్యాలయమును నెలకొల్పెను. ఈ వరకే మేము వర్ణించిన రాజ్యసభ (సమితి) (Curia Regis) యందీ కార్యాలయ మొకశాఖ. ఇందు అంకెలను సులభముగ లెక్కించుటకై రంగురంగుల గడులు గల పెద్ద బల్లలుండెడివి. కావున ఈ కార్యాలయమునకు Exchequer అను పేరు కల్గెను. ఆ పేరే బ్రిటీషు ప్రభుత్వము వారి ఆదాయ వ్యయశాఖకై నేడుకూడ వాడబడు చున్నది. బ్రిటీషు ఆర్థిక శాఖామంత్రికి Chancellor of the Exchequer అని పేరు. జిల్లా అధికారియైన Sheriff హోదా చాల ముఖ్యమైనది. ఈ యధికారము వంశ పారంపర్యముగ నే జమీందారీ కుటుంబమునకును చెందకుండునట్లు రాజు శ్రద్ధ పూనెను. హెన్రీ రాజు జిల్లా అధికారులను తరచు మార్చుచు, వారు తనకు వశవర్తులై యుండునట్లు జాగ్రత్త వహించెను. ఈ కాలమున ప్రభుత్వమువారికి లభించు ఆదాయములో ఒక ముఖ్య భాగము న్యాయస్థానములలో నేరస్తులపై విధింపబడు అపరాధపు సొమ్ము. జమీందారీ యుగమున నింగ్లాండులో రెండు

తరగతుల న్యాయస్థానము లుండెడివి. రాజ ప్రతినిధులగు జిల్లా అధికారుల యాజమాన్యమున సమావేశమగు న్యాయస్థానములు కొన్నియు, జమీందారులచే నెలకొల్పబడిన జాగీరు న్యాయస్థానములు మరికొన్నియు వీనితో చేరియుండెను. ప్రభుత్వాదాయమును పెంపు కావించు నుద్దేశ్యముతో హెన్రీ రాజు ప్రజల అభియోగము లన్నియు విచారణ కొరకై ప్రభుత్వము వారి న్యాయస్థానములకే పంపబడునట్లు ప్రోత్సాహము కల్పించెను. విజయభూషణుడు రాజ్య కార్యనిర్వహణ సౌలభ్యము నకై యొక క్రొత్త ఏర్పాటును కావించియుండెను. 1085 వ సంవత్సరము నందలి ఆర్థిక విచారణను సాగించుటకై ఈ రాజు తన దర్బారునుండి కొందరు ఉద్యోగులను నియమించెను. వీరు వేర్వేరు జిల్లాలలోనికేగి, అచ్చటి జిల్లా అధికారుల సహకారముతో జిల్లా సమితులను, ఇతర స్థానిక సంస్థలను సమావేశ పరచి, తమకు కావలసిన విషయములను సేకరించిరి. ఈ విధమున మొదటి విలియంరాజు కేంద్ర ప్రభుత్వమునకును స్థానిక స్వపరిపాలనా సంస్థలకును మైత్రి కుదిర్చెను. మొదటి హెన్రీ రాజు కూడ అప్పుడప్పుడు తన దర్బారునుండి ఉద్యోగులను జిల్లాలలోనికి పంపి, రాజునకు రావలసిన ఆదాయమును గూర్చియు, ప్రత్యేకమగు కొన్ని అభియోగముల గూర్చియు విచారణ కావింపించెడివాడు. ఈ సందర్భములలో జిల్లా అధికారులును, జిల్లా సమితులును, రాజోద్యోగులతో సహకరించి ప్రభుత్వాదాయ సేకరణమును, అభియోగ విచారణయు

కావించుచుండిరి. రాజుచే నియమింపబడిన అధికారులును, జిల్లాలను పాలించు అధికారులును, అనుభవశాలురును, న్యాయ్య శాస్త్ర నిపుణులును అగుటచే వారి తీర్పులు నిష్పక్షపాతముగను, న్యాయసమ్మతముగను ఉండెడివి. జమీందారులు తమ తమ జాగీరు న్యాయస్థానములలో అభియోగముల విచారించి, తీర్పులు చెప్పునప్పుడు వారి నిర్ణయములలో తగినంత నిష్పాక్షికత్వము కాని, న్యాయశాస్త్ర వైదుష్యముకాని కానవచ్చెడివికావు. ప్రభుత్వ న్యాయస్థానము లే జిల్లాకు చెందినను, వారి తీర్పు లొకేవిధముగ నుండెడివి. ఆ కారణముచే ప్రజలు క్రమక్రమముగ జాగీరు న్యాయస్థానములకుపోక, ప్రభుత్వ న్యాయస్థానములకే, తమ వివాదముల గొనిపోయెడివారు. ఈ విధముగ ప్రభుత్వ న్యాయస్థానములు జనాంగీకారమును పడయ జొచ్చెను. వానితోపాటు ప్రభుత్వమువారి యాదాయము హెచ్చుసాగెను. హెన్రీరాజు ప్రోత్సాహముచే సాక్సను యుగమునాటి న్యాయస్థానములు పునరుద్ధరింపబడెను. ఆ న్యాయస్థానములు సక్రమముగ సమావేశము కావలెనని రాజు ఆజ్ఞాపించెను. న్యాయ ప్రధాన శాఖ ఈ విధముగ బలపడెను. పైన సూచింపబడిన మార్పువలన రాజునకు చాల లాభము కల్గెను. హెన్రీ రాజు న్యాయ విచారణకొరకై చేసిన ఏర్పాట్ల వలన నేరములు క్షీణించెను. ప్రభుత్వ న్యాయస్థానములు నిర్ధితుని హోదాను, ఆతనికిగల పలుకుబడిని, యెంత మాత్రమును సరకుచేయక, న్యాయశాస్త్ర ప్రకారము ఆతనిని శిక్షించుచుండె

తకు. ఆ రాజును చూచి దొంగలును భయపడసాగిరి. "హెన్రీరాజు కాలమున ఏ పౌరుడును ఇతరులకు హానిచేయుటకు జంకెడివాడు" అని ఆంగ్లో సాక్సను చరిత్రము వ్రాసెను. హెన్రీ రాజును ప్రజలు "న్యాయ సింహము" (Lion of Justice) అని కీర్తింపసాగిరి. దేశమునందు శాంతిని నెలకొల్పుటయు, ప్రజలను సంరక్షించుటయు, రాజ ధర్మములలో ముఖ్యమైనవని సాక్సను జాతివారి సిద్ధాంతము. హెన్రీరాజు ఈ సిద్ధాంతమున కనుగుణ్యముగ వర్తించెను. అందువలన అతని ప్రతిష్ఠ హెచ్చెను. రోమక సామ్రాజ్య యుగమున ప్రజలు చక్రవర్తి పరమేశ్వరుని ప్రతిబింబమని భావించెడివారు. రోమనుల రాజ్యము నశించినను ప్రజలలో ఈ భావములు సమసిపోలేదు. తాను కేవలము జమీందారులకెల్ల పెద్ద మాత్రమే కానని యు, తనయందు భగవదంశ నెలకొని యున్నదనియు నొక విశ్వాసమును ఈ రాజు ప్రజలలో కల్పించెను.

హెన్రీ రాజు సాధించిన ఘన కార్యములలో కేంద్ర ప్రభుత్వమును స్థాపించి, దానిని బలపరచుట ముఖ్యమైనది. ఇందు వలన జిల్లాలలో జమీందారులకు గల ప్రతిష్ఠయు, పలుకుబడియు క్షీణింపసాగెను. రాజోద్యోగులను నియమించునప్పుడు, ఈ రాజు పెద్ద జమీందారులను పూర్తిగ విడచిపెట్టి, సామాన్య కుటుంబముల వారినే ఈ పదవులలో నెలకొల్పసాగెను. ఈ పద్ధతివలన రాజకార్య నిర్వహణ చాతుర్యమును, రాజభక్తియు గల యొక ప్రత్యేక ఔద్యోగిక శాఖ యేర్పడెను. ఈ శాఖ

వారిని పెద్ద జమీందారులు మిక్కిలి అసూయతో చూచెడి వారు. ఏది యెట్లున్నను సామాన్య ప్రజలు మాత్రము రాజు నెడల మిక్కిలి శ్రద్ధాభక్తులు కలవారై ఆతనిని గౌరవింప సాగిరి. రాజు ప్రజాహిత తత్పరుడై, సమర్థతతో రాజ్య పరి పాలనము కావించినంత కాలమును ప్రజ లాతనికి హృదయ పూర్వకమగు సహకారమును ఒసంగుట మనము బ్రిటీషు దేశ చరిత్రయం దనేక ఘట్టములలో కన్గొనవచ్చును. సర్వసాధారణ ముగ జమీందారులు స్వార్థపరులై ప్రజానీకమును దోచుకొని, బాధలు పెట్టెడివారు. అట్టి జమీందారులను అణచివైచి, రాజులు తమ్ము కాపాడుటలో విశేషశ్రద్ధ చూపెడివారు కావున రాజునకును ప్రజకును బలవత్తరమగు అనుబంధ మేర్పడెను. జమీందారుల ప్రాబల్యము పూర్తిగ నశించు వరకును ఈ పరి స్థితులే దేశమం దెల్లెడల నెలకొనియుండెను.

రాజ్యాధికారము వహించిన తరువాత యిరువది సంవ త్సరముల వరకును హెన్రీరాజున కెట్టి కష్టమును సంభవింప లేదు. ఫ్రాన్సుదేశమున నీతనికిగల రాజ్యములో అశాంతిని పెంపొందించుటకై ఫ్రాన్సుదేశ ప్రభువు కావించిన ప్రయత్న ములు నిరర్థకమయ్యెను. కాని విధి ప్రాతికూల్యమువలన నీ రాజునకు 1120 వ సంవత్సరమున నొక పెద్ద యాపద కల్గెను. ఈ రాజున కొక్క కుమారుడును ఒక్క కుమార్తెయును నుండిరి. కుమారుడు హెన్రీ. కుమార్తె మాటిల్డా. ఏకైక పుత్రుడగు కుమారునిపై హెన్రీరాజు ప్రేమయంతయు నెల

కొనెననియు, తన విశాలరాజ్యమునకు రాజకుమారుడు వారసుడు కావలెనని యాతడుత్సాహపడెడివాడనియు, వేరుగ తెలుపనక్కరలేదు. కాని ఆ సంవత్సరమున హెన్రీరాకుమారుడును, అతని సోదరియు నార్మండీనుండి ఇంగ్లాండునకు తిరిగి వచ్చుచుండగా, వారు ప్రయాణము కావించుచున్న "శ్వేత నౌక" యను పడవ, సముద్రములోని యొక పెద్ద రాతిని తాకి పగిలిపోయెను. రాకుమారుని సముద్రుడు మ్రింగివైచెను. రాకుమారి మాత్రము ప్రాణములతో బయటపడెను. ఈ వార్త వినుసరికి హెన్రీ రాజునకు కల్గిన దుఃఖము వర్ణనాతీతము. ఏకపుత్ర వియోగ మెట్టివారికిని దుస్సహమేకదా! రాజకుమారుని మరణము తరువాత హెన్రీరాజు దుఃఖమునై నుండవాస మెన్నడును చిందులాడలేదట. తన యనంతరము రాజ్యమున కెవ్వరు వారసత్వము వహింపగలరను సమస్య రాజును బాధింపసాగెను. యుద్ధప్రియులును, అభిమాన ధనులును అగు ఆ కాలపు జమీందారులు ఒక స్త్రీ యధికారము నంగీకరింపరని హెన్రీరాజు ఎరుగకపోలేదు. కాని ఆతనికి మార్గాంతరము కానరాలేదు. విజయభూషణునికి ఎడిలా (Adela) అను కుమార్తె యుండెను. ఆమె కుమారుడగు స్టీఫెన్ అను నాతడు రాజ్యాధికారము వహించుట కర్హుడు. కాని హెన్రీరాజు మేనల్లునికి రాజ్యాధికారము నొసంగుటకు విముఖుడు. కావున నాతడు రాజ్యమందలి పెద్ద జమీందారులనెల్ల రావించి, తన యనంతరము తన కుమార్తెయగు మాటిల్డాను ఇంగ్లండు

నార్మండీ రాజ్యములకు ప్రభ్విగ నంగీకరింతుమని, వారివలన వాగ్దానమును పొందెను. ఈ రాకుమారి తీవ్ర స్వభావము గలది. గర్విష్ఠి. ఆమెకు స్త్రీయాకారమును, పురుష స్వభావమును పరమేశ్వరు డొసంగెనని సమకాలీనులు భావించెడివారు. హెన్రీ రాజు ఈమెను పదమూడవయేట పవిత్ర రోమక సామ్రాజ్యమును పాలించుచున్న చక్రవర్తికిచ్చి పరిణయము కావించెను. కాని 1125 నాటి క్కాతడు మరణించెను. అప్పటికి మాటిల్డా వయస్సు ఇరువదిరెండు సంవత్సరములు. అంతట హెన్రీరాజు తన కుమార్తెను ఫ్రాన్సు దేశమందలి అంజో (Anjon) రాష్ట్రమున కేలికయైన జఫరీ (Geoffery) యను బలవంతుడగు జమీందారున కొసంగి ద్వితీయ వివాహము కావించెను. ఆమెకు ఈ రెండవ భర్తవలన హెన్రీ అను కుమారుడు దుద్భవించెను. ఆతనిని గూర్చి మనము ముందుముందు తెలిసికొనగలము. హెన్రీరాజు తనకుమార్తెకు రాజ్యాధికారమును బూనుటకై వలయు తర్ఫీదు నిచ్చెను. కాని జమీందారులు మాటిల్డాను తమ రాణిగ యంగీకరింతురని హెన్రీరాజు కూడ పూర్తిగ విశ్వసించినట్లు తలంచుటకు వీలులేదు. ఆతని మేనల్లుడగు స్టీఫెన్‌కు ఇంగ్లండు దేశమునకూడ పెద్ద జాగిరు లుండెను. ఈతని వారసత్వమును బలపరచు నొక బలవత్తర పక్షము ఇంగ్లాండు దేశమున నేర్పడెను. ఇట్టి క్లిష్టపరిస్థితులలో 1135 వ సంవత్సరమున హెన్రీరాజు కాలధర్మము చెందెను.

## స్టీఫెన్ మాటిల్డాల పరిపాలన
## ఇంగ్లాండు దేశమున అరాజకత్వము

మొదటి హెన్రీరాజు మరణించుటయే తడవుగ దేశమున అంతర్యుద్ధము ప్రారంభమయ్యెను. జమీందారులు రాకుమారి యగు మాటిల్డాను తమ ఏలికగ మన్నించుటకు నిరాకరించిరి. అంతేకాక తండ్రి మరణించునపుడు ఆమె ఫ్రాన్సు దేశమున తన భర్తవద్ద యుండెను. స్టీఫెన్ ఇంగ్లండులో నుండెను. కొందరు జమీందారులు ఆతని పక్షము వహించిరి. క్రైస్తవ మతసంఘము వారాతనినే సమర్థించిరి. ఆ కారణముచే ఆతడు 1135వ సంవత్సరమున ఆంగ్లరాజ్య సింహాసనము నధిష్ఠించెను. జమీందారులలో కొందరు మాటిల్డాను సమర్థించిరి. హెన్రీరాజు ఉంపుడుకత్తె కుమారుడగు రాబర్టు అనువాడు ఆ కాలమున గొప్ప జమీందారు. ఆతడు చాల బలశాలి. పలుకుబడి గలవాడు. ఈతడు మాటిల్డా రాకుమారి పక్షము నవలంబించెను. ఈ విధముగ ఆంగ్ల జమీందారులు రెండు పక్షములుగ చీలిపోయిరి. రాజ్యాధికారము కొరకై ఇరువురు వారసులు కలహించుట వారికెంతయును సంతోషదాయకమగు నంశము. అంతఃకలహములచే రాజుల బలము క్షీణించును. రాజ దుర్బలుడైనచో తాము స్వతంత్రులై తమ యిష్టమువచ్చిన చొప్పున ప్రవర్తింప వచ్చునని జమీందారుల యాశయము. కావున వారు వీలైనంత వరకు రాజ్యమునం దంతర్వివాదములు సాగుచుండవలెననియు, రాజు తేజోవిహీనుడై నామమాత్రమున ఏలికగ

నుండవలెననియు కోరుచుండిరి. జమీందారుల యీ స్వార్థపర త్వమే మధ్యమ యుగమున నాంగ్లదేశమున వ్యాపించిన అరాజ కత్వమునకును, అశాంతికిని మూల హేతువు.

వారసత్వము కొరకై సాగుచున్న వివాదములకుతోడు స్టీఫెన్ రాజు దౌర్బల్యముకూడ అరాజకత్వమునకు దోహద మొసంగెను. ఈ ప్రభువు బలశాలి. యుద్ధరంగమున నప్రతి హతమగు పరాక్రమమును ప్రదర్శింపగల యోధుడు. కాని యాతని స్వభావము మెత్తనిది. రాజునం దుండవలసిన కాఠిన్య మీతనియందు పూజ్యము. రౌతు మెత్తనివాడైనచో గుఱ్ఱము మూడు కాళ్ళపైన నడచుట సహజము. స్టీఫెన్ రాజు సాత్విక ప్రవృత్తిని గమనించి, జమీందారులు తమ యిష్టమువచ్చినట్లు ప్రవర్తింపసాగిరి. రాజు దౌర్బల్యమును, ఆతడు జమీందారుల నదుపులో నుంచజాలక పోవుటయు చూచి, ప్రభుత్వోద్యోగు లాతని యెడ విముఖులైరి. స్కాట్లండు దేశపురాజు ఇంగ్లండుపై దండెత్తి వచ్చెను. ఈ దండయాత్ర విఫలమయ్యెను కాని అందు వలన దేశమునకు సౌఖ్యము చేకూరలేదు. అసంతుష్టులైన ప్రజలు తిరుగుబాటు కావింప దొడగిరి. ఇది యిట్లుండగా మాటిల్డా రాకుమారి 1139 వ సంవత్సరమున ఇంగ్లండు దేశ మున కేతెంచి రాజ్యాధికారము తనకు రావలెనని వివాదము ప్రారంభించెను. ఆమె కనుకూలురగు జమీందారు లామెకు సైన్యసహాయము కావించిరి. స్టీఫెన్ మాటిల్డాల సేనలకు యుద్ధము జరిగెను. స్టీఫెన్ పరాజితుడై శత్రు పక్షమునకు

బందీగ చిక్కెను (క్రీ. శ. 1141). ఒక సంవత్సరము కాలము మాటిల్డా ఇంగ్లాండునం దధికారము పొందెను. కాని ఆ స్వల్ప కాలములోనే లండను పౌరుల కామెయెడ సహ్యము తగ్గి, ఆమెను తరిమివైచిరి. స్టీఫెను మరల రాజ్యాధికారము వహించెను.

ఈ మార్పువలన దేశస్థితి యేమాత్రమును బాగుపడ లేదు. జమీందారు లుద్ధతులై రాజునుతోని రాజు కాంచిరి. రాజు తన అధికారములను నిలువబెట్టుకొన లేకపోయెను. ప్రభు త్వాదాయము క్షీణించెను. ప్రభుత్వమునకై రాజు కట్టి యుద్ధ కారమును లేకపోయెను. రాజ్యాంగ వ్యవస్థ ఛిన్నాభిన్న మయ్యెను. ఈ స్టీఫెన్ రాజు కాలమున నింగ్లాండు దేశమునందు ప్రబలిన అరాజకత్వమును ఆంగ్లోసాక్సను చరిత్ర యిట్లు వర్ణించుచున్నది.

"దేశమునందలి బలవంతులగు వారెల్ల తమ కొరకై దుర్గ ముల నిర్మించుకొని రాజును ధిక్కరించిరి. ఈ దుర్గములలో దుష్టులును, పైశాచిక స్వభావులును నివసింపజొచ్చిరి. ఎవ్వరి వద్దనైన ధనధాన్యము లున్నట్లు తెలియవచ్చినచో, నీ దుర్గాధి కారులు వారిని పట్టి బంధించెడివారు. వారు పగలనక రాత్రి యనక, స్త్రీలన పురుషులనక యెల్ల వారిని చెరపట్టి వారివద్దగల వెండిబంగారముల నియ్యవలసినదని బాధించెడివారు. అందుల కంగీకరింపని వారిని నానావిధముల హింసించెడివారు. వేలకొలది జను లన్నాతురులై ప్రాణముల గోల్పోయిరి. ఈ దుర్గాధిపతులు

సామాన్య ప్రజలను పెట్టిన బాధలును వారు కావించిన హింసా కాండయు వర్ణనాతీతములు. స్టీఫెన్ రాజు అధికారము వహించిన పందొమ్మిది సంవత్సరములును పరిస్థితు లీ విధముగనుండెను. స్థితిగతులు నానాటికిని క్షీణించెను. పై దుర్గపాలకులు గ్రామములపై తమకు తోచినట్లు పన్నులు విధించెడివారు. నిరుపేదలైన ప్రజల వద్దగల ధనము నంతను గుంజుకొని, ఆ పిమ్మట ఈ ధూర్తులు గ్రామములను తగులబెట్టెడివారు. ఈ కాలమున నెవ్వరైన అంగ్ల గ్రామసీమలందు ఒక దినము పూర్తిగ తిరిగినను, వారికి గ్రామములలో నొక్క మనుష్యుడు కాని, ఒక్క పంటపొలము కాని కానవచ్చెడిది కాదు. ధాన్యములు, మాంసము, పాలు, వెన్న మున్నగువాని ధర విపరీతముగ హెచ్చిపోయెను. దేశము జనశూన్యమైనప్పు డిట్లు జరుగుటలో యాశ్చర్య మేదియును లేదు. నిర్భాగ్యులగు ప్రజలాకలిబాధచే కటకట లాడిరి. ధనాఢ్యులగు వారిలో పలువురు సర్వస్వమును కోల్పోయి, బిచ్చమెత్తుకొన జొచ్చిరి. మిగిలినవారు దేశమును విడచి పారిపోయిరి. దేశ మిట్టి దుస్థితికి గురియగుటచే, పంట భూములలో కూడ నెట్టి సస్యములును చేకూరవయ్యెను. మహనీయుడగు ఏసుక్రీస్తును, అతని శిష్యులగు ఋషి పుంగవులును నిద్రించిరని ప్రజలు తలంపసాగిరి." నామమాత్రమునకు ప్రభువుగ నున్నను స్టీఫెన్ రాజు దేశస్థితి నెంతమాత్రమును బాగు చేయజాలక పోయెను.

ఇంగ్లాండు దేశము నీ దుస్థితినుండి యుద్ధరించి, ఉన్నత దశకు గైకొని పోవజాలిన యుత్తమపాలకు డీకాలమున

వేరొకచోట పెరుగుచుండెను. ఆతడు మొదటి హెన్రీరాజు మనుమడగు హెన్రీ. ఈతడు మాటిల్డా కుమారుడు. ఈతని తండ్రి అంజో రాష్ట్రము నేలుచుండెను. 1150 వ సంవత్సరమున తండ్రి మరణించునప్పటికి హెన్రీ పదునెనిమిది సంవత్సరముల యువకుడు. అప్పటికే ఈతడు ప్రశంసనీయమగు బుద్ధి కుశలతను, పరిపాలనా నైపుణిని, ధైర్యసాహసములను ప్రదర్శించెను. నార్మండీ రాష్ట్రమును, అంజో మున్నగు పైతృక రాజ్యములును ఈ యువక ప్రభువునకు వశపడెను. 1153 వ సంవత్సరమున హెన్రీ ఇంగ్లాండు దేశమునకు వచ్చెను. సాక్సను నార్మను రాజవంశములు రెంటికిని వారసుడును, ప్రతిభాశాలియు నగు నీ రాకుమారుని ఆంగ్లప్రజ లత్యంతోత్సాహముతో ఆదరించిరి. మరల అంతర్యుద్ధము ప్రారంభమయ్యెను. ఇందు విజయలక్ష్మి హెన్రీ రాకుమారునిపైపు మొగ్గసాగెను. అంతేకాక అప్పటికి స్టీఫెన్ రాజునకు వయస్సు మరలజొచ్చెను. ఆతనికి యుద్ధమునందు విరక్తి కల్గెను. కావున నాతడు హెన్రీతో సంధి కావించుకొని, తన జీవితాంతము వరకును తాను రాజుగ నుండునట్లును, తన యనంతరము హెన్రీ ఆంగ్లరాజ్య సింహాసనమధిష్ఠించునట్లును అంగీకరించెను. హెన్రీని తన పుత్రునిగ భావించి, రాజ్యాంగ వ్యవహారములలో ఆతని సలహాను పాటించెదనని కూడ స్టీఫెన్ వాగ్దానము చేసెను. ఈ షరతులకు హెన్రీ అనుమతించెను. ఆ మరుసటి సంవత్సరము (1154)

స్టీఫెన్ మరణించెను. ఆంగ్ల ప్రజలు హెన్రీని తమ కేలికగ స్వీకరించిరి. మహానీయుఁడగు అల్ఫ్రెడురాజు తరువాత అంతటి సంపూర్ణమగు ప్రజామోదముతో సింహాసన మధిష్ఠించిన రాజు ఆంగ్లదేశమున మఱియెవ్వరును లేరని చారిత్రికుల యభిప్రాయము.

—

### అయిదవ ప్రకరణము

# నార్మను రాజుల స్వర్ణయుగము

## రెండవ హెన్రీరాజు

ఇంగ్లాండు దేశమును పరిపాలించిన ఉత్తమ ప్రభువులలో నీత డొక్కడని నిస్సంశయముగ తెలుపవచ్చును. రెండవ హెన్రీరాజు ౩౫ సంవత్సరములు రాజ్యపాలనము కావించెను. ఈ కాలమం దీతడు దేశమున శాంతి భద్రతలను నెలకొల్పెను. స్టీఫెన్ రాజు కాలమున పైశాచిక తాండవ మొనర్చి, ఆంగ్ల ప్రజలను పలుదుఃఖముల పాలుగావించిన జమీందారీవర్గము నణచివైచి, వారు మరల తలయెత్తకుండగ నందులకై ఏర్పాటు చేసెను. న్యాయ ప్రధాన శాఖయం దీతడు కావించిన మార్పులు మిక్కిలి దూరదృష్టితో కూడినవి. ఈ రాజు అమలు కావించిన సంస్కారణలవలన బ్రిటను దేశమునందలి న్యాయ పరిపాలన క్రమక్రమముగ ఉత్కృష్టస్థితికి వచ్చి, ఆ జాతికి గొప్ప గౌరవము చేకూర్చినది. ఉన్నత వంశీకులు, సామాన్యప్రజలు, ధనవంతులు, దరిద్రులు, అధికారులు, అనధికారులు అను భేదము లేకుండ ఎల్లవారును ధర్మమునకు బద్ధులై యుండవలయు నను నది బ్రిటిషు రాజ్యాంగ విధానము (British Constitution) నందలి యొక ముఖ్యసూత్రము. దీనిని పండితులు Rule of Law (న్యాయ పరిపాలనము) అని వర్ణించుచున్నారు. అట్టి న్యాయ పరిపాలనకు పునాది రెండవ హెన్రీరాజు కాలమున

వేయబడెను. ఆతడు కావించిన ఏర్పాట్లే కొలది మార్పులతో నేటికిని బ్రిటను దేశమందు నెలకొని యున్నవి. క్రైస్తవ మత సంఘమున కూడ తగు మార్పులను కొనిరావలెనని ఈ రాజు కావించిన ప్రయత్నములు ఫలవంతము కాలేదు.

రెండవ హెన్రీప్రభువు దేహబలమును, బుద్ధిసంపదయును కూడ గల యదృష్టశాలి. తేజస్వి. ఆరంభదశయందే యతనిని భాగ్యదేవత కోరి కోరి వరించెడిది. 1154 వ సంవత్సరమున నీతడు ప్రజామోదముతో, ఇంగ్లాండు రాజ్యమున కేలిక యయ్యెనని ఈ వరకే తెలిపినారము. అంతకు పూర్వమే ఆతడు ఫ్రాన్సు దేశమందలి నగజాలునకు పైబడిన రాజ్యమున కేలికగ నుండెను. తల్లిదండ్రులవలన ఆతనికి నార్మండీ, ఆంజో మున్నగు రాష్ట్రములు సంక్రమించెను. తన కేలికయగు ఫ్రాన్సుదేశపు రాజును సందర్శించుటకై హెన్రీ ఫ్రెంచి దర్బారున కొకపర్యాయము పోయెను. యువకుడును, సుందరుడును, తేజశ్శాలియు నైన యీతనిని గాంచి, ఫ్రెంచిరాజు భార్య ఎలియనార్ ఎంతో ముచ్చటపడెను. ఈమె భర్తయైన ఏడవ లూయీరాజు ప్రాపంచిక విషయము లందుకంటె ధార్మిక విషయములలో ఎక్కుడు శ్రద్ధ కలవాడు. ఆతని కాలమంతయు దైవప్రార్థనాదికములందును, తదితర మత కర్మాచరణమునందును గడచుచుండెడిది. విలాసవతియగు ఆతని రాణికీ పద్ధతి యెంతమాత్రమును నచ్చలేదు. ఆమె స్వయముగ అక్విటైన్ మున్నగు రాష్ట్రములకు ప్రభ్వి. రాజస ప్రకృతి గలది. "నాభర్త యొక

నరపాలుడు కాడు. నేనొక సన్యాసిపాల బడితిని" అని యామె వాపోవుచుండెడిది. హెన్రీని చూడగనే ఆమెకు చీకటిలో వెలుతురు కానవచ్చినట్లయ్యెను. పోపు మతగురువువలన వివాహ విచ్ఛేదమును పొంది, ఆ పిమ్మట ఎలియనార్ ప్రభ్వి మూడు నెలలలోగా హెన్రీని వివాహమాడెను. ఈ సిద్ధాంతమునుగాంచి ఐరోపా ప్రపంచమంతయు ముక్కున వ్రేలు వేసికొనెను. ఈ వివాహమువలన సువిశాలమగు అక్విటైన్ (Aquitaine) సంస్థానము హెన్రీ రాజ్యములో చేరిపోయెను. పలికయగు యీ రాజుకంటె సామంతుడగు హెన్రీయే ఎక్కుడు బలవంతుడుగ పరిణమించెను. ఎలియనారు ప్రభ్వి కింతకుమించి కావలసినదేమి! కాని యీ దాంపత్యములో కొంత లోపము లేకపోలేదు. వివాహ మగుసరికి హెన్రీ ప్రభువు పందొమ్మిది సంవత్సరముల యువకుడు. ఎలియనార్ ప్రభ్వి ముప్పది సంవత్సరములు పైబడిన-నిండు జవ్వని. ఈ వయోభేదమువలన రాజునకును రాణికిని భావికాలమున ప్రేమానుబంధము సడలిపోయెను. రాజు పరస్త్రీ లోలుడయ్యెనని తెలిసి, ఎలియనారు ప్రభ్వి చాల బాధపడి, దుఃఖితయై, భర్తను వదలి దూరముగ నివసింప జొచ్చెను. ఆమె పశ్చాజ్జీవితము దుఃఖపూర్ణమయ్యెను. కాని వేమును మ్రింగి చేదునకు వెగటుపడరాదు కదా!

స్టీఫెన్ రాజు అసమర్థ పరిపాలన తరువాత దేశమునకు ముఖ్యముగ కావలసినది శాంతి. దుష్టులగు జమీందారులను శిక్షించి, వారి బలమును భగ్నము కావించిన కాని దేశమునకు

శాంతి లభింపదని హెన్రీరాజు మొదటనే గ్రహించెను. అందులకు వలయు చర్యల నాతడు తక్షణమే గైకొనెను. స్టీఫెన్ రాజు కాలమున ప్రభుత్వాదాయము క్షీణించెను. ఆదాయ వ్యయశాఖయందు నియమితులైన యున్నతాధికారు లందరితోడను స్టీఫెన్ రాజు తగవులాడెను. కావున వారెవ్వరును సక్రమముగ తమధర్మముల నిర్వర్తింపరైరి. అంతేకాక ఈతడు రాజునకుగల స్వంత భూములలో చాలభాగము జమీందారులకు కౌలున కిచ్చెను. ఈ రెండు కారణములచే ఈతని కాలమున ప్రభుత్వాదాయము చాల తగ్గిపోయెను. హెన్రీరాజు తొల్లింటి ఉద్యోగులను మరల వారి వారి హోదాలలో నియమించెను. స్టీఫెన్ రాజు జమీందారుల కిచ్చిన భూముల నీతడు మరల గైకొనెను. అరాజక యుగమునందు రాజునకు చెందిన పెక్కు దుర్గములను జమీందారు లాక్రమించిరి. హెన్రీ ప్రభువు వీరి నాకోటలనుండి వెడల నడచెను. రాజానుమతి లేకుండగ జమీందారులు నిర్మించిన గడీల నన్నిటిని ఈ రాజు కూలద్రోయించెను. ప్రజానీకమును దోచుకొనుటయే వృత్తిగా మెలగుచున్న దుష్టవ్యక్తుల నీ ప్రభువు తరిమివైచెను. స్కాట్లండు ప్రభువు తన దేశముపైదండెత్తిరాగా హెన్రీ రాజాతని నోడించి, పరాభవించి, తనకు పాదాక్రాంతుని చేసికొనెను. ఈ విధముగ దేశమున శాంతి పునరుద్ధరింపబడెను.

కాని యింతమాత్రముచే జమీందారుల బలము శాశ్వతముగ క్షీణింపదని హెన్రీరాజు తెలిసికొనెను. జాగీర్దారులను

శాశ్వతముగ నిర్వీర్యాల కాపించుటకై ఈ ప్రభువు కొన్ని పద్ధతుల నవలంబించెను. జమీందారీ విధానపు ఏర్పాట్ల ప్రకారము రాజువలన భూవసతులను పొందిన ప్రతిజాగీర్దారుడును, యుద్ధ కాలమున రాజు సహాయమునకై నిర్ణీత సంఖ్యగల కొంత యోధవర్గమును పంపవలసి యుండెను. ఆ యోధులకు ఆవశ్యకమగు గుఱ్ఱములు, అస్త్రములు, దుస్తులు, కవచము, మున్నగు వానిని జమీందారుడే ఏర్పాటు చేయవలసి యుండెడిది. కాని ఈ యోధులు సంవత్సరమునందు నలుబది దినములు మాత్రమే రాజసేవ చేయవలెను. ఈ షరతు ననుసరించి జమీందారీ యోధులు యుద్ధముల సాగుచున్నప్పుడు నిర్ణీతకాలము మాత్రము సేనలో పనిచేసి, ఆ పైన గృహోన్ముఖులగుచు వచ్చిరి. యుద్ధము ముగియకపోయినను, వారట్లే కావించెడి వారు. కావున మొదటి హెన్రీరాజు ఈ యేర్పాటులో కొంత మార్పు కావించెను. రెండవ హెన్రీ ఈ పద్ధతిని బలపరచెను. యుద్ధకాలమున యోధులను పంపి సహాయముచేయు పద్ధతికి మారుగ, జమీందారులు నిర్ణీతధనము నిచ్చిన చాలునని హెన్రీ రాజు ప్రకటించెను. ఈ ధనముతో రాజు తనకిచ్చవచ్చిన సైనికులను, తనవద్ద కొలువుంచుకొన వచ్చును. హెన్రీరాజు విధించిన ఈ క్రొత్త పన్నును ఆంగ్లమున Scutage అని వ్యవహరించిరి. ఈ యేర్పాటు చాల దూరదృష్టితో కూడినది. దేశరక్షణము కొరకును, తదితర సమయములందును రాజసేవ కొరకై సైనికులను పంపు పద్ధతిని మాని, దాని స్థానమున

పన్నులను కట్టు పద్ధతి నంగీకరించిన తరువాత, జమీందారుల వద్ద సుశిక్షితులగు యోధులు కరవైరి. క్రమక్రమముగ జమీం దారులు కూడ రణకౌశల్యమును కోల్పోయి కేవల భూస్వాము లుగ నిలచిపోయిరి. జమీందారు లిచ్చెడి పన్నుల నుపయోగించి రాజు బలవత్తరములగు సేనలను సిద్ధముచేసి యుంచుకొన సాగెను. ఈ సేనల నాతడు తరచు పరదేశములందు మాత్రమే ఉపయోగించెడివాడు. కాని అత్యవసర పరిస్థితి యేర్పడినప్పుడు దేశమందలి జమీందారీ తిరుగుబాటులను కూడ ఈ సేనల తోడ్పాటుతోనే రాజు అణచి వేయుచుండెను. సాక్సనురాజుల కాలమునుండియు ఇంగ్లాండు దేశమున ఒక జాతీయసేన యుండుట ఆచారముగ నుండెను. ఈ సేనయందు స్వాతంత్ర్య ప్రతిపత్తిగల ప్రతి పౌరుడును విధిగ పనిచేయవలెను. దేశము నకు ప్రమాద పరిస్థితి యేర్పడినప్పుడు రాజు జాతీయసేనను సమావేశ పరుపవచ్చును. జాతీయసేన తనకు చక్కగ సహాయ పడగలదని తెలిసికొని హెన్రీరాజు ఈ సంస్థను పునరుద్ధరించెను. 1181 వ సంవత్సరమున హెన్రీ ప్రభువు సైనిక శాసనమును (Assize of Arms) కావించెను. ప్రతి స్వాతంత్ర్య ఆంగ్ల పౌరు డును, దేశ సంరక్షణమున రాజునకు సహాయపడు నిమిత్తమై తన కవసరమగు ఆయుధ సామగ్రిని సిద్ధముచేసి యుంచుకొన వలెననియు, ఆ ఆయుధములను రాజోద్యోగు లప్పటప్పట పరీ క్షించు చుందురనియు, ఇందు ప్రకటింపబడెను. ఈ విధముగ జాతీయసేన పునరుద్ధరింపబడెను. ఇందలి సైనికులు పాద

చారులై యుద్ధము కావింతురు. కాని హేస్టింగ్సు యుద్ధమున నార్మను సేనలతో హరోల్డాంగ్లో సాక్సనులు పోరెనది వీరే. మరితర సమయములలో కూడ వీరు ఇంగ్లండు రాజులకు సహాయపడిరి. జాతీయసేనను పునరుద్ధరించుటలో హెన్రీ రాజునకు మరియొక ఉద్దేశ్యము కూడ గలదు. దేశమున నిలకడగ సేనలను సిద్ధము చేసియుంచు పద్ధతి, ఆంగ్లప్రజల కెంతమాత్రమును అంగీకారము కాదు. ఇయ్యది సాక్సను సాంప్రదాయములకు విరుద్ధము. కావున హెన్రీరాజు తన శాశ్వతసేనను (Standing Army) ఫ్రాన్సు మున్నగు పరదేశములలో ఉపయోగించుచు, అంతరంగిక ప్రయోజనములకై జాతీయసేనను మాత్రము రాపించెడివాడు.

ప్రజాస్వత్వములను రక్షించుటకును, సంఘమున న్యాయరక్షణము కావించుటకును, స్వతంత్రమును, నిష్పక్షపాతమును అగు న్యాయప్రధానశాఖయుండుట చాల యవసరము. ఆధునిక నాగరక దేశము లన్నిటియందును ఇట్టి న్యాయశాఖ నెలకొనియున్నది. న్యాయశాఖను మొట్టమొదటి నుండియు చక్కగ పోషించి, దానిని నిర్దుష్టదశకు గొనివచ్చిన జాతులలో ఆంగ్లేయులు ముఖ్యులు. బ్రిటీషు న్యాయపరిపాలన యితర దేశములకు వరవడి దిద్దినది. ఏసుక్రీస్తునకు పూర్వమే ఐరోపా ఖండమునందు విశాల సామ్రాజ్యమును నెలకొల్పి, మిక్కిలి సమర్థతతో రాజ్యపరిపాలనము కావించిన రోమనులు గొప్ప శాసన నిర్మాతలుగ ప్రసిద్ధి గాంచిరి. వారు సక్రమ పద్ధతులపై

న్యాయశాఖను కూడ పెంపుగావించిరి. రోమను సాంప్రదాయ ములకై యూరోపా ఖండమందుగల ప్రతిష్ఠ యపారమైనది. కావున యూరోపా దేశములవారు పలువురు రోమను న్యాయప్రధాన విధానము నంగీకరించుట సహజము. కాని ఆంగ్ల న్యాయ విధానమును, రోమను న్యాయవిధానమును పోల్చిచూచిన పక్షమున, నిందు మొదటిదే శ్రేష్ఠతరముగు విధానమని యెల్లవారును అంగీకరింతురు. ఈ రెంటిని పోల్చిచూచుటకై వీని యందలి ముఖ్య లక్షణము లిందు చూపబడుచున్నవి. బ్రిటీషు న్యాయ విధానము ప్రకారము ఏ వ్యక్తిపైనను మనము నేరారోపణము చేయుటకు పూర్వము, ఆతడు సివిలు లేక క్రిమినలు శాసనము లకు విరుద్ధముగ వర్తించినట్లు, విస్పష్టముగ చూపవలెను. విచా రణ జరుగునప్పుడు న్యాయాధిపతి తటస్థుడగు మధ్యవర్తిగ నుండవలెను. ఇరుపక్షముల వారును చూపగల్గిన సాక్ష్యముల యాధారముపై ఆతడు వ్యాజ్య పరిష్కారము కావించును. సాక్షులు పరమేశ్వరుని మ్రోల సత్యమును మాత్రమే పల్కెదమని ప్రమాణముచేసి, బహిరంగముగ న్యాయస్థానములో తమ సాక్ష్యమును ఈయవలెను. అభియోగమునందలి రెండు పక్ష ములవారును, లేదా వారిచే నియమింపబడిన న్యాయవాదు లును సాక్షులను తరచి తరచి ప్రశ్నించి, సాక్ష్యమందలి నిజా నిజములను కనుగొనవచ్చును. సాక్షుల వాఙ్మూలము లందలి సత్యాసత్యములను పండ్రెండుగురు న్యాయవర్తనులగు సత్పురు షులు బాగుగా విమర్శించి నిర్ణయింతురు. వారి నిర్ణయమును

దృష్టియం దుంచుకొని, న్యాయాధిపతి శాసనముల ప్రకారము దోషిని శిక్షించుట లేదా విడచిపుచ్చును. బ్రిటీషు న్యాయస్థానములలో అనుసరింపబడుచున్న యీ విధానము మిక్కిలి సామాన్యముగ కాన్పించవచ్చును. కాని రోమను విధానమును పరిశీలించినచో బ్రిటీషు విధానమందలి వైశిష్ట్యత మనకు గోచరింపగలదు. రోమను పద్ధతి ప్రకారము న్యాయాధికారి స్వయముగ సివిలు క్రిమినలు నేరములను గూర్చి దర్యాప్తు జరుపును. ఈ దర్యాప్తు జరుపువిధానమున ఎట్టి నిర్బంధములును లేవు. అనుమానితుడగు వ్యక్తిని న్యాయాధిపతి రహస్యముగ పరీక్షింపవచ్చును. నిందితుడు అన్ని ప్రశ్నలకును సమాధానము చెప్పి తీరవలెను. నిందితునికి తనపక్షమున వ్యవహరించుటకు న్యాయవాదిని నియమించుకొనుట కధికారము సార్వత్రికము కాదు. సాక్ష్యమును నిందితుని పరోక్షమున రహస్యముగ సేకరింపవచ్చును. ఈ కార్యకలాపమంతయును జరిగిన పిమ్మట దోషిపై మోపవలసిన నేరమునుగూర్చి నిర్ణయము జరుగును. ఆపైన నేర మెట్టిదియో ప్రకటింపబడును. ఈ విధానమువలన అనుమానముపై వ్యక్తులను బెదరించుట, నిర్బంధపరచి వాఙ్మూలముల గ్రహించుట, అనుమానితుని క్రూరముగ హింసించుట, నేరము నంగీకరింపజేయుటకై అనుమానితుని ఇతర విధముల జడిపించుట, మున్నగు మార్గములు సర్వసాధారణముగ వాడుకలోనికి వచ్చును. కాని న్యాయశాఖయం దట్టి దుష్టపద్ధతులు ప్రవేశింప కుండునట్లు సుమారు ఆరు శతాబ్దులకు పూర్వమే ఆంగ్ల దేశమున ఏర్పాట్లు జరిగినవి. రెండవ హెన్రీరాజు మునిమనుమ

డగు మొదటి ఎడ్వర్డురాజు పరిపాలన ముగియునరికి ఆంగ్లేయుల సివిలు క్రిమినలు న్యాయవిధానము ఇంచుమించు నేటి స్వరూపమును దాల్చినది. ఇందులకు ముఖ్యకారణము ఆంగ్లదేశపు సామాన్య న్యాయము. ఆంగ్లేయుల న్యాయప్రదాన పద్ధతులందు జ్యూరీల నేర్పాటుచేయుట యొక ముఖ్య లక్షణము. రెండవ హెన్రీరాజు జ్యూరీ విధానమును న్యాయశాఖయందు ప్రవేశపెట్టి, దానిని బలపరచి, సర్వత్ర వ్యాపింపజేసినవాడు. కావున చరిత్రకారు లీతనిని "జ్యూరీ విధానమునకు జనకుడు" అని ప్రశంసించుచున్నారు. ఆంగ్లదేశపు సామాన్య న్యాయము (Common Law) ను గూర్చియు, జ్యూరీ పద్ధతిని గూర్చియు ఇచ్చట కొంత ప్రశంస చేయవలసియున్నది.

బ్రిటను దేశమున వ్యక్తి స్వాతంత్ర్యము, భూస్వామ్యములు, దొంగతనము, ఖూనీలు మొదలగు నేరములు మున్నగు విషయములను పరిష్కరించుటకై న్యాయాధికారులు సామాన్య న్యాయము నుపయోగించుచున్నారు. ఈ న్యాయమునందు చాలభాగము నేటికిని కూడ లిఖిత రూపమును పొందలేదు. ఆంగ్లేయులకు ప్రప్రథమము నుండియు తమ శాసనములను, రాజ్యాంగ విధానమును సాంప్రదాయ రూపమునందే యుంచుట ఎక్కువ యిష్టము. ఉదాత్త భావములతోడను, గంభీర పద జాలము తోడను కూడిన ప్రజాస్వత్వ ప్రకటనల యెడలను, రాజ్యాంగ విధానము నెడలను ఆంగ్లేయులకు నాటికిని నేటికిని కూడ అవిశ్వాసము. అట్టి దస్తావేజుల యెడల వారికెంతయో వైముఖ్యము. కావున మేము పైన పేర్కొనిన సామాన్య

న్యాయమునందలి అనేక విషయములు ఆంగ్ల శాసనములలో కానరావు. ఉదాహరణమునకు ఆంగ్లేయుల న్యాయశాస్త్రములో హత్యకు సంబంధించిన సక్రమమగు నిర్వచనము కానరాదు. ఇట్టి విషయములు ప్రజల సాంప్రదాయము పైనను, ఆ సాంప్రదాయములపై వ్యాఖ్యానము కావించి, న్యాయాధికారులు కావించిన తీర్పుల పైనను ఆధారపడి యుండును. ఈ యంశముల గ్రహించుటకై న్యాయవాదులు, న్యాయస్థానములలో కావింపబడిన తీర్పులను శ్రద్ధగ చదువవలయును. పదునాల్గవ శతాబ్దమునుండి ఆంగ్ల న్యాయవాదులు సంఘములుగ నేర్పడి, న్యాయస్థానములందు కావింపబడిన నిర్ణయముల నేకెట క్రోడీకరించి, న్యాయశాస్త్ర నివేదికలవంటి గ్రంథములను సంసిద్ధము కావించెడి వారు. న్యాయాధిపతులు వీనిని ప్రామాణికములుగ అంగీకరించు చుండిరి. పైన పేర్కొనబడిన న్యాయవాదుల సంఘములకు "Inns of Court" అని పేరు. ఇవి ఒక విధమగు న్యాయశాస్త్ర కళాశాలలుగ కూడ వ్యవహరించెడివి. ఈ విధముగ మూడు శతాబ్దులు గడచెను. ఈ దీర్ఘకాలములో ఆంగ్లేయుల న్యాయశాస్త్రమును గ్రంథస్థము చేయుటకై యెవ్వరును ప్రయత్నింపలేదు. కాని న్యాయశాస్త్ర గ్రంథములను ప్రకటించిన వారెల్లరును, ప్రజానీకమున వాడుకయందున్న ఆచారములను విశదీకరించుటకును, వానిపై వ్యాఖ్యానించుటకును మాత్రము యత్నించిరి. ఈ పద్ధతియందలి ఆంతర్యమును మనము గ్రహింపవలెను. నాగరక సాంఘిక జీవనమునకై కావలసిన న్యాయ శాసనములు, ప్రజల యాచా

రము లందును, సాంప్రదాయము లందును నెలకొనియున్న వనియు, న్యాయవాదులు ఆ యాచారములను, సాంప్రదాయములను, అంతకు పూర్వము న్యాయస్థానములవారు కావించిన తీర్పులను, శ్రద్ధగ పరిశీలించి న్యాయ స్వరూపమును గ్రహింప వలెననియు, ఆంగ్ల ప్రజల దృఢవిశ్వాసము. రెండవ హెన్రీరాజు కాలమందలి న్యాయవాదులు పదవ శతాబ్ది న్యాయవాదుల ప్రకటనలకు వారెన్నడును తలంచి యుండని క్రొత్త యర్థములను చెప్పిరి. క్రొత్త వ్యాఖ్యానముల కావించిరి. సమకాలీన పరిస్థితులకు వారి నూతన వ్యాఖ్యానముల వర్తింపజేసిరి. ఈ విధముగ పూర్వోదాహరణము (precedent) లేర్పడెను. ఖాపితరమున నొక న్యాయవాది న్యాయాధిపతి మ్రోల వాదించుచు, ఒక సాంప్రదాయమును, ఆచారమును పూర్వపు న్యాయస్థానములవారు అంగీకరించినట్లు తెల్పిన పక్షమున, ఆ న్యాయాధిపతి సర్వ సాధారణముగ ఆ తీర్పును ప్రామాణికముగ నంగీకరించును. ఇట్టి సందర్భములలో న్యాయాధిపతి ప్రస్తుత ప్రజాభిప్రాయమును, విమర్శింపబడుచున్న అభియోగపు న్యాయాన్యాయముల గూర్చి తన స్వంతభావములను, సమ్మేళనము కావించి, ఒక నిశ్చితాభిప్రాయమునకు వచ్చును. ఇట్టి తీర్మానములే కాలక్రమమున అభియోగ న్యాయము (Case-law) గా మారినవి. బ్రిటనులోని సామాన్య ప్రజలకు గల్గ స్వాతంత్ర్యమునకును, వారి హక్కులకును ఈ తీర్పులే మూలము. ఈ హక్కులను కాపాడుటకై అమెరికా సంయుక్త రాష్ట్రములవారు అమెరికా స్వాతంత్ర్య ప్రకటనమును, రాజ్యాంగ

విధానమున పౌరస్వత్వముల రక్షణకై ఈయబడిన హామీలను, సాధనముగ భావించుచున్నారు. ఫ్రాన్సు మున్నగు దేశము లలో మానవహక్కుల ప్రకటనల కావించి, రాజ్యాంగ నిర్మా తలు ప్రాథమిక పౌరస్వత్వముల రక్షించుటకై పాటుపడినారు. కాని ఆంగ్లేయుల న్యాయవిధానము మాత్ర మట్లుగాక, క్రమ క్రమముగ ఏర్పడినది. ఆంగ్ల రాజ్యాంగ విధానమునందు Magna Carta (మహాపత్రము) అతి ముఖ్యమగు రాజకీయపు దస్తావేజుగ పరిగణింప బడుచున్నది. కాని యీ పత్రమును సిద్ధము చేసినవారు కూడ ఇందు నూతన విషయముల చొప్పిం చుటకు గాని, సార్వజనీన సిద్ధాంతముల కావించుటకు కాని యత్నింపలేదు.

ఆంగ్ల న్యాయవిధానము నందలి విశిష్ట లక్షణములలో జ్యూరీ పద్ధతి యొక్కటి. జ్యూరీ యనగా ఒక పెద్దమనుష్యుల సంఘము. ఇందు సాధారణముగ పండ్రెండుగురు సభ్యు లుందురు. వీరు న్యాయశాస్త్ర ప్రకారము ప్రమాణమును గైకొని, తమకు లభించిన సాక్ష్యపు టాధారముపై సత్యము నే పక్షమునదని వ్యాఖ్యానము చేయుదురు. న్యాయసభలలో జ్యూరీ లను నియమించి వారి సహాయముతో వ్యాజ్యముల పరిష్క రించు పద్ధతిని ప్రారంభించినవాడు హెన్రీరాజు. ఈ రాజునకు పూర్వము ఆంగ్ల దేశమున జ్యూరీ సంఘముల నెవ్వరును నియ మింపలేదని తెల్పుటకు వలను పడదు. రెండవ హెన్రీరాజు ముత్తాతయగు విజయశూరుడు 1085 వ సంవత్సరమున ఆంగ్ల

దేశమును గూర్చి ఆర్థిక పరిశోధన జరిపించినప్పుడు, జ్యూరీపద్ధతి మొట్టమొదటసారి ఆంగ్ల భూమియం దవతరించెను. ఇయ్యది నిజమునకు ఆంగ్లో సాక్సను సంఘమున కపరిచితమగు నూతన విధానము. దీని నైరోపా ఖండమందలి ఫ్రాంకు ప్రభువులు పరిపాలనా సౌకర్యముకొరకై వాడుచుండెడివారు. పరిపాలనా సమస్యలను పరిష్కరించుసందర్భమున, రాజు రాజ్యమందలి కొందరు పెద్దమనుష్యులను రాపించి, ఒకానొక విషయమును గూర్చి తమకు తెలిసిన సత్యాంశముల నెల్ల వెలిబుచ్చవలసినదిగ, వారి నాజ్ఞాపింప వచ్చును. తమ వాఙ్మూలముల నిచ్చుటకు పూర్వమీ పెద్దమనుష్యులు సత్యమునే పల్కెదమని ప్రమాణము చేయవలెను. ఈ జ్యూరీ విధానము మిక్కిలి ఉపయోగకరమైనదని తెలిసికొని రెండవ హెన్రీరాజు దీనిని న్యాయ శాఖయందు ప్రవేశపెట్టెను.

స్టీఫెన్ రాజు కాలమున ఒకవంక జమీందారుల ప్రాబల్యము హెచ్చుటయు, మరొకవంక రాజుయొక్క అధికారములు తగ్గుటయు సంభవించెనని మనమింతకు పూర్వమే తెలిసికొన్నాము. ఈ పరిస్థితిని సంపూర్ణముగ తారుమారు చేయుటకై రెండవ హెన్రీ పూనుకొనెను. న్యాయ ప్రధానశాఖను జమీందారుల చేతినుండి తప్పించి, సంపూర్ణముగ ప్రభుత్వము వారి వశము కావింపగల్గిన పక్షమున, తన యుద్దేశ్య మీడేరగలదని ఈ రాజు తెలిసికొనెను. కాని యీ లక్ష్యమును సాధించుటకొరకై రాజు మిక్కిలి జాగరూకతతో మెలగవలెను. చిర

కాలము నుండియు ఆంగ్లదేశమున న్యాయ ప్రదానము చేయు హక్కును ప్రభుత్వము వారును, జమీందారులును కూడ అనుభవించు చుండిరి. జమీందారులకు గల యీ హక్కును అకస్మాత్తుగ రద్దు చేయుటకై, ఏ రాజును పూనుకొనుటకు వీలులేదు. అది ప్రమాద భూయిష్టము. ప్రాచీన సాంప్రదాయముల యెడ ఆంగ్లజాతి వారి కెంతయో పట్టుదల గలదు. కావున హెన్రీ రాజు జమీందారులతో సూటిగ వివాదమునకు దిగక వేరొక మార్గమును త్రొక్కెను. అతడు ప్రాచీనాచారములను త్రోసిపుచ్చక, వానికొక నూతన వ్యాఖ్యానము కావించెను. పురాతన సాంప్రదాయముల ప్రకారము రాజునకును, తదితర ప్రభువులకును, తమతమ రాజ్యమునందును, సంస్థానము లందును శాంతిని నెలకొల్పి యుంచుకొను హక్కుగలదు. ఆ హక్కుకు విరుద్ధముగ నెవరైన నేరములుసల్పి శాంతి భంగము కావించినచో, అట్టి నేరస్థులను శిక్షించుటకు, రాజునకును, ఇతర ప్రభువులకును అధికారము గలదు. ఈ యాచారమును హెన్రీరాజు తన కుపయోగకరముగ మార్చుకొనెను. ప్రాచీన సాంప్రదాయము ననుసరించి, ఏ యిలాకాలో శాంతిభంగము జరుగునో నేరస్థులు ఆ యిలాకా న్యాయస్థానములలోనే దండింపబడవలెను. రాజు దేశమునకెల్ల ప్రభువు కావున దేశమునందే భాగమున శాంతిభంగము సంభవించినను, అది రాజుగారి యిలాకాలో జరిగిన శాంతిభంగమే యనియు, అట్టి నేరము కావించిన దోషుల అభియోగముల విచారించి, దండన విధించు నధి

కారము, రాజుగారి న్యాయస్థానములకే కలదనియు హెన్రీ ప్రభువు నిర్ణయించెను. ఈ విధముగ దేశమందలి క్రిమినలు నేరములన్నియు ప్రభుత్వమువారు నెలకొల్పిన న్యాయస్థానము లందే విచారణకు రావలెను. ఇట్లు చేయుటవలన జమీందారుల హక్కులకు భంగము కల్గును. జమీందారుల న్యాయస్థానము లందలి అభియోగములను ప్రభుత్వ న్యాయస్థానములవారు నిర్బంధముగ తీసికొనుట ఆచారములకు విరుద్ధము. కావున హెన్రీరాజు ఈ సందర్భమున నిర్బంధము నుపయోగింపలేదు. కాని ప్రభుత్వ న్యాయస్థానములలోని న్యాయప్రదాన విధానము శ్రేష్ఠతరమైనది యని ప్రజలకు విశ్వాసము కల్గినచో వారు తమంత తామే తమ అభియోగములను అచ్చటికి (ప్రభుత్వ న్యాయస్థానములకు) మార్పించుకొందురు. ప్రభుత్వమువారి కోర్టుల నున్నతదశకు కొనివచ్చుటకై, ఈ రాజు సర్వవిధముల యత్నించెను. ఈ ప్రయత్నములు మొదటి హెన్రీరాజు కాలము నుండియే జరుగుచున్నట్లు తెలుపవచ్చును. మొదటి హెన్రీ కాల మున రాజు దర్బారునుండి కొందరు సమర్థులైన ఉద్యోగులు జిల్లాలలో పర్యటనము కావించుచు, జిల్లా న్యాయస్థానములలో అభియోగములను విచారించుట వాడుక యయ్యెను. ఈ ఉద్యోగులు న్యాయశాస్త్రపండితులు కావున వారి నిర్ణయములు మిక్కిలి ధర్మబద్ధముగను, సమంజసముగను ఉండెడివి. జమీం దారుల న్యాయస్థానములలో జమీందారు స్వయముగ కాని, తనకు సహాయకుడగు నొక యధికారి ద్వారా కాని, నేరముల

పరిష్కారము కావించెడివాడు. జమీందారులును అతని ఉద్యో గులును న్యాయశాస్త్ర నిపుణులు కానందున, వారి నిర్ణయ ములు సంతృప్తికరముగ నుండెడివి కావు. ప్రభుత్వ న్యాయ స్థానములు దేశమం దెల్లెడలను కూడ ఒకే విధమగు న్యాయ విధానము నవలంబించెడివి. జమీందారు లట్లుకాక ఎవారికితోచిన విధమున వారు తీర్పులు చెప్పెడివారు. ప్రభుత్వ న్యాయస్థాన ములలో జరిగిన తీర్పులను, ప్రభుత్వాధికారులు తు. చ. తప్ప కుండ అమలు కావించెడివారు. వారి కట్టి సామర్థ్యము కూడ ఉండెడిది. జమీందారు లీ విషయమున ప్రభుత్వములో నేవిధము గను తులతూగజాలక పోయిరని వేరుగ చెప్ప నవసరము లేదు. పై కారణములవలన ప్రభుత్వ న్యాయస్థానములు క్రమక్రమ ముగ ప్రజామోదమును పొందుటయు, జమీందారుల న్యాయ స్థానములు వెనుకబడుటయు తటస్థించెను.

అభియోగములను జమీందారుల న్యాయస్థానములు నుండి తప్పించి, ప్రభుత్వ న్యాయస్థానములలోనికి మార్పించుటకొరకై హెన్రీరాజు ఒక నూతనపద్ధతిని కనిపెట్టెను. ఈ విషయమునందు రాజు కొన్ని ప్రత్యేకమగు ప్రకటనలను జారీ చేయసాగెను. ఈ యాజ్ఞకు ఆంగ్లమున Writ అని పేరు. ఈ ప్రకటనకు ఫలితముగ కొన్ని ప్రత్యేకలక్షణములుగల అభియోగములు రాజు సూచిం చిన కొన్ని న్యాయస్థానములలో మాత్రమే విచారింప బడవలెను. హెన్రీరాజుతరువాత కొంతకాలమువరకును ఆంగ్లప్రభువులు ఇట్టి ప్రకటనలను జారీచేయుచు వచ్చినందున, ప్రభుత్వ న్యాయస్థాన

ముల ప్రాబల్యము హెచ్చసాగెను. ఇందువలన జమీందారుల కోర్టులకు పనియే లేకుండపోయెను. ఇందులకు జమీందారులు కోపగించి, ఇట్టి ప్రకటనలను ముందు ముందు జారీ చేయకూడదని నొక్కిపెట్టిరి. కావున మూడవ హెన్రీరాజు కాలమునుండి క్రొత్త ప్రకటనలు (Writs) జారీచేయుపద్ధతి ఆగిపోయెను. కాని న్యాయవాదులు పాతప్రకటనలకు క్రొత్త వ్యాఖ్యానముల చెప్పి, వీలైనంతవరకు అభియోగములను జమీందారుల కోర్టులనుండి ప్రభుత్వ న్యాయస్థానములలోనికి మార్పించుచునే వచ్చిరి. జమీందారుల యుగములో, న్యాయప్రధాన శాఖ వలన జమీందారులకును, రాజునకును కూడ ఆదాయము లభించెడిది. నిందితులపై జుర్మానావిధించు పద్ధతి ఆ కాలమున విస్తారముగ వాడుకయందుండెను. ఈ జుర్మానాలవలన ఆదాయము హెచ్చుచుండినందున జమీందారులును, రాజులును కూడ తమ తమ న్యాయస్థానములకు వీలైనంతపని లభించుచుండవలెనని వాంఛించుట సహజము. జ్యూరీ విధానమువలన తమకు శ్రేష్ఠతరమగు న్యాయము లభింపగలదని యెరింగి, ప్రజలు ప్రభుత్వ న్యాయస్థానములవైపు మొగ్గు చూపసాగిరి. అభియోగములను జ్యూరీచే పరిష్కారము కావించు నధికారము రాజునకు మాత్రమే ఉండెను. రాజు నాజ్ఞవలన మాత్రమే జ్యూరీలు ఏర్పాటు అగును.

రెండవ హెన్రీరాజు న్యాయశాఖను సంస్కరించి, అందు క్రమ పద్ధతులను ప్రవేశపెట్టుటకు పూర్వము ప్రబలియుండిన పరిస్థితులను ఇచ్చట సూక్ష్మముగ వర్ణింపవలసి యున్నది. అంతకు

పూర్వము సివిలు క్రిమినలు నేరముల నన్నిటిని పరిష్కరించు టకు మూడు మార్గము లుండెను. అభియోగమందలి యిరు పక్షములలో నొక్కరు తమ వాదము న్యాయమైనదని ప్రమాణముచేసి న్యాయస్థానమువారి ముందర వాఙ్మూలము నీయ గల్గిన కొందరు పెద్ద మనుష్యులను హాజరు పెట్టవలెను. వారి వాఙ్మూలముల ఆధారముపై కోర్టువారు తీర్పుచెప్పుచుండిరి. అసత్యమగు వాఙ్మూలము నిచ్చిన వారిని భగవంతుడు శిక్షించు నని ఆకాలపు ప్రజలు నమ్ముచుండిరి. రెండవ పద్ధతి ప్రకారము కక్షిదారులలో ఎవరైన నొకరు కఠినమగు అగ్నిపరీక్ష నీయ వలెను. వారు ఎఱ్ఱగ కాలిన ఇనుపకడ్డీని చేతిలో పట్టుకొని మూడడుగులు వేయవలెను. లేదా తమ కొసంగబడిన రొట్టెను తినవలెను. లేదా నియమితకాలము నీటిలో మునిగియుండ వలెను. దీనిని ఆంగ్లమున "Trial by Ordeal" అనుచున్నారు. వేడి యినుమువలన చేతులు కాలని పక్షమునను, రొట్టె తినుట యందు కక్షిదారు ఉక్కిరి బిక్కిరి కాకపోయినను, నీటినుండి అతడు సులభముగ పైకి తేలివచ్చినను, అట్టి పక్షము న్యాయ పక్షమని న్యాయాధికారులు నిర్ణయించుచుండిరి. పై పద్ధతులు రెండును సాక్సనుల యుగమునుండియు ఆచారములో నుండెను. నార్మనుల అధికారము బలపడిన వెనుక వారు ఒక నూతన పద్ధతిని ప్రవేశపెట్టిరి. ఈ పద్ధతి ముఖ్యముగ సివిలు వ్యాజ్యముల పరిష్కారమం దుపయోగపడుచుండెడిది. దీని నాంగ్లమున "Trial by Battle" (అనగా బలప్రదర్శనముద్వారా

వ్యాజ్య పరిష్కారము) అని వర్ణించుచుండిరి. ఏదైన ఒక ఆస్తికి హక్కుదారు లెవ్వరను విషయమున వివాదము సంభవించి నప్పుడు, ఇరుపక్షములవారును తమ హక్కు న్యాయమైనదని నిరూపించుటకై ఒక్కొక్క యోధుని ఎన్నుకొనెడివారు. ఇర్వురు యోధులును బహిరంగముగ పోరాడెడివారు. ఈ పోరాటమున నే పక్షపు యోధుడు విజయము సాధించిన నాపక్షము న్యాయపక్షమని మధ్యవర్తులు తీర్పు చెప్పెడివారు. మహో న్యాయదక్షుడైన పరమేశ్వరుడు న్యాయపక్షము నవలంబించిన వీరునికి బలమును ప్రసాదించునని ఇందలి విశ్వాసము. ఆ కాలపు సామాన్యప్రజ లీ యంశమును నమ్మెడివారు. కాని ధనవంతులగు వారు మాత్రము భారమునంతను పరమేశ్వరునిపై పడవేయుట కిచ్చగింపక, తమవద్ద బలశాలులైన యోధులను కొలువుంచుకొను చుండెడివారు. బలప్రదర్శనము ద్వారా వ్యాజ్య పరిష్కారము కావించుకొను పద్ధతి ఆంగ్ల ప్రజలలో పలువురకు నచ్చదయ్యెను. కావున 1215 వ సంవత్సరము నాటికే క్రైస్తవ మతసంఘము వారీ పద్ధతి నంగీకరించుటకు నిరాకరించిరి. ఈ విధముగ జ్యూరీ విధానమున కెక్కుడు ప్రాముఖ్యత లభింపసాగెను. అయినను పై పద్ధతిని ప్రభుత్వమువారు రద్దు చేయలేదు. 1818 వ సంవత్సరమున నొక వ్యాజ్యమునందలి యొక కక్షిదారుడు తన అభియోగము బలప్రదర్శన మార్గమున పరిష్కారము కావలెనని పట్టుపట్టెను. న్యాయమూర్తుల కేమి చేయవలెనో తోచలేదు. అంతట పార్లమెంటు సభవారు

జోక్యము కలుగజేసికొని బలప్రదర్శన విధానము న్యాయ విరుద్ధమని శాసనము కావించిరి.

రెండవ హెన్రీరాజు కాలము నాటి జ్యూరీలకును నేటి జ్యూరీలకును చాల భేదము కలదు. కాలక్రమమున జ్యూరీ సంఘములు నేటి స్వరూపమును పొందెను. మొదటిదశలో ఏదైన నొక వివాదమును గూర్చిన సమస్త విషయములను స్వయముగ తెలిసినవారును, లేదా ఒక సంఘటనను స్వయముగ చూచినవారును, జ్యూరీసభ్యులుగ నుండుచు వచ్చిరి. అనగా ఒక అభియోగమునందు జ్యూరీ సభ్యులే సాక్షులుగను, న్యాయమూర్తులుగను ఉండెడివారు. మరి కొంతకాలము గడచిన వెనుక జ్యూరీసభ్యులు సాక్షులుగ మాత్రము ఏర్పడి, మధ్యవర్తులగు మరికొందరు పెద్ద మనుష్యులకు తమకు తెలిసిన యంశములు నివేదించుచు వచ్చిరి. ఇంకను కొంతకాలము నడచిన తరువాత, నేటికాలపు జ్యూరీ సంఘము లేర్పడినట్లు మనము భావింపనగును. ఇప్పటి జ్యూరీసభ్యులు వివాద గ్రస్తమగు విషయమును గూర్చి ఏ యంశములను ఎరుంగని వారుగను, కక్షిదారుల గూర్చి ఎట్టి అనుకూల ప్రతికూల భావనములును లేనివారుగను, ఉందురు. వారు యోగ్యులగు పెద్దమనుష్యులు. అభియోగ విచారణ సాగుచున్నప్పుడు వారు న్యాయస్థానమున నుపవిష్టులై, సాక్షుల వాఙ్మూలములను, న్యాయవాదుల వాదోపవాదములను విని, వ్యాజ్యమును కూర్చి యేర్పరుచుకొనిన యభిప్రాయములను న్యాయమూర్తికి తెలియ

జేయుదురు. నేటి జ్యూరీ సభ్యులు పక్షపాతబుద్ధి యేమాత్ర మును లేని మధ్యవర్తులు. ఇట్టి విధానమువలన ఇరుపక్షముల వారికిని న్యాయము లభించుటకు చక్కని యవకాశములు కలవు.

న్యాయశాఖను సంస్కరించు సందర్భమున రెండవ హెన్రీప్రభువు కొన్ని ముఖ్యమగు శాసనములను కావించెను. అందు మొదటిది 1166 వ సంవత్సరము నాటి క్లారెండన్ శాసనము (Assize of Clarendon). రాజుగారి దర్బారునుండి కొందరు న్యాయాధికారులను జిల్లాలలోనికి పంపుపద్ధతిని మొదటి హెన్రీరాజు ప్రారంభించెను. రాజోద్యోగులు జిల్లాలలో పర్యటనము కావించి, రాజునకు రావలసిన ఆదాయమును గూర్చి వివరముగ దర్యాప్తు చేసెడివారు. అంతేకాక వారు దుష్టులగు నేరస్థులను శిక్షించుటలో కూడ, పాటుపడెడివారు. ఈ పద్ధతికి రెండవ హెన్రీరాజు పై శాసనమువలన మెరుగు పెట్టెను. రాజోద్యోగులు జిల్లాలలోనికి పోయినప్పుడు పండ్రెండుగురు తాలూకా ప్రతినిధులును, నలుపురు చొప్పున నగర ప్రతినిధులును, సమావేశమై, తమతమ యిలాకాలోని నేరస్థులను, ఈ రాజోద్యోగుల ముందు హాజరు పెట్టవలెను. అటుపిమ్మట నేరస్థులు న్యాయప్రకారము దండనకు పాలగుదురు. ప్రజా ప్రతినిధులచే దోషిగ వర్ణింపబడిన యాతనికి న్యాయస్థానములో నెట్టి శిక్షయు లభింపక పోయినను, ఆతడు దేశమునందు నివసించుట కనర్హుడని భావింపబడెడిది. క్లారెండను శాసనము క్రిమినలు

నేరములకు మాత్రమే వర్తించెను. 1176 వ సంవత్సరమున రెండవ హెన్రీ నార్దాంప్టన్ శాసనము (Assize of Northampton) ను కావించి సివిలు వ్యాజ్యములను కూడ జ్యూరీలచే పరిష్కారము చేయించుటకు వసతి కల్పించెను. ఈ విధముగ దేశమందెల్లెడల రాజుచే నియమింపబడిన న్యాయాధిపతులు సివిలు క్రిమినలు వ్యాజ్యములను తీర్మానముచేయు పద్ధతి యేర్పడెను. జిల్లా కోర్టులలో తీర్పు కావింపబడిన అభియోగముల పునర్విమర్శ రాజుయొక్క సలహాదారుల సంఘమువారు (Kings' Council) కావించెడివారు. కాలక్రమమున ఈ సలహాసంఘము నుండి పెక్కు న్యాయస్థానము లుద్భవించెను. Court of Kings' Bench (రాజుగారి న్యాయసభ), Court of Common pleas (సామాన్య వ్యాజ్య న్యాయస్థానము) అనునవి ఇందు ముఖ్యమైనవి.

రాజ్యాంగ విషయములలో రెండవ హెన్రీరాజు పట్టిన దెల్ల బంగారమయ్యెను. ఆతడు ప్రవేశపెట్టిన సంస్కరణము లన్నియు ప్రజామోదమును పొంది, విజయవంతములై దేశమునకు క్షేమమును గూర్చెను. క్రైస్తవ మతసంఘమున ఆనాడు ప్రబలియున్న లోపములను సవరించుటకై హెన్రీరాజు కొన్ని ప్రతిపాదనల కావించెను. కాని ఆ ప్రతిపాదన లాకాలమున కాంటర్బరీ మతాధికారిగ నున్న థామస్ బెకెట్ (Thomas Becket) అను క్రైస్తవ ప్రముఖున కెంతమాత్రమును అంగీకారము కాలేదు. ఈ విషయమున రాజునకును కాంటర్బరీ

మతాధికారికిని తీవ్రమగు భేదాభిప్రాయము లుద్భవించెను. తుదకు రాజున కోటమి సంభవించెను. ఆ విషయమును గూర్చిన వివరములు తెల్పుటకు పూర్వము నార్మనురాజుల పరిపాలన ప్రారంభ మైనప్పటినుండియు రాజులకును క్రైస్తవ మత సంఘము వారికిని గల సంబంధమును గూర్చి యించుక ముచ్చటించవలసి యున్నది. పదునొకండవ శతాబ్దియందు క్రైస్తవ మత సంఘమున గొప్ప సంచలనము ప్రారంభమై, మతగురువులలో కానవచ్చుచుండిన లోపములను తొలగింపవలెనను తీవ్ర వాంఛ యుద్భవించెను. తత్ఫలితముగ కొన్ని సంస్కరణములు ప్రతిపాదింప బడెను. క్రైస్తవ మతసంఘములో గురుపీఠము లందున్న వారెవ్వరును, వివాహ మాడరాదనునది ఇందలి మొదటి సూత్రము. మత సంఘములో హోదాలను, ధనమును వెచ్చించి సంపాదింపరాదనునది రెండవ సూత్రము. ఈ యంశములు రెండింటిని గూర్చి యెవ్వరికిని అభ్యంతర ముండబోదు. కాని మూడవసూత్రము మిక్కిలి వివాదాస్పదముగ పరిణమించెను. క్రైస్తవ మత సంఘమునందు పనిచేయువా రెవ్వరును, లౌకికాధికారుల వలన ఎట్టి అధికారిక చిహ్నములను గ్రహింప రాదనునది మూడవ సూత్రము. మతగురువులు లౌకికాధికారుల యనుగ్రహమునకై ప్రాకులాడ రాదనియు, అట్లు జరిగినచో వారు భగవత్సేవను, వృత్తి ధర్మములను, విస్మరించి హోదాలకొరకై తాపత్రయ పడుదురనియు ఈ నిర్బంధము నందలి అంతర్యము. ఆ కాలమున పోపు మతాధికారిగ నుండిన

ఏడవ గ్రెగరీ మిక్కిలి సమర్థుడు. చాల పలుకుబడి గలవాడు. క్రైస్తవ మతసంఘమును బాగుగ బలపరచి, దానిని రాజుల యొక్కయు, ఇతర ప్రభువుల యొక్కయు, అధికారమునుండి తప్పించి, సర్వస్వతంత్రము కావింపవలెనని యాతని ఉద్దేశ్యము. కాని ఈ యాశయ మీడేరుట కొక పెద్ద యవరోధముండెను. ఆ కాలపు మతాధికారులుపలువురు బిషప్పులు,ఆబట్లుమున్నగువారు ఇతర జమీందారులవలెనే, గొప్ప భూవసతులు కల్గియుండెడి వారు. భూవసతులు గలవారు రాజునకు పన్నులు చెల్లించుట, యుద్ధకాలమున సైనికులను పంపుట, స్వామిభక్తి ప్రమాణము కావించుట, మున్నగు ధర్మముల నిర్వర్తింప వలయుననుట సమంజసము. తమనుండి భూవసతులను పొందిన మతాధికారు లితర జమీందారులవలెనే, తమకు వశ్యులై యుండవలయునని రాజులు పట్టుపట్టెడివారు. ఈ విధముగ రాజునకును క్రైస్తవ మతసంఘమునకును తీవ్ర విభేదములు కలుగజొచ్చెను. కాని విజయభూషణుని కాలమున క్రైస్తవ మతసంఘము వారికిని, రాజునకును, ఎట్టి సంఘర్షణయు సంభవింపలేదు. ఆతని కాలమున బిషప్పులు మొదలైన మతాధికారులు తమ అధికారిక చిహ్నములను రాజు హస్తములనుండియే గ్రహించుచుండిరి. ఇందులకు పోపు మతాధికారి యే విధముగను అభ్యంతర పెట్ట లేదు. విజయభూషణుడు క్రైస్తవ మతసంఘమునకు మిక్కిలి సుముఖుడును, మత సంఘమును సర్వవిధముల వృద్ధి కావించు చున్నాడనియు, పోపు మతాధికారికి గట్టినమ్మక ముండుటచే,

ఆతడు ఈ రాజుతో నెట్టి తగవును పెట్టుకొనలేదు. మొదటి విలియంరాజు క్రైస్తవ మత సంఘము వారికొక ప్రత్యేక సదుపాయము కల్పించెను. ఈ రాజునకు పూర్వము నేరములను కావించిన వారు లౌకిక ప్రజలైనను, మత సంఘముతో సంబంధించినవారైనను, జిల్లా న్యాయస్థానములలో విచారింపబడి, దండనకు పాత్రులగుచుండిరి. జిల్లా న్యాయసభలో ఇతర రాజోద్యోగులతోపాటు, మతాధికారులు కూడ న్యాయమూర్తులుగ వ్యవహరించుచుండెడివారు. కాని లౌకిక ప్రజలను, మత సంఘోద్యోగులను సమానముగ భావించి, వారిని ఒకే విధమగు శిక్షాస్మృతిచే దండనకు పాల్జేయుట న్యాయవిరుద్ధమని, విజయభూషణుడు తలంచెను. కావున నాతడు మతాధికారులకు జిల్లా న్యాయ సభలలో స్థాన మొసంగక వేరుపరచి, వారికొరకై ప్రత్యేక న్యాయసభల నేర్పాటు కావించెను. మత సంఘోద్యోగు లెవ్వరైన నేరములు కావించినచో, అట్టివారిని పైన పేర్కొనిన మత న్యాయసభలలో హాజరుపరచి, వారు కావించిన నేరములను మతాధికారులు క్రైస్తవ ధర్మ సంబంధమగు న్యాయము (Canon Law) ప్రకారము విచారించి, శిక్షలు విధింపవలెనని విజయ భూషణుడు నిర్ణయించెను. ఈ విధముగ నేరస్తులగు లౌకిక ప్రజలను విచారించి దండించుటకు సామాన్య న్యాయస్థానములును, నేరస్తులగు మత సంఘోద్యోగుల విచారించి దండించుటకు ప్రత్యేక మత న్యాయస్థానములును (Ecclesiastical Courts), ఏర్పడెను.

విలియంరాజు కావించిన ఈ మార్పు ముందు ముందు రాజుల కును మతాధికారులకును తీవ్ర విభేదములకు మూలమగుట మనము చూడగలము. కాని ఆతని కాలమున మాత్రము ఇట్టి విభేదములు తలచూప లేదు.

రెండవ విలియంరాజు మిక్కిలి ధనాశాపరుడు. కావున ఆతడు జమీందారుల నుండియు, క్రైస్తవ మతసంస్థలనుండియు, వీలైనంత ధనమును గుంజుకొనెడివాడు. ఈ కారణముల వల నను, ఆ రాజు కావించెడి ఇతర దుష్కృత్యముల వలనను, ఆత నికిని కాంటర్బరీ మతాధికారికిని వైర మేర్పడెను. ఈ కాల మున కాంటర్బరీ మతాధికారి ఆన్సలమ్ (Anselm)అను నాతడు. ఈతడు మిక్కిలి యోగ్యుడు. సద్వర్తనుడు. కాని విలియం రాజు ఇట్టి సత్పురుషునికి కూడ ఆగ్రహము కల్గించెను. ఎవ్వ రైన మతగురువు కాంటర్బరీ మత పీఠమున కధికారిగ పదవీ స్వీకారము చేయునప్పుడు, పోపు మతగురువు రెండు అధికార చిహ్నములను పంపుట ఆ కాలమున వాడుకగ నుండెను. అందు ఒక ఉంగరమును, ఒక దండమును ఉండెడివి. మతాధి కారియు, ఆతని ధార్మిక సంరక్షణలో నున్న క్రైస్తవ ప్రజా నీకమునకును ఉండవలసిన సంఘీభావమునకు ఉంగరము ఒక చిహ్నముగ భావింప బడెడిది. క్రైస్తవు లెల్లరును సాధువులగు గొఱ్ఱెలు. మతాధికారి వారినెల్ల ధర్మమార్గమున నడపు గోపా లుడు. ఈ భావము మహనీయుడగు ఏసుక్రీస్తు కాలము నుండియు వాడుకలో నుండెను. పైన సూచింపబడిన దండము

కాంటర్బరీ మతాధికారికి ధార్మిక రంగమునగల యధికారము నకు గుర్తు. రెండవ విలియం రాజునకు పూర్వము మతాధి కారులెల్ల ఈ రెండు ఆధికారిక చిహ్నములను, రాజులవలన గ్రహించుచుండిరి. కాని ఆన్సలమ్ యీ పద్ధతి కంగీకరింపక, వానిని తన సంస్థయందలి దేవతా పీఠమునుండి అందుకొనెను. ఇందులకు విలియంరాజు కోపగించి, కాంటర్బరీ మతగురువును దేశభ్రష్టుని గావించెను. మొదటి హెన్రీరాజు అధికారము పూనిన వెనుక ఆతడు ఆన్సలమ్‌ను తిరిగి ఇంగ్లాండునకు పిలి పించెను. రాజును, మతగురువును, తమకుగల యభిప్రాయ భేదములను సౌమ్యముగ పరిష్కరించుకొనిరి. ఉంగరమును, దండమును, మతాధికార సూచకములు కావున వానిని మతాధి కారులు రాజునుండి గ్రహింప నక్కర లేదని హెన్రీరాజు అంగీక రించెను. కాని మతాధికారులు రాజునుండి భూవసతులను, తది తర సౌకర్యములను పొందుచుండిరి. కావున వారుకూడ ఇతర జమీందారుల వలెనే రాజునకు వశ్యులై, స్వామిభక్తి ప్రమా ణము కావింపవలెనని ఆన్సలమ్ మతాధికారి యంగీకరించెను. రాజునకును, మతసంఘమునకును సఖ్యత యేర్పడెను. స్టీఫెన్ రాజు కాలమున రాజును, జమీందారులును, తరచు కలహించు చుండిన కారణమున, ఈ యదను చూచుకొని క్రైస్తవ మత సంఘమువారు తమ బలమును వృద్ధి చేసికొనిరి.

రెండవ హెన్రీరాజు అధికారము వహించుసరికి ఆంగ్ల క్రైస్తవ మత సంఘమునందు కొన్ని పెద్దలోపములు సర్వత్ర

వ్యాపించి యుండెను. అందు ముఖ్యమైనది మత సంఘపు ఉద్యోగులకు సంబంధించినది. విజయభూషణుని కాలమున ప్రభుత్వ న్యాయస్థానములును, మతసంఘపు న్యాయసభలును వేరు చేయబడినట్లు తెల్పియున్నాము. మత న్యాయస్థానముల వారికి మరణదండన విధించు నధికారము లేకుండెను. ఖూనీలు చేసినవారికి కూడ, మత న్యాయస్థానముల వారు ఉపవాసములు, దైవప్రార్థన, పశ్చాత్తాపము మున్నగు శిక్షలను విధించెడివారు. ఇట్టి పద్ధతులవలన నేరస్థులకు భయమనునది లేకుండపోయెను. అంతేకాక క్రైస్తవ మతసంఘముతో సంబంధ మున్నవారును లేనివారును కూడ, తాము మత సంఘోద్యోగులమని తెల్పు కొనసాగిరి. ఇందువలన సంఘమున ఘోరమగు అన్యాయ ముత్పన్నమయ్యెను. తోటిమానవుని చంపిన సామాన్యపౌరుని కురిశిక్ష విధింప బడెడిది. ఇదే నేరముచేసిన మరియొకనికి ఉప వాసమును, దైవ ప్రార్థనయు శిక్షగ విధింపబడు చుండెను. హెన్రీరాజు ఈ అన్యాయమును చూచి సహింపజాల దయ్యెను. కావున నీ లోపములను సవరించుటకై ఈ ప్రభువు ఒక సంఘ మును నియమించెను. ఆ సంఘమువారు సమకాలీన పరిస్థితు లను కూలంకషముగ సమీక్ష కావించి, క్రైస్తవ మతసంఘ వ్యావ హారములతో తేవలసిన కొన్ని మార్పులను సూచించిరి. ఈ మార్పులను క్లారెండన్ నిబంధనలు (Constitutions of Clarendon–1164) అని వ్యవహరించిరి. ఇందు మొదటి హెన్రీ రాజును అన్సలమ్ మతాధికారియు కావించుకొనిన రాజీ పర

త్తులు పునః బలపరుపబడెను. ఇంగ్లండునందలి క్రైస్తవ మతాధికారులు రాజునకు వశ్యులై యుండవలయునను ప్రాచీన నియమములు మరల ధ్రువపరుపబడెను. కాని పై నియమముల యందలి ముఖ్య విషయము నేరస్థులగు మత సంఘోద్యోగులకు సంబంధించినది. మత సంఘమునందలి ఉద్యోగి యెవరైన నేదైన నేరము చేసిన పక్షమున, ఆతని నుద్యోగమునుండి తొలగించి, అర్హమగు శిక్షను పొందుటకై, ప్రభుత్వ న్యాయస్థానములకు పంపవలెనని యిందు సూచింపబడెను. కాని యీ తుది సూచనకు కాంటర్బరి మతాధికారియగు థామస్ బెకెట్ అంగీకరింపకుండెను. ఈ మతాధికారి, పూర్వాశ్రమమందు హెన్రీరాజునకు మిక్కిలి అభిమాన పాత్రుడును, మిత్రతుల్యుడును అగు గొప్ప రాజోద్యోగి. బెకెట్ సమర్థతను గుర్తించి, హెన్రీరాజు ఆతనిని సామాన్యమగు హోదానుండి, మంత్రి పదవిలోనికి మార్చెను. బెకెట్ హెన్రీకి ప్రధానమంత్రిగ వ్యవహరించసాగెను. రాజు అతనితో సంప్రదించకుండ ఏ ముఖ్యకార్యమును తలపెట్టెడివాడు కాడు. బెకెట్ కూడ హెన్రీ ప్రభువును మిక్కిలి స్వామి భక్తితో కొలుచుచుండెడివాడు. రాజు ఆతనిని తన మిత్రునిగ భావించి, ఆతనితో సల్లాపములాడుచు, విందులు కుడుచుచు, మిక్కిలి సన్నిహితుడై వర్తించుచుండెను. రాజ్యాంగ వ్యవహారములను చక్కపెట్టుటలో తనకు బెకెట్ కుడిభుజముగ నుండగలడని హెన్రీ నమ్మెను. ఇది యిట్లుండగా, కాంటర్బరీ మతపీఠము ఖాళీ అయ్యెను. బెకెట్ వంటి మిత్రుడు

ఈ మతపీఠమున కధికారి నైనచో క్రైస్తవ మత సంఘమున తాను ప్రవేశ పెట్టదలచిన సంస్కారములను సులభముగ అమలు చేయవచ్చునని హెన్రీ అభిప్రాయపడెను. ఈ యుద్దేశ్యముతో రాజు బెకెట్‌ను కాంటర్బరీ పీఠాధిపత్యము నంగీకరింప వలసినదిగ ఒత్తిడి కావించెను. ఇందులకు బెకెట్ సులభముగ అంగీకరింపలేదు. [illegible] అంగీకరించిన పిదప ము. [illegible] సంప్ర వింపగనే [illegible] బెకెట్ [illegible] వాదించినను, రాజు పట్టు విడువ లేదు. అంతట [illegible] నిర్బంధముపై బెకెట్ కాంటర్బరీ పీఠమున కధికారి యాయెను. ఆనాటినుండి బెకెట్ జీవితము సంపూర్ణముగ మారిపోయెను. భోగపరాయణుడై, ఇహ సౌఖ్యముల ననుభవించుచున్న ఈ మంత్రి సత్తముడు, అకస్మాత్తుగ ఐహికసుఖముల త్యజించి, ఉపవాసాది కఠిన నియమముల నవలంబించి, నిజమైన మతగురువుగ జీవింపసాగెను. బెకెట్ భావములలో కూడ పరివర్తనము కల్గెను. మతగురువైన తాను క్రైస్తవ మతసంఘము వారి హక్కులను కాపాడవలెనని, ఆతడు భావింపసాగెను. క్లారెండన్ నిబంధనలను హెన్రీరాజు ప్రకటించినప్పుడు బెకెట్ వానిని ప్రతిఘటించుట కిదియే కారణము. నేరస్థులగు మత సంఘోద్యోగులను వారి హోదాల నుండి తొలగించుటయే యొక శిక్షయనియు, వారిని ప్రభుత్వ న్యాయస్థానములలో విచారించి, శిక్షించుట, ఒకే నేరమునకు రెండు పర్యాయములు శిక్ష విధించుటవంటిదనియు, బెకెట్

పక్షమువారు వాదించిరి. ఇటీవల వరకును తనకు మిత్రుడుగ నున్న బెకెట్ ఇప్పుడు తన్ను ఎదిరించి, తాను కావింపదలచిన సంస్కరణముల కవరోధము కల్గించుట హెన్రీ రాజునకు మిక్కిలి కోపకారణమయ్యెను. రాజునకును మతాధికారికిని తీవ్ర విభేదములు కల్గెను. అంతట బెకెట్ ఇంగ్లాండు దేశమును విడి ఫ్రాన్సునకు ప్రవాసిగ వెడలిపోయెను. కొన్ని సంవత్సరములు గడచిపోయెను. 1170 వ సంవత్సరమున హెన్రీ రాజును, బెకెట్ మతాధికారియును, ఒకచోట సమావేశమైరి. గతమును విస్మరించి, మిత్రభావముతో వర్తింపవలెనని యిరువురును నిర్ణయము కావించుకొనిరి. ఆ యేర్పాటు ప్రకారము బెకెట్ ఇంగ్లాండు దేశమునకు మరలివచ్చెను. కాని అనతికాలములో రాజునకును మతాధికారికిని మరల విరోధము సంభవించెను. బెకెట్ ప్రవాసములో నున్న కాలమున హెన్రీరాజు తన పెద్ద కుమారుని యువరాజుగ అభిషిక్తుని కావించెను. ఈ యభిషేక క్రియ చేయు నధికారము సాంప్రదాయము ననుసరించి కాంటర్బరీ మత గురువునకు చెందియుండెను. కాని ఆతడు దేశాంతరమున నుండుటచే యార్కు పీఠాధిపతి నీ క్రియాకలాపములు నెరపింపవలసినదిగ హెన్రీ రాజు నియమించెను. ఈ కథను వినియు, బెకెట్ శాంతము వహింపక, తన హక్కులను భంగపరచెనను నేరముపై, యార్కు మతాధికారిని వెలివేసెను. ఇతర మతగురువులపై కూడ ఆతడు చర్యగైకొనెను. ఈ సంఘటన జరుగునప్పుడు హెన్రీ రాజు ఫ్రాన్సు దేశమున

నుండెను. బెకెట్ గైకొనిన చర్యలను వినుసరికి హెన్రీ రాజు కోపాగ్ని భయంకరముగ ప్రజ్వరిల్లెను. "నా యుప్పుతిని బ్రతుకుచున్న సేవకులందరును కూడ పిరికిపందలగు నిర్భాగ్యులేనా? వీరిలో ఒక్కడునుకూడ నాకీ పొగరుబోతు పాదరీ బాధ వదలించలేడా" యని రాజు ఆగ్రహావేశమున పలికెనని చెప్పుదురు. ఆ వాక్యములు విని నలుగురు యోధులు తక్షణమే బయలుదేరి, ఇంగ్లీషు ఛానలునుదాటి, కాంటర్బరీ పట్టణమును చేరిరి. అచ్చటి దేవాలయమునందే వారికిని బెకెట్ మతాధికారికిని, సమావేశము సంభవించెను. యోధులు బెకెట్‌ను నిందింపగా, అతడు కఠినముగ ప్రత్యుత్తర మొసంగెను. అంతట యోధు లోరిమిని కోల్పోయి. ఖడ్గములదూసి మతాధిపతిని సంహరించిరి. ఈ విషయము తెలియుసరికి, ఇంగ్లాండు దేశమున గొప్ప సంక్షోభము బయలుదేరెను. బెకెట్టు క్రైస్తవమత సంఘము నుద్ధరించుటకై ప్రాణము లర్పించిన మహనీయుడనియు, హెన్రీ రాజు తామస ప్రవృత్తిచే భగవంతుని కపరాధము కావించె ననియు ప్రజలు తలంపసాగిరి. బెకెట్ మతాధికారి ఋషిగ మారిపోయెను. ప్రజ లాతని సమాధికడకు యాత్రలు చేయ జొచ్చిరి. ప్రజాభిప్రాయము తనకు ప్రతికూలముగ పరిణమించినట్లు తెలిసికొని, హెన్రీ రాజు ప్రజలను సంతుష్టి పరచుటకై పాటుపడెను. బెకెట్టు మృతికై అతడు పశ్చాత్తాపమును ప్రకటించెను. కాంటర్బరీ యందలి బెకెట్టు సమాధికడకు యాత్ర కావించి, అచ్చట మోకరించి, పాపపరిహారార్థముగ రాజు

దెబ్బలు కొట్టించుకొనెను. బెకెట్టు మరణించినను ఆతని మాటయే నెగ్గెను. క్రైస్తవ మత సంఘమును హెన్రీ కాపింప దలచిన మార్పులు సుమారు నాల్గు శతాబ్దుల వరకును ఆగి పోయెను.

రెండవ హెన్రీ రాజు విజయవంతముగ 35 సంవత్సరములు రాజ్యము చేసెను. కాని అవసాన కాలమున ఆతనికి కష్టములు సంభవించెను. రాణి తన భర్తపై కోపించి, ఫ్రాన్సు దేశమునకు వెడలిపోయి అచ్చట నివసింపసాగెను. హెన్రీ కుమారులు తరచు తమలో తాము కలహించుటయే కాక, ఫ్రాన్సు దేశపు రాజు సహాయముతో తండ్రిపై తిరుగుబాట్లు కావింప జొచ్చిరి. మొదటి యిరువురు కుమారులును తండ్రి జీవిత కాలమందే మరణించిరి. మూడవ కుమారుడగు రిచర్డు తండ్రిపై యుద్ధము ప్రకటించి ఆతని నోడించెను. నాల్గవ కుమారుడగు జాన్ హెన్రీ రాజునకు మిక్కిలి యిష్టుడు. ఈతడు కూడ విద్రోహులలో చేరుటవలన తండ్రికి తీరని దుఃఖము కల్గెను. మనోవ్యథచే ఆరోగ్యము చెడి 1189 వ సంవత్సరమున రెండవ హెన్రీ మరణించెను.

బ్రిటను దేశమును పాలించిన సమర్థతములైన ప్రభువులలో రెండవ హెన్రీ యొకడు. ఈతడు జన్మతః ఫ్రెంచి పౌరుడైనను, ఆంగ్లభూమి కెంతయో సేవ కావించెను. ఈ రాజునకు గల దేహ దార్ఢ్య మపారమైనది. ఆతడు హయారూఢుడై

ఎల్లప్పుడును తన విశాల రాజ్యమున పర్యటనము కావించెడి వాడు. ఈ దినమున నాతడింగ్లాండునం దుండును. రేపు ఫ్రాన్సు దేశమునను కానవచ్చును. రాజానుచరులును, ఉద్యోగులును, లేఖక బృందమును, రాజ్యాంగమునకు సంబంధించిన కవిలె కట్టలను తీసికొని, పడుచు లేచుచు, అతని వెంట పరుగెత్తెడి వారట. అయినను ఈతడు ప్రజలకు సులభ గమ్యుడుగ నుండెడివాడు. ప్రభువునకు విన్నపముల సమర్పింప దలచినవారును, చారులును, మిత్ర బృందమును, తదితరులును కూడ హెన్రీ కడకు సులభముగపోయి, అతని సన్నిధిని వాలుగాళ్ళు కూర్చుండెడి వారట.

## సింహవిక్రములైన రిచర్డు రాజు

రెండవ హెన్రీ యనంతరం మాతని మూడవ కుమారుడగు రిచర్డు అతని రాజ్యమున కంతకును వారసుడయ్యెను. ఈ రాజు క్రీ. శ. 1189 నుండి 1199 వరకు అనగా పది సంవత్సరములు మాత్రము రాజ్యపాలనము కావించెను. ఈ దశాబ్దిలో రిచర్డు రాజు పది నెలలు మాత్రము ఇంగ్లాండు దేశమున గడపెను. మిగిలిన కాలమంతయు ఆతడు మూడవ మతయుద్ధమునకు సంబంధించిన పోరాటములందును, లేదా ఫ్రాన్సు దేశపు ప్రభువుతో వైరమునందును వ్యయపరచెను. రాజు దేశాంతరమున నున్న కాలమున ఆతని పక్షమున సమర్థులగు మంత్రులు రాజ్యాంగ వ్యవహారములను చక్కబెట్టుచు, ప్రభుత్వమును

చక్కగ కొనసాగించిరి. రిచర్డు నామమాత్రమునకు ఆంగ్ల ప్రభువు. కాని అతని జీవిత విధానమును, అభిరుచులును, విదేశీయములు. ఈ రాజు నాంగ్లేయు డనుటకంటె ఫ్రెంచి జాతీయు డనుట ఎక్కుడు సమంజసము. ఇంగ్లాండు దేశ మాతనికి బంగారు గ్రుడ్లుపెట్టు బాతువంటిది. రిచర్డు రాజు ఇచ్చటినుండి సాధ్యమైనంత ధనమును సేకరించి, దానిని తన యుద్ధ ప్రయత్నములకై వ్యయపరచెడివాడు. ఈ ప్రభువు గొప్ప గొప్ప ఉద్యోగ పదవులను ధనమునకై అమ్మెను. జమీందారుల వద్దనుండి వీలైనంత సొమ్మును రాబట్టెను. రాజునకుగల హక్కులను విడచి పెట్టుకొని తత్ప్రతిఫలముగ భూస్వాముల నుండియు పట్టణముల నుండియు విత్తమును ప్రోవుచేసెను. "లండను పట్టణమును కొనజాలిన ధనాఢ్యు డెవ్వడైన నున్నచో ఆ నగరమును కూడ నేను అమ్మివేసెడి వాడనే" అని రిచర్డురాజు ఒక పర్యాయము పరిహాసముగ పల్కినట్లు చెప్పుదురు. ఇట్లు లభించిన ధనమును మూడవ మత యుద్ధము సాగించుటలో ఈ ప్రభువు వినియోగము కావించెను. రిచర్డురాజు నింతగ యాకర్షించిన యీ మూడవ మత యుద్ధమునుగూర్చి ఇంచుక ప్రసంగింపవలసి యున్నది.

మొదటి మత యుద్ధమునందు విజయ భూషణుని మొదటి కుమారుడగు రాబర్టు పాల్గొనినట్లు ఈవరకే తెలుపబడినది. ఈ యుద్ధమునకు ఫలితముగ పాలస్తీనమునందు క్రైస్తవులు తమ రాజ్యమును నెలకొల్పుకొన గల్గిరి (1099). కాని యీ

క్రైస్తవ పాలకులు స్థానికులగు యూదు(Jews) ప్రజలను మిక్కిలి క్రూరముగ హింసించిన కారణమున వారు ప్రజాభిమానమును కోల్పోయిరి. అయినను క్రైస్తవ రాజ్యము మరి కొంత కాలము వరకును నిలువగల్గెను. 1147 వ సంవత్సరమున రెండవ మత యుద్ధము ప్రకటింపబడెను. ఐరోపా ఖండమందలి క్రైస్తవ ప్రభువులు, పాలస్తీనములోని తమ రాజ్యమును బలపరచుకొనుటకై యత్నించిరి. కాని వారి యత్నములు కొనసాగలేదు. అంతట మహమ్మదీయులు విజృంభించిరి. అదృష్టవశమున వారికి మహా సమర్థుడైన సలాదీన్ అను నాయకుడు లభించెను. మహమ్మదీయులు క్రైస్తవ సేనలను, నాయకులను అనేక విధముల బాధించి తుదకు 1187 వ సంవత్సరమున క్రైస్తవ పుణ్యక్షేత్రమగు జెరూసలేమ్ నగరమును ఆక్రమించిరి. ఈ వార్త ఐరోపా ఖండమును చేరుసరికి అచ్చటి క్రైస్తవ ప్రజానీకములో కోపాగ్ని ప్రజ్వరిల్లెను. మతాంతరులైన మహమ్మదీయుల నోడించి, జెరూసలేమ్ పట్టణమును కాపాడవలెనని పోపు మతాధికారి, తన శిష్యగణమును ప్రోత్సహించెను. ఇందులకు ఫలితమే మూడవ మత యుద్ధము. ఈ మత యుద్ధము మిక్కిలి ప్రఖ్యాతి గాంచినది. ఇందు రోమక చక్రవర్తియును, ఫ్రాన్సు దేశపు రాజును, ఆంగ్ల ప్రభువగు రిచర్డు రాజును, ఆస్ట్రియా దేశపు ప్రభువును, అనేకులు ప్రసిద్ధ క్రైస్తవ వీరులును పాల్గొనిరి. కాని వీరిలో ఐకమత్యము లేకుండెను. కావున క్రైస్తవ సేనల సంఖ్యకును, అందలి వీరుల బలపరాక్రమములకును, అనురూప

మగు ఫలితము వారికి లభింపలేదు. ఈ మతయుద్ధమునందు రిచర్డు రాజు చూపిన రణకౌశల్యమును, పరాక్రమమును మిక్కిలి ప్రశంసా పాత్రములు. ఆతని యాధిపత్యమున క్రైస్తవ సేనలు 1191 వ సంవత్సరమున ఏకర్ (Acre) అను కీలక స్థానమును వశపరచుకొనగలిగెను. కాని యెంత ప్రయత్నించినను, జెరూసలేమ్ నగరమును మరల స్వాధీన పరచుకొన లేకపోయిరి. యుద్ధము సాగుచున్న కాలమున రిచర్డు రాజు ఫ్రాన్సు దేశపు ప్రభువుతోడను, ఆస్ట్రియా పాలకునితోడను తీవ్రముగ తగవులాడెను. క్రైస్తవుల బలము క్షీణించెను. తుదకు రిచర్డు మహమ్మదీయుల నాయకుడైన సలాదీన్ వీరునితో సంధిచేసికొనవలసి వచ్చెను. జెరూసలేమ్ నగరము క్రైస్తవులకు పునః వశపడుట అసంభవమని తేలిపోయెను. ఆ ప్రసిద్ధ యాత్రాస్థలమునకు రాకపోకలు సల్పు క్రైస్తవుల నే విధముగను బాధింపమని మహమ్మదీయ పక్షము వారంగీకరించిరి. అదియే పదివేలని భావించి, రిచర్డు రాజు యుద్ధము చాలించి, వెనుకకు మరలి వచ్చెను. త్రోవయందు నాతనిని శత్రువులు చెరపట్టిరి. ఇంగ్లాండు ప్రభుత్వము వారొక పెద్ద మొత్తము నొసంగి రిచర్డు రాజును బంధవిముక్తుని కావించుకొనిరి.

స్వదేశమునకు మరలివచ్చిన పిమ్మట కూడ రిచర్డునకు ఇంగ్లాండులో కాలు నిలువలేదు. ఆతడు సైన్యమును సేకరించుకొని, ఫ్రాన్సుదేశపు ప్రభువుతో పోరాడుటకై మరల దండయాత్ర సాగించెను. తుదకు ఈ రాజు తనకు సామంతుడగు

కొక విలుకానితో యుద్ధము చేయుచు ప్రాణములు గోల్పోయెను (1199).

ఆంగ్లదేశమును గూర్చియు, అప్పటి ప్రజల సౌఖ్యమును గూర్చియు రిచర్డురాజు ఏమాత్రమును కలుగ జేసికొనినవాడు కాడు. ఆతడు సాగించిన నిరంతర యుద్ధములకు వలయు ధనమును, సైనికులను సమకూర్చి యిచ్చు సైన్య స్థావరముగ ఈ దేశము ఆ ప్రభువునకు కానవచ్చెను. కాని ఆంగ్లేయులు మాత్రము రిచర్డును తమ గొప్ప జాతీయ వీరులలో నొకనిగ భావించి, గౌరవింతురు. మధ్యమ యుగమునందు ఐరోపాఖండమున వీరపురుషులకును, సాహస కృత్యములకును అపారమగు గౌరవప్రతిష్ఠ లుండెడివి. రిచర్డురాజు అట్టి మహా వీరులలో నొకడని నిస్సందేహముగ తెలుపవచ్చును. ఆతడు గొప్ప బలశాలి. అసహాయశూరుడు. ఎంతలేసి సాహస కృత్యములైనను జంకుకొంకులు లేకుండ సాధింపగల్గిన శూరాగ్రేసరుడు. అందులకు తోడు ఆతడు మాయమర్మము లెరుగని నిష్కల్మష హృదయుడు. చమత్కారముగ ప్రసంగము చేయగల ప్రజ్ఞావంతుడు. రిచర్డురాజు తీవ్ర స్వభావముకలవాడే కాని దీర్ఘక్రోధము నాతడెరుంగడు. తన ప్రాణములకు అపాయము తెచ్చిన శత్రువునైనను క్షమింపగల యుదారత ఈ రాజునకలవడి యుండెను. 1199 వ సంవత్సరమున రిచర్డురాజు ఒక కోటకు ముట్టడివేసి యుద్ధము సాగించుచుండెను. ఒకనాడు శత్రుసైనికు డొకడు రిచర్డుపై ఒక బాణమును గురిచూచి వదలెను. ఆ బాణా

ఘాతమువలన రాజు తుదకు మరణించెను. కాని ఆతడు చని పోవుటకు పూర్వము, ఆంగ్ల సైనికులు తమ ప్రభువును గాయ పరచిన శత్రు సైనికుని బంధించి తెచ్చిరి. రిచర్డు రాజు మిక్కిలి ఔదార్యముతో ఆ సైనికుని విడుదల కావించెను. ఇట్టి సద్గుణ ములుగల యోధపుంగవుని ఆంగ్ల ప్రజలు "సింహవిక్రముడు" అని మన్నించుటలో ఆశ్చర్యము లేదు.

సింహ పరాక్రముడగు నీ ప్రభువునకు ఆంగ్లదేశ చరిత్ర యందు మొదటి రిచర్డురాజు అను పేరు వాడబడుచున్నది. రాజకీయ రంగమున నీ ప్రభువు కాలములో నెట్టి విశేషమును సంభవింపలేదు. ప్రభుత్వ వ్యవహారముల నీ రాజు సంపూర్ణముగ నిర్లక్ష్యము చేసినను ఇంగ్లాండున కెట్టి హానియు సంభవింపలేదు. ఇందులకు ముఖ్య కారణము రిచర్డు తండ్రియైన రెండవ హెన్రి రాజు కావించిన చక్కని కట్టుదిట్టములే యని చెప్పవచ్చును. రిచర్డురాజు సాగించిన మూడవ మతయుద్ధము వలన ఇంగ్లాండు దేశమున కొన్ని పరోక్షఫలితములు కల్గెను. మత యుద్ధములో పాల్గొనినది ఒక రిచర్డురాజు మాత్రమే కాదు. ఆతనితోపాటు అనేకులు జమీందారులు కూడ పైధర్మయుద్ధమునందు పాల్గొ నుటకై బయలు వెడలిరి. ఇట్లు వెడలిపోయిన జమీందారులు బలవంతులు, యుద్ధప్రియులు, ధూర్తులు. దేశమునం దున్నంత కాలమును వీరు ప్రజలను పీడించుటయందో, లేక, రాజుపై కుట్రలుపన్ని తిరుగుబాట్లు కావించుటయందో, నిమగ్నులై యుండెడివారు. మత యుద్ధములు ప్రారంభమైన తరువాత

ఇంగ్లాండు ప్రజలకీ జమీందారుల బాధ తప్పెను. పైవీర పురుషులలో పలువురు రణభూమియందు కూలిరి. మరలివచ్చిన వారు కేవల ప్రాణావశిష్టులైరి. యుద్ధములకు పోవుటకు పూర్వమీ జమీందారులకు చాల ధనము కావలసి వచ్చెను. దానిని సేకరించు నిమిత్తము వీరు తమ జమీందారిలో నెలకొనియున్న నగరములకు స్వపరిపాలనాధికారమును, స్వాతంత్ర్యమును ప్రసాదించుచు సనదులను జారిచేసిరి. అనేక పట్టణముల వారీ స్వాతంత్ర్యమును సంపాదించుకొని, అందులకు ప్రతిఫలముగ జమీందారులకు పెద్ద ధనపు మొత్తముల నిచ్చెడివారు. ఈ మార్పు ఇంగ్లాండు దేశపు పట్టణముల భాగ్యాభివృద్ధి కెంతయో తోడ్పడెను. పండ్రెండవ శతాబ్దినాటికి ఐరోపాఖండము నాగరకతయందు వెనుకపడి యుండెను. మతయుద్ధముల సందర్భమున ఐరోపా దేశీయులు పలువురు ప్రాగ్దేశములకేగి అచ్చటి నాగరక జీవితమును, భాగ్యభోగ్యములను కన్గొని వానిచే మిక్కుటముగ ప్రభావితులైరి. ప్రాక్పశ్చిమములకు ఏర్పడిన యీ సంబంధమువలన నీ రెండు ప్రాంతములకును వ్యాపారము వృద్ధి చెందెను. కాని ఈ వ్యాపారాభివృద్ధివలన బాగుపడినవారు మధ్యధరా సముద్ర ప్రాంతములలో నివసించువారు మాత్రమే. ఎచ్చటనో పశ్చిమమున నొక మారు మూలలో నొదిగియున్న ఇంగ్లాండు దేశమునకీ వ్యాపారమువలన నెట్టి లాభమును చేకూరలేదు.



ఆరవ ప్రకరణము

# ప్రజా పరిపాలన ప్రారంభము

## రాజ్య విహీనుడైన జాన్ భూపాలుడు

## ( John Lack land )

రెండవ హెన్రీ రాజును గూర్చి చరిత్రలు ఒక హృదయంగమమగు నంశమును తెల్పుచున్నవి. ఈ ప్రభువు తన ప్రాసాదమునందు నేర్పరులగు చిత్రకారులచే చక్కని చిత్రముల వ్రాయించెడి వాడట. అందు ఒక చిత్రములో ఒక రాబందును దాని నాల్గు పిల్లలు పీడించుచున్నట్లు చూపబడెను. వానిలో చిన్న పులుగు తన తండ్రి పులుగు మెడపై కూర్చుండి, దాని కండ్లను పెరికివేయుటకు ప్రయత్నించు చున్నట్లు ప్రదర్శించిరి. "ఈ నాల్గు పులుగులును నా నలువురు కుమారులు. వీరిలో తుది వాడగు జాన్ నాకు మిక్కిలి అభిమాన పాత్రుడు. కాని వీడు తుదకు నా పరువు ప్రతిష్ఠలు భగ్నముచేసి నా గౌరవము నష్టపెట కలుపగలడు" అని రెండవ హెన్రీ రాజు పల్కుచుండెడివాడట. అదే విధముగ జాను రాజు తన రాజ్యములో చాల భాగమును పోగొట్టుకొని, పరుల కడను, తన ప్రజలలోను కూడ అప్రతిష్ఠకు పాలై, ఇంగ్లండు దేశచరిత్రలో శాశ్వత దుష్కీర్తిని సంపాదించుకొనెను. ఫ్రాన్సు దేశమునగల రాజ్యమును పోగొట్టుకొనిన యీతనికి ప్రజలు Lack land అను వెక్కిరింపు బిరుదును ప్రసాదించిరి.

రిచర్డు రాజు మరణించుటకు పూర్వము ఆతడు తన సోదరుడగు జానును ఆంగ్లరాజ్యమునకు వారసునిగ ఎన్నుకొనెను. అప్పటికి సజీవురాలై యున్న వారి తల్లి (ఎలియనార్ రాణి) ఈ యేర్పాటు నంగీకరించెను. జాను రాజు 17 సంవత్సరములు (1199-1216) రాజ్యపాలనము కావించెను. ఈతడు తన అన్న కుమారుడగు ఆర్థరును క్రూరముగ చంపించినట్లు చరిత్ర ప్రసిద్ధము. ఈ క్రూర కృత్యమువలన ప్రజానీకమునందు జాను రాజునకు చాల అప్రతిష్ఠ కల్గెను.

జాను రాజు చాల సమర్థుడనియు, పరిస్థితులు ప్రతికూలముగ నుండుటచే ఆతని సామర్థ్యమే విధముగను రాణించ లేదనియు కొందరు చారిత్రికుల భావము. కాని యిందులకు తగిన నిదర్శనములు లేవు. ఈ రాజు కృత్రిమ స్వభావుడు. ఎవ్వరితోడను కూడ స్నేహ ధర్మము పాటింప నసమర్థుడగు కలహప్రియుడు. స్వలాభమును గుర్తింప జాలని మూఢుడు. ఈతడు కావించిన పనులన్నియు తెలివితక్కువ పనులే. ఈతని ప్రథమ భార్య ఇంగ్లాండు నందలి గొప్ప జమీందారులగు గ్లస్టరు ప్రభువుల వంశమునకు చెందిన యొక యువతి. జాను రాజు ఈమెను విడనాడి, ఆ విధముగ గ్లస్టరు జమీందారుల ఆగ్రహమునకు పాత్రుడయ్యెను. మరి కొంతకాలము గడచిన వెనుక జాను ఫ్రాన్సు దేశపు జమీందారుల కుటుంబములోని యొక జవ్వనిని బలాత్కారముగ గైకొని పోయి, వివాహ మాడెను. ఈ వివాహమునకు పూర్వమే ఆ యువతి మరొక ఫ్రెంచి జాగీ

ర్దారునకు వాగ్దత్తయై యుండెను. అవమానము పొందిన ఫ్రెంచి జాగీర్దారు, తన యేలికయగు ఫ్రాన్సు దేశపు రాజున కీ యాగడము గూర్చి విన్నవించుకొనెను. ఆ కాలమున ఫ్రాన్సుదేశపు రాజుగనున్న ఫిలిప్పుఆగస్టస్ (Philip Augustus) అను నాతడు మిక్కిలి సమర్థుడు. ఆత డేదో యొక అవకాశము చూచుకొని, ఆంగ్లేయులను తన దేశమునుండి వెడల నడచుటకై పథకములు పన్నుచుండెను. ఫ్రెంచి జాగీర్దారునకు జరిగిన అపచారమునకు సంజాయిషీ చెప్పుటకై తన వద్దకు రావలసినదని, ఫిలిప్పు రాజు జానును ఆజ్ఞాపించెను. ఫ్రాన్సు దేశమునందలి జమీందారులలో నొకడగు జాను ఫ్రెంచి రాజునకు సామంతుడు. కావున ఆతడు ఫ్రెంచి రాజు ఆజ్ఞలకు బద్ధుడు. కాని మూర్ఖుడైన జాను ఫ్రెంచి రాజు ఆజ్ఞల తిరస్కరించెను. అంతట ఫ్రెంచి రాజు జానుపై యుద్ధము ప్రకటించి, రెండవ హెన్రీ రాజు కాలమున ఆంగ్ల రాజులు పాలించిన ఫ్రెంచి భూభాగమునంతను ఆక్రమించుకొనెను (1204). ఆంగ్ల ప్రభువున కీ విధముగ రాజ్య నష్టమును, అవమానమును కూడ సిద్ధించెను. కాని ఫ్రెంచి భూభాగములు నష్టమగుటచే ఆంగ్ల రాజులకును, జమీందారులకును మరొక విధముగ లాభము కల్గెను. ఇంత వరకును వీరు సగము ఫ్రెంచివారుగను, సగము ఆంగ్లేయులుగను ఉండుచు వచ్చిరి. జమీందారులకు ఇంగ్లండు నందును, ఫ్రాన్సు నందునుకూడ భూవసతు లుండుటచే వారు ఆంగ్ల ప్రభువులకును, ఫ్రెంచి రాజులకును కూడ సామంతులుగ నుండవలసి వచ్చెడిది. వారుపై రెండు జాతులలో నే యొక్క జాతికినికూడ చెంది, సంపూర్ణ

యుండెను. కాంటర్బరీ మత పీఠాధిపత్యము కొరకై యెన్ను కొనబడిన యిరువురు అభ్యర్థులను కూడ త్రోసిపుచ్చి, ఆతడు స్టీఫెన్ లాంగ్టన్ (Stephen Langton) అను ఆంగ్ల మతగురుపును కాంటర్బరీ పీఠాధిపతిగ నియమించెను. పాండిత్యము చేతను, ఇతర యోగ్యతల వలనను, స్టీఫెన్ లాంగ్టన్ ఈ పదవి కెంతయును అర్హుడు. కాని ఆతనిని తన యంగీకారము లేకుండ పోపు మతగురువు నియమించెనను కారణముచే, జానురాజు లాంగ్టనును ఇంగ్లాండు దేశపు గడ్డపై కాలు పెట్టనీయనని పట్టు పట్టెను. ఇయ్యది పోపు మతగురువునకును, జానురాజునకును, పెద్ద తగవుగ పరిణమించెను. జానురాజు మూర్ఖత్వమునకు కోపించి, పోపు మతగురువు యావత్తు ఇంగ్లండు దేశముపై అంతరు (Interdict) విధించెను. ఇందువలన ఇంగ్లండు దేశములో ధార్మిక జీవితమంతయు స్తంభించిపోయెను. ఎవ్వరును దేవాలయములను తెరచుటకు వీలులేదు. దేవస్థానములలో ప్రార్థనాదికములు కరవయ్యెను. వివాహములు చేసికొను వారికి పురోహితులు లభింపరైరి. మరణించిన వారిని పూడ్చిపెట్టు నప్పుడు, అంత్యక్రియలు జరపుటకు కూడ వీలుపడదయ్యెను. ఈ విధముగ ధార్మిక జీవిత మంతయు రద్దుపడిపోయినను, నాస్తికుడగు జానురాజు లొంగలేదు. అంతట పోపు మత గురువు కోపపరవశుడై జాను రాజును మతము నుండి వెలివేసినట్లుగ (Excommunicate) ప్రకటించెను. కాని ఈ ప్రకటనవలన కూడ జాను భయపడలేదు. పోపు పక్షము నవలంబించిన మతగురువుల

నందరను, రాజు దేశమునుండి తఱిమివైచెను. మఠములకును, దేవస్థానములకును చెందిన భూములను, తానే వశపరచుకొని రాజు తన ఆదాయమును వృద్ధిపొందించుకొనెను. నూతనముగ లభించిన యీ ధనముతో, జాను రాజు క్రొత్తసేనలను గూర్చుకొని, తనపై శత్రుత్వము వహించిన వారికి గర్వభంగము చేయుటకు సన్నాహములు చేయుచుండెను. ఇందువలన పోపు మతాధికారి యాగ్రహము మేర మీఱిపోయెను. మత భ్రష్టుడైన జాను రాజును, తాను రాజ్యభ్రష్టుని గావించితిననియు, అందువలన ఆంగ్ల ప్రజ లెవ్వరును అతని యాజ్ఞలను మన్నింప నక్కరలేదనియు, పోపు ప్రకటించెను. తన యాజ్ఞ ప్రకారము జాను రాజును గద్దె నుండి దింపవలయునని, పోపు ఫ్రెంచి రాజును ప్రోత్సహించెను. ఫ్రెంచి రాజు ఇంగ్లాండుపై దాడి కావించుటకు సన్నాహములు చేయసాగెను. ఈ పరిస్థితి చూచుసరికి, జాను రాజుకు మిక్కిలి భయము కల్గెను. దేశమందలి జమీందారులు అతనికి మిక్కిలి ప్రతికూలురై యుండిరి. పోపు మత గురువుతో నిక వైరము పాటించుట ప్రమాదకరమని యెంచి, జాను రాజు ఆతనికి లొంగిపోయెను (1213). స్టీఫెన్ లాంగ్టనును ఆతడు కాంటర్బరీ పీఠాధిపతిగ నంగీకరించెను. ఇంగ్లాండు రాజ్యమును తాను పోపు మత గురువు అనుగ్రహముచే సంపాదించినట్లు అంగీకరించి, తా నా మతాధికారికి సామంతునిగ నుండగలనని కూడ జాను రాజు అంగీకరించెను. ఇట్టి యవమానకరమైన పరిస్థితి, యింతకుపూర్వమే ఆంగ్ల

ప్రభువుకాలమందువలె, ఉపద్రవము కాలేదు. జాను రాజు ఇంగ్ల భూమికి తీరని యవమానము తెచ్చినట్లు ప్రజలు భావింప దొడగిరి. అతని పేరు ప్రతిష్ఠలు నశించెను. కాని మూర్ఖుడైన జాను రాజు ఈ యంశమును లెక్క సేయలేదు. తాను నూతనముగ సంసిద్ధము కావించిన సేనతో ఫ్రెంచి రాజ్యమును మరల సంపాదింపవలెనను ఉద్దేశ్యముతో ఈతడు ఫ్రాన్సు దేశముపై దండెత్తిపోయెను. కాని యీ ప్రయత్నమునందీతనికి సంపూర్ణ పరాభవము కల్గెను (1214).

జాను రాజు కేవలము ఫ్రెంచి ప్రభువుతోడను, పోపు మతాధికారితోడను మాత్రమే కలహించినచో ఆతని కట్టి తీవ్రమగు బాధయు కల్గెడిది కాదు. అట్లు కాక, మూర్ఖాగ్రేసరుడగు ఈ రాజు, ఇంగ్లండు దేశములోని జమీందారులతో కూడ కలహములు తెచ్చిపెట్టికొనెను. అందువలన ఈ నరపాలుని స్థితి యింటిలో కూర్చుండి నాల్గు చూరులకును తన చేతులతో తాను నిప్పుపెట్టుకొనిన నిర్భాగ్యుని స్థితిని పోలెను. జమీందారులనుండి జాను రాజు అక్రమముగ పన్నులను గైకొనజొచ్చెను. రెండవ హెన్రీ రాజు కూడ జమీందారుల నుండి పెక్కు క్రొత్త రుసుములను తీసికొని, తన కోశాగారమును నింపుకొనెడివాడు. కాని వివేకవంతుడైన ఈ రాజు పూర్వాచారములను బాహాటముగ ధిక్కరింపలేదు. ప్రాచీన సాంప్రదాయములను తెరగ పెట్టుకొని, రెండవ హెన్రీ ఆంగ్ల ప్రభుత్వ పద్ధతులందు పెక్కు మార్పులను కొనివచ్చెను. జాను

వలన సామాన్య ప్రజలకు రాజు సాంప్రదాయానుగుణ్యముగ నే
వర్తించుచున్నట్లు కానవచ్చెడిది. జాను ప్రభువునందు తండ్రిలో
గల చాకచక్యము కాని, రాజకార్య నిర్వహణ దక్షత కాని
లేనందున ఆతడు తన యసాధారణ కృత్యములను తగు విధ
ముగ కప్పిపుచ్చజాలడయ్యెను. అందుచేత జమీందారులకును,
ప్రజలకును రాజుపై మితిమీరిన యాగ్రహము కల్గెను. ఫ్రెంచి
రాజు చేతను, పోపు మతాధికారి చేతను తీవ్రముగ అవమా
నము పొందిన రాజు నెడ ప్రజల కెట్టి సానుభూతియును
గౌరవమును లేదయ్యెను. ప్రాచీన సాంప్రదాయముల కను
గుణ్యముగను, ప్రజాభిప్రాయమున కనుకూలముగను, పరిపాల
నము చేయునట్లు రాజుచే వాగ్దానము పొందవలయుననియు,
అట్లు జరగని పక్షమున జాను రాజు దుష్పరిపాలన మితిమీరి
పోవుననియు, ప్రజానీకమునందు దృఢాభిప్రాయ మేర్పడెను.
అదృష్టవశమున నీ సందర్భమున ఆంగ్ల ప్రజలకు దేశభక్తిపూరితు
డును, సమర్థుడును అగు నాయకుడు లభించెను. ఇతడు కాంట
ర్బరీ మతాధికారి యగు స్టిఫెన్ లాంగ్టన్. స్టిఫెన్ లాంగ్టన్
ఆంగ్లేయుడని యీవరకే తెలుపబడినది. జాను రాజు తన గౌర
వమును భంగపరచుకొని, పోపు మతాధికారికి సామంత ప్రభు
వుగ మారుట, ఆతని కెంతమాత్రమును రుచింపలేదు. ఈ
మార్పు దేశ ప్రతిష్ఠకు భంగకరమే కాక, ఆంగ్ల మతాధికార
వర్గమున కనేక విధముల నష్టదాయకము. ఈ యంశమును
దేశభక్తుడగు లాంగ్టన్ స్పష్టముగ గుర్తించెను. అంతేకాక

జానురాజు సాగించుచున్న దుష్పరిపాలనమును గాంచి, యీ మతాధికారి మిక్కిలి బాధపడెను. ఈ రెండు కారణములచే స్టీఫెన్‌లాంగ్టన్ రాజకీయ రంగమునందు ప్రవేశించి,జమీందారుల కును, ఆంగ్ల ప్రజానీకమునకును నాయకత్వము వహించుట కంగీకరించెను. ఈతడు 1214 వ సంవత్సరమున జమీందారులను, వివిధ ప్రాంతములనుండి ప్రజా ప్రతినిధులను రావించి, సైంటు పాలు దేవస్థానమునం దొక సభను ఏర్పాటు కావించెను. అందు స్టీఫెన్ లాంగ్టన్ మొదటి హెన్రీ రాజు 1100 సంవత్సరమున జారీచేసిన రాజకీయపు హక్కుల దస్తావేజును సభాసదులకు చదివి వినిపించి, ఇట్టి దస్తావేజునే వారు జాను రాజు వద్ద నుండి కూడ సంపాదింపవలయునని హెచ్చరిక చేసెను. కాంటర్బరీ మత గురువు చూపిన త్రోవ, ఆంగ్ల ప్రజల కందరకును బాగుగ నచ్చెను. ఆంగ్లదేశపు ప్రాచీన రాజకీయ సాంప్రదాయములకు అనుగుణ్య ముగ ప్రజలను పాలించునట్లును,ఏ విధముగను ప్రజలను బాధింప ననియు వాగ్దానముచేయు నొక రాజకీయ పత్రమును రాజు నుండి పొందుటకై జమీందారులు కృతనిశ్చయులైరి. రాజు తమ కోర్కెను మన్నింపని పక్షమున ఆతనిపై తిరుగుబాటు చేయుటకై కూడ జమీందారులును, వారి అనుచరులును సన్నాహములు చేయదొడగిరి. ఇంతలో ఫ్రాన్సుదేశపు దండ యాత్రనుండి, ఫిలిప్పు రాజుచే సంపూర్ణముగ పరాభవింపబడి, జాను ప్రభువు స్వదేశమునకు మరలివచ్చెను. తత్క్షణమే ఆంగ్ల

ప్రజల కోపాగ్ని రాజుపై మరలెను. జాను రాజు రచ్చలో గెలువజాలకపోయినను, ఇంటి యందు నిరంకుశముగ వర్తింప వలయునను తత్వము కలవాడు. అందువలన ప్రజలు తనపై విధింపదలచిన నిర్బంధముల నాతడు మిక్కిలి అసహ్యించుకొనెను. జమీందారులతోడను, ప్రజలతోడను, యుద్ధము సేయుటకై ఆతడు సేనలను సేకరింపదొడగెను. ప్రజలను ప్రతిఘటించుటలో తనకు చేయూత నొసంగవలసినదని యీ రాజు పోపు మతాధికారి నర్థించెను. కాని యిందువలన రవంతయు ఫలితము లేదయ్యెను. దేశమున నంతర్యుద్ధము ప్రారంభమగు సూచనలు కాన నయ్యెను. రాజు పక్షము నెవ్వరును బలపరుప రైరి. ప్రజా పక్షము నానాటికిని బలపడసాగెను. ఇది చూచి భయపడి, జానురాజు ప్రజాభిప్రాయమునకు తలయొగ్గుట కంగీకరించెను. 1215 వ సంవత్సరము జూను నెల 15 వ తేదీని జమీందారులు రూనీమీడ్ (Runneymede) అను పెద్ద మైదానమునందు సమావేశమైరి. జాను రాజు కతిపయ పరివారముతో నచ్చటి కేతెంచి, ప్రజలు కోరిన రాజకీయపు దస్తావేజుపై చేవ్రాలు కావించెను. త్వరలోనే దానిపై రాజముద్ర పడెను. ఈ రాజకీయపు దస్తావేజు ఆంగ్ల రాజ్యాంగ చరిత్ర యందు మిక్కిలి విఖ్యాతిని చెంది, "మహాపత్రము" అను పేర బరగుచున్నది. ఆంగ్లమున దీనిని **The Great Charter (Magna Carta)** అందురు.

ఈ మహాపత్రమును చారిత్రికులును, రాజ్యాంగ వ్యవ-
హార నిపుణులును, పలువురు పలువిధములఁ బ్రశంసించి
యున్నారు. ఈ దస్తావేజు ఆ కాలగతులకు చాలవరకు తగి
యున్నదనియే తెలుపవచ్చును. రాజు ధర్మమునకు బద్ధుడై,
ప్రజాప్రతినిధుల సలహాపై, ప్రజా సమ్మతముగ, పరిపాలనము
చేయవలయునను సూత్రము నేటి ఆంగ్ల దేశ పరిపాలనకు పునాది
రాయి. ప్రజా పరిపాలనా విధాన మాంగ్ల దేశమున క్రమక్రమ
ముగా వృద్ధిచెంది, నేడొక బలీయమగు మహావృక్షమై విరాజిల్లు
చున్నది. ఆ వృక్షము సూక్ష్మరూపమున నీ మహాపత్రమున కాన
వచ్చుచున్నదని తెల్పినచో నం దతిశయోక్తి యించుకయును
లేదు. మహా పత్రమునందు మొత్తము అరువదిమూడు నిబం
ధనలు కలవు. ఆధునిక ప్రజాపరిపాలనా విధానము దృష్ట్యా
ఇందు నాల్గు నిబంధనలు అతి ముఖ్యమైనవని విద్వాంసుల యభి
ప్రాయము. "సాంప్రదాయ సిద్ధమగు పన్నులను మాత్రమే
రాజు తన జమీందారుల వద్దనుండి గైకొనవలెను. ఇంతకు
మించిన రుసుములను వేనిని కూడ ప్రజాప్రతినిధుల సభ యను
మతిలేకుండ ప్రభువు విధింపరాదు." అని పండ్రెండవ నిబంధన
యందు తెలుపబడినది. పదునాల్గవ నిబంధనయందు ప్రజాప్రతి
నిధుల సభయనగా నెట్టిదియో, అది యెట్లు సమావేశము
కావలెనో తెలుపబడినది. "ప్రజాప్రతినిధుల సభలో ఆర్చిబిషప్పులు,
బిషప్పులు, పెద్ద జమీందారులు మున్నగువారు చేరి యుందురు.
పైన పేర్కొనబడిన ప్రముఖులను రాజు సభా సమావేశమునకు

ప్రత్యేకముగ ఆహ్వానింపవలెను. తదితరులగు భూస్వాములను జిల్లా అధికారుల ద్వారా రాజు ఆహ్వానింపనగును". అని పదునాల్గవ నిబంధన స్పష్టపరచు చున్నది. ఈ రెండు నిబంధనలను జోడించినచో, నేటి పార్లమెంటరీ ప్రభుత్వ విధానమునందలి రెండు ముఖ్య సూత్రములు రూపొందుచున్నవి. రాజు నిరంకుశముగ వర్తించి, ప్రజలపై పన్నులను విధించుటకు వీలు లేదు. పన్నుల విధించుటకై ప్రజా ప్రతినిధుల యనుమతి ముఖ్యము. ఈ నియమము యొక్క ప్రాముఖ్యతను వేరుగ విశదీకరింప నవసరము లేదు. పన్నుల విధించు హక్కును గూర్చి రాజునకును ప్రజలకును అతి తీవ్రమగు భేదాభిప్రాయము లుత్పన్నమగుట, మనము ముందుముందు స్టూవర్టు రాజుల యుగములో చూడగలము. తుట్టతుద కీ వివాదము మహాపత్రమునందు కాపింపబడిన నిబంధన ప్రకారమే పరిష్కారమయ్యెను. పదునాల్గవ నిబంధన ఈనాటి బ్రిటీషు పార్లమెంటు స్వరూపమునకు నాందీ ప్రవచనము. బ్రిటీషు పార్లమెంటులో సామాన్య ప్రజా ప్రతినిధుల సభ (House of Commons), ప్రభువుల సభ (House of Lords) అని రెండు విభాగములు కలవు. ఈ రెండింటిని కలిపి మనము పార్లమెంటు అని వ్యవహరించుచున్నాము. ఆదిమ దశయందు రెండుసభలును [illegible] కలిసి [illegible] నుండెడివి. కాలక్రమమున అవి వేర్పడెను. అట్లు వేరుపడుటకును గల ప్రాతిపదిక కూడ మహాపత్రములోనే కలదు. రాజువలన ప్రత్యేకముగ ఆహ్వానముల నందుకొనిన ఆర్చి బిషప్పులు, బిషప్పులు,

పెద్ద జమీందారులు కాలక్రమమున ప్రభువుల సభగ మారి ప్రత్యేకముగ సమావేశము కాసాగిరి. ఇదియే నేటి House of Lords (ప్రభువుల సభ). రాజాజ్ఞ ననుసరించి జిల్లా అధికారులచే ఆహ్వానింపబడిన ఇతర భూస్వాములు,స్థానిక ప్రముఖులు, ప్రజా ప్రతినిధులును, వేరొకసభగ ఏర్పడి, కాలక్రమమున ప్రజాప్రతినిధుల సభగ మారిరి. దీనిని ఆంగ్లమున House of Commons అని వ్యవహరింతురు. ఆంగ్ల ప్రజా ప్రతినిధి ప్రభుత్వమునకు పునాదులు 1215 వ సంవత్సరము నాటి మహాపత్రమునందు కానవచ్చుననుటకు మరి వేరు నిదర్శనములు చూపనక్కరలేదు.

బ్రిటను దేశీయులు తాము చిరకాలమునుండియు అనుభవించుచున్న పౌరస్వత్వముల గూర్చియు, తమ దేశమున నెలకొనియున్న ధర్మపరిపాలన (Rule of Law) ను గూర్చియు సకారణముగ గర్వింతురు. ఈ రెండింటికిని కూడ పునాది మహాపత్రము నందే కానవచ్చును. ఈ దస్తావేజులోని ముప్పదితొమ్మిది నలుబది నిబంధనలు ముఖ్యమైనవి. "దేశములోని ఏ స్వతంత్ర పౌరునికూడ మేము అతనితో సమానమగు హోదాగల పౌరుల నిర్ణయ ప్రకారమును, దేశమునందమలులోనున్న శాసనముల ప్రకారముగనే కాని - భిన్న పద్ధతులచే ఖైదు చేయుటగాని, అతని ఆస్తిని వశపరచుకొనుట కాని, అతని ధర్మబాహ్యుని కావించుట కాని, దేశమునుండి తరిమివేయుటగాని విధింపగల వారము కాము" అని ముప్పదితొమ్మిదవ నిబం

ధనయందు రాజు వాగ్దానము చేసి యున్నాడు. "మా ప్రజలలో ఎవ్వరికిని కూడ మేము న్యాయప్రదానము కావించుటకు నిరాకరింపము. న్యాయ ప్రధానమునం దాలస్యము కావింపము. ధనాశచే మేము ధర్మమును తారుమారు కావింపము" అని కూడ జానురాజు అంగీకరించెను. ఈ రెండు నిబంధనలును నేటి పౌరస్వత్వములకు ప్రాణమువంటివి. సరియైన కారణము లేకుండ స్వతంత్రుడగు బ్రిటీషు పౌరు నెవ్వనిని, ఎంతటి ఉన్నతాధికారియు, తుదకు రాజుకూడ నిర్బంధించి, చెరసాలకు పంపరాదు. ఈ యంశమును గూర్చి పదునేడవ శతాబ్దియందే రాజునకును ప్రజాపక్షము వారికిని తీవ్రభేదము లుత్పన్నమై తుదకు ప్రజాపక్షము వారే జయించిరి. "ప్రజలెల్లరునుకూడ ఎట్టి భేదములును లేక న్యాయమును పొందుటకు అర్హులు. ధర్మదేవత ప్రమోల హెచ్చుతగ్గులు ఎంత మాత్రమును లేవు. ఎల్లవారును కూడ ధర్మమునకు తలయొగ్గవలసినదే" అను ఆధునిక భావములు సూక్ష్మరూపమున మహాపత్రములో కానవచ్చుచున్నవి.

పైన పేర్కొనబడిన నాల్గు నిబంధనలకును జాతీయ పౌర జీవితములో గల ప్రాముఖ్యమును నేడు స్పష్టముగా తెలిసికొనగల్గుచున్నాము. కాని జాను రాజు కాలమునాటి ప్రజలు కాని, జమీందారులు కాని, తుదకు వారి నాయకుడగు స్టీఫెన్ లాంగ్టన్ పీఠాధిపతి కాని, ఈ నిబంధనలకు మహత్తరమైన ఆధిక్యత కలదని గుర్తింపలేదు. ప్రజలకును, జమీందారులకును సాంప్రదాయ సిద్ధముగ లభించియున్న హక్కులను

వారు మహాపత్రములో పేర్కొని, ఆ స్వత్వములను రాజు మన్నింపవలెనని నిర్బంధము చేసిరి. ఈ కథా కాలమున నాటికి సామాన్య ప్రజలకు, సంఘమునందు తగినంత ఆధిక్యత కాని, గౌరవము కాని లభించియుండలేదు. ప్రభువులు, జమీందారులు, పెద్ద భూస్వాములు మున్నగువారు మాత్రమే ఆ యుగమందు తల యెత్తుకొని తిరుగుచుండిరి. వారికే సంఘమున ప్రతిపత్తియుండెడిది. ఒక విధముగ వారే సన్నకారు ప్రజలకు ప్రతినిధులను భావము సర్వత్ర వ్యాపించియుండెను. కావున మహాపత్రమునందు చాలభాగము నిబంధనావళి జమీందారులు, భూస్వాములు మున్నగు ఉన్నత తరగతుల వారి హక్కులు, వారికిని రాజునకును గల సంబంధములు, రాజునకు చెల్లవలసిన పన్నులు మొదలైన యంశములు పేర్కొనినది. నిజమునకీ మహాపత్రము జమీందారులు రాజు నుండి బలవంతముగ రాబట్టిన హక్కుల జాబితా యని చెప్పవలెను. కాని యిందు పేర్కొనబడిన మరికొన్ని యంశము లీదస్తావేజునకు జాతీయ ప్రాముఖ్యతను కల్పించుచున్నవి. ఆ కాలపు క్రైస్తవ మత సంఘమునకు గల హక్కులు యథాతథముగ నుండవలయుననియు, లండను మున్నగు పట్టణ సంఘముల వారు సంపాదించిన ప్రత్యేక స్వత్వములు మన్నింపబడవలయుననియు, వర్తకుల రాకపోకల కెట్టి భంగమును కలుగరాదనియు ఈ పత్రమున పేర్కొనబడినది. పెద్ద పెద్ద భూస్వాముల హక్కులను రాజు కాపాడవలయునని నిబంధన కావింపబడినట్లే

చిన్న భూస్వాముల యొక్కయు, పేదరైతుల యొక్కయు,
నష్టపు బాధ్యతను వారి కంటె అధికులగు వారు వహింపవలె
నని కూడ ఇందు స్పష్టముగ పేర్కొనబడినది. ఈ విధముగ
మహాపత్రము నందలి యధిక భాగము సంఘమునందలి
యున్నత వర్గముల-వారి హక్కుల సంరక్షణకును, తాత్కాలిక
ప్రయోజనముల సాధించుటకొరకును ఉద్దేశింపబడినను, అందు
ప్రజాసామాన్య సంక్షేమము కొరకును, శాశ్వతజాతీయ
ప్రయోజనముల సాధించుట కొరకును కొన్ని ఏర్పాట్లు లేక
పోలేదు. కావున ఆంగ్ల రాజకీయ చరిత్రయందు మహా పత్ర
మున కొక ప్రత్యేక స్థానము లభించి యున్నది.

స్థలాంతరములందు పేర్కొనబడిన మరొక యంశము
ని సందర్భమున మరల ప్రశంసింపవలసి యున్నది. ఆంగ్లేయ
జాతివారు వాస్తవిక తత్వము కలవారు. వారెన్నడును గంభీర
పదజాలముతో కూడిన రాజ్యాంగ పత్రములకై ప్రాకులా
డరు. ఏదైన నొక సమస్య యుత్పన్నమైనప్పుడు, ఆ సమ
స్యను పరిష్కారము చేయుటకై మాత్రమే వారు యత్నిం
తురు. కావున ఆంగ్లరాజ్యాంగ చరిత్ర యందలి రాజకీయపు
దస్తావేజు లన్నియు, తాత్కాలిక లక్ష్యముల సాధించుటకు
మాత్రమే యేర్పడినవి. అయినను అనేక సందర్భములలో నీ
రాజకీయ పత్రములు వర్తమానము నతిగమించి, భవిష్యత్ప్ర
యోజన సాధనకైకూడ ఉపకరించుట మనము చూడగలము.
ఇందువలన ఆంగ్లజాతివారి స్వభావమును, బుద్ధికుశలతయు కార

ణములు. వారు దానిని పిండి నీరు తెప్పింప గల సమర్థత గల వారు. ప్రాచీన సాంప్రదాయములకు నూతనార్థములు కల్పించి, ఆ విధముగ నూతన లక్ష్యముల సాధించుటలో, వారికిగల ప్రజ్ఞ అపూర్వమైనది. కావుననే 1215 వ సంవత్సరమున జమీందారులచే సంపాదింపబడిన హక్కుల పత్రమును పునాదిగ చేసికొని, 17 వ శతాబ్దియందలి ఆంగ్లప్రజాప్రతినిధులు పార్లమెంటరీ ప్రభుత్వ విధానము, వ్యక్తి స్వాతంత్ర్యము, వ్యక్తుల స్వేచ్ఛ మున్నగు ఆధునిక రాజకీయ స్వత్వములకొరకై పోరాడ గల్గిరి. ఆంగ్ల రాజకీయ పత్రముల ప్రాముఖ్యత కేవలము వాని యందలి నిబంధనలపై ఆధారపడునది కాదనియు, వివిధ కాలములందు ఆ నిబంధనలకు కావింపబడు వ్యాఖ్యానములే మూలముకంటె ముఖ్యతరములని మనము గుర్తింప నగును.

మహాపత్రమునందు గర్భితమగు మరియొక ముఖ్యాంశమును ఇచ్చోట గమనింప వలసియున్నది. పదమూడవ శతాబ్ది యందలి ఆంగ్లేయులకు పార్లమెంటు, ప్రజాప్రతినిధుల పరిపాలన మున్నగు భావి రాజకీయ పరిణామములు తెలియవు. కాని వారు ఒక ముఖ్య విషయమును మాత్రము ఎట్టి పొరపాటును లేకుండ గుర్తింపగల్గిరి. అనాదినుండియు ఇంగ్లాండు దేశమున రాజ్యాంగ నిర్వహణమును గూర్చిన కొన్ని సాంప్రదాయములు, నిబంధనలు కలవు. ఆ సాంప్రదాయములును, నిబంధనలును ప్రజాభిప్రాయమును ప్రతిబింబించును. అయ్యవి

ధర్మముపై ఆధారపడియున్నవి. కావున వాని నెవ్వరును తిర స్కరించుటకు వీలులేదు. రాజుకూడ వానిని త్రోసి పుచ్చుటకు సమర్థుడు కాడు. ప్రాచీన రాజ్యాంగ ధర్మములును, సాంప్ర దాయములును ప్రభుత్వమునకు మూలము. రాజు కూడ వీనికి బద్ధుడు. ధర్మము నతిక్రమించి ప్రవర్తించుటకై యేరాజైన యత్నించినచో, ప్రజ లాతనిని నిర్బంధించి, న్యాయమార్గము నకు మరలింప వచ్చును. ఈ ముఖ్యమగు సత్యము మహాపత్ర మును సాధించిన జమీందారులును, ప్రజాప్రతినిధులును ఋజువు చేసిరి. రెండవ హెన్రీ రాజు కాలమున న్యాయ పరి పాలన (Rule of Law) నెలకొల్ప బడినట్లు భావింప బడుచు న్నది. ఆ భావన సత్యదూరము కాదు. కాని రెండవ హెన్రీ కాలము నాటికి రాజు ప్రాచీన సాంప్రదాయములకును, నిబం ధనలకును బద్ధుడు అను సత్యము గుర్తింప బడలేదు. వివేకవం తుడును, బుద్ధిశాలియునగు హెన్రీ రాజు సాంప్రదాయముల నుల్లంఘింపకుండగనే, తన లక్ష్యముల నన్నిటిని సాధించు కొనెను. కావున నాతనికి ప్రజలతో నెట్టి సంఘర్షణయు సంభవింప లేదు. అవివేకియైన జానుప్రభువు నిరంకుశముగ వర్తించు టకు యత్నించుటచే ప్రజ లాతనికి "ప్రభుత్వము ధర్మ మూలము" అను సత్యమును నేర్పవలసి వచ్చెను.

జమీందారుల నిర్బంధము వలనను, ప్రజలు తిరుగుబాటు కావింతురేమో యను భయము వలనను, జానురాజు మహా పత్రముపై చేవ్రాలు కావించెనే కాని అందలి నిబంధనల

ప్రకారము రాజ్యపరిపాలనము కావింపవలెనను తలంపు ఆతనికి కలలో కూడ లేదు. పై పత్రము నందలి యంశముల నమలు చేయుటకై ఇరువదియైదుగురు జమీందార్ల సంఘమొకటి నియమింప బడెను. "వీరు నా నెత్తిపై ఇరువదియైదుగురు రాజరాజులను నిలువ బెట్టినారు" అని జాను ప్రభువు పై యేర్పాటును అసహ్యించుకొనెను. తన్నవమానము పాలు కావించిన జమీందారుల కొక గుణపాఠము నేర్పవలెనని, యాతడు నిశ్చయించు కొనెను. జమీందారులలో కొందరను చీలదీసి, రాజు తన పక్షమున చేర్చుకొనెను. క్రొత్త సేనలను సిద్ధము చేసెను. మహాపత్రము తనవలన అక్రమముగా సాధింపబడినది. కావున, దానిని ధర్మ విరుద్ధముగ ప్రకటించి, రద్దుచేయ వలసినదని జాను ప్రభువు పోపు మత గురువును కోరెను. పోపు అట్టి ప్రకటనను కావించి, మహాపత్రము నమలు కావించుటకై యత్నించు వారి నందరను వెలివేసెద నని బెదరించెను. కాని ఆంగ్ల ప్రజలు బెదర లేదు. జమీందారులు కూడ సేనలను సిద్ధము కావించుకొనిరి. వారు ఫ్రాన్సు దేశపు రాజగు ఫిలిప్పు కుమారుడు లూయీని తమ రాజుగ ఎన్నుకొని, ఆతనిని ఇంగ్లాండు దేశమునకు రావలసినదిగ ఆహ్వానించిరి. కొంత సేనతో లూయీ ఇంగ్లాండునకు వచ్చెను. అంతర్యుద్ధమునకై సర్వసన్నాహములును జరిగెను. కాని యీ పరిస్థితిలో జాను రాజు మరణించెను (1216). జాను ప్రభువు తన దేశమునకు కావించిన సేవ అనుకూల సమయమున మరణించుట యొకటియే యని చారిత్రికుల మతము.

మన మిప్పుడు పంద్రెండవ శతాబ్దిని దాటి పదమూడవ శతాబ్దియందు ప్రవేశించుచున్నాము. జానురాజు పరిపాలనా కాలముకూడ పదమూడవ శతాబ్దిలోనే చేరియున్నది. ఈ శతాబ్ది పార్లమెంటుసభ ఆవిర్భవించిన యుగమని తెల్పుట సత్యదూరము కాదు. 1215 వ సంవత్సరమున ఆంగ్లప్రజలు మహాపత్రమును సాధించిరి. అంతేకాక ఆ పత్రమునందలి నిబంధనల నమలు కావించుటకై వారు ఇరువది యైదుగురు జమీందారుల సంఘమును నియమించిరి. ఈ సంఘమే అనేక రూపాంతరములనంది కాలక్రమమున పార్లమెంటు సభగ మారుట మనము చూడవచ్చును. మొట్టమొదటి న్యాయబద్ధమైన పార్లమెంటుసభ జానురాజు మనుమడగు మొదటి ఎడ్వర్డుచే సమావేశ పరుపబడెను (1295). పార్లమెంటుసభ మూడు ముఖ్యధర్మములను నిర్వహించును. శాసనములు కావించుట, పన్నులను విధించుట, రాజ్య వ్యవహారములందు రాజునకు సలహానిచ్చుట అను ఈ మూడు పనులను నిర్వహించుటకై చిరకాలమునుండియు ఆంగ్లేయ రాజ్యాంగమునం దేర్పాటు చేయబడియే యుండెను. సాక్సను యుగమునందీ మూడు ధర్మములను విజ్ఞానుల సమితి (Witan) వారు నిర్వర్తించుచుండిరి. కొన్ని అసామాన్య సందర్భములలో వారు రాజులను ఎన్నుకొను హక్కును కూడ ఉపయోగించుచుండిరి. నార్మను రాజుల కాలములో విజ్ఞానులసభ రాజ్యాంగసమితి (Curia Regis) గ మారెను. విజ్ఞానుల సభలో సభ్యత్వమును సంపా

ించుటకు విజ్ఞానము, లోకానుభవము అను యోగ్యతలు కావలసి యుండెను. రాజ్యాంగ సమితిలో సభ్యత్వము రాజుచే సూటిగ భూవసతుల పొందినవారికి మాత్రము లభించుచుండెను. ఈ రెండు సంఘములందును సభ్యత్వము వేరువేరు యోగ్యతలపై ఆధారపడియున్నను, ఇయ్యవి ఆ కాలమునందలి పార్లమెంటు సభలని చెప్పుట తప్పుకాదు. కాని ఈ పార్లమెంటులు కొన్ని వర్గములకు మాత్రమే ప్రాతినిధ్యము వహించుచుండెను. మొదటి ఎడ్వర్డు రాజుచే సమావేశ పరుపబడిన పార్లమెంటుసభ అట్లుకాక యావదాంగ్ల జాతికిని ప్రాతినిధ్యము వహించెను. పార్లమెంటు ఆవిర్భావమే పదమూడవ శతాబ్ది అంగ్లదేశ చరిత్రకు మకుటము.

## మూడవ హెన్రీ రాజు
## పార్లమెంటు సభ అవతరణ

చేదులో నుండి తీపియు, చీకటిలో నుండి వెల్తురును, చెడుపులో నుండి మంచియు తరచు ఉత్పన్నమగునని లోకానుభవము గలవారు చెప్పుట మనము వినుచుందుము. అవివేకియు, నిరంకుశ తత్వము గలవాడును అగు, జాను రాజు పరిపాలన యందు ఇంగ్లాండు దేశమునకు నష్టము సంభవించిన మాట వాస్తవమే కాని, ఆతని కాలమందే గొప్ప రాజ్యాంగ ప్రాముఖ్యము గల మహాపత్రముకూడ రూపొందుట మనము చూచియున్నాము. అట్లే జాను రాజు కుమారుడు మూడవ హెన్రీ రాజు కాలమున కూడ ఒక ముఖ్యమగు రాజకీయ పరి

ణామము సిద్ధించెను. ఇది ఆంగ్ల దేశమున మొట్టమొదటిసారిగ పార్లమెంటు సభ సమావేశమగుట. కాని యీ సత్పరిణామము రాజు యొక్క పరిపాలనా సామర్థ్యము వలన గాని, అతనికి గల ప్రజా క్షేమ కాంక్ష వలనగాని సంభవించినది కాదు. తండ్రివలెనే హెన్రీ కూడ అసమర్థుడు. అతడు జాను రాజు కంటె కూడ అసమర్థుడనియే తెలుపవలసియున్నది. ఈతనికి రాజ్య పరిపాలనా సామర్థ్యము సున్న. హెన్రీ కూడ జాను రాజు వలెనే మాట నిలుకడలేని వాడు. ఈతడు దుష్టులగు మిత్రుల యొక్కయు, స్తోత్ర పాఠకుల యొక్కయు, తేనె మాటలకు లొంగిపోయి, వారిచేతి కీలుబొమ్మయై రాజ్యాంగ వ్యవహారముల నస్తవ్యస్తము కావించెను. విదేశీయులకు ఆంగ్ల దేశ పరిపాలన యందు విశేష ప్రాముఖ్యత కల్పించి, ప్రజాభిమానమును కోల్పోయెను. రాజ్యాంగ వ్యవహారములందు మార్పు తేవలసినదిగ కోరిన ప్రజా పక్షమువారి కోర్కె మన్నింపడయ్యెను. అందువలన ప్రజలు హెన్రీ రాజుపై విసువుచెంది, తిరుగుబాటు లేవదీసి, దేశమున శాశ్వతముగ సుపరిపాలనను నెలకొల్పు నుద్దేశ్యముతో, నొక నూతన సంస్థను సృష్టించిరి. ఆ నూతన సంస్థయే పార్లమెంటు సభ. ఈ పార్లమెంటు సభకు స్వరూప కల్పనము కావించిన యాతడు విదేశీయుడగు ఫ్రాన్సు వాస్తవ్యుడగుట మిక్కిలి విచిత్ర విషయము. ఏది యెట్లున్నను, మూడవ హెన్రీ రాజు అసమర్థ పరిపాలన వలన ప్రపంచము నందలి మొదటి ప్రజా ప్రతినిధి సభ

యుత్పన్నమయ్యెను. బురదలో నుండి తామరపువ్వు వికసించెను. ఆ కథాక్రమమును మనము సూక్ష్మముగ తెలిసి కొందము.

జాను రాజు మరణించుటకు పూర్వము ఆంగ్ల దేశము నందలి జమీందారు లేకమై, తమ దేశమునకు పరిపాలకత్వము వహించవలసినదని, ఫ్రాన్సుదేశపు రాకుమారుడగు లూయీ నాహ్వానించినట్లు ఈవరకే తెలుపబడినది. లూయీ ఇంగ్లాండు దేశమునకు వచ్చి చేరిన అనతికాలములోనే జాను రాజు కాల ధర్మము చెందెను (1216). అప్పటికి జానురాజు కుమారుడైన హెన్రీ తొమ్మిదేండ్ల బాలుడు. తండ్రి యెంత దుర్మార్గుడైన నేమి? పసివాడగు కుమారుని అందులకు శిక్షించుట ధర్మము కాదు. ఈ యుద్దేశ్యముతో ఆంగ్ల జమీందారులును, ప్రజలును బాలుడైన హెన్రీని తమ ప్రభువుగ ఎన్నుకొనిరి. కాని విదేశీయు డగు లూయీ రాకుమారుడు ససైన్యుడై ఆంగ్లభూమి యందే యుండెను. ఆతనిని స్వదేశమునకు మరలిపోవలసినదిగ ఆంగ్ల ప్రముఖులు కోరిరి, కాని లూయీ అందుల కంగీకరింప లేదు. అంతేకాక ఆంగ్ల సింహాసనము తనకే దక్కవలయునని యాతడు వాదింపజొచ్చెను. తన హక్కును బలపరచుకొనుటకై లూయీ ఫ్రాన్సు నుండి క్రొత్త సేనలను కూడా రావింపదొడగెను. ఈ నూతన పరిణామమును చూచి ఆంగ్లేయు లించుక భయపడిరి. కాని వారి నాయకుడైన పెంబ్రోకు జమీందారు విలియం (William the Marshal, Earl of Pem-

broke) అను నాతడు లూయీ సేనలతో పోరాడి వాని నోడించెను. ఆంగ్ల నౌకాదళము ఫ్రెంచి వారిని సముద్రముపై కూడ పరాభవించెను. ఇక మార్గాంతరములేక లూయీ రాకుమారుడు ఇంగ్లాండును వదలి వెడలిపోయెను. అంతట ఆంగ్ల జమీందారులు బాలుడైన హెన్రీని రాజ్యాభిషిక్తుని కావించిరి.

1216 వ సంవత్సరమునుండి పదునారు సంవత్సరముల కాలము మూడవ హెన్రీ రాజు పక్షమున సమర్థులైన ఆంగ్ల రాజనీతిజ్ఞులు దేశమును పరిపాలించిరి. వారిలో ప్రథముడు వృద్ధుడును, పెంబ్రోకు జమీందారును అగు పిలియం. అతడు 1219 వ సంవత్సరమున మరణింపగా హ్యూబర్టు డిబర్ (Hubert De Burgh) అను మరియొక ప్రముఖుడు రాజునకు సంరక్షకత్వము వహించి 1232 వరకును పరిపాలన సాగించెను. ఈ రాజనీతిజ్ఞు లిర్వురును దేశమున శాంతి నెలకొల్పిరి. ప్రభుత్వముపై తిరుగుబాటు చేయబూనిన వారి నెల్లరను కఠినముగ శిక్షించి, రాజు అధికారమును స్థిరముగ నెలకొల్పిరి. 1232 వ సంవత్సరము నాటికి మూడవ హెన్రీ సంప్రాప్త వయస్కుడై తానే స్వయముగ రాజ్యపాలనము చేయుటకు పూనుకొనెను.

మూడవ హెన్రీరాజు పరిపాలనయందు దసమర్థతయు, అవివేకమును స్పష్టముగ కానవచ్చును. ఈత డధికార సూత్రముల గ్రహించుసరికి ప్రభుత్వాదాయము మిక్కిలి సన్నగిలి యుండెను. రిచర్డురాజును, జానురాజును స్వప్రయోజనముల

సాధించుటకై ప్రభుత్వమునకు రావలసిన ఆదాయమునంతను అన్యాక్రాంతము చేసియుండిరి. ప్రభుత్వ కోశాగారమునుండి లక్ష్మీదేవి వెడలిపోయెను. ఇతర విధముల ధనమును సేకరించుటకు మార్గములు లేకపోయినను, హెన్రీరాజు మాత్రము తన ఖర్చులను తగ్గించుకొనడయ్యెను. ఈ రాజు ఒక ఫ్రెంచి దేశీయుని తనకు ప్రధాన సలహాదారునిగ నియమించుకొనెను. ఈ సలహాదారుడు ఇంగ్లాండు దేశమునందలి పెద్ద పెద్ద హోదాల నన్నిటిని విదేశీయులకే యిచ్చుచు, ప్రజల యాగ్రహమునకు గురియయ్యెను. కొంతకాలమునకు హెన్రీరాజు ఒక ఫ్రెంచి వనిత నుద్వాహము కావించుకొనెను. అది మొదలుగ రాణిగారి బంధువర్గ మంతయు, ఇంగ్లాండు దేశమున కేతెంచి, ప్రభుత్వోద్యోగముల నన్నిటిని తామే వహింపజొచ్చిరి. ఇట్లు ప్రభుత్వాధికారము లన్నియు విదేశీయులకు లభించుట ఆంగ్ల ప్రజానీకమున కెంతమాత్రమును రుచింపలేదు. ఇది యిట్లుండగా అవివేకియగు హెన్రీరాజు ఫ్రాన్సు దేశముతో యుద్ధమునకు పూనుకొని, అందు సంపూర్ణముగ పరాభవింపబడెను. ఇదే సందర్భమున పోపు మతగురువు హెన్రీ కొక పేరాస కల్పించి, హెన్రీ రెండవ కుమారుడగు ఎడ్మండు అను వానిని నేపిల్సు, సిసిలీ రాజ్యముల కధిపతిని కావింతుననియు, అందులకు ప్రతిఫలముగ తాను (పోపు) తన శత్రువులతో సాగించుచున్న యుద్ధమున కగు వ్యయమునంతను ఇంగ్లాండురాజు భరింపవలెననియు నొక అపూర్వ పథకమును సిద్ధము చేసెను. సాధ్యా

సాధ్యముల గుర్తెరుంగని హెన్రీ ఈ నిరర్థక ప్రయత్నములయం దెంతయో ద్రవ్యమును వెచ్చించెను. ఆతని కుమారునికి నేపిల్సు సిసిలీ రాజ్యములు లభించలేదు. కాని ఇట్టి అవివేక కార్యముల వలన రాజు ప్రజాభిమానమును సంపూర్ణముగ కోల్పోయెను. ప్రస్తుతపు కార్యనిర్వహణమును సక్రమముగ కొనసాగించుటకై సమర్థులగు నుద్యోగులను నియమింప వలసినదని జమీందారులు రాజు నొత్తిడి చేయసాగిరి. హెన్రీరాజు ప్రజాభిప్రాయమును మన్నింతునని వాగ్దానము చేయుటయే కాని, ఆ వాగ్దానముల చెల్లించిన పాపమున నెన్నడును పోలేదు. ఆంగ్ల జమీందారు లకు సమర్థుడగు నాయకుడు లభించువరకును, హెన్రీరాజు దుష్పరిపాలన నిరాటంకముగ సాగెను. తుదకు ఇంగ్లాండు ప్రజల కొక యుత్తమనేత లభించెను. ఆతడు సైమన్ డీ మాంట్ ఫర్ట్ (Simon De Montfort) అను వాడు.

సైమన్ డీ మాంటుఫర్టు ఫ్రెంచి దేశీయుడు. ఈతడు ప్రశంసనీయమగు పరిపాలనా సామర్థ్యమును, ఉదాత్త ప్రకృతియు, ఆధికారిక తత్వమును, ధర్మతత్పరతయు కలవాడు. సైమను, హెన్రీ రాజు చెల్లెలిని వివాహము కావించుకొనినందున సమీప రాజబంధువు. హెన్రీ రాజు ఆతనిని ఫ్రాన్సు దేశమునందలి గాస్కనీ (Gascony) రాష్ట్రమును పాలించుటకై నియమించెను. సైమను మిక్కిలి సమర్థతతోడను, ఆవశ్యకమగు కాఠిన్యము తోడను, పరిపాలన సాగించెను. ఆతని కఠిన-పద్ధతులు గాస్కనీ ప్రజలకు రుచింప లేదు. హెన్రీ రాజు కూడ సైమను పరిపా

లన యెడ వైముఖ్యమును చూపించినందున సైమను ఇంగ్లాండు నకు తిరిగివచ్చి, తన జమీందారీ యగు లెస్టరు నందు కాలము గడుపసాగెను (1257). సైమన్ డీ మాంటుఫర్టు విదేశీయుడును, రాజబంధుడును, అగుటచే ఆతడు రాజు పక్షము నవలంబించి, ఆంగ్ల ప్రజాపక్షమునకు విరుద్ధముగ వ్యవహరించి యుండుట సహజము. కాని హెన్రీ రాజును, ఆతని కుటుంబము లోని వారును సైమనును తిరస్కార భావముతో చూచెడి వారు. కావున సైమను ప్రజాపక్షమునందు ప్రవేశించి, అనతి కాలములో ఆ పక్షమునకు నాయకుడయ్యెను.

1258 వ సంవత్సరమున హెన్రీ రాజునకు ఒక పెద్ద మొత్తపు ధనము కావలసి వచ్చెను. అందువలన ఆతడు జమీందారులను సమావేశము కావింపక తప్పలేదు. జమీందారు లీ సమావేశమునకు సాయుధులై యేతెంచి, రాజు విదేశీయుల నందరను అధికార పదవుల నుండి తొలగింపవలయుననియు, ప్రభుత్వ విధానమును సంస్కరించుటకై యొక సంఘము నియమింపబడవలయు ననియు, లేని పక్షమున తాము రాజు కోరిన ధనమును మంజూరు చేయజాలమనియు, పట్టుపట్టిరి. విధిలేక హెన్రీరాజు ఈ షరతులకు లోబడెను. ప్రభుత్వ సంస్కరణమునకై యొక సంఘము నియమింపబడెను. వై సంఘము వారు మరల ఆక్స్ఫర్డు (Oxford) పట్టణమందు సమావేశమై "ఆక్స్ఫర్డు నియమావళి" (The Provisions of Oxford) అను పేర కొన్ని సిఫారసులు కావించిరి. అందు ముఖ్యాంశము ఒక శాశ్వతరాజ్యాంగ సంఘమును నియమించుట. ఈ సంఘమునందు

పదునేనుగురు సభ్యు లుందురు. వారు ప్రభుత్వ వ్యవహారముల పర్యవేక్షణ కావింతురు. అక్రమ మగు పన్నులు విధింపబడకుండు నట్లును, ప్రజానీకమున కెట్టి యన్యాయములును జరుగకుండు నట్లును శ్రద్ధవహింతురు. అవసరమని తోచినప్పుడు వీరు మరి యొక జమీందారుల సంఘముతో సంప్రతించుచుందురు. పదు నేనుగురు సభ్యులు గల రాజ్యాంగ సంఘమునకు సైమన్ డీ మాంటుఫర్టును, మరియొక జమీందారును నాయకులుగ నియ మితులైరి. అనతికాలములో సైమనునకే నాయకత్వమునకు సంబంధించిన సర్వాధికారములును లభించెను. హెన్రీ రాజు ప్రజలు విధించిన నిర్బంధములకు తాత్కాలికముగ తల యొగ్గెను. ఆరు సంవత్సరములు గడచెను. ప్రజలు కావించిన ఏర్పాట్లను కూలద్రోయుటకై, తండ్రివలెనే హెన్రీరాజు కూడ కుట్రలు పన్నసాగెను. ప్రజాభిప్రాయమున కనుకూలముగ రాజ్యపాలనము కావింతునని తాను కావించిన వాగ్దానమును రద్దుచేయవలెనని ఆతడు పోపు నర్థించెను. పోపు అట్లే కావించెను. ఆక్స్ఫర్డు నియమావళి ప్రకారము మెలగవలసిన బాధ్యత తనపై నున్నదా లేదా యను ధర్మసందేహమును పరిష్కరింపవలసినదని హెన్రీ రాజు ఫ్రాన్సు రాజగు లూయీని కోరెను. హెన్రీ రాజుపై అట్టి బాధ్యత యెంతమాత్రమును లేదని ఫ్రెంచి రాజు పరిష్కారము చేసెను. ఇది సాకుగ గైకొని, హెన్రీరాజు ఆక్స్ఫర్డు ఒప్పందమును త్రోసిపుచ్చి, నిరంకుశముగ పాలనచేయుటకు సమకట్టెను. ప్రజాపక్షము వారు మార్గాంతరములేక రాజుపై యుద్ధము ప్రకటించిరి.

సైమను డీ మాంటుఫర్టు జమీందారుల సేనకు నాయకత్వము వహించెను. లండను పట్టణవాసులును, ఇంగ్లాండు నందలి దక్షిణ జిల్లాలవారును ప్రజాపక్షమును సమర్థించిరి. వేల్సు రాష్ట్రమును, ఉత్తర జిల్లాలును రాజును బలపరచెను. లీవీ (Lewes) అను ప్రదేశమున ఇరు పక్షములకును యుద్ధము సంభవించెను (1264). హెన్రీ రాజు పెద్ద కుమారుడు ఎడ్వర్డు అను యువక వీరుడు రాజు పక్షమున గొప్ప ధైర్యసాహసములతో పోరాడెను. కాని అనుభవశాలియు, యుద్ధకుశలుడును అగు సైమను డీ మాంటుఫర్టు మిక్కిలి నేర్పుతో వర్తించి, హెన్రీ రాజును చెరపట్టెను. ఎడ్వర్డు రాకుమారుడు కూడ సైమనుకు లొంగిపోయెను. ఆక్స్ఫర్డు నియమావళి ప్రకారము రాజ్యపాలనము కావింతునని హెన్రీ రాజు మరల వాగ్దానము చేయవలసి వచ్చెను.

లీవీ యుద్ధ విజయము వలన సైమను డీ మాంటుఫర్టునకు గొప్ప ప్రతిష్ఠ లభించెను. ఆత డింగ్లాండు దేశమున కొక నియంత యయ్యెను. కాని సైమను మహాశయుడు నియంతవలె వర్తింపక, స్వార్థరాహిత్యముతోడను, దూరదృష్టితోడను వ్యవహరించెను. సైమను గొప్పతనము లీవీ విజయముపై ఆధారపడినది కాదు. విజయానంతర మాతడు అవలంబించిన మార్గములే ఆతని కాంగ్ల దేశచరిత్రయందు లభించిన శాశ్వత కీర్తికి మూలము. రణభూమిలో ఆతడు సాధించిన గెలుపు వంటి గెలుపు ఇతర సందర్భములలో అనేకులు సాధించి

యుండిరి. కాని శాంతి నెలకొనిన తరువాత ఆతడు సాధించిన విజయ మసమానమైనది. ఆతడు ఇంగ్లీషుపార్లమెంటు నందలి ప్రజాప్రతినిధి సభను మొట్టమొదటి పర్యాయము సమావేశ పరచిన రాజనీతిజ్ఞుడు. ఈతనిని బ్రిటీషు పార్లమెంటునకు జనకుడు అని వర్ణించుట తప్పుకాదు. నిజమునకు బ్రిటీషు శాసన సభయందు రెండు విభాగములు కలవు. కాని అందలి దిగువ సభయగు ప్రజాప్రతినిధి సభకే (House of Commons) మనము సాధారణముగ పార్లమెంటు అను నామమును వాడు చున్నాము. ఆ కామన్సు సభను సృష్టించినవాడు సైమను డీ మాంటుఫర్టు. 1265 వ సంవత్సరమున నీతడిట్టి పార్లమెంటు సభను సమావేశపరచెను. ఇందు పాల్గొన వలసినదిగా ఆతడు ప్రతి జిల్లానుండియు ఇద్దరు చిన్న భూస్వాములను (Knights), పట్టణములనుండి ఇద్దరిద్దరు చొప్పున ప్రతినిధులను, వర్తక ప్రతి నిధులను ఆహ్వానించెను. వీరందరును ఒకచోట సమావేశమైరి. ఇదియే బ్రిటీషు పార్లమెంటు నందలి కామన్సుసభ ఆవి ర్భావము. ఈ సమావేశము నందెట్టి ముఖ్య నిర్ణయములును జరుగ లేదు. "సైమను డీ మాంటుఫర్టు సమావేశ పరచిన పార్లమెంటు యొక్క ఉత్కృష్టత ఆ సభ కావించిన ఘన కార్యముల వలన సిద్ధించినది కాదు. ఆ పార్లమెంటు యొక్క ప్రాధాన్యము దాని స్వరూపము నందే ఇమిడి యున్నది" అని ఆంగ్లచారిత్రికులు పదే పదే వక్కాణించి యున్నారు. ఈ పార్ల మెంటు సభవారు ప్రభుత్వమును కొనసాగించుటకై సైమను కావించిన యేర్పాట్లనామోదించిరి.

ప్రజా ప్రతినిధులను సమావేశపరచి, వారిచే ప్రభుత్వ సంబంధములగు కార్యములను నిర్వహింపజేయుట ఇంగ్లాండు దేశచరిత్రలో క్రొత్త విషయము కాదు. చిరకాలమునుండియు ఇంగ్లాండు దేశమునందలి తాలూకాల (Hundreds) ప్రతినిధులును, పట్టణముల ప్రతినిధులును జిల్లా న్యాయస్థానములలో సమావేశమగుట ఆచారముగ నుండెను. విజయభూషణుడు కావింపించిన ఆర్థిక విచారణయందు పల్లెల ప్రతినిధులు వాఙ్మూలముల నిచ్చియుండిరి. అంతేకాక క్రైస్తవ మతసంఘమువారు ధార్మిక సభల నేర్పాటు చేసినప్పుడు, అందు వివిధ ప్రాంతముల ప్రతినిధులు పాల్గొనుట చిరకాలమునుండియు వాడుకలో నుండెను. మహాపత్రమును సాధించిన సందర్భములో స్టీఫెన్ లాంగ్టన్ మతాధికారి సూచనపై జమీందారులును, చిన్న భూస్వాముల ప్రతినిధులను, సమావేశమైరి (1213). తదనంతర కాలములో జిల్లాల ప్రతినిధు లప్పటప్పట సమావేశమై, తాము చెల్లింపదలచిన పన్నుల మొత్తమును గూర్చి నిర్ణయములు చేయుచుండెడివారు. కాని సైమను ఈ పద్ధతికి కొంత వన్నె పెట్టెను. జిల్లా ప్రతినిధులతోపాటు ఆతడు పట్టణవాసుల ప్రతినిధులను, వర్తకుల ప్రతినిధులను కూడ ఒకచోట సమావేశపరచి, బ్రిటీషు పార్లమెంటులోని కామన్సు సభకు పునాది వైచెను. సైమను డీ మాంటుఫర్టు వైచిన పునాదిపై బ్రిటీషు ప్రజాప్రతినిధిసభ కాలక్రమమున వృద్ధిచెందెను. ఇందలి యొక ముఖ్యలక్షణమును మాత్రమిచ్చట పేర్కొనవలసిఉన్నది. ఫ్రాన్సు,

స్పైను మున్నగు దేశములం దాయా కాలములలో ప్రజా ప్రతినిధులతో కూడిన పార్లమెంటు సభలు నెలకొనెను. కాని ఆ సభలలో వర్గ ప్రాతినిధ్య భావమేకాని జాతీయభావము లేకుండెను. వివిధ వర్గములవారు అనగా భూస్వాములు, వర్తకులు, పట్టణవాసులు, మత సంఘములవారు, వేర్వేరు భాగములుగ నేర్పడి తమవర్గమునకు సంబంధించిన సమస్యలను చర్చించి, పరిష్కరించుకొని వెడలి పోయెడివారు. తామందరమును ఒక జాతికి ప్రాతినిధ్యము వహించుచున్నార మను భావము వారిలో లేకుండెను. బ్రిటీషు పార్లమెంటు సభలో అట్లుకాక భూస్వాములు, జిల్లా ప్రతినిధులు, పౌర ప్రతినిధులు, వర్తక ప్రతినిధులు ఒకేచోట చేరి తమతమ సమస్యలను కలసి మెలసి పరిష్కారము కావించుకొనెడి వారు. అందువలన బ్రిటీషు పార్లమెంటు ఒక జాతీయసంస్థగ పెంపు చెందెను. కామన్సు సభలోని మరియొక మంచి లక్షణము ఇచ్చట ప్రశంసింపదగి యున్నది. ఇతరదేశపు పార్లమెంటులలో భూస్వాముల వర్గమంతయు ఒక ప్రత్యేక విభాగముగ నుండెడిది. ఇంగ్లండులో అట్లుకాక చిన్నతరహా భూస్వాములు సామాన్య ప్రజానీకముతోనే చేరి వారిని బలపరచిరి. ఈ చిన్నతరహా భూస్వాములు విశేషము ధనాఢ్యులుకారు కాని, గౌరవముగను, హోదాతోడను జీవయాత్ర గడపుటకు చాలిన వసతులు కలవారు. స్థానికముగ మంచి పరపతియు, పలుకుబడియు కలవారు. కావున వారికి స్వాతంత్ర్యేచ్ఛయు, ఆత్మగౌరవమును మెండు. ఈ భూస్వాములే ముందుముందు

కామన్సు సభకు వెన్నెముకగ మారి, పౌరస్వత్వములకొరకై రాజుతో హోరాహోరిగ పోరాడుట మనము చూడవచ్చును. బ్రిటీషు పార్లమెంటునందలి ఉన్నత సభలో పెద్దపెద్ద భూస్వాములు, ఉన్నత వంశ సంజాతులును, ధనాఢ్యులునగు ప్రభువులును, క్రైస్తవ మతసంఘమునందలి ఉన్నతోద్యోగులును మాత్రమే సభ్యులుగ నుండెడివారు. ఆ యేర్పాటే నేటికిని కొనసాగుచున్నది.

ఉత్తమ కార్యములను కేవల పరార్థతత్పరతతో కావించినను, స్వార్థబుద్ధిచే నెరవేర్చినను, అయ్యవి ఉత్తమ కార్యములే యగునని విజ్ఞానుల మతము. సైమను డీ మాంటుఫర్టు సమావేశపరచిన మొదటి పార్లమెంటు సభయందాతని స్వార్థము మేళవించి యున్నదనుటలో సందేహము లేదు. కాని ఆ కారణము వలన నాతని యుదాత్త సంరంభమునకు న్యూనత సంభవింపదు. బ్రిటీషు దేశ చరిత్ర యందాతనికి గల కీర్తి జ్యోతి మందగింపదు. 1264 వ సంవత్సరమున లీవీ యుద్ధములో విజయము సాధించిన తర్వాత సైమను మహాశయున కింగ్లాండు దేశమున నపారమగు గౌరవము లభించెను. దేశమున కాతడు మకుటము లేని రాజుగ మారెను. రాజును, యువరాజును ఆతనికడ బందీలుగ నుండిరి. ప్రభుత్వమునంతను ఆతడు వశపరచు కొనెను. ఆక్స్ఫర్డు నియమావళి ప్రకార మేర్పడిన పరిపాలనా సంఘమున కాతడు నాయకుడు. సామాన్య ప్రజలలో సైమను డీ మాంటుఫర్టు ప్రతిష్ఠ విస్తారముగ హెచ్చుచుండెను.

ఈ పరిస్థితులను చూచి జమీందారుల వర్గము వారు చాల భయపడిరి. రాజు నిరంకుశత్వము సంతరింప చేయుటకై ప్రయత్నములు సాగించిన తాము, తమలో నొక్కడగు సైమను నిరంకుశత్వమునకు లోబడ వలసి వచ్చునేమో యని వారి కనుమానము తోచెను. కావున నీ యాపదనుండి తప్పించుకొనుటకై జమీందారులు సైమనును ఏవిధముగనైన యాతని ఉన్నత పదవినుండి కూలద్రోయవలెనని యత్నములు చేయ సాగిరి. ఈ యంశమును సైమను గ్రహించెను. సైమనుకు పట్టణము లందును, సామాన్య ప్రజలందును చాల పలుకుబడి యుండెను. తన ప్రయోజనముల సాధించుటకై సర్వదా కృషి చేయుచున్న సైమను డీ మాంటుఫర్టును సన్నకారు ప్రజలు చాల అభిమానముతో చూచుచుండిరి. ఈ యంశమును గుర్తించిన సైమను తాను సమావేశ పరచిన పార్లమెంటు సభలో కొన్ని పట్టణములకును, చిన్న తరహా భూస్వాములకును ప్రాతినిధ్య మొసంగుట ఆశ్చర్యకరమగు నంశము కాదు. పెద్ద జమీందారులలో కొందరను మాత్రమే ఆతడు ఈ సభకాహ్వానించెను. ఏది యెట్లున్నను సైమను డీ మాంటుఫర్టు గైకొనిన చర్య చారిత్రిక ప్రసిద్ధినంది, బ్రిటీషుజాతి కెంతయో లాభదాయకముగ పరిణమించిన దనుట నిర్వివాదాంశము.

పరిపాలనా రంగమున సైమను డీ మాంటుఫర్టు సాధించిన విజయములు రెండు. అందు మొదటిది బ్రిటీషు పార్లమెంటులోని కామన్సు సభ యొక్క ప్రథమ సమా-

వేశము నేర్పాటు కావించుట, రెండవది 1258 వ సంవత్స రమునందు ఆక్స్ఫర్డు నియమావళిని మూడవ హెన్రీ రాజుచే నంగీకరింప జేయుట. ఈ రెంటి యందును గల విశిష్టతను గూర్చి యించుక ముచ్చటించవలసియున్నది. జాను రాజు కాలమున సాధించబడిన మహాపత్రము నందు ప్రజల యొక్కయు, జమీందారుల యొక్కయు హక్కులను రాజు నిస్సందేహముగ నంగీకరించెను. అయ్యది ప్రజాపరిపాలనను నెలకొల్పుటలో నొక ముఖ్యాంశము. కాని రాజు నామమాత్రమునకు ప్రజాస్వత్వ ముల నంగీకరించుటవలన ప్రజలకు విశేష లాభము కలుగదు. కావించిన వాగ్దానము ప్రకారము రాజు ప్రజా పరిపాలన సాగించుచున్నాడో లేదో తెలిసికొనుటకును, రాజు పెడ త్రోవలబట్టినప్పు డాతనిని మరల చక్కని త్రోవకు తీసికొని వచ్చుటకును, ఒక శాశ్వతమగు పర్పాటు కావలెను. పరిపాలనా విధానమును పర్యవేక్షణ కావించుటకై యొక సంస్థ నిర్మా ణము కావలసియున్నది. ఆ సంస్థయే పార్లమెంటు సభ. ఆక్స్ఫర్డు నియమావళి ప్రకారము పదునేనుగురు సభ్యులు గల యొక సంఘ మేర్పాటయ్యెను. ఇందలి సభ్యులు రాజునకు సలహాదారులుగ భావింపబడిరి. వీరు దేశ పరిపాలనకు చెందిన వివిధ శాఖలను తమలో తాము పంచుకొని ప్రభుత్వ కార్య నిర్వహణము కావించెడివారు. వీరికి సైమను డీ మాంటుఫర్టు నాయకుడు. పరిపాలన విషయములో ఈ సంఘమువా రవలం బించిన యొక పద్ధతి ముఖ్యముగ గమనింపదగి యున్నది. పరి

పాలనకు సంబంధించిన విధానముల (Policy) ను మాత్రము వీరు నిర్ణయించెడి వారు. ఈ విధానమును అమలు కావించు బాధ్యతను, పై సంఘ సభ్యులకంటె "తక్కువ ప్రాముఖ్యత" గలవారు వహించుచుండిరి. వీరు రాజకీయ రంగమునందు ఏ విధమగు ఘనతయు లేని ఉద్యోగస్తులు. ఈ యేర్పాట్లను గమనించినప్పు డాధునిక ప్రజా పరిపాలనా పద్ధతులతో పరిచయము గలవారికి ఒక భావము స్ఫురించి తీరును. నేటి కాబినెట్టు పరిపాలనకును, అక్స్ఫర్డు నియమావళి ప్రకార మేర్పడిన ప్రభుత్వమునకును ఎంతయో సామ్యము కలదు. పదునేనుగురు సభ్యులు గల సంఘము నేటి కాబినెట్టు సంఘము లేక మంత్రి మండలి. నేటి మంత్రిమండలివలెనే వీరు ఆంగ్ల ప్రజానీకమునకు ప్రాతినిధ్యము వహించు నాయకులు. పదునేనుగురు సభ్యుల సంఘమునకు నాయకుడైన సైమనుమహాశయుడు నేటి బ్రిటిషు ప్రధానమంత్రి వంటివాడు. మంత్రివర్గ సభ్యులకంటె "తక్కువ ప్రాముఖ్యత" గల యట్టియు, రాజకీయముగా నెట్టి ఘనతయును లేనట్టియు, ఉద్యోగివర్గము ఈనాటి సివిలు సర్వీసు వారు. ఆధునిక కాలమున మనకు సుపరిచితములగు నీ యేర్పాట్ల నన్నిటిని పదమూడవ శతాబ్దిలోని బ్రిటిషు జమీందారు లూహించిరని భావించుట పొరపాటు. ఈనాటి పరిపాలనా విధానమున కొక ప్రతిబింబమును వారు కల్పించుకొనిన యంశము మాత్రము నిజము. ఆ ప్రతిబింబము కొంతకాలము

వరకును పూర్తిగ మరగుపడి, తుదకు ఆధునిక కాలమున ప్రస్ఫుటమగు ఆకారమును ధరించినది.

సైమను డీ మాంటుఫర్టు సాధించిన విజయము చిర స్థాయిగ నుండలేదు. జమీందారులలో పలువురు ఆతనియెడల అసూయ చెందియుండిన విషయ మీవరకే తెలుపబడియున్నది. సైమను కడ బందీగ నున్న హెన్రీ రాజును, ఆతని కుమారు డగు ఎడ్వర్డును, అవమానకరమగు నా పరిస్థితి నుండి యెట్లైన తప్పించుకొనవలెనని సర్వ ప్రయత్నములు చేయసాగిరి. తుదకు రాకుమారు డగు ఎడ్వర్డు 1265 వ సంవత్సరమున చెరనుండి తప్పించుకొనిపోయి, సేనలను కూర్చుకొని, సైమనుపై యుద్ధము ప్రకటించెను. ఎవిషామ్ (Evesham) అను ప్రదేశ మున నిరుపక్షములకును ఘోరమగు పోరాటము సంభవించెను. సైమను వీరుడు మిక్కిలి ధైర్యముతో పోరాడియు, తుదకు రణరంగమున బలియయ్యెను. రాజు పక్షము వారు జయించిరి. కాని యిందువలన సైమను డీ మాంటుఫర్టును, ప్రజాపక్షము వారును కావించిన పర్పాట్లు పూర్తిగ చెడిపోయినట్లు భావించు టకు వీలులేదు. సాంప్రదాయ ప్రకారమును, ప్రజా సమ్మతము గను, రాజ్యపాలనమును నిర్వహింపగలనని ఎడ్వర్డు రాకుమారుడు తండ్రి పక్షమున వాగ్దానము చేసెను. తండ్రివలె కాక ఈతడు చేసిన వాగ్దానముల మన్నించువాడు. కావున ప్రజలకు సంతుష్టి కల్గెను. ఎవిషామ్ విజయము తరు వాత మూడవ హెన్రీ ఏడు సంవత్సరములు జీవించెను. ఈ

కాలమున రాజ్యపరిపాలనమును ఎడ్వర్డు రాకుమారుడే నడపెను. ఈ రాకుమారుడు గొప్ప బుద్ధిశాలి. రణరంగమున నాతడు సైమను డీ మాంట్ఫర్టును నిర్జించెనే కాని, పరిపాలనా రంగమున నాతడు కావించిన మార్పులను తిరస్కరింపలేదు. ఈ విషయము మనకు ముందు ముందు తెలియగలదు.

——

## ఏడవ ప్రకరణము

# పార్లమెంటు సంస్థ వికాసము

# శత సంవత్సర యుద్ధము

## ఆంగ్ల మనువు - మొదటి ఎడ్వర్డురాజు

## (Edward I - The English Justinian)

మూడవ హెన్రీరాజు 1272 వ సంవత్సరమున కాల ధర్మము చెందగా, ఆతని జ్యేష్ఠ పుత్రుడగు ఎడ్వర్డు రాకుమారుడు రాజ్యాభిషిక్తు డయ్యెను. తండ్రి మరణించుసరికి ఈ యువ రాజు దేశాంతరమున నుండెను. అయినను ఆంగ్లప్రజలు ఎట్టి యాటంకమును తెలుపక, ఈతనినే తమరాజుగ వరించిరి. తండ్రి కాలమునందే ఈ రాజపుత్రుడు మేటి వీరుడుగను, పరిపాలనా దక్షుడుగను, ఖ్యాతి గడించి యుండెను. అంతేకాక ఎడ్వర్డు రాజు మాట నిలుకడ గలవాడు. ఆడి తప్పనివాడు. తండ్రి కిని ఈతనికిని ఈ విషయమున నెంతయో భేదము కలదు. కావున ఆంగ్లప్రజలు ఈతనిని తమ ప్రభువుగ ఎన్నుకొనుటలో ఆశ్చర్య మేమియును లేదు. ఎడ్వర్డుఋషి (Edward the Confessor) తక్క ఆంగ్ల రాజులలో ఎడ్వర్డు నామకులు మరొకరు లేని కారణమున ఈతనిని చరిత్రలు మొదటి ఎడ్వర్డురాజుగ వర్ణించు చున్నవి. మొదటి ఎడ్వర్డుప్రభువు ముప్పదియైదు సంవత్సర ములు రాజ్యపాలనము కావించెను (1272-1307). ఉత్తమోత్త

ములగు ఆంగ్ల రాజన్యులలో నీత డొక్కడని తెల్పుట కెంత మాత్రమును సందేహము లేదు. ఆంగ్ల పార్లమెంటును సృష్టించుటలో సైమను డీ మాంటుఫర్టు ప్రాభవమునే అయినను, ప్రభుత్వ దృష్టిలో ఆతడొక తిరుగుబాటు దారుడు. కావున 1265 నాటి ఆంగ్ల పార్లమెంటును శిష్టులు సక్రమమగుదానిగ మన్నింపలేదు. ఎడ్వర్డురాజు ఈ పార్లమెంటు సభను సక్కగ పోషించి, తుదకు 1295 వ సంవత్సరమున దానికొక సక్రమ స్వరూపమును కల్పించెను. ఈతడు ప్రజాంగీకారముచే రాజ్యాధికారము వహించిన ప్రభువు. కావున ఎడ్వర్డు రాజుచే సమావేశము కావింపబడిన పార్లమెంటు సభ పందొమ్మిదవ శతాబ్ది వరకును "నమూనా పార్లమెంటు సభగ" పరిగణింపబడుచు వచ్చెను. కావున సైమను డీ మాంటుఫర్టుతో సహా ఈతడు కూడ ఆంగ్ల పార్లమెంటును సృష్టించిన వాడని తెలుపవచ్చును. ఈ రాజునకు క్రమబద్ధమగు జీవితమునందును, రాజ్యాంగ విధానమునందును, ప్రీతి మెండు. శాసనములు జీవితమును క్రమబద్ధము కావించును కావున ఎడ్వర్డు రాజు ఆంగ్లప్రభుత్వ విధానమునకు సంబంధించిన కొన్ని అతి ముఖ్య శాసనములు కావించెను. శాసన నిర్మాణ మాతనికి మిక్కిలి ప్రీతిదాయకమని చెప్పినను తప్పులేదు. ఈ రాజు కావించిన శాసనము లాంగ్ల ప్రజా జీవితమును శాశ్వతముగ ప్రభావితము కావించినవి. కావున ఆంగ్లప్రజ లీతనిని ప్రసిద్ధ రోమక చక్రవర్తియు, శాసన నిర్మాతయు నగు Justinian అను ప్రముఖునితో పోల్చుచున్నారు. భారతీయ

సాంప్రదాయ ప్రకారము మే మీతనిని ఆంగ్లమనువుగ వర్ణించి నారము. ఈతనికి శాసన నిర్మాణమునం దెంత దక్షతగలదో, యుద్ధ నిర్వహణమునం దంత కౌశల్యము గలదు. ఎడ్వర్డు ప్రభు వనేక రణరంగములందు తన పరాక్రమమును, సంగ్రామ కళాకోవిదత్వమును ప్రదర్శించి. గొప్ప వీరుడుగ విఖ్యాతి గాంచెను. ఫ్రాన్సు, స్కాట్లండు, వేల్సు మున్నగు దేశముల వీరులు ఎడ్వర్డురాజు ఖడ్గధాటిని చవిజూచిరి. ఇన్ని యోగ్యతలు కల్గిన ఎడ్వర్డురాజును ఉత్తమ ఆంగ్లప్రభువులలో నొకనిగ వర్ణించుట తప్పుకాదు.

ఉదాత్త ప్రకృతి లేని ఇతర ఆంగ్ల ప్రభువులు పార్లమెంటు సభను విరోధ భావముతో నుపలక్షించి యుందురు. కాని క్రమబద్ధ జీవితమునందు మిక్కిలి ఆసక్తి గల ఎడ్వర్డు రాజు అట్లు కాక సైమను మహాశయుడు నాటిన ఈ మొలకను చక్కగ పోషించెను. 1275 వ సంవత్సరము మొదలు 1295 వరకును ఈ రాజు పార్లమెంటు సభను అనేక పర్యాయములు సమావేశపరచెను. కాని ఈ పార్లమెంటు సమావేశములసంపూర్ణమైనవని తెలుపక తప్పదు. కొన్ని సందర్భములలో ఎడ్వర్డు రాజు పట్టణముల ప్రతినిధులను, జిల్లాల ప్రతినిధులను సమావేశము కావించెడి వాడు. మరికొన్ని సమావేశములకు పై ప్రతినిధుల కాహ్వానములే పోయెడివి కావు. మరొకప్పుడు పెద్ద జమీందారులు మాత్రమే పార్లమెంటుసభ కాహూతులగు చుండిరి ఒక్కొకప్పుడు రాజు వర్తకుల ప్రతినిధులను

మాత్రమే ఆహ్వానించి, వారి వలన ధన సహాయమును పొందు చుండెడివాడు. ఈ విధముగ నైపై కాలములో (1275 - 95) పార్లమెంటు సభ సజీవమై యున్నను, దానియందు సంపూర్ణత కొరత పడెను. కాని ఈ మధ్యకాలములో అంగ్ల ప్రభువు యొక్క విదేశాంగ సంబంధములలో పెద్ద మార్పువచ్చెను. ఎడ్వర్డు రాజున కేక కాలమున ఫ్రాన్సు, స్కాట్లండు వేల్సు దేశములతో యుద్ధముచేయ వలసి వచ్చెను. అంగ్ల దేశ చరిత్ర యందొక ముఖ్య ఘట్టము సమీపించెను. ఈ పరిస్థితియందు ప్రజా ప్రతినిధు లందరను రావించి, వారికి తానవలంబించు చున్న విదేశాంగ విధానమును చక్కగ తెలియ జెప్పి, యుద్ధ నిర్వహణమున కావశ్యకమగు ధనమును ప్రజల నుండి పొంద వలయునని ఎడ్వర్డు రాజు నిశ్చయించు కొనెను. కావున ఆతడు 1295 వ సంవత్సరమున సమగ్రమగు పార్లమెంటు సభను సమావేశము కావించెను. ఇందు ఉన్నత వంశ సంభూతులగు ప్రభువులును, పెద్ద జమీందారులును, ఆర్చి బిషప్పులు, బిషప్పులు, అబట్లు మున్నగు మతాధికారులును, ప్రతి జిల్లా నుండియు ఇర్వురు చొప్పున ఘరానా మనుష్యు లును, ప్రతి పట్టణము, వర్తక స్థానము నుండియు ఇర్వురు చొప్పున ప్రతినిధులును, ఆహూతులై పాల్గొనిరి. ఈ పార్ల మెంటు మునుముందు ఆంగ్లదేశమున సమావేశమైన ప్రజా ప్రతినిధి సభలకు వరవడి దిద్దినది కావున దీనికి నమూనా పార్ల మెంటు (Model Parliament) అను ఖ్యాతి లభించినది. ఈ పార్ల

మెంటు సమావేశములో పాల్గొనవలసినదిగా ఎడ్వర్డురాజు చిన్న తరహా మతాధికారులనుకూడ ఆహ్వానించెను. ఈ విధముగ ఎడ్వర్డు రాజు నాజ్ఞచే సమావేశమైన పార్లమెంటు సభలో ఆంగ్ల ప్రజానీకమునందలి ప్రభువులు, మతాధికారులు, సామాన్య ప్రజలు అను మూడు వర్గముల వారునుకూడ చేరియుండిరి. కాని చిన్న తరహా మతాధికారులు పార్లమెంటు సభలో చేరుట కిష్టపడక, తమ ప్రత్యేక సమావేశములలో రాజునకు కావలసిన సొమ్మును మంజూరుచేయుట కంగీకరించుటవలన, వీరు శాశ్వతముగ పార్లమెంటు సభ నుండి విడిపోయిరి. అంత మాత్రముచే ఎడ్వర్డు రాజు ఏర్పాటుచేసిన పార్లమెంటు సమావేశమున కెట్టి కొరతయు రాలేదు. ఆ సభను సమకాలీనులును, అనంతర యుగముల వారును కూడ జాతీయ ప్రతినిధి సమావేశముగ మన్నించుచు వచ్చిరి.

ఈ విధముగ పదమూడవ శతాబ్ది తుది భాగమున ఆంగ్ల ప్రజానీకమునకు ప్రాతినిధ్యము వహింపగల యొక పార్లమెంటు సభ ఏర్పాటయ్యెను. కాని ఆ పార్లమెంటునందు నేటి కాలపు పార్లమెంటు సభలో గల యన్ని లక్షణములును ఉండినట్లు మనము భావింపరాదు. ఎడ్వర్డు రాజు సమావేశపరచిన ఈ జాతీయ సభలో ప్రభువులును, సామాన్య ప్రజల ప్రతినిధులును ఒకే చోట సమావేశమైరి. ప్రభువుల సభయు, ప్రజాప్రతినిధుల సభయు ఆనాటి కింకను వేరుపడలేదు. రెండవ ఎడ్వర్డు రాజు కాలమున నీ మార్పు సంభవించెను. పార్లమెంటు సభను

సమావేశపరచు అధికారము రాజునకు మాత్రమే యుండెను. నిర్ణీతమగు వ్యవధి తరువాత పార్లమెంటు సభను తప్పక సమావేశపరచవలయునను శాసన మానాటి కింకను రూపొంద లేదు. రాజునకు సలహాదారులుగ నుండు మంత్రులను నిర్ణ యించుటలో ఆనాటి పార్లమెంటు సభవారి కెట్టి యధికార మును లేకుండెను. మరియొక విషయము ఈ సందర్భమున తెలుపవలసియున్నది. ఈనాడు పార్లమెంటులో సభ్యుడుగ నుండుట యొక గౌరవముగ భావింపబడుచున్నది. కాని రాక పోకల సౌకర్యములు లేని యా కాలమున పార్లమెంటు సభలో సభ్యుడుగ నుండుట యొక నిరర్థకమగు బాధ్యతగ భావింపబడెడిది. ఇట్టి పరిస్థితులలో పార్లమెంటు సభకు పుష్టి కల్గుటకు సావకాశము చాల తక్కువగ నుండెనని వేరుగ తెలుప నక్కరలేదు.

ఎడ్వర్డురాజు కోరిన ప్రకారము "నమూనా పార్ల మెంటు" సందలి సభ్యులు తమ ప్రభువునకు కావలసిన ధనమును మంజూరు చేసిరి. కాని 1295 నాటి పార్లమెంటు సభయొక్క విశిష్టత దాని స్వరూపమందే యిమిడియున్నది. ఈ సభవా రెట్టి ఘనమగు కార్యక్రమమును నిర్వర్తింపలేదు. అయినను పై సమావేశమువలన ఒక గొప్ప లాభము చేకూరెను. పార్ల మెంటు సభయనగా ఒక జాతీయసమితి యనియు, అందు అన్ని వర్గములవారి ప్రతినిధులు చేరి యుండవలయుననియు, అందు లకు విరుద్ధముగా దేశమునందలి ఏ యొక్క వర్గమువారినైనను

(జమీందారులు లేక వర్తక ప్రతినిధులు లేక జిల్లాల ప్రతినిధులు) సమావేశపరచి, ఆ సమావేశమును పార్లమెంటు సభగ పరిగణింప రాదనియు, ప్రజానీకమునకు విస్పష్టముగ తెలియవచ్చెను. ఇదియే నమూనా పార్లమెంటుయొక్క సత్ఫలితము.

మరి రెండు సంవత్సరములు గడచిన తరువాత అనగా 1297 వ సంవత్సరమున ఆంగ్ల రాజ్యాంగ విధానమునందలి యొక ముఖ్య పత్రముపై ఎడ్వర్డురాజు వ్రాలు చేయవలసి వచ్చెను. ఆ రాజకీయ పత్రమును "Confirmation of Chartars" అని చరిత్రలు వర్ణించినవి. రాజ్యాంగపు దస్తావేజులను పునః ధ్రువపరచుట అని మనము పై అంశముల కర్ధము చెప్పుకొనవచ్చును. పార్లమెంటుసభను ఇష్టపూర్వకముగ తనంతట తాను సమావేశపరచి, ఆంగ్లదేశ చరిత్రలో "ఋజుమార్గ వర్తనుడు" అని గొప్పకీర్తి నార్జించిన ఎడ్వర్డురాజు జానురాజు కాలము నాటి మహాపత్రమును కొన్ని హెచ్చింపులతోసహా పునః ధ్రువపరచవలసి వచ్చుట మనకు కొంతవరకు ఆశ్చర్యము కల్గింపవచ్చును. కాని కొన్ని అసామాన్య పరిస్థితుల కారణముగ ఎడ్వర్డురాజు అట్లు చేయవలసివచ్చెనని ఇందులకు సమాధానము చెప్పవలసి యున్నది. 1295 వ సంవత్సరము నాటి పార్లమెంటు సభవారు ఎడ్వర్డురాజు కోరిన ధనమునంతను మంజూరు చేసిరి. కాని ఆ ధనమంతయు చేజిక్కుటకు కొంతకాలము పట్టును. కాని ఫ్రాన్సు, స్కాట్లండు, వేల్సు దేశములతో ఒకే పర్యాయము యుద్ధము సాగించుచున్న ఎడ్వర్డు రాజునకు

తగినంత కాలము వేచి యుండుటకై ఓరిమి లేదయ్యెను. ఇది యిట్లుండగా పోపు మతగురువు ఒక ప్రత్యేక శ్రీముఖమును పంపి, ఇంగ్లండు నందలి క్రైస్తవ మత సంఘమువారు తన యనుమతి లేనిది రాజు గారికి పన్నులు ఈయరాదని ఆజ్ఞ కావించెను. మరొక వంక ఆంగ్ల జమీందారులు నిష్కారణముగ తమ రాజుతో తగవు పెట్టుకొని, తాము విదేశములకు యుద్ధమునకు పోమని భీష్మించిరి. యుద్ధమునందు తనకు సహాయము చేయనివారి నురి తీసెదనని రాజు బెదరించినను ఫలము లేదయ్యెను. అంతట ప్రాణము విసిగి, ఎడ్వర్డు రాజు రేవుస్థలములలో వర్తకులవద్ద గల ఉన్ని నంతను బలాత్కారముగ తీసికొని, (తనకు కావలసిన ధనమును సంపాదించి) యుద్ధమును సాగించుటకై ఆంగ్ల సముద్రమును దాటి, ఐరోపాఖండమునకు వెడలి పోయెను. ఇంకను ధనమును సేకరింపవలసినదిగ ఈతడు తన అధికారులకు ఆజ్ఞ యిచ్చెను. ఎడ్వర్డు రాజు కావించిన పని అక్రమమైనదని తెల్పుటలో ఎంత మాత్రమును సందేహము లేదు. ప్రభువు పరదేశముల కేగగానే, ఆంగ్ల జమీందారులందరును ఏకమై ఒక పెద్ద ఆందోళన ప్రారంభించిరి. ఎడ్వర్డు రాజు పరోక్షమందాతనిచే నియమింపబడిన యొక సంరక్షక సంఘము వారు రాజ్య పరిపాలన సాగించుచుండిరి. ఎడ్వర్డు రాజు విధించిన అక్రమమగు పన్నులను వసూలు చేయరాదని జమీందారులు సంరక్షక సంఘమును నిర్బంధించిరి, త్వరలోనే పార్లమెంటు సభ మరియొక పర్యాయము సమావేశము కావింప

బడెను. జాను రాజు కాలమునాటి మహాపత్రమును ఎడ్వర్డు ప్రభువు మరల ధ్రువపరచ వలసిన దనియు, అందులకు కొన్ని నూతనమగు అనుబంధములను కూడ చేర్చవలెననియు పార్లమెంటు సభవారు తీర్మానము కావించిరి. ఇటీవల ఎడ్వర్డు రాజు విధించిన "ఉన్ని" పన్ను అక్రమమైన దనియు, అట్టి పన్నులను ముందుముందు విధింపరాదనియు,ఆచార సమ్మతమైన రుసుములను తక్క రాజు మరేపన్నులను తీసికొన రాదనియు, పన్నులు విధించుటకు పూర్వము రాజు ప్రజాంగీకారమును పొందవలయు ననియు, ఈ అనుబంధమునందు స్పష్టముగ పేర్కొనబడెను. ఈ యంశములను రాజు పక్షమున సంరక్షక సంఘము వారు ధ్రువపరచిరి. అటుపిమ్మట ఐరోపాఖండములో యుద్ధము సాగించుచున్న ఎడ్వర్డు రాజు తన ప్రజలు కోరిన ప్రకారము, 1215 వ సంవత్సరము నాటి మహాపత్రమును, దానికి చేర్పబడిన అనుబంధమును అంగీకరించి, చేవ్రాలు చేసెను (1297). ఆంగ్ల రాజ్యాంగ విధానములో ఈ రాజ్యాంగ పత్ర ధృవీకరణ మొక ముఖ్యాంశమని విద్వాంసులు భావించు చున్నారు. అక్రమమగు పన్నులను రాజు విధింపరాదని మాత్రము మహాపత్రమునందు పేర్కొనబడెను. 1297 నాటి అనుబంధమునందు మరొక నూతనాంశము చేర్పబడెను. ప్రజాంగీకారమును పొందకుండగ రాజు పన్నులను విధింప కూడదని యిందు వ్రాయబడినది. కావున సమస్త రాజ్యకార్య నిర్వహణమునకును మూలమైన ధనమును (పన్నులు) ప్రజల

సమ్మతితో మాత్రమే రాజు గ్రహింపవలెనని యిందు తెలుప బడుటచే, రాజును తమ చెప్పు చేతలలో నుంచుకొనుటకై ప్రజ లొక చక్కని మార్గమును కన్గొనిరని మనము గ్రహింప వలెను. ఈ సూత్రము ప్రజాప్రతినిధి పరిపాలనకు జీవగఱ్ఱ. పదమూడవ శతాబ్దినాటి ఆంగ్లేయు లీ యంశమును సంపూర్ణముగ గ్రహించి యుండక పోవచ్చును కాని ముందు కాలమున రాజునకును ప్రజలకును వివాదములు సంభవించి నప్పుడు పై సూత్రము ప్రజాపక్షమువారి వాదములను బలపరచెను.

మొదటి ఎడ్వర్డు రాజును మేము ఆంగ్లమనువుగ వర్ణించియున్నాము. ఇది అతిశయోక్తి కాదు. ఈనాటి న్యాయశాస్త్ర గ్రంథములు కూడ మొదటి ఎడ్వర్డు రాజును ప్రథమ శాసన నిర్మాతగ పరిగణించుచున్నవి. ఈ రాజు శాస నములను ఆంగ్లేయు లీనాటికిని మన్నించుచున్నారు. రెండవ హెన్రీరాజు న్యాయప్రదాన విధానమునందు సక్రమమగు పద్ధ తుల నేర్పాటు కావించినందున, ప్రజలు తమ అభియోగముల నన్నిటిని రాజుచే నెలకొల్పబడిన న్యాయస్థానములందే పరిష్కా రము కావించుకొనజొచ్చిరి. ఈ విధముగ న్యాయస్థానములందు విచారింపదగిన అభియోగముల సంఖ్య హెచ్చెను. కావున వానిని పరిష్కరించుటకై ఎడ్వర్డు రాజు చక్కని ఏర్పాట్లు కావించెను. కేంద్రమున గల న్యాయస్థానముల నీ రాజు మూడు వేరువేరు భాగములుగ విభజించెను. ఇందొకటి Court of

King's Bench (రాజుగారి న్యాయస్థానము) యనియు, రెండవది Court of Common Pleas (సామాన్య వ్యాజ్య న్యాయస్థానము అనియు, మూడవది Exchequer (కోశాగారము) అనియు పిలువబడెను. రాజ్యమునందలి వివిధ ప్రాంతములలో శాంతిని నెలకొల్పియుంచుటకై ఎడ్వర్డు శాంతి సంరక్షకులు అను గౌరవోద్యోగులను నియమించు పద్ధతిని ప్రారంభించెను. ఈ శాంతి సంరక్షకులకు మూడవ ఎడ్వర్డు రాజు కాలమున Justice of Peace అను నామ మేర్పడెను. ఈ నామము ఆంగ్ల స్థానిక పరిపాలనమునందు నేటికిని వాడబడుచున్నది. శాంతి సంరక్షణకై Justices of Peace అను గౌరవోద్యోగులు ఇంగ్లాండు దేశమందలి జిల్లాలలో నేటికిని పనిచేయుచున్నారు. శాంతి సంరక్షకుల నియమించుటతో రెండు ముఖ్య విషయము లిమిడియున్నవి. ప్రతి పౌరుడును ప్రజా క్షేమముకొరకై ఎట్టి పారితోషికమును అపేక్షింపక, కేవల సేవాభావముతో, కృషిచేయవలయు ననునది ఇందలి ప్రథమ సూత్రము. పై శాంతి సంరక్షకులు న్యాయశాస్త్రవేత్తలు కాని, ప్రత్యేకముగ తర్ఫీదు పొందిన ఉద్యోగులు కాని కారు. వారు తమ లోకానుభవమును, ప్రపంచ జ్ఞానమును, ప్రజా సామాన్యమునందు వ్యాప్తియందున్న భావములను ఆధారముచేసికొని, అభియోగముల విచారించి, న్యాయప్రదానము కావింతురు. ఈ విధముగ న్యాయ శాఖకును, సామాన్య ప్రజల భావనలకును సాంగత్య మేర్పడును. గౌరవోద్యోగుల నియామకమువలన

ప్రభుత్వమునకు ఖర్చు లేకుండపోవును. ఉద్యోగుల సంఖ్య తగ్గును. ప్రతి చిన్న పనికొరకును ఉద్యోగులను నియమించుచు వచ్చినచో, దేశ ముద్యోగులతో నిండిపోవుటయు, ఉద్యోగివర్గము వారు తాము సామాన్య ప్రజలకంటె నధికులమనియు, తాము లేనిచో ప్రభుత్వమే లేదనియు, తలంచుటకు సావకాశ మేర్పడును. ఇట్టి అనర్థములు కలుగకుండునట్లుగ ఎడ్వర్డు రాజు ఏర్పాట్లు కావించెను.

ఎడ్వర్డు రాజు కావించిన శాసనము లెన్నియో కలవు. అందు మూడింటిని గూర్చి యిచ్చట ప్రశంస కావించెదము. 1278 వ సంవత్సరమున కావింపబడిన గ్లస్టరు శాసనము (Statute of Gloucester) వలన ఎడ్వర్డు రాజు తన దేశమందలి జమీందారు లనుభవించుచున్న న్యాయ ప్రదానాధికారములను నిరోధించుటకై యత్నించెను. జమీందారు లీ యుగమునందు అభియోగముల విచారించు హక్కు కేవలము గౌరవహేతువు మాత్రమే కాక, ఆదాయమున కొక మార్గముగ నుండెడిదని యీ వరకే తెలుపబడినది. ఎడ్వర్డురాజు కాలమునాటికి అనేకులు జమీందారులు తమ చిన్న చిన్న సంస్థానములలో న్యాయ సభల నేర్పాటు కావించి, వివాదముల పరిష్కరించుచుండిరి. ఇట్లు చేయుటకు మీకుగల హక్కును చూపుడని రాజు తన అధికారులచే విచారణ కావింపించెను. రాజువలన ప్రత్యేకమగు అధికార పత్రమును పొందనివారు న్యాయసభల నేర్పాటు చేయుటకు వీలులేదు. ఎడ్వర్డురాజు జరిపించిన విచారణ జమీం

దారులలో పెక్కండ్రకు కోపకారణ మయ్యెను. వారన్ ప్రభువు అను జమీందారువద్దకు రాజోద్యోగులుపోయి, న్యాయ సభల నేర్పాటు చేయుటకై నీకుగల అధికారపత్రము (Warrant) ను చూపుమని యడుగగా, ఆతడు కత్తిని దూసి "ఇదియే నా అధికారపత్రము" అని ప్రత్యుత్తర మిచ్చెనట. జమీందారులలో ప్రబలిన ఈ యసంతృప్తిని గుర్తించి, ఎడ్వర్డు రాజు తన శాసనములో కొంతమార్పు కావించెను. న్యాయ సభల నేర్పాటు చేసికొనుటకై రాజువద్దనుండి అధికారపత్ర మవసరము లేదనియు, రిచర్డు రాజుకాలము నుండియు, అవిచ్ఛిన్నముగ ఈ యధికారము ననుభవించు జమీందారులకీ హక్కు లభింపవలెననియు, రాజు నిర్ణయించెను. 1279 వ సంవత్సరమున ఎడ్వర్డురాజు Statute of Mortmain (మృత హస్తశాసనము) కావించెను. జమీందారీ విధానములో రాజును, పెద్ద భూస్వాములును, ఇతరులకు తమ భూవసతిలో కొంత భాగమును ఇచ్చుటయు, ఈ విధముగ భూమిని పొందిన కౌలు దారుడు తన ప్రభువునకు వివిధ సేవలను చేయుటయు, వివిధ ములగు పన్నులను ఇచ్చుటయు సర్వత్ర ఆచారముగ నుండెను. చిన్న భూస్వామి మైనరుగ నున్నప్పుడును, ఆతడు చనిపోయి ఆతని కుమారు డాస్తికి వారసుడైనప్పుడును, లేక కౌలుదారు వివాహము చేసికొన్నప్పుడును ఆతనికి ప్రభువగు పెద్ద భూస్వామికి ప్రత్యేకమగు పన్నులు చెల్లుచుండెను. కావున చిన్న భూస్వాములలో నిట్టి సంఘటనలు తరచు జరుగుచుండ

వలెనని పెద్ద భూస్వామి కోరుచుండెడివాడు. భూములు వ్యక్తులకు కాక, సంస్థలకు ఈయబడినచో పైన తెలుపబడిన ప్రత్యేక రుసుములు ఎన్నడును చెల్లవు. ఉదాహరణముగ గ్లాస్టన్‌బరీ అను ప్రదేశమందలి మఠమునకు రాజు కొంత భూమిని ఇచ్చిన పక్షమున ఆ మఠాధికారి మైనరుగ నుండుట కాని, మరణించుట కాని, వివాహము చేసికొనుట కాని తటస్థిం పదు. అందువలన రాజుగారికి అదనపుపన్నులు లభించు అవ కాశము లేకుండ పోవును. ఈ విషయము మనస్సునందిడికొని మత సంస్థల కీయబడిన భూములు మృత హస్తములలోనికి పోయిన భూముల వంటివని ఎడ్వర్డు ప్రభువు అభిప్రాయపడెను. అనేకులు భూస్వాములు తమకు కల్గిన ఇబ్బందులనుండి తప్పించు కొనుటకై తమ భూములను మతసంస్థల కమ్మినట్లు తప్పుడు పత్రములను సృష్టించి, పిమ్మట ఆ భూములను తాము మరల పొందుచుండెడివారు. కావున ప్రజలెవ్వరును మతసంస్థలతో వ్యవహారములు సాగించి, భూములను మత సంస్థలకు సంక్ర మింప జేయరాదనియు, అందులకు విరుద్ధముగ కావింపబడు ఏర్పాట్లు అన్నియు రద్దుపడుననియు రాజు ప్రకటించెను. 1285 వ సంవత్సరమున ఎడ్వర్డు ప్రభువుచే కావింపబడిన రెండవ వెస్టుమినిస్టరు శాసనము అతి ముఖ్యమైనది. దానివలన ఆంగ్ల సమాజవ్యవస్థ అత్యంతము ప్రభావితమైనదని చెప్పవచ్చును. ఒక పరిమితికిమించిన ఆస్తులను నిభజించుటకు వీలు లేదనియు, ఆస్తి దారున కౌరస సంతానము లేనప్పుడు, ఆ యాస్తి అతని దూరపు

వారసులకు అవిభక్తముగ చెందవలెను కాని, దానిని (ఆస్తిని) ముక్కలు ముక్కలుగ చేయుటకు వీలులేదనియు ఈ శాసనము విధించెను. ఇంగ్లాండు దేశమునందు పెద్దపెద్ద భూవసతులు గల కుటుంబములపై ఈ నిషేధములు విధింపబడెను. అందువలన ఆంగ్లభూమిలో జమీందారీలు చిరకాలమువరకును యథాతథముగ నిలచిపోయెను. ఉన్నత కుటుంబములలో జ్యేష్ఠునకు మాత్రమే ఆస్తి సంక్రమించును. ఇతర సోదరులకు ఆనువంశికముగ లభించిన ఆస్తిపై హక్కు ఉండదు. కావున ఉన్నత వంశ సంజాతులైనను అట్టి యువకులు నిర్ధనులగుదురు. అట్టివారు తమ కుటుంబపు హోదాను విస్మరించి, ఉదరపోషణార్థమై సామాన్య ప్రజలవలెనే ఏదైన ఒక వృత్తి నవలంబించి, కష్టపడవలెను. ఈ యేర్పాటువలన ఉన్నత వంశములలో జన్మించిన పలువురు ప్రముఖులు సామాన్య సంసారులతో కలసిపోవలసి వచ్చెడిది. కావున ఆంగ్ల సంఘమునందు ప్రభువర్గము, సామాన్య ప్రజలు, అను కృత్రిమ విభజనము లేకుండపోయెను. ఈనాటి జమీందారీ కుటుంబపు బిడ్డ రేపు సామాన్య బ్రిటీషు పౌరుడుగ మారిపోవును. ఎడ్వర్డు రాజు శాసనము సంఘము వివిధ వర్గములుగ విభజింపబడకుండునట్టి చక్కని ఏర్పాటు కావించెను. ఇందువలన సాంఘిక మగు అశాంతికి తావు లేకుండపోయెను. ఇందులకు విరుద్ధముగ ఫ్రాన్సు దేశములో ప్రభువంశ సంజాతులెల్లరును ప్రభువులే యనియు, సామాన్య సంసారులకంటె వారు గొప్పవారనియు, ఒక శాశ్వత నిబంధన

అమలులో నుండెను. ఈ నిబంధనవలన ఫ్రెంచి సమాజము కొన్ని ప్రత్యేక వర్గములుగ విడిపోవుటయు, వివిధ వర్గములలో విద్వేషము పెంపొందుటయు సంభవించెను. ఈ విద్వేషమే 18 వ శతాబ్ది తుది భాగమున ఫ్రాన్సు దేశమున చెలరేగిన విప్లవమున కొక ముఖ్య హేతువు.

మొదటి ఎడ్వర్డు రాజు సాధింపదలచిన ఘనకార్యములలో యావత్తు బ్రిటను దేశమును ఇంగ్లాండు రాజు అధికారములోనికి తీసికొనివచ్చుట యొకటి. ఇంగ్లాండున కుత్తరమున స్కాట్లండును, పశ్చిమమున వేల్సు దేశమును నెలకొనియున్నవి. ఇంగ్లండు, స్కాట్లండు, వేల్సు దేశములు మూడును కలసి బ్రిటను దేశముగ వ్యవహరింపబడును. బ్రిటను దేశమంతయు ఒకే ఖండము. ఇట్టి దేశమునంతను తన పలుకుబడిలోనికి తేకొనవలెనని ఎడ్వర్డు వంటి వీరుడైన ప్రభువు ప్రయత్నించుట సహజము. వేల్సుదేశపు ప్రాచీన చరిత్రను గూర్చి మేము స్థలాంతరమున ముచ్చటించినారము. నార్మను రాజులగు మొదటి విలియం, రెండవ విలియం ప్రభువులు వేల్సుదేశపు ఆక్రమణను గూర్చి కొంత కృషిచేసి యుండిరి. వీరులును, యుద్ధభోజనులును అగు నార్మను జమీందారులు తమ భుజబలముచే వేల్సు దేశము నందలి దక్షిణ ప్రాంతము నంతను ఆక్రమించుకొనిరి. ఈ విజేతలు తమ ఆక్రమణను శాశ్వతముగ చేయుటకై ఎత్తైన కొండలపై బలవత్తరములగు కోటలను కట్టుకొని, దక్షిణ వేల్సును పాలించసాగిరి. పర్వతమయ మగు ఉత్తర ప్రాంత

మున వేల్సు దేశపు రాజులు స్వతంత్రముగ రాజ్యము చేయు చుండిరి. మొదటి ఎడ్వర్డు రాజు తీవ్రముగు కృషిచేసి 1301 వ సంవత్సరము నాటికి వేల్సు దేశమునంతను వశపరచుకొనెను. ఈ ఆక్రమణ శాశ్వతమైనదని లోకమునకు తెల్పుటకై ఈ రాజు తనకుమారునికి "వేల్సు యువరాజు" (Prince of Wales) అను బిరుదు నిచ్చెను. ఈ బిరుదు బ్రిటను దేశపు యువరాజు లకు నేటికిని కూడ వాడబడుచున్నది. వేల్సు రాజులును, ప్రజలును ఇంగ్లాండు ప్రభువునకు సులభముగ వశపడక చాల సంవత్సరములు పోరాడి ఎడ్వర్డు రాజును మిక్కిలి చికాకు పెట్టిరి. కాని ఎడ్వర్డు రాజు వారి యెడల కాఠిన్యతను చూప లేదు. వేల్సు దేశమును తన రాజ్యములో కలుపుకొనిన పిమ్మట, ఎడ్వర్డు రాజు ఆ ప్రాంతమును ఇంగ్లీషు పరిపాలనా పద్ధతుల ప్రకారము జిల్లాలుగ విభజించెను. కాని వేల్సు దేశపు న్యాయస్థానములలో వారి శాసనములే అమలుజరుపబడెను. వేల్సు దేశపు భాషను, సాంప్రదాయములను ఎడ్వర్డు రాజు సంరక్షించెను. ఈ కారణముచేతనే వేల్సు ప్రజలు సంతుష్టిపడి, ఆంగ్ల రాజుల పరిపాలన నంగీకరించిరి.

స్కాట్లండు దేశముపట్ల మాత్రము ఎడ్వర్డురాజు విదేశాంగ నీతి ఫలవంతము కాలేదు. అందులకు మారుగ స్కాట్లండు ప్రజలు ఎడ్వర్డురాజును ఒక ధూర్తుడగు విదేశీయ పాలకునిగ భావించి, ఆతనియెడల అత్యంత వైరభావము పూనిరి. చిర కాలమునుండి ఆంగ్లేయులకును, స్కాట్లండు ప్రజలకునుగల

స్నేహ సంబంధము విచ్ఛిన్న మయ్యెను. ఆదికాలమున స్కాట్లండు ప్రజలు నాల్గు తెగలుగ నేర్పడియుండిరి. క్రైస్తవ మత ప్రాచుర్యమువలన నీ తెగలలో కొంతవరకు స్నేహ మేర్పడెను. కాని స్కాట్లండునందలి స్థానిక ప్రభువులు ఒక రితో నొకరు కలహించుచు, ఇతరుల రాజ్యములను కబళింపవలె నని యత్నించుచుండిరి. తుదకు 1034 వ సంవత్సరము ప్రాంత మునకు స్కాట్లండు దేశమంతయు ఒక రాజ్యముగ నేర్పడెను. దీనిని మాల్కంల్మ (Malcolm) అను రాజు పాలించెను. షేక్స్పి యరు మహాకవి నాటకమునకు కథానాయకుడైన మాక్బెత్ (Macbeth) అను రాజు స్కాట్లండు దేశమున పదునేడు సంవ త్సరములు (1040 - 1057) సమర్థతతో పరిపాలన కావించెను. 1057 నుండి 1093 వ సంవత్సరమువరకు ఈ దేశమున కేలిక యైన మూడవ మాల్కొల్మరాజు ఇంగ్లాండు దేశపు రాజకుటుం బమునందలి యొక రాకుమారిని వివాహమాడెను. ఈ రాణి ప్రోత్సాహముచే స్కాట్లండు దేశీయులు పలువురు తమ ప్రాచీన భాషకు మారుగ ఆంగ్లేయభాషను వాడుట ప్రారంభించిరి. స్కాట్లండు క్రైస్తవ మతసంఘము వారుకూడ తమ ఒంటరి తనమును విడనాడి, ఆంగ్లేయులవలెనే రోమక క్రైస్తవమత విధానము నవలంబించిరి. ఈ కారణముచే స్కాట్లండు దేశము కూడ ఐరోపా ఖండమందలి యితర దేశములకు సన్నిహిత మయ్యెను. మూడవ మాల్కొల్మరాజు కుమారుల కాలము నందు స్కాట్లండు క్రైస్తవ మతసంఘము బలపడెను ఈ

కాలమునాటి కింగ్లాండునందు నార్మను రాజుల యధికారము కూడ బలపడెను. కావున కొందరు నార్మనులు స్కాట్లండు భూమిలోనికి కూడ చొరుచుకొనివచ్చి, అచ్చట స్థిరనివాస మేర్పరుచుకొనిరి. నార్మనుల జమీందారీ విధానము స్కాట్లండు నందు కూడ వ్యాపించెను. 1100 వ సంవత్సరమున ఇంగ్లాండు దేశపు ప్రభువగు మొదటి హెన్రీరాజు స్కాట్లండు ప్రభువగు ఎడ్గారురాజు చెల్లెలిని వివాహమాడెను. ఈ విధముగ రెండు దేశములకును అన్యోన్యత యేర్పడవలెనని హెన్రీరాజు అభి మతము. కాని అట్లు సంభవింపలేదు. ఎడ్గారురాజు సోదరుడు డేవిడ్ అనునాతడు ఒక ఆంగ్ల ప్రభుకుటుంబమునందలి యొక స్త్రీని వివాహమాడి, ఒక ఆంగ్ల జమీందారీని సంపాదించెను. అయినను ఈతడు 1138 వ సంవత్సరమున స్టీఫెన్ రాజు రాజ్యము చేయుచున్న కాలమున ఇంగ్లాండు దేశముపై దండెత్తి వచ్చి ఓడిపోయెను. కాని తేజోవిహీనుడగు స్టీఫెన్ రాజు డేవిడుకు ఇంగ్లాండుదేశపు టుత్తర భాగమునందలి మూడు జిల్లాల నిచ్చివైచి సంధి చేసికొనెను. రెండవ హెన్రీరాజు రాజ్యాధికారము వహింపగనే ఈమూడు జిల్లాలను మరల ఇంగ్లాండు రాజ్యములో కలుపుకొనుటయే కాక, స్కాట్లండు రాజువలన స్వామి భక్తి ప్రమాణమును పొందెను. స్కాట్లండు రాజులు ఆంగ్ల ప్రభువులకు సామంతులుగ వర్తించుచు, అనేక పర్యాయములు స్వామి భక్తిప్రమాణమును గైకొనిరి. మొదటి రిచర్డురాజు స్కాట్లండు రాజులవద్ద ఒక పెద్ద మొత్తము ధన

మును తీసికొని, వారు ఇంగ్లాండు ప్రభువులకు సామంతులుగ నుండనక్కరలేదని నిర్ణయించెను. కావున స్కాట్లండురాజు లాంగ్ల ప్రభువులకు సామంతులా కాదా యను సమస్య వివాదాస్పద మయ్యెను.

ఇది యిట్లుండగా మొదటి ఎడ్వర్డు రాజు ఆంగ్లభూమి కేలిక యయ్యెను. స్కాట్లండు దేశము సైతమైన ఇంగ్లాండు రాజ్యమునందు కలిపి వేయవలెనని ఈతని కోరిక. ఇందుల కాతడొక చక్కని యుపాయము నాలోచించెను. ఆ కాలమున స్కాట్లండు దేశమున కేలికయగు మూడవ అలెగ్జాండరు రాజు ఎడ్వర్డు రాజు సోదరిని వివాహమాడి యుండెను. వారికి సంతానము కల్గెను కాని ఆ సంతాన మంతయు మరణించెను. అలెగ్జాండరు దౌహిత్రురాలు నార్వేదేశపు రాకుమారి. ఈమె తక్క స్కాట్లండు సింహాసనమునకు వారసు లెవ్వరును లేకుండిరి. ఈ సమయముననే అలెగ్జాండరు మరణించెను. ఆతని మనుమరాలిని తన కుమారుడగు ఎడ్వర్డు రాకుమారునకు వివాహము చేసికొనిన పక్షమున, ఇంగ్లాండు స్కాట్లండు దేశములు రెండును ఏకమగునని ఎడ్వర్డు రాజు భావించెను. క్రమ క్రమముగ స్కాట్లండు నింగ్లాండు దేశమునందు చేర్చుకొన వచ్చునని ఈతని యుద్దేశ్యము. కాని ఆ యుద్దేశ్యమును ఎడ్వర్డు వెలిబుచ్చలేదు. స్కాట్లండు ప్రజలు కూడ ఈ వివాహమున కంగీకరించిరి. కాని దురదృష్టవశమున అలెగ్జాండరు రాజు మనుమరాలు మరణించెను. ఎడ్వర్డు రాజు ఆశలన్నియు ఈ విధమున వమ్మ

య్యెను. స్కాట్లండు రాజ్యమునకు రాజు అగుటకు ఎవరి కెక్కువ హక్కు గలదను విషయమున ముప్వురు వారసులలో వివాద ముత్పన్న మయ్యెను. వీరిలో ఎవ్వరి హక్కు బలవత్తర మైనదో నిర్ణయింప వలసినదిగ స్కాట్లండు ప్రజలు ఎడ్వర్డు రాజును కోరిరి. ఆతడు నిష్పక్షపాతముగ నీ యంశమును విచారించి జాన్ బాలియల్ (John Balliol) అను వానిని స్కాట్లండు ప్రభువుగ నిర్ణయించెను (1292). కాని యీ బాలి యలు రాజ్యాధికారము వహించుటకు పూర్వము ఆతడు తనకు సామంతుడుగ నుండునట్లు ఎడ్వర్డు ఆతని నుండి వాగ్దానము పొందెను. తమ రాజు ఇంగ్లాండు ప్రభువునకు సామంతు డగుట స్కాట్లండు ప్రజల కెంతమాత్రము రుచింపలేదు. కావున రెండు రాజ్యములకును నడుమ తీవ్రవిభేదము లుత్పన్నమయ్యెను. ఆ కాలమున నింగ్లాండునకును ఫ్రాన్సు దేశమునకును వైరము సాగుచుండెను. స్కాట్లండు ప్రజలు ఫ్రాన్సు దేశముతో సంధి చేసికొనిరి. ఇందులకు కోపగించి ఎడ్వర్డు రాజు స్కాట్లండుపై యుద్ధము ప్రకటించి 1295 వ సంవత్సరమున నా దేశము నాక్రమించెను. కాని స్కాట్లండు ప్రజలు ఇంగ్లాండు రాజునకు లోబడుటకు నిరాకరించిరి. 1295 నుండి 1307 వ సంవత్సరమున ఎడ్వర్డు రాజు మరణించు వరకును స్కాట్లడు దేశీయులు స్వాతంత్ర్య యుద్ధమును సాగించుచునే వచ్చిరి. వీరికి వాలెస్ (Wallace), బ్రూస్ (Bruce) అను వారలు నాయకత్వము వహించిరి. రణరంగమున ఎడ్వర్డు రాజు

విజయముల సాధించినను, అందువలన ఆతనికి స్కాట్లండు భూమి వశపడ లేదు. తుదకు 1307 వ సంవత్సరమున స్కాట్లండు దేశమందలి అల్లరుల నణచుటకై గొప్ప సేనాసన్నాహముతో పోవుచు, ఎడ్వర్డు రాజు మార్గమధ్యమందు మరణించెను. ఎడ్వర్డు రాజు అవలంబించిన నీతివలన స్కాట్లండు ఇంగ్లాండు దేశముల స్నేహము పూర్తిగ చెడిపోయెను. ఎడ్వర్డు ప్రభువు ఈ దేశము పట్ల వర్తించిన పద్ధతు లేమాత్రమును సమర్థనీయములు కావని ఆధునిక చారిత్రికులు నిరూపించుచున్నారు. కాని, సమకాలికులు ఎడ్వర్డు రాజును "స్కాట్లండు ప్రజా మర్దనుడు" (The Hammor of the Scots) అను బిరుదముతో గౌరవించిరి.

## రెండవ ఎడ్వర్డు రాజు (1307-1327)

పులి కడుపున మేక పుట్టినట్లు మహా వీరుడును, మహా సమర్థుడునైన మొదటి ఎడ్వర్డు రాజునకు రెండవ ఎడ్వర్డు జన్మించెను. రెండవ ఎడ్వర్డు గంభీరమైన ఆకారము గలవాడు. బలశాలి. కాని తేజో విహీనుడు. రాజున కుండవలసిన ఉదాత్త స్వభావము కాని, ఉదాత్తమగు సమర్థత కాని ఆతని యందెంత మాత్రమును లేకుండెను. మొదటి ఎడ్వర్డు స్కాట్లండు దేశములో చాల రేగిన అల్లరులను, జాతి యోద్యమమును అణచి వేయుటకై ప్రయత్నించెను. దేహము చాలించెను. అవసానదశ యందాతడు తన కుమారుని రావించి, తానసంపూర్ణముగ విడచి పోవుచున్న

స్కాట్లండు యుద్ధమును పూర్తి కావించి, స్కాట్లండు విద్రోహుల నణచి వేయవలసినదని ఆదేశించెను. తండ్రి యాజ్ఞననుసరించి, రెండవ ఎడ్వర్డు గొప్ప సేనాసన్నాహముతో ఉత్తరముగ దండయాత్ర సాగించెను. 1304 వ సంవత్సరము జూను 24 వ తేదీని ఇంగ్లండు సేనలును, స్కాట్లండు వాహినులును Bannock అను ఒక ఏరు వద్ద యుద్ధమునకు తలపడెను. ఈ యుద్ధము Bannock burn యుద్ధమని ప్రసిద్ధి గాంచినది. Burn అనగా చిన్న యేరని అర్థము. స్కాట్లండు సేనలకు నాయకత్వము వహించిన Robert Bruce రాజు అపారమైన అనుభవమును, యుద్ధనైపుణియు కలవాడు. ఇంగ్లాండు సైన్యమున కసమర్థుడైన రెండవ ఎడ్వర్డు చమూపతి. ఉభయ సేనలును మిక్కిలి పట్టుదలతో పోరాడెను. కాని తుదకు ఆంగ్లేయులు పరాభూతులైరి. ఎడ్వర్డు రాజు పలాయన మంత్రము పఠించెను. అనుచరులు స్వామి మార్గమునే అవలంబించిరి. పారిపోవుచున్న ఇంగ్లీషు సైనికులను వెంటాడి, స్కాట్లండు వీరులు అనేకులను సంహరించిరి. ఒక్కనాటి ఈ యుద్ధములో సుమారు ముప్పది వేలమంది ఆంగ్లేయ యోధులు రణభూమికి బలియగుటయో, గాయపడుటయో సంభవించెను. ఈ విజయము వలన స్కాట్లండు దేశము స్వతంత్రమయ్యెను. బానక్ బర్న్ యుద్ధము స్కాట్లండు దేశచరిత్రలో ఒక ఉజ్జ్వల సంఘటన. ఇంతటి విజయమును స్కాట్లండు సేనలు మరెన్నడును సాధించి యుండలేదు. ఇంగ్లాండుతో సంభవించిన కయ్యములలో స్కాట్లండు ప్రజల కనేక పరాభవములు సంభవించెను. కాని ఎన్నటికైన Bannock burn యుద్ధమువంటి తరుణము మరల రాకపోవునా యని వారెల్లప్పుడును ఆసించెడివారు.

రణభూమిలో పరాభూతుడైన ఈ రెండవ ఎడ్వర్డు ప్రభువునకు, రాజ్యాంగ నిర్వహణముకూడ కొరుకరాని కొయ్యగ పరిణమించెను. ఈ రాజు తనకు ప్రీతిపాత్రుల సహాయముతో ప్రభుత్వ నిర్వహణము కావింపవలెనని యత్నించెను. ఈ పద్ధతి ఆంగ్లజమీందారులలో పలువురకు రుచింపలేదు. వారు రాజునకు విరుద్ధమగు ఒక బలమైన పక్షమును ఏర్పాటు చేసిరి. రాజునకు అనుకూలమైన ఒక పక్షముకూడ త్వరలోనే ఏర్పడెను. ఎడ్వర్డు రాజు భార్య ఎసబెల్లా మహా క్రూరురాలు. కులట. ఈమె తన భర్తకు శత్రువులగు జమీందారుల పక్షమును పూనెను. ఈ కాలమునాటికి ఆమె కుమారుడు ఎడ్వర్డు (మూడవ ఎడ్వర్డు రాజు) పదునాల్గు సంవత్సరముల బాలుడు. ఈ బాలుని చేజిక్కించుకొని, ఎసబెల్లారాణి, తన ప్రియుడైన Mortimer అను జమీందారుని తోడను, అనుచర వర్గము తోడను, తన భర్తపై దండెత్తి పోయెను. రాజు పక్షము సంపూర్ణముగ పరాభవింపబడెను. రాజు మిత్రులు ఉరిశిక్షకు పాలయిరి. రెండవ ఎడ్వర్డు రాజును అతని భార్యయు, ఇతర జమీందారులును పదభ్రష్టుని కావించి, Berkeley అను కోటలో బందీకావించిరి. అదృష్టహీనుడైన ఈ రాజును రాణిప్రియుడైన Mortimer జమీందారు అతిక్రూరముగ హింసించి, చంపివైచెను (1327). అటుపిమ్మట కొంతకాలము వరకును ఎసబెల్లా రాణియు, ఆమె ప్రియుడైన Mortimer జమీందారును, బాలుడైన మూడవ ఎడ్వర్డు రాజుపేర అధికారము నెరపిరి.

రెండవ ఎడ్వర్డు రాజు విదేశాంగ నీతి పూర్తిగ విఫలమై స్కాట్లండు దేశము సంపూర్ణముగ స్వతంత్రము య్యెను. అంతరంగిక విషయములలో ఈ రాజు లోపభూయిష్ఠమైన వ్యవహార నిర్వహణవలన, రాజ్యాధికారమును మాత్రమే కాక ప్రాణములను కూడ కోల్పోయినట్లు చూచియున్నాము. విషాద పూరితమైన ఈ రాజు పరిపాలనలో కూడ కారు మబ్బులలోని విద్యుల్లేఖవలె ఒక సత్పరిణామము భాసించు చున్నది. అయ్యది పార్లమెంటు సభయొక్క వికాసము. రాజ్యాధికార నిర్వహణమును గూర్చి ఇంగ్లాండు దేశమున రాజునకును, జమీందారులకును ఎల్లప్పుడును సంఘర్షణ జరుగు చునే ఉండెను. గొప్ప జమీందారులందరును Curia Regis అను రాజ్యాంగ సభలో సభ్యులుగ నుండెడివారు. ఈ సంఘము వారి సలహాల ప్రకారము రాజు దేశ పరిపాలనను నిర్వహింప వలెనను శాశ్వత సాంప్రదాయ మేర్పడి యుండెను. ఈ విధముగ రాజు నిరంకుశాధికారమునకు Curia Regis సభ ఒక చెలియలి కట్టవలె నిలచి యుండెను. కాని Curia Regis సభ ఒక సలహాసంఘము మాత్రమే. రాజ్యాంగ నిర్వహణమును, దేశమందు సమస్త ధర్మశాసనములను అమలు కావించుటయు నను బాధ్యతలు రాజునందే నిక్షిప్తములై యుండెను. కాలము గడచిన కొలదియు, రాజు నిర్వహింప వలసిన ధర్మములు విస్తారముగ పెరిగి పోయెను. ఈ బాధ్యతల నిర్వర్తించుటకై అనేకులు అధికారులు కావలసి వచ్చిరి. వీరినందరను రాజు

స్వయముగ నియమించెడివారు. వీరినే మనము నేడు మంత్రులనియు, రాజోద్యోగులనియు వర్ణించుచున్నాము. ఇదియును గాక The Great Seal అను రాజముద్రికకు రాజ్యాంగ నిర్వహణములో ఒక ప్రత్యేక ప్రాముఖ్యము కలదు. ఈ ముద్రిక యచ్చులేనిదే ఏ రాజ్యాంగ పత్రమును చెల్లనేరదు. రాజు పన్నులు విధించినను, రద్దుచేసినను, యుద్ధము ప్రకటించినను, శాంతి నేర్పాటు చేసికొనినను. ఈ ముద్రిక ఆ రాజ్యాంగ పత్రముపై అచ్చుకావలెను. ఇట్టిఘనమైన ప్రభావముగల రాజముద్రిక రాజు చెప్పు చేతలలో నున్న అధికారుల వశమై యుండెడిది. సమర్థ రాజు అధికారమునకు వచ్చినపుడు [illegible] నానాటికిని విస్తృతమగు కార్యక్రమము. [illegible] మంత్రులును రాజోద్యోగులును. సూర్యుని చుట్టును తిరుగు గ్రహములవలె రాజు చుట్టును పరిభ్రమింపజొచ్చిరి. రాజు ముందట [illegible] సూర్యుని ముందట చంద్రునివలె వెలవెల బోవసాగిరి. ఈ పరిస్థితి జమీందారుల కెంత మాత్రమును నచ్చలేదు. మంత్రులను, రాజోద్యోగులను, రాజు యొక్క సలహాదారులను, తమ యధికారములోనికి తెచ్చుకొనవలెనని జమీందారీ వర్గము వారి యాశయము. అథమపక్షము పై యధికారుల నియమించుటలో నైన తమకు కొంత పలుకుబడి యుండవలెనని వారి కోర్కె. దౌర్జన్యము ద్వారా రాజును వశపరచుకొనుటకు ఆనాటి ధూర్తులైన జమీందారు లెన్నడును వెనుదీసెడివారు కారు. కాని రాజుపై దౌర్జన్యము సాగించిన పక్షమున ప్రజ

లెంతమాత్రమును సహింపరు. ఈ యంశమును జమీందారులు బాగుగా గుర్తించి యుండిరి. ఈ కాలమునాటికి పార్లమెంటు సభ యేర్పాటై యుండెను. ఆ సభకు జాతీయ ప్రతిపత్తి లభించియుండెను. అందు ప్రజలలోని అన్ని వర్గముల వారికిని కూడ ప్రాతినిధ్యము లభించి యున్నట్లు ఆ నాటి ప్రజలు తలంచిరి. ఇట్టి జాతీయ సభను తమ వశములోనికి తెచ్చుకొనగల్గినచో, రాజును ఆయన ఉద్యోగులను తమ అదుపులోనికి తెచ్చుకొనవచ్చునని జమీందారులు గుర్తించిరి. పార్లమెంటు సభ యొక్క ప్రాముఖ్యమును రాజు పక్షము వారు కూడ చక్కగ తెలిసికొనిరి. కావున రెండవ ఎడ్వర్డు రాజు కాలములో రాజు పక్షమువారును, జమీందారుల పక్షమువారును కూడ పార్లమెంటు సభను తమ వైపునకు త్రిప్పుకొని, ఆ సభ వారిచే తాము సాగించుచున్న కార్యకలాపములపై ఆమోద ముద్రిక వేయించుకొన సాగిరి. రెండవ ఎడ్వర్డు రాజు కాలమందు పార్లమెంటు సభ ఇరువదియైదు పర్యాయములు సమావేశమయ్యెను. ఈ సభ వారికి రాజ్యాంగ సంబంధమైన ఎట్టి నీతిని నిర్ణయించుటకు కాని, చర్చించుటకుకాని అధికారము లేకుండెను. పార్లమెంటు సభ్యులందరును కూడ రాజు పక్షమునకో, జమీందారుల పక్షమునకో సంపూర్ణముగ వశ్యులై యుండిరి. అయినను నామకః ఈ పార్లమెంటు సభకు జాతీయ ప్రాతినిధ్యము లభించియుండుటయు, పార్లమెంటు సభ తరచు సమావేశమగుటయు, ఈ సభ వారి సహాయమును రాజును, జమీందారులును కూడ అర్థించు

టయు పార్లమెంటు యొక్క బలమును, ప్రతిష్ఠను హెచ్చించు టలో తోడ్పడెను.

## మూడవ ఎడ్వర్డు (1327 - 77)

మందభాగ్యుడైన రెండవ ఎడ్వర్డు అనంతరము అతని కుమారుడు మూడవ ఎడ్వర్డు అను బిరుదుతో సింహాసన మధి ష్ఠించెను. అప్పటి కాతని వయస్సు పదునైదు సంవత్సరములు మాత్రమే. మూడవ ఎడ్వర్డు రాజ్యాధికారమునకు వచ్చుటలో ఒక విశిష్టత గమనింప దగియున్నది. రెండవ ఎడ్వర్డును పద భ్రష్టుని కావించిన జమీందారులు, అతనిచే రాజ్యత్యాగము కావింపించిరి. రెండవ ఎడ్వర్డు రాజ్య త్యాగమును, బాలుడైన ఎడ్వర్డు రాకుమారుని (మూడవ ఎడ్వర్డు) రాజ్యాభిషేకమును కూడ పార్లమెంటు సభయొక్క ప్రతిష్ఠను అపారముగ వృద్ధి కావించెను. బాలుడైన ఎడ్వర్డు రాజు నాల్గు సంవత్సరములు, జారిణియైన తన తల్లియొక్కయు, ఆమె ప్రియుడైన మార్టిమరు యొక్కయు చెప్పుచేతలలో ఉండవలసి వచ్చెను. 1329 వ సంవత్సరము నాటికి పదునేడేండ్ల వయస్సుగల ఎడ్వర్డు రాజు ఫిలిప్పా అను కన్యను వివాహమాడెను. ఆ మరుసటి సంవత్స రము వారికొక కుమారుడు జన్మించెను. అంతటితో తాను రాజ్య కార్య నిర్వహణమునకై సంప్రాప్త వయస్కుడనైనట్లు ఎడ్వర్డు రాజు భావించెను. దోషియైన తన తల్లిని, ఆమె ప్రియు

డైన Mortimer జమీందారును శిక్షించుట తన ప్రథమ కర్తవ్యముగ నీతడు భావించెను. ఈ దుష్ట మిథునము Nothingham అనుచోట ఒక కోటలో బలమైన అంగరక్షక సేనతో విడిదచేసి యుండిరి. రాజు పక్షపు వీరులు కొందరొక రహస్య మార్గము ద్వారా కోటలో ప్రవేశించి, రాణిని ఆమె ప్రియుని చెరపట్టిరి. మార్టిమరుకు ప్రాణదండనము విధింప బడెను. ఎడ్వర్డు రాజు తన తల్లిని యావజ్జీవము చెరసాలలో నిర్బంధించెను. ఆమెకు సంవత్సరమునకు మూడు వేల పౌండ్లను భరణము నేర్పాటు కావించి, ఎడ్వర్డు రాజు అప్పుడప్పుడు ఆమెను చూచుటకై పోవుచుండెడివాడు. ఈ దుష్టవనిత ఆ పిమ్మట ముప్పది సంవత్సరముల వరకు జీవించెను. తేజో వంతమును, సుదీర్ఘమును అగు మూడవ ఎడ్వర్డు పరిపాలన భీకర మగు ఈ నాందీ సంఘటనలతో ప్రారంభ మయ్యెను.

మూడవ ఎడ్వర్డు రాజు తన తాతవలెనే గొప్ప యోధుడు. యువకరక్త మూతని దేహమునందు ప్రవహించు చుండెను. కావున మొదటి ఎడ్వర్డువలెనే యుద్ధములు సాగించి, తన రాజ్యమును విస్తరింప జేసికొనుటకై ఈతడు సమకట్టెను. ఈతని దృష్టి మొదట స్కాట్లండు దేశమువైపు మరలెను. 1333 వ సంవత్సరమున ఈ రాజు స్కాట్లండు సేనల నొక యుద్ధమున నోడించి, తన యధికారము నంగీకరించిన John Balliol అను వానిని స్కాట్లండు రాజుగ నియమించెను. ఇంగ్లాండు రాజు కావించిన సహాయమునకు ప్రతిఫలముగ

Balliol తన రాజ్యమునందలి ఆగ్నేయ భాగమును ఎడ్వర్డునకు వశపరచెను. Balliol చర్య స్కాట్లాండు ప్రజల కెంతమాత్రమును రుచింపలేదు. వారీ నూతన ప్రభువును దేశద్రోహిగ భావించి, ఏవగించుకొనసాగిరి. ఈ రాజునకు ప్రతిపక్షముగ ఇతఃపూర్వము రాజైన Robert Bruce అనుయాయులు నిలువబడిరి. వీరు ఇంగ్లాండు రాజునకు ప్రతిస్పర్థియైన ఫ్రాన్సుదేశపు రాజు సహాయమును నర్థించి, దానిని పొందగల్గిరి. ఈ విధముగ స్కాట్లండు ప్రజలు తన శత్రుమిత్రుడగు ఫ్రాన్సురాజు సహాయమును పొందుట మూడవ ఎడ్వర్డునకు చాల ఆగ్రహము కల్గించెను. తత్ఫలితముగ ఇంగ్లాండు ఫ్రాన్సు దేశములకు యుద్ధము పొసగెను. 1337 వ సంవత్సరమున శత సంవత్సర యుద్ధము ప్రారంభమయ్యెను.

ఈ యుద్ధమున కనేక కారణములు కలవు. నార్మను రాజుల కాలమునుండియు ఇంగ్లాండు ప్రభువులకు ఫ్రాన్సు దేశములో కొన్ని ప్రాంతములు వశపడి యుండెను. ఈ విధముగ ఇంగ్లాండు ప్రభువు ఫ్రాన్సుదేశపు జమీందారులలో నొక్కడుగ పరిగణింపబడుచుండెను. ఇతర ఫ్రెంచి జమీందారు లందరివలెనే ఇంగ్లాండుదేశపు ప్రభువు ఫ్రాన్సు భూమిశుని ముందర మోకరించి, స్వామిభక్తి ప్రమాణము చేయవలసి వచ్చెడిది. ఈ పరిస్థితి ఇంగ్లాండు రాజులకు చాల కంటకముగ నుండినను, వారు లాంఛనప్రాయముగ ఈ ధర్మమును నిర్వర్తించుచు వచ్చిరి. ఇది యిట్లుండగా ఫ్రాన్సుదేశపు రాజు

నాల్గవ ఛార్లెసు మరణించెను (1328). ఆతని యనంతరము ఫిలిప్పు అనునాతడు రాజ్యాధికారమును పూని,సాంప్రదాయాను సారముగ తనకు స్వామిభక్తి ప్రమాణము చేయవలసినదని మూడవ ఎడ్వర్డునకు వర్తమాన మంపెను. మూడవ ఎడ్వర్డు నకు తన తల్లిద్వారా ఫ్రెంచి రాజకుటుంబముతో బాంధవ్య ముండెను. కావున ఫిలిప్పునకు రాజ్యాధికారము లేదనియు, ఫ్రాన్సు దేశమునకు కూడ తానే యేలిక ననియు ఎడ్వర్డు రాజు వాదింపసాగెను. ఇంతేకాదు. హాలెండు, బెల్జియం దేశ ములలోని పారిశ్రామికులు ఇంగ్లాండు దేశమునుండి ఉన్నిని దిగుమతి చేసికొని, మేలిరకపు ఉన్నిబట్టలను సిద్ధము చేయుచు, చాల ధనమును గడించుచుండిరి. ఈ విధముగ ఇంగ్లాండులోని ఉన్ని ఉత్పత్తిదారులును, హాలెండు బెల్జియములలోని పారి శ్రామికులును అన్యోన్యాశ్రయులై యుండిరి. కాని నిమ్న భూముల (Low Lands) లోని జమీందారీ వర్గమువారు తమ దేశపు పారిశ్రామిక ప్రజల అభివృద్ధిని సహింపలేకపోయిరి. పారిశ్రామికులు ధనాధికులైనచో కాలక్రమమున తమ్ము ధిక్క రించగలరని వారి భయము. కావున ఇంగ్లాండుతో ఉన్ని వ్యాపారము సాగకుండుటకై వారు వీలైనన్ని అవరోధములు కల్పించిరి. హాలెండు బెల్జియం జమీందారులకు ఫ్రాన్సు రాజు అండగ నుండెడివాడు. కావున నిమ్నభూములలోని పారిశ్రా మికులు తమ ఆర్థిక ప్రయోజనముల కాపాడుకొనుటకై ఇంగ్లాండు దేశపు ప్రభువు సహాయము నర్థింపవలసి వచ్చెను. ఈ

విధముగ ఫ్రాన్సు ఇంగ్లాండుల కనేక విషయములలో వైమనస్య మేర్పడెను. ఫ్రాన్సుదేశపు సింహాసనమునకు తాను వారసుడ నని మూడవ ఎడ్వర్డు రాజు కావించిన సవాలును ఇంగ్లాండు లోని జమీందారులును, మతాధికారులును, వర్తకులును, సామాన్య ప్రజలును కూడ సమర్థించిరి. తన కెల్లప్పుడును ప్రక్కలో బల్లెమువలె మెలగుచుండు జమీందారీ వర్గమువారి బలదర్పముల వినియోగమునకై ఒక సాధన మేర్పడినందులకు రాజు లోలోన సంతసించెను. యుద్ధ వ్యవసాయము లేనినాడు కలహ భోజనులైన జమీందారులు తనతో కయ్యమునకు కాలు దువ్వుదురని ఎడ్వర్డు రాజు బాగుగా నెరుంగును. పైపెచ్చుగ అందరి ప్రజల యంగీకారముతోడను, స్వప్రయోజన సిద్ధి కోరి కును, మూడవ ఎడ్వర్డు రాజు ఫ్రాన్సు దేశముతో యుద్ధము నకు దిగెను (1337).

ఇంగ్లాండు దేశపు రాజు కావించిన దీర్ఘకాలిక యుద్ధము లలో, ఈ శత సంవత్సర యుద్ధము మొదటిదని చెప్పవచ్చును. ఇట్టి సంగ్రామముల కావించుట కనువైన పరిస్థితులు క్రమ ముగా నేర్పడెను. ప్రాచీన సాంప్రదాయముల ప్రకారము ఇంగ్లాండు దేశమున స్థిరమైన సైన్యము నెలకొనియుండుటకు వీలులేదు. National Militia లేక జాతీయ సేన అను తాత్కా లిక సేన సహాయముతో, రాజు తన శత్రువుల నెదుర్కొన వలసి వచ్చుచుండెను. కాని ఇట్టి వాహినులతో ఏ రాజును దీర్ఘ మగు యుద్ధములను సాగింపలేడు. నిర్ణీత కాలము పూర్తి

కాగానే ఈ సైనికవర్గము యుద్ధమును మానివేసి, తమ
తమ వృత్తులను సాగించుటకై వెడలిపోవుదురు. కావున
జాతీయ సైన్యమునకు మారుగ శాశ్వత సైన్యము
నేర్పాటుచేసికొను పద్ధతిని మొదటి ఎడ్వర్డు రాజు అవలం
బించెను. ఇందులకు తగిన వసతులు కూడ ఆనాడు ఏర్పడి
యుండెను. గొప్ప గొప్ప భూస్వాములైన జమీందారులు తమ
యేలికయైన రాజునకు అవసరమైనప్పుడు నిర్ణీత సంఖ్య గల
యోధ వర్గమును సహాయముగా పంపవలెనను ఆచారము
జమీందారీ విధానములో ఒక ముఖ్య భాగముగా ఉండెను.
కాని రాజుతో కలసి తరచు యుద్ధభూమికి పోవు పద్ధతి
జమీందారులకు రుచించెడిది కాదు. కనుక రాజునకు సైన్య
సహాయము చేయుటకు మారు కొంత ధనమును చెల్లించు
ఉపాయమును జమీందారులు కనిపెట్టిరి. ఇది ఉభయతారక
మగు మంత్రముగ పరిణమించెను. ధనమును చెల్లించి, తరచు
యుద్ధభూమికి పోవలసిన బాధను తప్పించుకొంటిమని జమీందా
రులు సంతోషించిరి. జమీందారులు ధూర్తులు. విశ్వాసపాత్రులు
కారు. ఇట్టి వారిని వెంటబెట్టుకొని యుద్ధమునకు పోవుట,
కుక్కతోక పట్టుకొని గోదావరి యీదుటతో సమానము.
కనుక జమీందారులు చెల్లించిన ధనముతో, తామే యొక సేన
నేర్పాటు చేసికొనుట మంచిదని రాజులు నిశ్చయించిరి. ఇట్టి
సేనలు నెలల తరబడి యుద్ధరంగములో నుండుటచే కాక,
రాజు వాని నెచ్చటకు పంపిన నచ్చటి కా సేనలు నిరభ్యంతర
ముగ పోవును. వేల్సు, స్కాట్లండు, ఫ్లాండర్సులతో తరచు

యుద్ధములు సాగించిన మొదటి ఎడ్వర్డు రాజు. ఈ నూతన మైన యేర్పాటును హృదయపూర్వకముగ నంగీకరించెను. ఇంగ్లాండు దేశపు సేనల వ్యవస్థలో జరిగిన ఈ మార్పు ముఖ్యముగ గమనింపదగినది. యిరోపా ఖండమునందలి సేనలలో ప్రాచీనకాలము నుండియు రెండు ముఖ్య విభాగము లుండెడివి. ఒకటి అశ్విక సైన్యము. ఇనుప కవచములను ధరించిన యోధవర్యులు పరశువు, ఖడ్గము, ఈటె, మొదలైన ఆయుధములను ధరించి, గుఱ్ఱముల నెక్కి రణరంగమునకు సాగిపోవుచుండెడివారు. వీరు ఉన్నత తరగతులకు చెందిన క్షత్రియ పురుషులు. ప్రతి యోధవర్యుని వెనుక అతని యనుచర వర్గము పాదచారులై పోరాడెడివారు. ఈ పదాతి వర్గము ప్రథమ దశయందు గొడ్డలి, కత్తులు, ఈటెలు, గదలు, ఇతర ఆయుధములు వాడెడివారు. కాని పదాతి సేనకు విశేషము ప్రాముఖ్యము లేకుండెను. యుద్ధములను జయించుటకు మహాయూరాధులగు వీర వర్యులే ముఖ్యసాధనమని ఆనాటి వారందరును భావించుచుండిరి కాని కాలము ఈ భావనలను తారుమారు చేసెను. మొదటి ఎడ్వర్డు రాజు వేల్సు ప్రాంతమందును, స్కాట్లండు దేశమందును చాల యుద్ధములు సాగించినట్లు మనము చూచి నాము. ఇవి పర్వతమయ ప్రాంతములు. ఇచ్చట బరువైన కవచాదులను ధరించిన అశ్విక వీరులు సులభముగ సాగిపోలేరు. కొండలలోను, గుట్టల వెనుకను, దాగుకొని ప్రచ్ఛన్న యుద్ధము సాగించు శత్రువులపట్ల ఈ అశ్విక సేన నిరర్థకమగును.

స్కాట్లండు దేశములోని సేనలకు ముఖ్య బలము ఈ కెగాంద్రడు. వీరు చిన్న చిన్న సంఘములుగ విభజింపబడి యుండిరి. ఈ ఈకెగాంద్రడు తమ తమ స్థానములలో నిలువ ద్రొక్కుకొని పోయిన యెడల, వారు ప్రాణములనైన విడచెదరు కాని వెన్నుచూపరు. ఇట్టి మొండిపట్టుదలగల ఈకెగాంద్రడ సహాయముతోడనే, రాబర్టు బ్రూను రాజు బానక్ బర్న్ యుద్ధమున ఇంగ్లాండు సేనలను సంపూర్ణముగ పరాభవింప గల్గెను. ఐరోపా ఖండములోని సేనలకు ముఖ్యబలము అశ్విక సైన్యము. హయారూఢులును, కవచధారులును, అగు వీరులు శత్రువును ముఖాముఖి యెదుర్కొనిన పక్షమున, వైరివర్గము పెనుగాలి వీచినప్పుడు దూది పింజలవలె, వికాపికలై పోవును. కాని ఇంగ్లాండు రాజుల అదృష్ట వశమున స్కాట్లండులోని ఈకెగాంద్రడను, ఐరోపా ఖండములోని అశ్విక సేనలను, ఎదుర్కొని సంపూర్ణముగ చీకాకు పరుపగల మరియొక సేనావిభాగము వారివద్ద ఏర్పడి క్రమముగ వికాసము పొందెను. అది ధానుష్కుల విభాగము. ధనుర్విద్య భారతదేశమునం దత్యంత ప్రాచీన కాలమునుండియు వ్యాప్తిలో నున్న విద్య. ఈ విధమైన యుద్ధ విధానము పాశ్చాత్య దేశములలో కూడ మిక్కిలి పూర్వకాలమునుండియు వాడుకలో నుండియుండును. ఇంగ్లాండు దేశమును 1066 వ సంవత్సరమున జయించిన నార్మండీ ప్రభువు మొదటి విలియం (విజయ భూషణుడు) రాజు సేనలో కూడ ధనుర్ధరులైన సైనికు లుండిరి. విజయ

భూషణుని యనంతరము ధానుష్క సైన్యమును విస్తారముగను, విజయవంతముగను ఉపయోగించినవాడు మొదటి ఎడ్వర్డురాజు. వేల్సు స్కాట్లండు దేశములలో సాగించిన యుద్ధములందు మొదటి ఎడ్వర్డు రాజును, మూడవ ఎడ్వర్డురాజును కూడ ధనుర్ధరులైన సైనికులను చాల నైపుణ్యముతో ఉపయోగించుకొని, విజయముల సాధించిరి. ఈ ధనుర్ధరులను సక్రమముగ వినియోగించుకొన జాలకపోవుట చేతనే, రెండవ ఎడ్వర్డురాజు సేనలు Bannock burn యుద్ధమున సంపూర్ణ పరాభవము నందెను. మూడవ ఎడ్వర్డు రాజు ఫ్రాన్సు దేశమునందు సాధించిన ఘన విజయములకు కూడ ఈ ధానుష్క సేనయే ముఖ్య సాధనముగ పరిణమించిన యంశము మనము మున్ముందు చూడగలము. ఏ కారణము వలననోకాని ఒక్క ఇంగ్లాండులో తప్ప మరే ఐరోపా దేశములోను ధనుర్ధరులైన ఈ సైనికుల విలువ మన కథాకాలమున గుర్తింపబడలేదు. తాము గడించిన అనుభవము వలన ఇంగ్లాండు రాజులు పూర్వకాలమునాటి ఆశ్విక సేనను, కవచధారులైన యోధవరులను, పదాతి బలమునే కాక, ధానుష్క సేననుకూడ తమ యుద్ధ యంత్రములో నొక భాగముగ నేర్పాటు చేసికొనిరి.

పదునాల్గు పదునేనవ శతాబ్దులలో ఐరోపా ఖండపు యుద్ధములలో మహత్తర విఖ్యాతిని సాధించిన ఈ ఆంగ్ల ధానుష్కులు చిన్న చిన్న వ్యవసాయదారుల (Yeomen) వర్గమునకు చెందినవారు. ధనుర్బాణములను వాడుటయందు వీరికి ప్రత్యేక

శిక్షణ లభించెడిది. వీరి బాణములు కఠినాతికఠినమైన కవచము లను కూడ ఛేదింప జాలెడివి. పాదచారులైన ఈ ధనుర్ధరులు ఇన్నూట యేబది గజముల దూరమునుండి శత్రువులపై శర వర్షము కురిపించి చీకాకు పరచగలెడివారు. సైన్యమునందొక ప్రధాన పాత్రను వహించుచున్న ఈ సైనికులకు గౌరవస్థాన మును, ఉచితమగు వేతనమును లభించెడివి. ఈ సైనికులు చిన్న గుఱ్ఱములపై రణభూమికి పోయెడివారు. అమ్ములు మొద లైన వీరి యుద్ధసాధనముల చేరవేయుటకై వేఱు ఏర్పాట్లు ఉండెడివి. ఈ ధనుర్ధరులు తమతో దృఢమైన దండములనుకూడ కొనిపోయెడివారు. బలమైన ఇనుపములుకులు వీని కమర్చ బడి యుండెడివి. యుద్ధరంగమును చేరగానే విలుకాండ్రు ఈ శూలములను తమ కెదురుగ నాటి బారులుతీర్చి నిలుచుండెడి వారు. శత్రువుల యాశ్వికసేన, ఈ విలుకాండ్రను సమీపింప కుండ, ఈ శూలముల వరుస నిరోధించెడిది. వాని వెనుక నిలువ బడి, విలుకాండ్రు తమ శరవర్షముచే శత్రువులసేన కపారమగు నష్టము కల్గించగల్గెడివారు. చిన్నచిన్న పోరాటములు సంభ వించినను, దూరమునందు శత్రువుల గూఢచారులు కానవచ్చి నను, ఈ విలుకాండ్రు తమ బాణములచే ప్రతిపక్షులను నాశ నము చేసెడివారు. ఇంగ్లాండు రాజులు తెలిసికొనిన ఈ యుద్ధ రహస్యముల నెరుంగని ఫ్రాన్సుదేశపు రాజులు, కవచధారు లైన తమ ప్రాచీనయోధ వర్గమునే నమ్ముకొని యుండుట వారి కనర్థదాయకమయ్యెను.

1337 వ సంవత్సరమున శత సంవత్సర యుద్ధము ప్రారంభమైనట్లు ఇదివరకే తెలుపబడినది. ఫ్రాన్సు దేశముపై దండెత్తి పోవలయునని మూడవ ఎడ్వర్డు రాజు ఆశయము. అందువలన ఈతడు మొట్టమొదట తన నౌకా సేనను బల పరచుకొని, ఫ్రెంచి నౌకా బలమును సంపూర్ణముగా పరాభవించి పారద్రోలెను. ఈ విధముగ సముద్రాధిపత్యమును సాధించి, 2400 అశ్విక సేన తోడను, 12000 విలుకాండ్ర తోడను, ఎడ్వర్డు రాజు 1346 వ సంవత్సరము జూలై నెలలో ఫ్రాన్సు దేశముపై దాడి సల్పెను. ఫ్రాన్సు దేశమునకు ముఖ్య నగరమగు ప్యారిసు పట్టణమును వశపరచుకొనవలెనని ఈ రాజు ఉద్దేశ్యము. కాని ఆ యత్నము సిద్ధించ లేదు. ఈ మధ్య కాలమున ఫ్రాన్సు దేశపు రాజు బలమైన సేనను కూర్చుకొని యుద్ధమునకు సంసిద్ధుడయ్యెను. అంతటి ప్రబలులైన శత్రువు నెదుర్కొని పోరాడుటకు ఇంగ్లాండు రాజునకు ధైర్యము చాల లేదు. కావున ఆంగ్ల సేనలు వీలైనంతవరకు యుద్ధము చేయకుండ తప్పించుకొనుటకై యత్నించెను. కాని శత్రువులను తరుముకొనుచు వచ్చిన ఫ్రెంచి రాజు సేన లిట్టి యవకాశమును వారి కొసంగ లేదు. అనేక ప్రమాదముల నెదుర్కొని ఆంగ్ల సేనలు Crecy అను ప్రదేశమును చేరి యుద్ధ సన్నద్ధులై నిల్చెను. 1346 వ సంవత్సరము జూలై నెల 26 వ తేదీని సాయంకాలము ఫ్రాన్సు సేనలును, ఎడ్వర్డు రాజు సేనలును యుద్ధమునకు తలపడెను. ఆంగ్ల ధానుష్కులు మిక్కిలి నేర్పు

తోడను, వేగముతోడను కురిపించిన శరవర్షము శత్రువుల కపారమగు నష్టమును చేకూర్చెను. ఫ్రెంచి సేనలోని విలు కాండ్రు నూర్లకొలది రణభూమికి బలియైరి. వారి వెనుక రణ భూమిలో ప్రవేశించిన, అశ్వారూఢులైన యోధవర్యులకు కూడ ఇదియే గతి పట్టెను. ఫ్రెంచిసేన పలాయనము కావింప సాగెను. ఈ యదనును చూచి, పాదచారులైన ఆంగ్ల సైనికులు బాకులను, ఖడ్గములను ధరించి, శత్రువుల వెన్నంటి అసంఖ్యా కులను సంహరించిరి. క్రెసీ యుద్ధము ఆంగ్లేయులకు మహత్తర మైన విజయముతో సమాప్తమయ్యెను. తమ ఆశ్విక సైన్యము నెదిరించి నిలువగల బలమేదియును కూడ లేదని ఇంత కాలమును ఫ్రాన్సు దేశపు ప్రభువులు గర్వించుచుండిరి. ఈ పరాభవము వలన వారికి గర్వభంగమయ్యెను. ఆ మరుసటి దినము ఫ్రెంచి సేనలోని మరికొన్ని భాగము లాంగ్లేయులతో తలపడి, సంపూర్ణముగ నోడిపోయెను. క్రెసీ యుద్ధమున విజయము చేపట్టి ఎడ్వర్డు రాజు సుప్రసిద్ధమైన Calais పట్టణమునకు ముట్టడి వేసెను. ఇది గొప్ప రేవు స్థలము. ఈ నగరమును బలమైన యొక ప్రాకారము రక్షించుచుండెను. కెలే పౌరులు సుమారు ఒక సంవత్సరము కాలము మహాధైర్యముతో ఎడ్వర్డు రాజు నెదిరించి పోరాడి, తుదకు అహారపు దినుసుల కొరత వలన, పరాజయము నంగీకరించిరి. కెలే నగర మాంగ్లేయులకు వశపడెను. ఈ పట్టణమునుండి ఆంగ్ల భూమి చాల సమీపము. సుమారు రెండు శతాబ్దుల వరకును ఆంగ్ల సేనలు ఫ్రాన్సు

దేశముపై దండెత్తి పోవుటకీ పట్టణ మొక ముఖ్యద్వారముగ నేర్పడెను. క్రెసీ యుద్ధములో మూడవ ఎడ్వర్డు రాజునకు ఆతని జ్యేష్ఠపుత్రుడు అపారముగ సహాయపడెను. ఈతని పేరు కూడ ఎడ్వర్డు. కాని ఈ రాకుమారునికి Black Prince అను పేరుతోడనే ఎక్కుడు విఖ్యాతి లభించెను. "నల్ల రాకుమారు" డని దీని యర్థము. ఈ వీరుడు ఎల్లప్పుడును నల్లని కవచమును ధరించి, నల్లని గుఱ్ఱముపై స్వారి చేయుచుండె నందున ప్రజ లీతనిని Black Prince అని ప్రేమతో వర్ణించెడి వారు. ఈ యువరాజు ఆ కాలము నాటి ప్రసిద్ధ వీరా గ్రేసరులలో నొక్కడు. క్రెసీ యుద్ధమునాటి కితడు పదు నెనిమిది సంవత్సరముల నవ యువకుడు. కాని యా రణరంగమున నీతడు గొప్ప సాహసమును, ధైర్యమును ప్రదర్శించి, మేటి వీరుడైన తండ్రి మన్ననల నందుకొనెను. 1355 వ సంవత్సర మున ఆంగ్లసేనలు మరల ఫ్రాన్సు దేశముపై దండెత్తిపోయెను. ఈ పర్యాయము నల్ల రాకుమారు డాంగ్లసేనలో కొంతభాగ మున కాధిపత్యము వహించి, ఫ్రాన్సుదేశపు దక్షిణజిల్లాల నతి క్రూరముగ దోపిడి చేయించెను. ఈ యత్యాచారములను సహింపక ఫ్రెంచి ప్రభువైన జానురాజు ఇరువదివేల బలమైన సేనతో ఆంగ్లసేనను వెన్నంటి తరిమెను. ఆంగ్లవాహిని చాల సన్నగిల్లి యుండెను. దాని సంఖ్య సుమారు నాల్గువేలు. కాని అందు సగబాలు అరివీరభయంకరులైన ధానుష్కు లుండిరి. నల్ల రాకుమారుడు తన సేనతో స్వదేశమునకు తప్పించుకొని

పారిపోవలెనని యత్నించెను. కాని ఆ యత్నము కొనసాగ లేదు. 1356 వ సంవత్సరమున ఆంగ్ల ఫ్రెంచిసేనలు Poitiers యుద్ధమునకు తలపడెను. క్రెసీ యుద్ధమున ఫ్రెంచివీరు లశ్వారూఢులై యుద్ధము కావించినందున, వారు పరాభవము నందిరి. ఈ యంశమును వారు మరువలేదు. కావున పాయి టీర్సు యుద్ధమున వీరు బరువైన కవచముల ధరించి, పాద చారులై యుద్ధము కావించిరి. యుద్ధ నిపుణుడైన నల్ల రాకుమారుడు తన విలుకాండ్రను, అశ్వికులను, పదాతిసేనను కూడ మిక్కిలి చాకచక్యముతో నడపి, ఫ్రెంచి సేనను సంపూర్ణ ముగ ఓడించెను. అనేకులు ఫ్రెంచివీరులు రణభూమిలో ప్రాణ ముల గోల్పోయిరి. పెక్కండ్రు యోధాగ్రేసరులును, జాను రాజును కూడ ఆంగ్లసేనలకు బందీలుగ చిక్కిరి. ఆంగ్ల సేనలు విజయాట్టహాసముతో ఫ్రెంచిరాజును తమ దేశమునకు తీసికొని పోయెను. ఫ్రాన్సురాజు లండను నగరములో కొంతకాలము బందీగ నుండెను. తుదకు 1360 వ సంవత్సరములో ఇరుపక్ష ముల వారికిని సంధి కుదిరెను. ఫ్రాన్సు దేశమందలి కొన్ని సూబాలును, ప్రసిద్ధమగు కెలే పట్టణమును ఇంగ్లీషువారికి వశము చేయబడెను. ఫ్రెంచి రాజును విడచి పెట్టుటకై ప్రతి ఫలముగ ఆంగ్ల ప్రభుత్వమువారు అయిదులక్షల పౌండ్లను తీసి కొనిరి. శాంతి సమయములో ఇంగ్లాండు రాజునకీ ఆదా యము ఎనిమిది సంవత్సరములలో కాని లభించెడిది కాదట.

క్రెసీ పాయిటీర్సు యుద్ధములు ఆంగ్లేయులు సాధించిన గొప్ప రణ విజయములలో లెక్కింపబడుచున్నవి. తమ ఇతిహాసములో నివి మరువరాని ఘట్టములని ఆంగ్లేయులు నేటికిని భావించుచున్నారు. తమ సాటివారును, మేటి శూరులునైన ఫ్రెంచివారిని పూర్తిగ చిత్తు చేయగల్గుట ఇంగ్లీషువారి కొక గర్వకారణముగ పరిణమించెను. కాని ఈ రణవిజయముల వలన ఇంగ్లాండు దేశమునకు కీర్తితప్ప మరేమియు దక్కలేదు. ఆంగ్ల సేనలు ఫ్రాన్సు సేనలను యుద్ధరంగములో ఓడింపగల్గెనే కాని, ఫ్రాన్సు దేశమును శాశ్వతముగ వశపరచుకొన లేకపోయెను. 1346, 1356 నాటి పరాభవములవలన ఫ్రెంచి ప్రభుత్వము వారు గుణపాఠమును నేర్చుకొనిరి. ఆంగ్లేయులతో ఎదురుపడి యుద్ధముచేయుట వారు పూర్తిగ మానుకొనిరి. అందులకు మారు ప్రచ్ఛన్న యుద్ధము, అకస్మాత్తుగ దాడులు, అల్ప సంఖ్యలో కానవచ్చిన శత్రు సైనికులను హతమార్చుట, మున్నగు పద్ధతులవలన, ఫ్రెంచివారు ఆంగ్లేయులకు బాగుగ నష్టము కల్గింపసాగిరి. ఫ్రాన్సు సేనానుల యుక్తి చాతుర్యము వలన ఆంగ్లేయులు సంపాదించిన రాజ్యలాభము సూర్య కిరణములకు కరగిపోవు మంచువలె అదృశ్యమయ్యెను. నల్ల రాకుమారుడు నిరంతర యుద్ధములచే అలసిపోయి, రణరంగమునకేగుట మానుకొనెను. వ్యాధిగ్రస్తుడై ఈతడు తండ్రికంటె పూర్వమే మరణించెను (1376). 1375 నాటికే ఫ్రాన్సు దేశపు గడ్డపై ఆంగ్లేయుల పరాభవము పూర్తియయ్యెను. పాయిటీర్సు

విజయమువలన వారు సంపాదించిన రాజ్యమునంతను కూడ ఫ్రెంచివారు మరల వశపరచుకొనిరి. కెలే, బోర్డో (Bordeaux), బెయాన్ (Bayonne) అను పట్టణములును, వాని నడుమగల కొంత తీరప్రాంతమును మాత్రము ఆంగ్లేయుల అధీనములో నిలచియుండెను. ఈ పరాభవముల నన్నిటిని చూచి, వ్యసన పడి, వీరుడైన ఎడ్వర్డురాజు 1377 లో మరణించెను.

ఒక వంక మూడవ ఎడ్వర్డు రాజును, ఆతని కుమారుడైన నల్ల రాకుమారుడును ఫ్రాన్సు దేశముపై దండెత్తి, అఖండ విజయములను సాధించుచుండగా, Black Death అను మహామారి ఇంగ్లాండు దేశమునందు వ్యాపించి, జనానీకమును వేలకొలది తన పొట్ట బెట్టుకొనసాగెను. ఈ జాడ్యము మహా భయంకరమైనది. ఇది అకస్మాత్తుగ మానవుని నావహించి, దేహముపై వికారమైన నల్లని మచ్చలను కలుగజేసి, నరముల బిగియపట్టి, పెద్ద పెద్ద గడ్డలను తనువుపై వ్యాపింపజేసి, అమితమైన బాధను, తుదకు అపస్మారమును గొనివచ్చి, ప్రాణులను బలిగొనుచుండెడిది. ఈ మహామారి మొట్టమొదట ఆసియా ఖండములో బయలుదేరినట్లు తోచుచున్నది. అచ్చటి నుండి ఈ వ్యాధి క్రిమియా దేశముద్వారా ఐరోపా ఖండములో ప్రవేశించెను. ఇరువది సంవత్సరముల కాలములో మొత్తము ఐరోపా ఖండములోని జనసంఖ్యలో మూడవవంతు ఈ రోగమువలన మృత్యువుపాలైరి. ఇంగ్లాండుదేశమునం దీ కాలమున జమీందారుల అంతఃకలహములు వ్యాపించుచున్నం

దున, ప్రజలు పుష్టికరమైన అన్నపానాదులు లభింపక, ఈ నల్ల జాడ్యమునకు (Black Death) సులభముగా బలికాజొచ్చిరి. ఈ మహామారివలన ఇంగ్లాండునందు ఎందరు జనులు మరణించిరో తెల్పుటకు వ్రాతపూర్వకమైన నిదర్శనములు లేవు. కాని కొన్ని సంఘటనలు ఈ కాలమునాటి భయానక పరిస్థితులను చెప్పక చెప్పుచున్నవి. ఆ యుగమునందు న్యాయస్థానములముందు తేబడిన అభియోగములలోని వాది ప్రతివాదులును, వారి సమీప బంధువులును కూడ మరణించినందున వ్యాజ్యములు తమంత తాము రద్దుపడెడివి. వృత్తి సంఘములకు నాయకులను సంవత్సరమునకు నాల్గు ఐదు పర్యాయములు ఎన్నుకొనవలసి వచ్చెడిది. ప్రాణావసాన దశయందున్న క్రైస్తవ రోగులకు ఆధ్యాత్మిక సహాయము చేయుటకు పాదిరీలు కరవైరి. మరణించినవారిని సమాధిచేయుటకు బ్రతికియున్నవారు చాలరైరి. దయాసముద్రుడని కొనియాడబడు పరమేశ్వరుని పరిపాలన ఈ విధముగనే సాగునాయని జనులందరును అబ్బురపడసాగిరి. ఈ విధముగ కొంతకాలము తన విలయతాండవము సాగించి, ఈ మహామారి అదృశ్యమయ్యెను. కాని నల్లజాడ్యము వలన ఇంగ్లాండు దేశపు ఆర్థిక వ్యవస్థలో గొప్ప మార్పు సంభవించెను. తొల్లింటి పరిస్థితులన్నియు తారుమారయ్యెను. ఈ యంశమును గూర్చిన వివరములు స్థలాంతరమున మనము పరిశీలింతము.

విజయములవలన వారు సంపాదించిన రాజ్యమునంతను కూడ ఫ్రెంచివారు మరల వశపరచుకొనిరి. కెలే, బోర్డో (Bordeaux), బెయాన్ (Bayonne) అను పట్టణములును, వాని నడుమగల కొంత తీరప్రాంతమును మాత్రము ఆంగ్లేయుల అధీనములో నిలచియుండెను. ఈ పరాభవముల నన్నిటిని చూచి, వ్యసన పడి, పిరుడైన ఎడ్వర్డురాజు 1377 లో మరణించెను.

ఒక వంక మూడవ ఎడ్వర్డు రాజును, ఆతని కుమారుడైన నల్ల రాకుమారుడును ఫ్రాన్సు దేశముపై దండెత్తి, అఖండ విజయములను సాధించుచుండగా, Black Death అను మహామారి ఇంగ్లాండు దేశమునందు వ్యాపించి, జనానీకమును వేలకొలది తన పొట్ట బెట్టుకొనసాగెను. ఈ జాడ్యము మహా భయంకరమైనది. ఇది అకస్మాత్తుగ మానవుని నావహించి, దేహముపై వికారమైన నల్లని మచ్చలను కలుగజేసి, నరముల బిగియపట్టి, పెద్ద పెద్ద గడ్డలను తనువుపై వ్యాపింపజేసి, అమితమైన బాధను, తుదకు అపస్మారమును గొనివచ్చి, ప్రాణులను బలిగొనుచుండెడిది. ఈ మహామారి మొట్టమొదట ఆసియా ఖండములో బయలుదేరినట్లు తోచుచున్నది. అచ్చటి నుండి ఈ వ్యాధి క్రిమియా దేశముద్వారా ఐరోపా ఖండములో ప్రవేశించెను. ఇరువది సంవత్సరముల కాలములో మొత్తము ఐరోపా ఖండములోని జనసంఖ్యలో మూడవవంతు ఈ రోగమువలన మృత్యువువాతపడిరి. ఇంగ్లాండు దేశమునం దీ కాలమున జమీందారుల అంతఃకలహములు వ్యాపించుచున్నం

మున, ప్రజలు పుష్టికరమైన అన్నపానాదులు లభింపక, ఈ నల్ల జాడ్యమునకు (Black Death) సులభముగా బలికాజొచ్చిరి. ఈ మహామారివలన ఇంగ్లాండునందు ఎందరు జనులు మరణించిరో తెల్పుటకు వ్రాతపూర్వకమైన నిదర్శనములు లేవు. కాని కొన్ని సంఘటనలు ఈ కాలమునాటి భయానక పరిస్థితులను చెప్పక చెప్పుచున్నవి. ఆ యుగమునందు న్యాయస్థానములముందు తేబడిన అభియోగములలోని వాది ప్రతివాదులును, వారి సమీప బంధువులును కూడ మరణించినందున వ్యాజ్యములు తమంత తాము రద్దుపడెడివి. వృత్తి సంఘములకు నాయకులను సంవత్సరమునకు నాల్గు ఐదు పర్యాయములు ఎన్నుకొనవలసి వచ్చెడిది. ప్రాణావసాన దశయందున్న క్రైస్తవ రోగులకు ఆధ్యాత్మిక సహాయము చేయుటకు పాదిరీలు కరవైరి. మరణించినవారిని సమాధిచేయుటకు బ్రతికియున్నవారు చాలరైరి. దయాసముద్రుడని కొనియాడబడు పరమేశ్వరుని పరిపాలన ఈ విధముగనే సాగునాయని జనులందరును అబ్బురపడసాగిరి. ఈ విధముగ కొంతకాలము తన విలయతాండవము సాగించి, ఈ మహామారి అదృశ్యమయ్యెను. కాని నల్లజాడ్యము వలన ఇంగ్లాండు దేశపు ఆర్థిక వ్యవస్థలో గొప్ప మార్పు సంభవించెను. తొల్లింటి పరిస్థితులన్నియు తారుమారయ్యెను. ఈ యంశమును గూర్చిన వివరములు స్థలాంతరమున మనము పరిశీలింతము.

నల్ల జాడ్యము వలన ఆంగ్ల సమాజమునందల్ల కల్లోలములు వ్యాపించి యుండగా, క్రైస్తవ మత సంఘమునకును, ఇతర ఆంగ్ల ప్రజలకును వైషమ్యములు నానాట వృద్ధి చెందసాగెను. జాను రాజు కాలమునందును, దుర్బలుడైన ఆతని కుమారుడు మూడవ హెన్రీ కాలమునందును, ఇంగ్లాండు దేశమున పోపు మతాధికారి ప్రాబల్యము బాగుగా హెచ్చెను. మతము పేరట క్రైస్తవ పాదిరీలు పెక్కు విధములైన పన్నులను వసూలు చేయసాగిరి. గొప్ప గొప్ప అధికార పదవులలో కూడ పాదిరీలు విశేష సంఖ్యలో ప్రవేశింప జొచ్చిరి. ఈ విధముగ పాదిరీలు నానాటికి బలపడుట సామాన్యులగు ఆంగ్ల ప్రజలకు నచ్చలేదు. శత సంవత్సర యుద్ధము ప్రారంభమైన పిమ్మట విదేశీయు లే విధముగను ఆంగ్లభూమిలో పలుకుబడి, అధికారమును కల్గియుండరాదను భావము బలపడెను. ఈ కథా కాలమునాటికి పోపు మతాధికారి పవిత్రమైన రోమకనగరమును వీడి, ఫ్రాన్సు దేశమున Avignon అను ప్రదేశమున విడిదిచేసి, ఫ్రాన్సుదేశపు రాజుల పలుకుబడికి లోనై యుండెను. తమకు శత్రువైన ఫ్రెంచి రాజునకు వశ్యుడై యున్న పోపు మతాధికారి యధికారమును గుర్తించుటయు, ఆయనకు పన్నులు చెల్లించుటయు, ఆంగ్లేయుల కెంతమాత్రమును రుచింపలేదు. తత్ఫలితముగ ఆంగ్లపార్లమెంటువారు క్రైస్తవ మత సంఘమునకు విరుద్ధముగ శాసనములు చేయసాగిరి. ఇంగ్లాండు దేశమున ప్రభుత్వ న్యాయస్థానములలో విచారింపదగిన అభియోగములను, మతా

ధికారుల న్యాయస్థానములలోనికి మార్చుట నిషేధింపబడెను. అట్లే ఇంగ్లాండు దేశమున మతాధికారుల నియమించు నధికారము పోపు మత పీఠము వారికి చాలవరకు తగ్గింపబడెను. ఈ శాసనములు సంపూర్ణముగ అమలు చేయబడక పోయినను, పోపు మతాధికారి కాంగ్ల భూమినుండి చెల్లు పన్నులు మాత్రము చాలవరకు తగ్గిపోయెను. దేశమునందుకల ధన మంతయు ఖర్చించి యుద్ధముల కొరకే సెలవగుచుండెను. 1369 వ సంవత్సరమున శత సంవత్సర యుద్ధము ఒక ముఖ్య ఘట్టమున ప్రవేశించెను. ఇంగ్లాండు ఫ్రాన్సులు మరల యుద్ధమునకు దిగెను. గడచిన ముప్పది సంవత్సరముల నుండియు నిరంతర యుద్ధములు సాగించుచున్న జమీందారులును, యుద్ధముకొరకై ప్రత్యేక పన్నులు చెల్లించుచున్న సామాన్య ప్రజలు తమ ఐశ్వర్యము నంతయు కోల్పోయిరి. కాని క్రైస్తవ పాదిరిలు మాత్రము తాము కూడబెట్టుకొనిన ధనమును ధారాళముగ వెచ్చించుచు, సౌఖ్యవంతమగు జీవితమును గడుపసాగిరి. ఈ పరిస్థితివలన సామాన్య ప్రజలలోను, జమీందారీ వర్గములోను పాదిరీల యెడ అసూయ జనించెను. ఇది ఇట్లుండగా క్రైస్తవపాదిరీలు తాము సామాన్యపౌరులు చెల్లించు పన్నులు చెల్లింప నక్కరలేదని వాదింప జొచ్చిరి. నానాటికి వృద్ధి యగుచున్న క్రైస్తవ మత సంఘమువారి ప్రాబల్యము నరికట్టవలెనను భావము పార్లమెంటు సభలో పెరుగ సాగెను. వీరుడైన మూడవ ఎడ్వర్డురాజు వృద్ధుడై క్రమముగా తన ప్రాభవమును కోల్పోయిన కొలదియు, జమీందారీ వర్గము బలమును పుంజుకొనసాగెను. రాజు మూడవ

కుమారుడైన జాను నామధేయుడగు లంకాస్టరు ప్రభువు జమీందారులకు నాయకత్వము వహించెను. జమీందారులకు క్రైస్తవ మత సంఘముపై యేర్పడిన వైరభావమును ప్రకటించుటకు లంకాస్టరు ప్రభువునకు మంచి యవకాశము లభించెను. ఆ కాలమున ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయము మత సంబంధమగు విద్యలకు కేంద్రముగ నుండెను. ఇచ్చట ప్రసిద్ధులైన విద్వాంసులు నిరంతరము విద్యావ్యాసంగమును సాగించుచుండిరి. ఆనాటి క్రైస్తవ మతాధికారులు రాజకీయముగ సాధించుచున్న అధికారమును పలుకుబడియు, ధర్మవిరుద్ధమైనవని ఈ క్రైస్తవ విద్వాంసులు భాషింప జొచ్చిరి. క్రైస్తవ మత సంఘమునందు పెక్కు సంస్కరణలు ఆవశ్యకముగ నున్నవని ఆనాటి ఆక్స్ఫర్డు పండితులలో చాల ప్రసిద్ధుడైన John Wiclif అను నాతడు వాదింపజొచ్చెను. నాటి క్రైస్తవ సన్యాసులలో ధనలోభము బాగుగా వ్యాపించి యుండెను. మతాధికారులలో తరతమభావము కూడ పొడుకొని యుండెను. ఈ రెండు లోపములును కూడ క్రైస్తవ మత సిద్ధాంతముల దృష్ట్యా చాల గర్హ్యములని విక్లిఫ్ పండితుడు ఘోషింప సాగెను. మానవుల యాధ్యాత్మిక జీవనమును తోటి మానవు లెవ్వరును శాసించుటకు వీలులేదనియు, ఈ విషయములలో సర్వోత్తముడైన యధికారి పరమేశ్వరుడే యనియు, ఈ విద్వాంసు డుద్ఘాటించెను. రాజుగారి ఆధ్యాత్మిక జీవితమును సక్రమ పద్ధతులపై నడపుటకు క్రైస్తవ పాదిరీలకు అధి

కారము కలదు. అన్లై లౌకిక విషయములలో దైవ ప్రతినిధి యైన రాజునకు క్రైస్తవ మతాధికారులలో వ్యాపించియున్న లోపముల సవరించుటకును, ధనకాంక్షను, ఆడంబర జీవితమును నిరోధించుటకును, సర్వాధికారము కలదని విక్లిఫ్ పండితుడు అభిప్రాయ పడెను. రాజునకును, పోప్ మతాధికారికిని కూడ, తమతమ నిర్ణీత పరిధిలో కొన్ని యధికారము లున్నమాట వాస్తవమే కాని, మత లౌకిక విషయము లన్నిటిలోను కూడ సర్వాధికారి పరమేశ్వరుడు మాత్రమే యనియు, మత విషయములలో పోపును పరమ ప్రమాణముగ నంగీకరింప నవసరము లేదనియు, జాన్ విక్లిఫ్ పండితుడు పునః పునః వాదించెను. విక్లిఫ్ విద్వాంసుడు రాజకీయాధికారము కలవాడు కాడు. అయినను ఆతని వాదనా పటిమవలన రాజకీయరంగమున కూడ సంచలనము సంభవించెను. మత గురువులు అనుభవించు చున్న రాజకీయాధికారములను తగ్గింప వలెననియు, లేని పక్షమున వారు తమ పవిత్రధర్మముల నిర్వర్తించుటకు తగిన వాతావరణ మేర్పడదనియు, అధికారులు తలంపజొచ్చిరి. అయినను తమ మతసంఘపు రాజకీయపు పలుకుబడిని తగ్గించుకొనుటకు కాని, ఇతర నైతిక లోపములను గుర్తించి వానిని సవరించు కొనుటకు గాని, క్రైస్తవ పాదిరీలు అంగీకరింపరైరి. కొంత కాలము వరకును రాజకుమారుడు లంకాస్టరు ప్రభువును, సంస్కర్తయైన విక్లిఫ్ పండితుడును, ఏకీభావముతో వ్యవహరించిరి. క్రైస్తవ పాదిరీల రాజకీయాధికారములను సంకుచిత

పరచి, జమీందారీ వర్గమును బలపరచవలెనని రాజకుమారుని ఆశయము. క్రైస్తవ మతసంఘములో పాదుకొనియున్న ధనలోభము, విషయ వాంఛాపరత్వము, ఆడంబరము మున్నగు వానిని తొలగించి, పాదిరీలను నిజమైన క్రైస్తవులుగ కావించుట విక్లిఫ్ మహాశయుని ఉద్దేశ్యము. ఉద్దేశ్యములు భిన్నమైనను క్రైస్తవ మతసంఘము నెడ విరోధభావము విక్లిఫ్ లంకాస్టరు ప్రభువులకు సమానము కావున వారిరువురును కొంత కాలము వరకును కలసి పనిచేసిరి. తమతమ లక్ష్యములను సాధించుటకై రెండవ వానిని సాధనముగ కావించుకొనవలెనని ఇరువురును కూడ అభిప్రాయపడిరి. కాని ఈ యిరువురి మైత్రివలనను ఎట్టి ఫలితమును చేకూరలేదు. పార్లమెంటుసభ యందు జమీందారుల వర్గమును బలపరచి, మతాధికారుల ప్రాబల్యమును క్షీణింప జేయుటకై క్రొత్త క్రొత్త సభ్యులను పార్లమెంటు సభలో నింపుటకై లంకాస్టరు ప్రభువు యత్నించెను. విక్లిఫ్ పండితుడు క్రైస్తవ దేవాలయముల నన్నిటిని సందర్శించి, పాదిరీలలో వ్యాపించియున్న లోపముల తీవ్రముగ విమర్శింప సాగెను. పార్లమెంటుసభలో క్రొత్తసభ్యుల చేర్చుట జమీందారులకు అంగీకారము కాలేదు. విక్లిఫ్ తీవ్ర విమర్శల కలజడిచెంది, మతాధికారులు తమ సంఘమును రక్షించుకొనుటకు సర్వశక్తుల కేంద్రీకరించుకొన జొచ్చిరి. లంకాస్టరు ప్రభువు తమకు ప్రబలశత్రువు. ఆతనికి విక్లిఫ్ పండితుడు చేయూత నొసగుచున్నాడు. కావున ఈ మత సంస్కర్తనే విధముగ

నైన కూలద్రోయవలెనని మతాధికారులు నిశ్చయించిరి. విక్లిఫ్ మత విరుద్ధమైన ప్రచారమును సాగించుచున్నాడని నేరారోపణ కావించి, మతగురువు లాతనిని St. Paul దేవాలయమందు జరిగిన సమావేశములో సంజాయిషీ చెప్పుకొన వలసినదని ఆజ్ఞాపించిరి. ఈ సంఘటనలవలన విక్లిఫ్ పండితుడు సామాన్యజనుల ద్వేషమునకు గురికావలసి వచ్చెను. ఆతనిని కాపాడబోయిన లంకాష్టరు ప్రభువుపై లండను మూకలు ఎదురు తిరిగెను. ఈ విధముగ తమతమ ప్రయోజనముల సాధించు నుద్దేశ్యముతో తాత్కాలిక మైత్రిని పాటించిన విక్లిఫ్ సంస్కర్తయు, లంకాష్టరు ప్రభువును వేరుపడిరి. విక్లిఫ్ పండితునికిగల రాజకీయ ప్రాబల్యము నశించెను. కాని అంత మాత్రముచే విక్లిఫ్ పండితుడు చేతులు ముడుచుకొని కూర్చుండ లేదు. అధికారుల సహాయముతో క్రైస్తవ మత సంఘమును సంస్కరించుటకు వీలుపడదని నిశ్చయము చేసికొని, ఆతడు సూటిగ ప్రజలతోడనే సంబంధము కల్పించుకొన సాగెను. ఆతడు తన యనుచరవర్గము నొక నూతన సంఘముగ వ్యవస్థీకరించెను. ఈ నూతన మత సంఘములోని పాదిరీలు స్వయముగ పవిత్ర జీవితమును గడపుచు, ధన సంపాదనము పొంతబోక, అతిముఖ్యమైన ఈ క్రైస్తవ మత సిద్ధాంతములు లోకమునకు బోధింప సాగిరి. ఈ పాదిరీలను జనులు Lollards అని పిలువ జొచ్చిరి. విక్లిఫ్ పండితుడు రోమను కాథలిక్కు మత సిద్ధాంతములలోని Doctrine of Transubstantiation అను భావ

మును కూడ తీవ్రముగ ఖండించెను. ఈ సిద్ధాంతము ప్రకారము ప్రార్థనానంతరము క్రైస్తవ దేవాలయములందు భక్తులకు పంచి ఈయబడు రొట్టెయు, మద్యమును, ఏసుక్రీస్తు యొక్క రక్తమాంసములుగ మార్పుచెంది మానవ దేహమును ప్రవేశించును. ఈ సిద్ధాంతమును మధ్యమ యుగమునాటి క్రైస్తవులలో అత్యధిక సంఖ్యాకులు తు. చ తప్పకుండ నమ్మచుండిరి. ఇట్టి సిద్ధాంతమును నిరసించుటవలన విక్లిఫ్ పండితుడు క్రైస్తవ మతాధికారుల యొక్కయు, సామాన్య ప్రజల యొక్కయు, తుదకు రాజకుమారుడగు లంకాస్టరు ప్రభువు యొక్కయు, అభిమానమును కోల్పోయెను. సామాన్య ప్రజలలో పలువురు విక్లిఫ్ సంస్కర్త యెడల విరోధభావమును పూనసాగిరి. అయినను ధైర్యశాలియైన ఈ విద్వాంసుడు తన మతబోధను మానలేదు. క్రైస్తవ మత సంస్కరణము నెడల తనకుగల భావముల నాతడు చిన్నచిన్న పుస్తకముల ద్వారా ప్రకటింపసాగెను. తుదకు విక్లిఫ్ పండితుడు తన శిష్యుల సహాయమును గైకొనుచు, క్రైస్తవ వేదమైన బైబిలు గ్రంథమును ఆంగ్ల భాషలోని కనువదించుటకు పూనుకొనెను (1380). విక్లిఫ్ విద్వాంసుని కృషివలన ప్రజానీకమునందు చిరకాలముగ నిద్రాణమైయున్న క్రైస్తవ మతతత్త్వము జాగృతిని పొందెను. ప్రాటస్టెంటు మతమున కింగ్లాండు దేశమున పునాదిరాయి వేసిన మహనీయుడు విక్లిఫ్ పండితుడని తెల్పుట కెంతమాత్రమును సందేహము లేదు.

మూడవ ఎడ్వర్డు రాజు కాలము చాలవరకు ఫ్రాన్సుదేశముతో యుద్ధము సాగించుటలోనే నడచి పోయినట్లు మనము కనుగొని యున్నాము. ఈ యుద్ధములవలన ఇంగ్లాండు దేశమునకు శాశ్వతమగు లాభమేమియు చేకూరలేదు. కాని ఈ యుద్ధములవలన పార్లమెంటు సభయొక్క స్వరూపము స్పష్టముగ నేర్పడుటయే కాక దీని అధికారములు కూడ హెచ్చెను. యుద్ధములు సాగినంత కాలమును రాజునకు సహజముగ ధనము యొక్క ఆవశ్యకత హెచ్చుగ నుండెను. ధనమును సేకరించుటకై రాజు ప్రజాప్రతినిధి సభను తరచుగ సమావేశపరచవలసినవాడయ్యెను. ఈ సమావేశములు జరిగినప్పుడు ప్రజాప్రతినిధులు తమకు స్థానిక రంగమునందును, జాతీయరంగమునందునుగల కష్టనిష్ఠురములను ప్రభుత్వమునకు నివేదించి, వానిని తొలగింపవలసినదిగా కోరజొచ్చిరి. తమ ఇబ్బందులు తొలగిన పిమ్మటనే ప్రజాప్రతినిధులు ప్రభుత్వమువారు కోరిన ధనమును మంజూరు చేసెడివారు. యుద్ధము సాగుచుండుటవలన ధనావశ్యకత హెచ్చుగ నుండి ప్రభుత్వమువారు ప్రజాప్రతినిధులు కావించిన విన్నపముల శ్రద్ధగ నాలకించి, వారి కష్టముల తొలగించెడివారు. ఈ విధముగ పార్లమెంటు సభవారు ప్రభుత్వము కోరిన పన్నులు వగైరాలను మంజూరు చేయుటకు పూర్వము, రాజు వారికిగల కష్టములను బాధలను గూర్చి విచారించి, వానిని తొలగింపవలెనను మంచి సాంప్రదాయ మేర్పడెను. రెండవఎడ్వర్డు రాజుకాలమునందే పార్లమెంటు సభ్యులు సామూహికముగ

రాజుగారికి విన్నపముల పంపుకొను పద్ధతి యేర్పడెను. ఆ పద్ధతి మూడవ ఎడ్వర్డు రాజు కాలమున బలపడెను. ప్రజా ప్రతినిధి సభవారు (House of Commons) ఏకమై తమకోర్కెలను విన్నవించుచు, ప్రభుత్వమునకు విన్నపము కావించుటయే కాక, ఆ విన్నపమునకు ఫలితముగ కావింపబడిన నిర్ణయములు శాసన రూపమును దాల్చవలయునని కూడ కోరసాగిరి. ఈ యాచారము కాలక్రమమున ఘనీభవించి, శాసన నిర్మాణాధికారము ప్రజాప్రతినిధి సభవారికి మాత్రమే కలదను సాంప్రదాయమునకు పునాది అయ్యెను. మొదటి ఎడ్వర్డు రాజు కాలమందు సామాన్య ప్రజానీకము యొక్క ప్రతినిధుల కొక వ్యక్తిత్వమును, ప్రత్యేకతయు లేకుండెను. మూడవ ఎడ్వర్డు రాజు పరిపాలనలో ప్రజాప్రతినిధి సభ స్పష్టముగ వేరుపడి, బలమైనట్టియు, శాశ్వతమైనట్టియు ఆకృతిని తాల్చెను. ప్రజా ప్రతినిధిసభ (Housue of Commons) తరపున వారి వకీలు (Clerk) ప్రభుత్వమునకు కావింపవలసిన విన్నపములను సిద్ధము చేసెడివాడు. రాజుగారి తరఫున పై విన్నపములకు తెలుపబడిన అభ్యంతరములకు కూడ అతడే సమాధానములు వ్రాసెడివాడు. మూడవ ఎడ్వర్డురాజు కాలమందే పార్లమెంటుసభ రెండు శాఖలుగ విడిపోయెను. జమీందారీ వర్గమువారు తాము రాజునకు సలహాదారులమని భావించి, ప్రభుత్వమువారు సమస్త విషయముల గూర్చి తమతో ప్రత్యేకముగ సంప్రతించవలెనని తీర్మానించుకొనిరి. 1343 వ సంవత్సరమునందు ఉన్నత మతాధి

కారులును, జమీందారులును, వెస్టుమినిష్టరునందలి White Chamber అనబడు సభా భవనములో ప్రత్యేకముగ సమావేశమైరి. చిన్న తరహా భూస్వాములును, పట్టణముల ప్రతినిధులును అదే భవనమున మరియొక భాగములో కలిసికొని ఆనాటి కార్యక్రమమును గూర్చి సమాలోచనలు జరిపిరి. 1376 వ సంవత్సరమున సమావేశమైన Good Parliament అను ప్రజాప్రతినిధి సభ ప్రజాపరిపాలన యందొక ముఖ్య సాంప్రదాయము నేర్పాటు చేసెను. ఇంగ్లాండు దేశమున ప్రభుత్వము రాజుగారి పేర నడచినను, ఆ ప్రభుత్వ నిర్వహణమునకు బాధ్యులు ప్రభుత్వాధికారులు లేక మంత్రులు. వీరే రాజునకు సలహాదారులు. కావున రాజ్యకార్య నిర్వహణము నందేదైన లోపము ఉత్పన్నమైనచో, దానికి కారణ భూతులు మంత్రులే యనునది ప్రజాపరిపాలనలో ఒక ముఖ్య సూత్రము. రాజకార్య నిర్వహణమును చక్కగ కావింపని ఉద్యోగులు నిందార్హులు. వారి యందలి లోపముల నిరూపించి, గర్హించి, వారిని శిక్షకు పాత్రుల కావించుట వలన మంత్రులు పార్లమెంటు సభకు వశ్యులై యుందురు. ఈ విధముగ రాజోద్యోగుల చర్యలను గర్హించుట Impeachment అని పిలువ బడుచున్నది. Good Parliament సభయందు ఈ ఆచారము ప్రారంభమయ్యెను. 1375 వ సంవత్సరము నాటికి ఫ్రాన్సు దేశములో ఆంగ్ల సేనల ప్రతిభ క్షీణించెను. మూడవ ఎడ్వర్డు రాజు, నల్ల యువరాజుల విజయముల వలన ఆంగ్లేయులకు కల్గిన రాజ్యలాభము పూర్తిగ

క్షీణించెను. పార్లమెంటు సభ వారికి కిది చాల ఆగ్రహకారణ మయ్యెను. ఆ కాలమున రాజ్యకార్య నిర్వహణ మంతయు, లంకాస్టరు ప్రభువు హస్తగతమై యుండెను. ప్రజా ప్రతినిధి సభ వారికి ఈ రాజువారుని సూటిగ నిందించుటకు ధైర్యము చాల లేదు. కావున లంకాస్టరు ప్రభువునకు సలహాదారులైన Lord Latimer, Richard Lyons అను వారిపై పార్లమెంటు సభ వారి ఆగ్రహమంతయు కేంద్రీకృత మయ్యెను. వీరు లంకాస్టరు ప్రభువున కత్యంతము ప్రీతిపాత్రులు. ప్రజలు పడుచున్న కష్టముల నదనుగా చూచుకొని వారు బాగుగా ధనము నార్జించి యుండిరి. ప్రజాప్రతినిధులు లంకాస్టరు ప్రభువు మిత్రులపై నిందారోపణ కావించి, వారిని దోషులుగ నిర్ణయించి, వారి నుద్యోగ పదవులనుండి తొలగించిరి. ప్రజా ప్రతినిధులకు నాయకుడైన Peter de la Mare అను నాతడు ఆనాటి కామన్సు సభకు అధ్యక్షుడుగా కూడ నుండెను. ఆంగ్ల పార్లమెంటులోని ప్రజాప్రతినిధి సభకు నాయకుని Speaker అని పిలతురు. Speaker అనగా ప్రసంగము కావించు వాడు లేక వక్తయని యర్థము. కాని ఈనాటి Speaker సాధారణముగ నెట్టి ప్రసంగమును చేయడు. ఆతడు ప్రజాప్రతినిధి సభ కధ్యక్షత వహించి, నిష్పక్షపాతముగ సభా కార్యక్రమమును నడపుచు, తన యభిప్రాయము చొప్పున తీర్పుచెప్పును. ఈనాటి రాజకీయ పరిభాషలో Speaker అనగా మౌనియైన సభాధ్యక్షుడని యర్థము. కాని 14 వ

శతాబ్దమున కామన్సుసభ కధ్యక్షుడైన Peter de la Mare అను నాతడు ప్రజా ప్రతినిధుల పక్షమున వాద వివాదముల సాగించెను. ప్రజా ప్రతినిధుల తీవ్రభావముల గుర్తించి, లంకాష్టరు ప్రభువు తన మిత్రులైన Lord Latimer, Richard Lyons గార్లను రక్షించుటకు పూనుకొనలేదు. ఈ మంత్రులు తమ పదవులను గోల్పోయి, అవమానము పొందిరి. ఆ మరుసటి సంవత్సరము అనగా 1377 నందు లంకాష్టరు ప్రభువు తన యధికారమును పునః బలపరచుకొనెను. పార్లమెంటు సభలో ఆయన కిష్టులైన సభ్యులు మాత్రమే ప్రవేశించిరి. ఈ యదను చూచుకొని, లంకాష్టరు నాయకుడు తన మిత్రులైన మంత్రులను మరల పదవిలో నియమించుటయే కాక, తనకు శత్రువగు Peter de la Mare ను కారాగారములో నిర్బంధించెను. అయినను Good Parliament సభవారు ఏర్పాటు చేసిన సత్సాంప్రదాయము నశించి పోలేదు. ప్రజల యాగ్రహమునకు గురియైన మంత్రులను Impeachment అను పద్ధతి ద్వారా అధికారమునుండి తొలగించు పద్ధతి ఆంగ్ల రాజ్యాంగ విధానములో శాశ్వతముగ నిలచి పోయెను. ఈ పద్ధతి ప్రకారము నిందాపాత్రుడైన వ్యక్తిని (సామాన్యపౌరుడు కాని, ఉన్నత వంశీకుడు కాని) ప్రజా ప్రతినిధి సభవారు నిందార్హునిగ నిర్ణయించి, అతనిని గూర్చిన అభియోగమును ప్రభువుల సభవారి యెదుట విచారింతురు. భారతదేశమున మొదటి గవర్నరు జనరలుగా పనిచేసి, గొప్ప ప్రఖ్యాతిని

సంపాదించిన, వారన్ హేస్టింగ్సు అను ఉన్నతోద్యోగిని, ఎడ్మండు బర్కు (Edmund Burke) అను ప్రసిద్ధ పార్లమెంటు సభ్యుని యాజమాన్యమున ఆంగ్ల ప్రజా ప్రతినిధి సభవారు దోషిగ భావించి, ప్రభువులసభ మ్రోల విచారణ గావించిరి. 18 వ శతాబ్దినాటి యీ సంఘటన చరిత్ర ప్రసిద్ధిని గాంచినది.

---

ఎనిమిదవ ప్రకరణము

# ఇంగ్లాండు దేశములో అల్లకల్లోలము

## రెండవ రిచర్డురాజు (1377 - 1399)

ప్రసిద్ధుడైన మూడవ ఎడ్వర్డు 1377 వ సంవత్సరమున మరణించెను. అంతకు పూర్వమే విఖ్యాత వీరుడైన ఆతని జ్యేష్ఠపుత్రుడు నల్ల రాకుమారుడు కాలధర్మము చెందెను. Black Prince కుమారుడైన రిచర్డు అను బాలుని ఆంగ్ల ప్రజలందరును తమ రాజుగ అంగీకరించిరి. అల్ప వయస్కుడైన ఈ ప్రభువు సింహాసన మధిష్ఠించుటయే తడవుగ దేశమం దల్లకల్లోలములు ప్రారంభ మయ్యెను. రాజ్య పరిపాలనమునందు రాజు తమ సలహాలు విధిగ పాటింపవలెనను సాంప్రదాయమును దృఢపరచుటకై జమీందారీవర్గము మరల పూనుకొనెను. వీరి యత్నములు రాజునకును జమీందారులకును నడుమ తీవ్ర విభేదములకు కారణ మయ్యెను. రాజు తన యనుచర వర్గములోని పెద్దపెద్ద జమీందారుల వద్దనుండి సైన్య సహాయమును పొందుటకు మారుగ వారి వద్దనుండి ధనమును స్వీకరించి, స్వయముగ సేనల సంసిద్ధము చేసికొనసాగెనని ఈ వరకే తెలుపబడినది. ఈ సూత్రమునే అనుసరించి పెద్ద భూస్వాములు తమ యనుచరులైన చిన్న భూస్వాముల వద్దనుండి ధనమును వసూలు చేసి, స్వంత సేనలను ఏర్పాటుచేసికొను పద్ధతి సర్వత్ర వ్యాపించెను. ఈ విధముగ రాజును, జమీందారులును కూడ ఎవరి

సేనలను వారు తయారు చేసికొని, స్వల్పకారణములపై ఒండొరులపై కత్తులు దూయుటకు సిద్ధమై యుండిరి. ఈ పరిస్థితి దేశ క్షేమమునకును. శాంతి భద్రతలకును చాల ప్రమాదముగ పరిణమించెను. ఇది యిట్లుండగా పార్లమెంటు సభవారి భావములకును రాజుగారి యాశయములకును ఎంత మాత్రమును పొత్తు కుదరలేదు. క్రెసీ, పాయిటీర్సు రణ విజయముల వలన ఆంగ్లేయులయం దపారమైన ఆత్మవిశ్వాస మంకురించెను. తమ్ము జయింపగల సేనలు ప్రపంచమున నెచ్చటను లేవని వారు సహేతుకముగ గర్వింపజొచ్చిరి. తమ రాజులు ఫ్రాన్సు దేశముపై మరల మరల దాడులుసల్పి గొప్ప విజయముల సాధింపవలెనని పార్లమెంటు సభవారు అభిప్రాయ పడసాగిరి. రాజు లిట్టి దండయాత్రలు సాగించుట కెల్లప్పుడును సంసిద్ధులే. కాని అందులకు కావలసిన ధనమును చూపవలసినదిగ వారు కోరునరికి పార్లమెంటు సభ్యులకు దేహముపై తేళ్ళు జెఱ్ఱులు పాకినట్లుండెడిది. ధనమును మంజూరు చేయుట వారి కెంత మాత్రమును మనస్కరించెడిది కాదు.

ఇది యిట్లుండగా నల్లజాడ్యము వలన ఆంగ్ల సామాజిక. ఆర్థిక రంగములలో విప్లవాత్మకమైన మార్పులు సంభవించెను. ఇట్టి మార్పులు సహజముగ సమాజమునం దల్లకల్లోలములకు కారణమగును. మధ్యమ యుగమునం దైరోపా ఖండమునం దంతటను వ్యాపించియున్న ఫ్యూడలు (జమీందారి) విధానము

నందు, భూఖామందులు పెద్దపెద్ద క్షేత్రముల (Manor) నేర్పాటు చేసికొని, వానిలో తాము స్వయముగ నివసించుచు, బానిసల (Serfs) చే వ్యవసాయము సాగింపజొచ్చిరి. ఈ బానిసల హక్కులు బాధ్యతలు మున్నగునవి చిరకాలానుగతమైన సాంప్రదాయముల వలన ఏర్పడియుండెను. వీనిని గూర్చి ఏవైన అభిప్రాయ భేదము ఉత్పన్నమైనచో వానిని గూర్చి తీర్పు చెప్పుటకు క్షేత్రము (Manor) నందే న్యాయస్థానము లేర్పడియుండెను. దేశము సుభిక్షముగనున్న కాలమున ఈ బానిసలు తమ యజమానుల యనుమతితో విడుదలపొంది, ఇతర ప్రాంతములకు కూలినాలి చేసికొనుటకై వెడలిపోయెడివారు. కాని నల్లజాడ్యము (Black Death) కారణముగ ఇంగ్లాండు దేశమునందలి వ్యవసాయదారులలో సుమారు మూడవవంతు నశించిరి. కూలినాలి చేసికొని, జీవించువారు కూడ వేలకొలది మరణించిరి. చిరకాలమునుండి సాగుబడిలో నున్న వ్యవసాయపు భూము లెన్నోవేల యెకరములు నిరర్థకముగ నుండిపోయెను. హతశేషులైన వారు ఇతరుల భూముల నాక్రమించుకొని, అందత్యంత సారవంతమైన వానిలో మాత్రమే వ్యవసాయమునకు పూనుకొనిరి. ఇక వ్యవసాయపు కూలీలకు ఏర్పడిన గిరాకీ వర్ణించుటకే వీలులేదు. వారిసంఖ్య క్షీణించినందున భూస్వాములు కూలీల కొరకై తహతహ లాడసాగిరి. కూలీల జీతనాతములు విపరీతముగ హెచ్చిపోయెను. ఈ పరిస్థితులు భూస్వాములకు చాల కంటకముగ తోచెను.

కూలీలకు హెచ్చు జీతముల నిచ్చుటకు వారి కెంతమాత్రమును మనస్కరింపలేదు. తమ వ్యవసాయ క్షేత్రములలో చిరకాలము నుండి బానిసలుగ పని చేయువారి వంశములలోని వారెల్లరును తమ బానిసలే యనియు, వారికి విడుదల ఈయజాలమనియు, ఈ బానిసలు నల్ల జాడ్యమునకు పూర్వము వాడుకలో నున్న కూలినాలి మాత్రమే తీసికొని, తమ క్షేత్రములలో పని చేయవలెననియు జమీందారీ వర్గమువారు వాదింపసాగిరి. భూఖామందులలో చాలమంది క్రైస్తవ మతాధికారులు కూడ ఉండుట గమనింపదగిన యంశము. మతాధికారులు కూడ వ్యవసాయపు కూలీల యెడల మిక్కిలి కాఠిన్యముతో వర్తించెడివారు. ఈ కథాకాలమున పార్లమెంటు సభ భూస్వాములకు కేంద్రముగ నుండిన యంశము వేరుగ తెలుప నక్కరలేదు. 1349 వ సంవత్సరమున పార్లమెంటు సభ వారొక శాసనము కావించి, వ్యవసాయపు కూలీలు నల్ల జాడ్యమునకు పూర్వము అమలులో నున్న కూలీ, అనగా దినమునకు రెండు షిల్లింగులు మాత్రమే పొందుటకు అర్హులనియు, ఇంతకంటె హెచ్చు కూలీని కోరువారు కారాగారశిక్షకు పాత్రు లగుదురనియు, నిర్ణీతమగు రేటును మించి కూలీనిచ్చు ఖామందులపై జుర్మానా విధింపబడుననియు ఆజ్ఞాపించిరి. 1351 వ సంవత్సరమున మరియొక కార్మిక శాసనము కావింపబడెను. 1349 నాటి శాసనము నతిక్రమించు వారికి ఈ నూతన శాసనము హెచ్చు శిక్షలను విధించెను. 1357, 1360 సంవత్సరములలో కూడ కార్మిక శాస

నములు కావింపబడెను. వస్తువుల ధరల నడుపులో పెట్టిన పతు మున, కూలీలు హెచ్చు వేతనముల నడుగరని నిశ్చయించి, పై నాలుగు కార్మిక శాసనములును కూడ, ధరవరలను సమంజసమైన పద్ధతిలో నిర్ణయించుటకును, ఆ ప్రకారము ధరల నములు కావించుటకును స్థానిక సంఘముల నియమించెను. కాని అత్యంత క్లిష్టమగు ధరల నిర్ణయమను సమస్యను ఈనాటి రాజ నీతిజ్ఞులు కూడ విజయవంతముగ పరిష్కరింప జాలకున్నారనిన పదునాల్గవ శతాబ్ది నాటి శాసనకర్తలిందు కృతకృత్యులు కాలే దని వేరుగ తెలుప నవసరములేదు. పార్లమెంటు సభవారి శాసనములు కూడ దేశమందలి ఆర్థిక పరిస్థితులను, తత్పరి ణామములను పూర్ఛజాలక పోయెను. వ్యవసాయపు కూలీలు హెచ్చు వేతనములు లేకుండ పనిచేయుటకు నిరాకరించిరి. వీరి బాధలు పడలేని యజమానులు వేరువేరు మార్గములను అవలం బింప సాగిరి. కొందరు యజమానులు తమ వద్దనున్న బానిస లకు స్వాతంత్రమునిచ్చి, ఇతర కూలీలద్వారా తమ వ్యవసాయ మును సాగింప దొడగిరి. మరికొందరు భూములను స్వల్పకాలము కొరకు కౌళ్ళకిచ్చు పద్ధతిని మొదలుపెట్టిరి. భూములను ఒక్క సంవత్సరమునకు మాత్రము కవులుకిచ్చు పద్ధతివలన కౌలుదారు భూస్వామందుకు లోబడి, సంపూర్ణముగ అతని చెప్పుచేతలలో నుండగలడని భావము. ఎవరేమి చేసినను ప్రజలలో అశాంతి తగ్గలేదు. పార్లమెంటు సభవారు వ్యవసాయ కూలీల వేతనము లను, జీవితావసర వస్తువులధరలను, నిర్ణయించి, వానిని అమలు

జరుపుటకై ప్రయత్నించి శాసన విరుద్ధముగ వర్తించిన వారికి శిక్షలను నిర్ణయించిరని ఈవరకే తెల్పినాము. ఇట్టి నేరముల విచారించుటకై మధ్య తరగతులకు చెందిన భద్రపూరుషులు నియమితులైరి. ఈ న్యాయాధీశులు కూడ చిన్న చిన్న భూఖామందులను విషయమును మనము గుర్తుపెట్టుకొన వలెను. 1351—1377 వ సంవత్సరముల నడుమ పూర్వోదాహృత శాసనముల ధిక్కారము కావించిన నేరమునకై తొమ్మిది వేలమంది నిందితులు న్యాయస్థానములలో హాజరు కావలసివచ్చెను. కొన్ని ప్రాంతములలో ప్రజలు పై న్యాయాధికారులపై కినుక చెంది, వారిపై దాడులు కావించిరి. ఈ విధముగ భూఖామందులకును, వ్యవసాయ కూలీలకును నడుమ నేర్పడిన తీవ్ర వైషమ్యములవలన దేశమం దెల్లెడల తీవ్రమగు అశాంత పరిస్థితు లేర్పడెను.

ఈ సందర్భమున మరియొక అంశముకూడ ముఖ్యముగ గమనింపదగి యున్నది. నల్లజాడ్యము వలన ప్రాణనష్టమునకును, ఇతర నష్టములకును గురియైన వారిలో క్రైస్తవ పాదిరీలు కూడ చేరియుండిరి. వీరు క్రైస్తవమత సంఘమునందు స్వల్ప వేతనములు పొందుచు, ప్రజల ధార్మిక జీవనమును సన్మార్గమున నడుపుటకును, మత ప్రచారము కావించుటకును నియమితులై యుండిరి. మహామారి ఇంగ్లాండు దేశమున వ్యాపించిన కాలమున ఒక్కొక్క జిల్లాలో నూర్లకొలది పాదిరీలు మరణించిరి. ప్రాణములు దక్కించుకొని, బయటపడిన

వారి గతి చాల దుర్భరముగ పరిణమించెను. ధరవరలు విపరీతముగ పెరిగిపోయెను. కాని పాదిరీల జీతభత్యములు గొప్ప తోకవలె, ఎదుగు బొదుగు లేక యథాతథముగ నుండ జొచ్చెను. క్రైస్తవ మత సంఘమందలి ఉన్నతాధికారులు తమ సహకార్యకర్తలైన ఈ పేదపాదిరీల కష్టనిష్ఠురముల నెంత మాత్రమును యోచించెడివారు కారు. ఇందువలన పాదిరీలలో కూడ అశాంతి హెచ్చెను. వారిలో కొందరు దౌర్జన్య చర్యలకు పూనుకొనిరి. మరికొందరు సంతలు, సంబరములు, జరుగు ప్రదేశములకు పోయి, ప్రజాసీకమునందు అశాంతిని రేకెత్తించు ఉద్రేక పూరిత ప్రసంగముల చేయసాగిరి. మరికొందరు నేటి సామ్యవాద సిద్ధాంతములను శతాబ్దములకు పూర్వమే ఊహించిరి. ప్రపంచమందలి భోగ్య పదార్థము లన్నియు, పరమేశ్వరుడు మానవులెల్లరు సమానముగ అనుభవించగలందులకై సృష్టించెననియు, కనుక బీద బిక్కి ప్రజకు కూడ ధనాఢ్యులతో సమముగ జీవితావసరములు లభింపవలెననియు బోధించిరి. "ఈ క్రైస్తవ కమ్యూనిష్టులు ప్లేటో (గ్రీకు తత్వజ్ఞుడు). సెనీకా (రోమను కవి) గార్లు తమ వాదముల కనుకూలముగ బోధించినట్లు తెల్పుచున్నారు. ఇది పచ్చి అబద్ధము" అని ఆనాటి కవులలో ఒకడైన Langland అను నాతడు తన గ్రంథములలో విమర్శించెను. సమాజ వ్యవస్థను తారుమారు చేయుటకై John Ball వంటి కొందరు తీవ్రవాదులు పూనుకొనిరి. ధనికవర్గమును కూలద్రోయుటయే ప్రధాన లక్ష్యముగ పెట్టుకొనిన వీరు. ఒక

విధముగ వర్గద్వేషమును పెంపుచేయసాగిరి. ఫ్రాన్సుదేశము నందలి యుద్ధములలో పాల్గొని, అంగ వైకల్యము పొందిన పెక్కండ్రు సైనికులు దేశమందంతటను వ్యాపించిరి. ధనుర్ధరు లైన సామాన్యయోధుడు కవచధారులైన పెక్కండ్రు జమీం దారులను నేలకూల్చుట వారు కండ్లతో చూచియుండిరి. ఫ్రాన్సు దేశమున సంభవించిన సంఘటనలు ఇంగ్లాండు దేశమున కూడ పునరావృత్తము కావచ్చునని వారికి ధైర్య మేర్పడెను. మానవజాతి యంతయు సమానమను విప్లవభావము సర్వత్ర వ్యాపించెను. ఆనాటి జానపద గేయములలో ఈ ప్రశ్న తీవ్ర ముగ ప్రతిధ్వనించెను.

When Adam delved and Eve span
Who was then a gentleman ?

క్రైస్తవమత సిద్ధాంతము ప్రకారము ఆదమ్ ఈవ్‌గారలు ఆదిమ దంపతులు. వా రత్యంత సరళమగు జీవనము గడపెడి వారు. ఆదమ్ నాగలి పూని వ్యవసాయము చేయగా, భార్య యైన ఈవ్ ఏకులు వడకెడిది. క్రైస్తవ ప్రపంచమున ఆనాడు సర్వత్ర అంగీకృతమైన భావమును మనస్సులో నిడికొని, ఈ జానపద గాయకుడు ఆదికాలమున జనులందరును సమానులే కదా! అప్పుడు గొప్ప తరగతులు, తక్కువ తరగతులు అను భేద మెక్కడిది? అని ప్రశ్నించెను. జమీందారులు, భూఖా మందులు, వ్యవసాయదారులు, కూలీలు, బానిసలు అను విభేద ములతో నిండియున్న పదునాల్గవ శతాబ్ది ఆంగ్ల సమాజము,

ఈ విప్లవాత్మక భావములచే గడగడ లాడిపోయెను. ఇట్టి భావములే ఐరోపా ఖండమునందు ఇతర దేశములలో కూడ వ్యాపించెను. నల్లజాడ్యపు పరిణామములును, నిరంతర యుద్ధములును, సమాజమునందు సర్వత్ర ఇంచుమించు ఒకే భావ విప్లవము కల్పించెను.

ఆంగ్ల సమాజమునందలి ఈ అశాంతి తుదకు 1381 వ సంవత్సరమునందు అగ్నిపర్వతము పగిలినట్లు ఒక తిరుగుబాటు రూపమున ప్రజ్వరిల్లెను. ఇంగ్లాండు నందలి దక్షిణ ప్రాంతము నందును, మధ్యజిల్లాలలోను, తూర్పు ప్రాంతములలోను కూడ ఈ అల్లరులు వ్యాపించెను. జనానీకము పన్నుల నిచ్చుటకు నిరాకరించెను. అసంతృప్తితో నిండియున్న వీరు దౌర్జన్య చర్యలకు కూడ పూనుకొనిరి. అచ్చటచ్చట క్రైస్తవ దేవాలయములపై దాడులు సాగెను. జమీందారీ క్షేత్రములలో చిరకాలముగ జాగ్రత్త పెట్టబడిన భూమిశిస్తు కవిలెలు పరశురామ ప్రీతి యయ్యెను. John Ball అను నాతని ఈ తిరుగుబాటుదారులు కైదునుండి విడిపించిరి. ఈ మూకలకు Wat Tyler అను నాతడు నాయకత్వము వహించెను. వీరందరును లండను నగరమును చేరుటకై పయనించి పోయిరి. ఈ ఈ తిరుగుబాటుదారుల చర్యలు ప్రభుత్వమునకు తెలియక పోలేదు. కాని అపూర్వమైన ఈ సంఘటన నెట్లు ఎదుర్కొనవలెనో తెలియక వారు దిగ్భ్రాంతి చెంది యూరకుండిరి. తిరుగుబాటుదారులు లండను నగరమును ప్రవేశించి, మూడు

దినముల వరకును అచ్చట భీతావహము వ్యాపింప జేసిరి. పెక్కండ్రు విదేశీయులు వధింప బడిరి. రాజ్యాంగ సభయందలి ఇద్దరు ముఖ్య సభ్యు లురితీయబడిరి. వీరిలో ఒకడు రాజ కోశాధికారి. రెండవ యాతడు Archbishop of Canterbury. ఈ కాంటర్బరీ మతాధికారి ఇంగ్లాడు నందలి క్రైస్తవ మత పీఠమునకు అధిపతి. మతవిషయము లన్నిటిలో ఈతడే అత్యున్నత గురువు. పాపు మీయును గారిని కూడ తిరుగుబాటు దారులు లక్ష్యపెట్ట లేదు. రాజు గారి పినతండ్రియు, వృద్ధుడును అయిన లంకాస్టరు ప్రభుని భవనములలో నొకటి దగ్ధము కావింప బడెను. లండను నగరములోని కొన్ని పేటలను తిరుగుబాటుదారులు దోచుకొనిరి. పాత పగలు తీర్చుకొనుట కిదియే తరుణమని భావించి, ఈ అల్లరిమూకల నాయకులు తమకు శత్రువులని తోచినవారి పేర్లను జాబితాగా వ్రాసికొని, ఒక్కరొక్కరినే పరిమార్చుటకు పూనుకొనిరి. ఈ విధముగా లండను నగరము నెల్లెడల కల్లకల్లోలము వ్యాపించిన తరువాత, లండను పౌరులు తమ నగరాధ్యక్షుని (Mayor) యాజమాన్యమున ఆత్మరక్షణకై పూనుకొనిరి. బాలరాజైన రెండవ రిచర్డు తన అంగరక్షకులతో కూడి, తిరుగుబాటుదారుల నాయకు లతో సంప్రతింపులు సాగించుటకై వెడలివచ్చెను. తిరుగుబాటు దారులలో రాజుగారియెడ సంపూర్ణమగు భక్తి శ్రద్ధ లుండెను. వారి కోరికలుకూడ మిక్కిలి సమంజసముగనే ఉండెను. కూలీల వేతనములు హెచ్చింపరాదని నిషేధించు శాసనములను రద్దు

చేయవలెననియు, బానిసతనమును రద్దుచేయవలె ననియు, క్రైస్తవ మత సంఘమునకు చెందిన ఆస్తులను జప్తుచేసి, వానిని పేదజనులకు పంచి ఈయవలెననియు, తిరుగుబాటుదారులు రాజు నర్థించిరి. ఆ కాలపు భావములదృష్ట్యా ఈ కోరిక లెంత మాత్రమును అంగీకార యోగ్యములు కావు. రాజున కేమి సమాధాన మీయవలెనో తోచక ముందు వెనుకలు చూడ సాగెను. అట్టి పరిస్థితిలో తిరుగుబాటుదారుల దురదృష్ట వశమున వారి నాయకుడైన Wat Tyler రాజుగారి అంగరక్షకులచే చంపబడెను. అట్టి ప్రమాద సమయమున ఎట్టి భయంకర సంఘర్షణలు చెలరేగెడివో తెలుపజాలము. కాని బాల రాజు ధైర్యముగ ముందునకు సాగివచ్చి, తిరుగుబాటుదారులకు తాను నాయకత్వము వహించెదనని ఎలుగెత్తి చాటెను. కాని నాయకుడులేని ఈ అల్లరిమూక ఉత్సాహమును కోల్పోయి, వెనుకకు మరలిపోయెను. తమతమ స్థానములకు మరలిపోయి, వీరు యథాప్రకారముగ దౌర్జన్య చర్యలను సాగింపజొచ్చిరి. అంతట ప్రభుత్వాధికారులు తీవ్రమగు ప్రతీకార చర్యల నవలంబించిరి. తిరుగుబాటుదారుల నందరను ప్రభుత్వ న్యాయస్థానములు కఠినముగ దండింపజొచ్చెను. కొన్ని మాసముల కాలములో అల్లరులు పూర్తిగ అణగిపోయెను. భూస్వాములకేర్పడిన ప్రమాదము తొలగెను. పూర్వ కాలమునాటి వ్యవసాయ క్షేత్రములు యథాతథముగ మరల నెలకొనెను. ఈ విధముగ తమ ఆస్తిపాస్తులను కాపాడుకొని,

పార్లమెంటు సభలోని సభ్యులు 1382 వ సంవత్సరమున తిరుగు బాటుదారుల నందరిని క్షమించుచు శాసనము కావించిరి. కాని జమీందారీ వర్గమువారి మనస్సులో అదటు మాత్రము పోలేదు. ఎప్పుడు మరల ప్రమాద పరిస్థితు లేర్పడునోయని వారు ప్రాణము లరచేతిలో పెట్టుకొని మెలగసాగిరి. పేద కూలీలు తమ కోర్కెలను విడచిపెట్టలేదు. వారు సంఘములుగ నేర్పడి బానిసతనమునకు విరుద్ధముగ పనిచేయసాగిరి. క్రమముగ బానిసతనము రద్దుపడెను. యజమానులవద్ద నిర్బంధముగ పనిచేయుటకు మారుగ బానిసలు ధనము చెల్లించు పద్ధతి నేర్పాటు చేసికొనిరి. ప్రజలపై ప్రభుత్వమున కవిశ్వాసము ఘనీభవించెను. క్రైస్తవ మత సంఘ మించుమించుగ అందరి ప్రజల యాగ్రహమునకు గురి అయ్యెను. మతాధికారులు సేకరించుకొనిన పెద్ద పెద్ద ఆస్తులయెడ సామాన్య ప్రజల కసూయ యేర్పడెను. ఈ ఆస్తులను విచ్ఛిన్నము కావించి, పేదసాదలకు పంచి యీయవలెనని వారు కోరసాగిరి. జమీందారులకు క్రైస్తవ మతసంఘములో చిన్న తరగతి పాదిరీలపై విద్వేషము ప్రబలెను. అందును ముఖ్యముగ **John Wyclif** అనుయాయులపై ఆగ్రహము బాగుగా వ్యాపించెను. వీరు తమ సంస్కరణాభిలాషతో పాటు, సామ్యవాద సిద్ధాంతముల కూడ వ్యాపింప జేయుచున్నారనియు, అందువలననే "**Peasants Revolt**" (వ్యవసాయదారుల తిరుగుబాటు) వంటి అనర్థములు సంభవించుచున్నవనియు, భూస్వా

ములు భావింపసాగిరి. ఈ భావములే రెండవ రిచర్డు రాజు అనంతరము అధికారము పూనిన నాల్గవ హెన్రీకాలములో, విక్లిఫ్ సంస్కర్త అనుయాయులైన Lollards లకు విరుద్ధముగ తీవ్రమైన శాసనములు కావింపబడుటకు హేతువయ్యెను.

విక్లిఫ్ సంస్కర్త నడపిన మత సంస్కరణోద్యమమును, వ్యవసాయదారుల తిరుగుబాటును వర్ణించిన పిమ్మట రెండవ రిచర్డురాజు రాజ్యకాలమున ప్రత్యేకముగ తెలుపదగిన యంశములు కానరావు. మధ్యమ యుగమందు ఇంగ్లాండు దేశమున నిరంతరమును, రాజునకును, ఆయన అనుచరులైన జమీందారులకును సంఘర్షణ జరుగుచు వచ్చెడిది. రాజునకు తాము సహజముగు సలహాదారుల మను సూత్రమును ప్రయోగించి, రాజ్యాంగ వ్యవహార నిర్వహణను తమ తమ హస్తగతము కావించుకొనవలెనని జమీందారులు తాపత్రయ పడెడివారు. తమ యుద్దేశ్యముల నెరవేర్చుకొనుటకై వారు పార్లమెంటు సభను సృష్టించిరి. ఈ సభ వారి యధికారములు క్రమక్రమముగ నెట్లు వికాసము చెందెనో స్థలాంతరమున తెలుపబడినది. ఈ వంక రాజుకూడ రాజ్యాంగ వ్యవహార నిర్వహణమును సంపూర్ణముగ తన చేతియందే నిక్షిప్తము కావించుకొనవలెనని సర్వ విధముల కృషి సాగించెడివాడు. సాంప్రదాయము చాల వరకు రాజునే సమర్థించెను. పరిస్థితుల ప్రాబల్యము రాజునకు తరచుగ నిరంకుశాధికారముల స్వీకరించుచుండెడిది. అయినను వివేకవంతులును, దూరదృష్టిపరులును, ధర్మపరులును అగు

రాజులు - మొదటి ఎడ్వర్డువంటి వారు - ప్రజాప్రతినిధి సంస్థయైన పార్లమెంటు సభను ఇష్టపూర్వకముగ పెంపు కావించిరి. పార్లమెంటుసభ నామకార్థము ప్రజాప్రతినిధి సభయేయైనను ఇందు జమీందారుల ప్రతినిధులు, వర్తకులు, మధ్యతరగతి భూస్వాములును మాత్రము ఉండెడివారు. ప్రజానీకమునం దధిక సంఖ్యాకులైన వ్యవసాయ కూలీలు, బానిసలు, నిరుపేదలు మున్నగు వారికి పార్లమెంటు సభలో యెట్టి స్థానమును ఉండెడిది కాదని మనము స్పష్టముగ గ్రహింపవలెను. ఈ ప్రజాప్రతినిధిసభ ఎంత ప్రాతినిధ్య రహితముగ నున్నను, అయ్యది ఆంగ్లజాతి నంతను తనలో ఇముడ్చుకొని యున్నట్లు ఆ కాలపు రాజులును, జమీందారీ వర్గము వారును భావించుచు వచ్చిరి. ఈ కారణముచే ఆ కాలమునాటి రాజులు తమ నిరకుంశ పరిపాలనకు సహాయభూతముగ నుండుటకై పార్లమెంటు సభను తమవంకకు త్రిప్పుకొనుటకై యత్నించెడివారు. "శంఖములో పోసినకాని తీర్థము కా"దను నొక సామెత మనలో తరచుగ వాడబడుచున్నది. పార్లమెంటు సభవారి యామోదమును పొందని యెట్టి నిర్ణయమును ధర్మబద్ధమగు శాసనము కాజాలదను భావము నా కాలమువారు సార్వత్రికముగ సంగీకరించిరి. ఈ భావము ననుసరించి, రెండవ రిచర్డురాజు కూడ వర్తించెను.

రెండవ రిచర్డురాజు చాల విచిత్ర ప్రవృత్తి కలవాడు. ఇతడు చాల బుద్ధిశాలి. అఖండమైన నేర్పుతో ఉపన్యాసములు చెప్ప గలవాడు. అవసరమైన పక్షమున సంవత్సరముల తరబడి,

ఓరిమితో తలవంచుకొని అవమానముల సహించి యూరకుండ గల నైజము కలవాడు. కాని పరులు తనకు కావించిన అప చారముల నీత డెన్నడును మరువడు. ఈతనిది పాముపగ. చిర కాలముగ తాను ఆత్మీయులుగ భావించినట్లు నటించుచు వచ్చిన వారిని క్షణములో ఈతడు మట్టిపాలు చేయగల క్రూర ప్రవృత్తి కలవాడు. మొత్తముమీద ఈతడు వివేకశూన్యుడని తెలుప వలసి యున్నది. తనకు నిజమైన మిత్రు లెవ్వరో శత్రు లెవ్వరో ఈ రిచర్డురాజు గ్రహింపజాలక, బాధ్యతారహితమును, చపల మును అగు ప్రవర్తనచే అందరిని కూడ తనకు శత్రువులుగ కావించుకొని, తుదకు రాజ్యాధికారమును ప్రాణములను కూడ కోల్పోయెను. మొదటి పర్యాయము ఈ బాలరాజుపై జమీం దారీ వర్గమువారు 1388 వ సంవత్సరమున తిరుగుబాటు కావిం చిరి. రాజు తన కిష్టులైన కొందరు మిత్రులను గొప్ప అధికార పదవులలో నియమించి, రాజ్యాంగ నిర్వహణము కావించుట జమీందారులకు అంగీకారము కాలేదు. అంతేకాక రాజు భోగ లాలసు డనియు, ఫ్రాన్సు దేశముతో యుద్ధము సాగించి, విజ యోచితముగ వర్తింపలేదనియు వారు తమ నేలికపై నేరము మోపిరి. జమీందారుల యొత్తిడి వలన రిచర్డు రాజు తన మిత్రుల నధికార పదవులనుండి తొలగింపవలసి వచ్చెను. కాని ఈ విధముగ రాజుగారిపై ఒత్తిడి కావించి, రాజ సేవకులలో మార్పిడి కావించుట అశాస్త్రీయమని ఆనాటి ఇంగ్లాండు ప్రధాన న్యాయమూర్తియు మరి నలుగురు న్యాయమూర్తు

లును ప్రకటించిరి. కాని ఫలితము లేదయ్యెను. రాజును, జమీందారీ వర్గమువారును, సేనలను సేకరించుకొని, యుద్ధ సన్నద్ధులైరి. జమీందారుల పక్షము వహించిన వారిలో Henry Bolingbroke అను ఉన్నత వంశీయుడైన యువకు డొకడు. ఈ హెన్రీ రిచర్డురాజు పినతండ్రియైన లంకాస్టరు ప్రభువు కుమారుడు. చాల సమర్థుడు. యుక్తిపరుడు. దూరదృష్టి కలవాడు. 1387 వ సంవత్సరమున జరిగిన యుద్ధములో రాజు పక్షము సంపూర్ణముగ ఓడిపోయెను. రాజు జమీందారుల చేతులలో బందీగ చిక్కెను. రాజును పదిపూర్చవలెనని పలువురు వృద్ధ నాయకులు పట్టుపట్టిరి. కాని యువకుడైన Henry Bolingbrokeను, ఇతరులును, అట్టి క్రూరత్వమున కంగీకరింపలేదు. రాజు అధికారముల నన్నిటిని తీసివేయుటకు మాత్రము వారియ్యకొనిరి. తుద కా మార్గమే యెల్లవారును అంగీకరించిరి. రాజు నామమాత్రముగ నిలువబెట్టబడెను. ఆతని పక్షము వహించిన ప్రధాన న్యాయమూర్తివంటి అత్యున్నతోద్యోగులను కూడ జమీందారులు పార్లమెంటు సభవారి యనుమతితో ఉరిదీయించిరి. రిచర్డు రాజు నిస్సహాయుడై ఈ దౌర్జన్యముల నన్నిటిని చూచుచు ఊరకుండవలసి వచ్చెను. కాని ఈ యవమానముల నాతడు మరువలేదు. 1389 వ సంవత్సరము నాటికి రిచర్డు రాజు సంప్రాప్తవయస్కుడయ్యెను. అప్పటి కాతడు ఇరువదిమూడేండ్లవాడు. రాజ్యాధికారమును చేజిక్కించుకొనుటకై ఈ రాజు రెండు సంవత్సరముల నుండియు రహస్యముగ యత్న

ములు చేయుచునే యుండెను. ఇప్పు డా కృషికి ఫలకాల మే తెంచెను. ఈ ప్రభువు తరుణమే రాజముద్రికను, కోశాగారమును, వశపరచుకొని, తన కనిష్టులైన మంత్రులను తొలగించి, ఇష్టులను అధికార పదవులలో నియమించెను. 1389 వ సంవత్సరమున వృద్ధుడైన లంకాస్టరు ప్రభువు విదేశములనుండి తిరిగి వచ్చెను. అతని కుమారుడైన Henry Bolingbroke రాజుతో దృఢమైత్రి పాటింపసాగెను. ఈ విధముగ రిచర్డు రాజు పదవి బలపడెను. అతడు ఎనిమిది సంవత్సరముల కాలము శాసన బద్ధ పద్ధతుల ననుసరించుచున్నట్లు నటించుచు, సర్వ స్వతంత్రుడై పాలించెను. యుద్ధములు సాగించుట రాజు స్వతంత్రమునకు చేటు మూడచేయునని ఈ రాజు బాగుగ గుర్తించెను. యుద్ధములు వ్యయసాధ్యములు. అందులకు కావలసిన ధనము కొరకై రాజు తరచు పార్లమెంటుసభను సమావేశ పరచవలసి వచ్చును. పార్లమెంటువారి ప్రాముఖ్యము హెచ్చిన కొలదియు రాజు ప్రాభవము తగ్గును. ఈ యంశమును గుర్తించి, రెండవ రిచర్డు రాజు ఫ్రాన్సు దేశముతో యుద్ధము సాగించుటకు నిరాకరించెను. అందులకు మారుగ అతడు ఫ్రెంచిరాజు కుమార్తెయైన ఇసబెల్లాను వివాహమాడి (1396) ఇంగ్లాండు దేశపు శత్రువులతో మైత్రిని పాటించెను. రిచర్డురాజు ఫ్రెంచి ప్రభువుతో రహస్యముగ నొక ఒడంబడిక కావించుకొని, తన అధికారమునకేదైన ప్రమాదము వాటిల్లినచో ఫ్రాన్సు దేశము తనకు సహాయపడవలెనని అందొక షరతును చేర్చెను. ఎనిమిది సంవత్సరముల

కాలము తన అధికారము నిరాఘాటముగ సాగుసరికి రిచర్డు రాజున కాత్మవిశ్వాసము హెచ్చెను. 1388 వ సంవత్సరమున తన్నవమానముపాలు కావించిన జమీందారుల నందరపైనను రాజద్రోహమను నేరము మోపి ఈ రాజు చంపించెను (1397). ఈ విధముగ చంపబడిన వారిలో రాజకుటుంబములోని Gloucestar ప్రభువు ఒకడు. ఈతడు రిచర్డునకు సొంతాత్తు పిన తండ్రి. ఇంతటి సమీప బంధువును చంపించినందు వలన రాజునకు మిక్కిలి అపఖ్యాతి సంభవించెను. కాని అవివేకియైన ఈ రాజు అందులకు లెక్క సేయలేదు. పార్లమెంటుసభ అప్పటికి నామమాత్రముగ నిలచి యుండెను. తాను కావించిన దుష్కృత్యము లన్నియు ధర్మబద్ధములని పార్లమెంటు సభచే ఒప్పించి, ఈ రాజు శాసనముల చేయించెను. ఈ విధముగ ఆంగ్ల పార్లమెంటు రాజు చేతిలో కీలుబొమ్మగ పరిణమించెను. రిచర్డు రాజు అధికార మిప్పుడు నిరంకుశ స్థాయిని చేరెను. గడచిన యెనిమిది సంవత్సరములలోను లంకాస్టరు ప్రభువు కుమారుడు Henry Bolingbroke రాజున కాప్తమిత్రుడై ఎంతో చనవుతో మెలగుచువచ్చెను. రాజునకు తాను కష్టకాలమున మిక్కిలి సహాయపడినందున, ఆతడు తన యెడల శాశ్వతముగ కృతజ్ఞుడై యుండగలడని Henry భావించెను. కాని రాజుల యభిమానములు నీటిబుగ్గలని రిచర్డు రాజు తన ప్రవర్తనచే ఋజువు చేసెను. 1398 వ సంవత్సరమున Henry కిని మరి యొక జమీందారునకును తీవ్ర వివాదము సంభవించెను. దీని నదనుగ

గైకొని రిచర్డు ఆ జమీందారుని మాత్రమే కాక తనకు సహచరుడును, మిత్రుడును, ఉపకారియునైన Henry ని కూడ దేశమునుండి వెడలగొట్టెను. Henry నిర్ఘాంతపోయెను. కాని త్వరలోనే మనస్థైర్యమును చేరదీసికొని, ఈ యపకృతికి ప్రతీకారము కావించెదనని నిశ్చయించుకొని దేశమును వీడి పోయెను.

ఇప్పుడు రెండవ రిచర్డు రాజు నిరంకుశపాలన అత్యున్నత స్థాయిని చేరెను. అతని శత్రువులైన జమీందారులెల్లరును సంపూర్ణముగ పరాభవమందిరి. పార్లమెంటు సభ రాజవాంఛితములను తీర్చుట కొరకు పనిముట్టుగ పరిణమించెను. రాజు తన యధీనములో ఎల్లప్పుడు నుండుట కొరకై ఒక సేనను సిద్ధము చేసి యుంచుకొనెను. తన కిష్టము వచ్చిన వారి నాతడు మంత్రులుగ నియమించు కొనెను. కాని వారిని కూడ ఆతడు నమ్మెడి వాడుకాడు. రిచర్డు రాజు తన యిష్టము వచ్చిన చొప్పున భోగముల ననుభవించుచు ధనమును విచ్చలవిడిగ వ్యయము చేయసాగెను. అతని యాడంబరముల కెంతటి ధనమును చాల లేదు. అందువలన రాజు బలవంతముగ ప్రజల వద్దనుండి ఋణములు తీసుకొన సాగెను. తనంతట తానే పన్నులను విధింప జొచ్చెను. 1399 వ సంవత్సరమున రాజు పిన తండ్రియు, వృద్ధుడునైన లంకాష్టరు ప్రభువు మరణించెను. ఈతనికి గొప్ప జాగీరులుండెను. దేశములో పెక్కు ప్రాంతములలో ఈతనికి భూవసతులుండెను. తనకు న్యాయసమ్మతముగ

వచ్చు రాబడి చాలక రిచర్డు రాజు తన పినతండ్రి జాగీర్ల నన్నిటిని వశపరచుకొని, వాని ఆదాయమునుకూడ అనుభవింప సాగెను. ఈ జమీనుల కన్నిటికిని న్యాయమైన వారసుడు నిర్వాసితుడైన Henry Bolingbroke. రాజ కుటుంబమునకు చెందిన Henry ఆస్తికే ప్రమాదము వాటిల్లినప్పుడు తమగతి ఇంకను హీనదశకు పోగలదని జమీందారుల కెల్లరకును అపార మైన భయమేర్పడెను. రాజు దుర్వ్యయమును, అన్యాయ మైన పన్నులను చూచి, వర్తకవర్గము వారందరును అతని యెడల సంపూర్ణముగ విరక్తులైరి. కాని మూర్ఖుడైన రిచర్డు ప్రజలలో తన యెడ ప్రబలియున్న విరోధ భావమును గుర్తింప లేదు. ఐర్లాండు ద్వీపమున చెలరేగిన అల్లరుల నణచి వేయ వలెనను నుద్దేశ్యముతో ససైన్యుడై యాతడు వెడలి పోయెను. ఇంగ్లాండు నందు బలమైన సేన కాని, సమర్థమైన మంత్రివర్గము కాని లేదు. ఈ యదను చూచుకొని, నిర్వాసితుడగు Henry Bolingbroke ససైన్యుడై ఇంగ్లాండులో దిగెను. కాని యుక్తిశాలి యైన ఈతడు తన నిజోద్దేశ్యములను వెల్లడింప లేదు. పైతృకమగు తన భూములను వశపరచు కొనవలెనను కోర్కెతో మాత్రము తా నేతెంచినట్లు ఆతడు ప్రకటించెను. రిచర్డు రాజు నిరంకుశ పాలనచే విసువు చెందియున్న వర్గములన్నియు Henry పక్షము వహించెను. రిచర్డు రాజు తన యేలుబడికి కేర్పడిన ప్రమాద మును గుర్తించి ఐర్లాండునుండి తిరిగివచ్చెను. కాని అప్పటికే కాలము మించిపోయెను. విద్రోహులు చాల బలపడిరి. రిచర్డు

రాజు వారిని నోడింప జాలక వారికి వశపడి పోయెను (1392). అనతి కాలములోనే ఆతడు రాజ్యత్యాగము కావించెను. పార్లమెంటు సభ వారు Henry Bolingbroke ను ఇంగ్లాండునకు రాజుగా వరించిరి. అదృష్టహీనుడైన రిచర్డు Pontefract అను కోటలో నిర్బంధితుడయ్యెను. శత్రుపక్షము వారికి చిక్కిన ఇతర రాజ వంశీకులకు పట్టినగతియే ఈ రాజునకు కూడ పట్టి యుండవచ్చును.

రెండవ రిచర్డు రాజునకు ఇంగ్లాండు దేశ చరిత్రలో ఒక విశిష్ట స్థానము కలదు. సమకాలికులైన ఇతర రాజులవలెనే ఈతడు కూడ తన ప్రతిద్వంద్వులైన ఒమింబారులతో పోరాడి నిరంకుశ ప్రభుత్వమును నెలకొల్పెను. కాని ఈ రాజు తన నిరంకుశాధికారములను స్వార్థప్రయోజనముల కొరకు కాక, దేశములోని నిరుపేద జనులను భూస్వాముల యొక్కయు, మధ్యతరగతి ప్రజల యొక్కయు, దౌర్జన్యమునుండి కాపాడుటకై వినియోగించెనని సామాన్య ప్రజలు నమ్మిరి. పీడితులగు సామాన్య ప్రజలు ఈ భావమును చిరకాలమువరకును తమ హృదయసీమలలో పెంపొందించుకొనిరి. భూస్వాములును, ధనికవర్గమువారును ఈ రాజు సామ్యవాద సిద్ధాంతముల నవలంబించి, సమాజ వ్యవస్థను తారుమారు చేయదలచినట్లు దృఢముగ విశ్వసించిరి. అందువలన రిచర్డు రాజు స్మృతిని కూడ ప్రజల మనోఫలకములనుండి తుడిచివేయవలెనని పార్లమెంటు సభ ప్రయత్నించెను. జనస్మృతిపథమున ఈ రాజు సజీవుడై

యున్నట్లు ప్రచారముచేయుట కూడ ఒక గొప్ప నేరమని శాసనము కావింపబడెను.

## నాల్గవ హెన్రీ (1399—1413)

రెండవ రిచర్డు రాజు పదచ్యుతుడైన పిమ్మట అతని పినతండ్రి కుమారుడు Henry Bolingbroke నాల్గవ హెన్రీ అను బిరుదుతో రాజ్యాధికారము వహించెను. ఈతడు ఇంగ్లాండు దేశపు సింహాసనము నధిష్ఠించుటలో ఒక విశిష్టసూత్ర మిమిడి యున్నది. ఈ హెన్రీ రాజునకు వంశక్రమానుగతమగు బలమైన హక్కు లేదు. హెన్రీ తండ్రియైన లంకాస్టరు ప్రభువు మూడవ ఎడ్వర్డు రాజు కుమారులలో మూడవవాడు. రెండవ రిచర్డు రాజును పదభ్రష్టునిగ భావించినను, అతని యనంతరము మూడవ ఎడ్వర్డు రాజు రెండవ కుమారుని సంతతివారు రాజ్యాధికారము వహించవలెను. అట్లు సంభవింపలేదు. ఇంగ్లాండు దేశమును తన భుజబలముచే జయించి, రాజ్యాధిపత్యమును పూనినట్లు ప్రకటించుటకు హెన్రీకి ధైర్యము చాల లేదు. కావున పార్లమెంటుసభలో సమావేశమైయున్న జమీందారులు, మతాధికారులు, ప్రజాప్రతినిధులును, తన్ను రాజుగ వరించినందువలన తనకీ రాజ్యాధికారము సంక్రమించినట్లు హెన్రీ అంగీకరింపవలసి వచ్చెను. ఈ యంగీకారము పార్లమెంటు సభ వారి ప్రతిష్ఠను అపారముగ వృద్ధిచెందించెను. ఇంగ్లాండు దేశపు సింహాసనమును పొందుటకు వంశానుగతమగు హక్కుతో

పాటు, పార్లమెంటు సభ వారి యనుమతి కూడ ప్రత్యక్షముగనో పరోక్షముగనో ఉండితీరవలెనను సిద్ధాంతమున కీ రాజు ఎన్నిక దోహదమిచ్చెను. పార్లమెంటు సభవారి యనుమతితో రాజ్యాధికారమును పూనిన యీ ప్రభువు ఆ సభవారు తమ అధికారముల విస్తృత పరచుకొనినను, ఎట్టి అభ్యంతరమును తెలుపలేక పోయెను. రాజుగారికి కావలసిన ధనమును మంజూరు చేయుటకు పార్లమెంటు సభకు మాత్రమే హక్కు గలదను సాంప్రదాయ మీవరకే అంగీకృతమై యుండెను. పన్నులను విధించు అధికారమును పార్లమెంటు సభనుండి పొందుటకు పూర్వము రాజు ప్రజల కష్టనిష్ఠురముల గూర్చి విచారించి, వారికిగల ఇబ్బందులను తీర్చవలెనను ప్రధాన రాజ్యాంగ సూత్ర మీ హెన్రీ రాజుకాలమున మరల బలపరుపబడెను. ఇంతకు పూర్వము ప్రజాప్రతినిధులు రాజుగారు కోరిన పన్నులను మంజూరుచేయు అధికారమును మాత్రమే కల్గియుండిరి. పన్నుల రూపముగ వసూలు చేయబడిన ప్రజలధనము ఏవిధముగ వ్యయపరుపబడినదని అడుగు పద్ధతి ఇంతకు పూర్వము లేదు. ఎవరైన పార్లమెంటు సభ్యులు సాహసించి ఇట్టి ప్రశ్నలను వేసినచో, రాజు చాల ఆగ్రహపడి, ఇట్టి సంజాయిషీని అడుగుట అహంభావమనియు, రాజాధికారమును తృణీకరించుట యనియు తీవ్రముగ ఖండించుచుండెడివాడు. నాల్గవ హెన్రీ కాలమున పార్లమెంటు సభకు మున్నెన్నడును లేని ధైర్యము కల్గెను. ప్రజాద్రవ్య మేవిధముగ వ్యయపరుపబడినదో

వివరింపవలసినదని, పార్లమెంటు సభవారు ప్రభుత్వాధికారుల నొత్తిడి చేయసాగిరి. ఈ నూతన పద్ధతిని కూడ హెన్రీ రాజు అంగీకరింపవలసివచ్చెను. ఈ విధముగ లంకాస్టరు వంశము (మూడవ ఎడ్వర్డు రాజు మూడవ కుమారుడైన డ్యూక్ ఆఫ్ లంకాస్టరు వంశీకులను లంకాస్టరు వంశము వారిని ఇంగ్లాండు చరిత్రలో సూచించుచున్నారు) వారికాలమున పార్లమెంటు సభ చాల బలపడెను. మత సంస్కర్తయైన John Wyclif అనుచరులను అణచివేయుటలో పార్లమెంటు సభకును, రాజునకును, ఏకాభిప్రాయత యేర్పడెను. మత సంస్కరణను క్రైస్తవ మతాధికారులు కెంతమాత్రమును రుచించలేదని వేరుగ తెలుపనక్కరలేదు. వసతిపరులైన మతాధికారులకును, భూస్వాములైన జమీందారులకును, విక్లిఫ్ అనుచరులైన Lollards అను మతప్రచారకులు భయంకరమైన సామ్యవాద సిద్ధాంత ప్రచారకులుగ కానవచ్చిరి. కావున రాజును, పార్లమెంటు సభవారును, ఏకాభిప్రాయముతో Lollards కు విరుద్ధముగ ఒక శాసనము చేసిరి. ఈ మత ప్రచారకులు మతద్రోహులు కావున వీరిని సజీవముగ దహనము చేయవలెనని ఈ శాసనము విధించెను (1401). మత విషయములైన నేరములను విచారించు సంపూర్ణాధికారము మతాధికారులకే ఈయబడెను. వారి నిర్ణయములపై పునర్విచారణ లేదు. మతాధికారుల నిర్ణయములను స్థానికాధికారులు అమలుచేసి తీరవలెను.

మధ్యయుగమునందలి ఇతర ఆంగ్లరాజుల కాలములో వలెనే నాల్గవ హెన్రీకాలమున కూడ తిరుగుబాట్లు, అల్లరులు చెలరేగెను. రాజు వాని నణచివేయగల్గెను. కాని నిరంతర యుద్ధవ్యవసాయము అపారమైన వ్యయమునకు కారణమయ్యెను. నిర్ధనుడైన రాజు మరల మరల పార్లమెంటు సభను ధనమునకై అర్థించవలసి వచ్చెను. ఈ అవసరము చూచుకొని పార్లమెంటు సభవారు రాజుపై నెక్కుడు నిర్బంధముల విధించిరి. నాల్గవ హెన్రీ ఈ నిర్బంధముల కన్నిటికిని తల యొగ్గవలసి వచ్చెను. దేశమునందలి విదేశీయులందరును కూడ వెడలగొట్టబడిరి. అట్టి విదేశీయులలో వివాహితులైన రాకుమార్తెలు కూడ ఉండుట గమనింపదగిన యంశము. ప్రభుత్వ వ్యవహారమును సూక్ష్మముగ పరీక్షించుటకై ప్రత్యేకాధికారులు నియమితులైరి. రాజుగారి అంతఃపురములోని అధికారుల నియామకము విషయమై కూడ పార్లమెంటు సభ జోక్యము కలుగజేసికొనెను. ఈ విధముగ నాల్గవ హెన్రీ తన అధికారములను చాలవరకు కోల్పోయెను. మిక్కిలి సహనముతో ఆతడీమార్పుల నంగీకరించెను. అవసానకాలమున హెన్రీకి కుమారుడైన వేల్సు యువరాజు వలన చాల మనస్తాపము కల్గెను. ఈ యువకునిది కూడ తండ్రి పేరే. యువరాజైన హెన్రీ అల్లరి చిల్లర స్నేహితులతో చేరి, విచ్చలవిడిగ వర్తించుటయేకాక, తండ్రిపై యెదురు తిరిగెను. రోగగ్రస్తుడైన రాజు మనోవ్యథతో మరణించెను (1413).

## ఐదవ హెన్రీ (1413—1422)

నాల్గవ హెన్రీ కుమారుడైన యీతడు తండ్రి మరణింపగనే ఎట్టి అవరోధమును లేకుండ ఆంగ్ల సింహాసనము నధిష్ఠించెను. ఈ రాజు గొప్ప వీరుడు. నవయువకుడుగ నున్న కాలమందే ఈ హెన్రీ తన తండ్రికి కుడిభుజమువలె నిలచి, తిరుగుబాట్లు కావించిన జమీందారులను సంపూర్ణముగ పరాభవింపగల్గెను. అదే కాలమున రాజ్యకార్య నిర్వహణమునందు తనకు గల సమర్థత నీతడు చక్కగ ప్రదర్శించెను. కాని వేల్సు యువరాజుగ నున్న కాలమందీతడు తుంటరులైన నేస్తగాండ్రను వెంటబెట్టుకొని, విచ్చలవిడిగ వర్తించుచు, జూదము, మద్యపానము, దారిదోపిడులు మొదలైన దుర్వ్యాపారములలో వర్తించుచుండెడివాడు. నాల్గవ హెన్రీ తన రాజ్యావసాన కాలమున వ్యాధిగ్రస్తుడై రాజ్యకార్యముల చక్కగ నిర్వహించజాలకపోయెను. ఈ యదను చూచుకొని, వేల్సు యువరాజైన హెన్రీ తండ్రిని రాజ్యత్యాగము చేయవలసినదని చాల పట్టుపట్టెను. కాని ప్రభువైన నాల్గవ హెన్రీ యందుల కియ్యకొనక, ఇట్టి ఔద్ధత్యమును, అహంకారమును, అవిధేయతను ప్రదర్శించినందుల కై కుమారుని కఠినముగ మందలించెను. మంత్రులు కాని, ఇతర రాజోద్యోగులు కాని, యువరాజు నెంతమాత్రమును సమర్థించలేదు. అందువలన యువరాజైన హెన్రీ చాల సిగ్గుపడి వెడలిపోయి, తండ్రి జీవితాంతము వరకును మరల తలయెత్తలేదు. నాల్గవ హెన్రీ చనిపోగానే

ఊత డధికార సూత్రముల గ్రహించుటయే కాక, తన జీవితము నందొక నూతనాధ్యాయమును ప్రారంభించెను. తన తొల్లింటి మిత్రుల నందరను ఊతడు సంపివైచి, బాధ్యత తోడను, రాజ ఠేవితోడను వర్తింప జొచ్చెను. ఈ యంశముల నన్నిటిని షేక్స్పియరు మహాకవి తాను రచించిన Henry VI, Henry V అను చారిత్రిక నాటకములలో మిక్కిలి హృదయంగమముగ వర్ణించి యున్నాడు.

ఆ కాలము నాటి గొప్ప వీరులలో ఐదవ హెన్రీ ఒకడు. సైన్య సారథ్యము నందీతడు మహానిపుణుడు. ఈతనికి రణ కండూతి హెచ్చు. అదృష్టవశమున ఆ కాలమున పార్లమెంటు సభలోని జమీందారులును, మతాధికారులును, ప్రజాప్రతినిధు లును కూడ రణపిపాసువులై, ఫ్రాన్సు దేశముపై దండెత్తి పోయి, విజయ పరంపరను సాధింపవలసినదిగా తమ ప్రభువును ప్రోత్సహించిరి. అందులకు కావలసిన ధనమును కూడ ఉదార ముగ మంజూరు చేసిరి. ఈ సదవకాశమును పురస్కరించుకొని, హెన్రీ రాజు ఫ్రాన్సు దేశముపై దండ యాత్రకై సన్నా హములు కావించెను. ఆంగ్ల సేనలను ఇంగ్లీషు సముద్రమును దాటించుటకై ప్రత్యేకమైన పడవలు నిర్మింపబడెను. సుశిక్షితు లైన పదివేల మంది యోధులతో ఆగస్టు 1415 వ సంవత్సర మున హెన్రీ రాజు సముద్రమును దాటి ఫ్రాన్సు గడ్డపై దిగెను. రెండు నెలలు గడచినను ఆంగ్ల సేనలు చెప్పదగిన ఘన విజయ ముల వేనిని సాధింపలేదు. ఇంతలో ఫ్రాన్సు దేశపు ప్రభుత్వము

వారు ప్రబలమైన సేనతో ఇంగ్లీషు సేనలపై దండెత్తి వచ్చిరి. 1415 వ సంవత్సరము అక్టోబరు ఇరువది యైదవ తేదీ నాడు Agnicowt అను ప్రదేశమున ఈ యిరుపక్షములకును భయంకర మైన యుద్ధము ప్రవర్తిల్లెను. ఆంగ్ల సేనలో అయిదు వేల మంది వీరులు మాత్రము మిగిలి యుండిరి. కాని వీరిలో మహానిపుణు లైన ధానుష్కులు నాల్గువేల వరకును ఉండిరి. మిగిలిన వారు కవచధారులైన యోధులు లేదా పదాతులు. వీరు ప్రాణభయ మును సంపూర్ణముగ విడనాడి, దేశగౌరవమును కాపాడుటకై దానవులవలె పోరాడిరి. ముప్పది వేల వీరసైనికులతో కూడిన ఫ్రెంచిసేన వీరి ధాకకు తట్టుకొనలేక సంపూర్ణముగ ఓడి పోయెను. Agnicowt విజయ మాంగ్లేయులు సాధించిన మహా విజయములలో నొకటి. ఈ నాటికి కూడ వారా యుద్ధగాథను సగర్వముగా స్మరింతురు. కాని తాటి ఆకుల మంటవంటి ఈ గెలుపు ఆంగ్ల ప్రభువుల కెట్టి శాశ్వత లాభమును చేకూర్ప లేదని మనము ముందుముందు తెలిసికొనగలము. విజయోత్సాహ సముతో హెన్రీ రాజు స్వదేశమునకు మరలి వచ్చెను. 1417 వ సంవత్సరమందు ఆంగ్ల సేనలు మరల ఫ్రాన్సుదేశముపై దండెత్తి నార్మండీ అను సూబాను వశపరచుకొనెను. అంతఃకలహము లలో మునిగి తేలుచున్న ఫ్రెంచి రాజకీయ పక్షములు ఆంగ్లే యుల విజయపరంపర నే విధముగను అరికట్టజాలక పోయెను. 1420 వ సంవత్సరమున ఆంగ్లేయులకును, ఫ్రాన్సు ప్రభుత్వ మునకును సంధి కుదిరెను. ఫ్రెంచి రాజైన ఆరవ ఛార్లెస్ తన కుమార్తెను ఐదవ హెన్రీ కిచ్చి వివాహము చేయుటయే కాక

నార్మండీ సూబాను ఆంగ్లేయుల కిచ్చి వేసెను. అంతేకాదు. తన జీవిత కాలములో హెన్రీ రాజు తనకు సంరక్షకుడుగ నుండు నట్లును, తన యనంతరము హెన్రీ ఫ్రాన్సు దేశమునకు కూడ యేలిక యగునట్లును అంగీకారము కుదిరెను. అయిదవ హెన్రీ రాజు ప్రతిష్ఠ ఆకాశమంటెను. కాని అనన్యసామాన్య రణ విజయముల సాధించిన ఈ రాజు విధినిర్ణయములచే పరాజయము పొందెను. యుద్ధపరిశ్రాంతి వలన నీతని దేహము రోగగ్రస్తమై పోయెను. వైద్యచికిత్స ఫలవంతము కాలేదు. తొమ్మిది సంవత్సరములు మాత్రము రాజ్యపాలన కావించి అయిదవ హెన్రి 1422 వ సంవత్సరమున కాలధర్మముం జెందెను. తొమ్మిది నెలల బాలుడైన ఈతని కుమారుడు ఆరవ హెన్రీ అను బిరుదుతో ఇంగ్లాండున కేలిక అయ్యెను.

అయిదవ హెన్రీయందు ఉత్తమ ప్రభువున కుండవలసిన మంచి లక్షణములన్నియు నుండె ననుటలో సందేహము లేదు. కాని సమకాలికుల భావముల మాత్ర మాతడతిక్రమింప లేక పోయెను. Lollards అనబడు మత సంస్కర్తల యెడల ఆనాటి ఆంగ్లేయులు పరమ ద్వేషమును పూనియుండిరి. విక్లిఫ్ సంస్కర్త అనుయాయులైన వారిలీలు మతవిప్లవమును, సంఘ విప్లవమును కూడ తెచ్చిపెట్టదలచినట్లు ఆనాటి ప్రజలు భావించిరి. ఈ సంఘ శత్రువులకు సజీవ దహనమే శిక్షయని పార్లమెంటు సభ నిర్ణయించి యుండినట్లు మేమిదివరకే తెల్పినాము. అయిదవ హెన్రీ వేల్సు యువరాజుగనున్న కాలములోనే Badby అను

కుట్టు పని వానిని క్రైస్తవమత ద్రోహి అను నేరముపై మంటలలో కాల్చి చంపిరి. యువరాజీ చిత్రవధను కండ్లతో చూచుచు మిన్నకుండెను. 1417 వ సంవత్సరమున Sir John Oldcastle అను ధనికుడును, మహాపండితుడును అయిన Lollard హెన్రీరాజు ఆజ్ఞచే మంటలో కాల్చి చంపబడెను. ఇట్టి క్రూరకృత్యములు రాజులకు కళంక మాపాదించునని, ఆనాటి ప్రజలు భావించినట్లు కానరాదు.

## ఆరవ హెన్రీ (1422—1461)

తొమ్మిది నెలల పసిబాలుడుగనున్న యీతడు రాజ్య కార్య నిర్వహణమున కసమర్థుడని వేరుగ తెలుపనవసరము లేదు. ఈతని పినతండ్రులు ఆరవ హెన్రీ పేరున పరిపాలన సాగించిరి. ఆరవ హెన్రీ ఇంగ్లాండు సింహాసన మధిష్ఠించిన రెండుమాసములకు ఈతని తాత (మాతామహుడు) యైన ఫ్రెంచిరాజు మరణించెను. ఈ విధముగ ఈ పసిబాలుడు ఫ్రాన్సు దేశమునకు కూడ యేలిక అయ్యెను. హెన్రీరాజు చాల యోగ్యుడు. దైవభక్తి కలవాడు. శాంతిప్రియుడు. విద్యాభిమాని. కాని రాజ్యకార్య నిర్వహణము నందతని కెంతమాత్రమును సమర్థత లేదు. ఇంగ్లాండు దేశ మా కాలమున బలవంతులును, పరమధూర్తులును, రుధిరప్రియులును, విద్యావివేక విరహితులును నగు జమీందారులతో నిండియుండెను. వీరు నిరంతర కలహములతో పొద్దుపుచ్చుచుండిరి. ఇట్టి జమీందారుల నణచియుంచగల సామర్థ్యము హెన్రీవద్ద ఎంతమాత్రమును

లేదు. అదియునుకాక చపలచిత్తయైన అదృష్టదేవత ఈ రాజు కాలమున ఇంగ్లీషువారిని విడనాడి, ఫ్రాన్సు దేశీయులను వరించెను. తత్ఫలితముగ హెన్రీ రాజు తన తండ్రి విజయముల వలన సాధింపబడిన ఫ్రాన్సు రాజ్యమును కోల్పోయెను. ఫ్రాన్సు దేశము నందవమానవుపాలైన ఈ రాజు ఇంగ్లాండు దేశమున ప్రజాభిమానమును పోగొట్టుకొని, క్రమముగ రాజ్య భ్రష్టత కూడ చెందెను.

ఫ్రాన్సుదేశమునందు ఆరవ హెన్రీ తరఫున రాజ్య సంరక్షకుడుగ బెడ్‌ఫర్డ్ ప్రభువు (Duke of Bedford) వ్యవహరింపసాగెను. ఐదవ హెన్రీ సోదరుడైన యీతడు యుద్ధనిర్వహణమందును, రాజ్యతంత్రమునందును కూడ చాలదిట్ట. ఈ కథాకాలమున ఫ్రాన్సుదేశము అంతఃకలహములతో మునిగి తేలుచుండెను. ఇచ్చట బర్గండీ పక్షము, Armagnac పక్షము అను రెండు బలమైన పక్షము లధికారము కొరకై పెనగులాడుచుండెను. బర్గండీ పక్షమువారు ఇంగ్లీషు వారికి మిత్రులు. వీరిసహాయముతో బెడ్‌ఫర్డ్ ప్రభువు ఇంచుమించుగ ఫ్రాన్సు దేశమునంతను జయించెను. ఆవలి పక్షమునకు చెందిన ఛార్లెస్ అను రాజవంశీకుడు ప్రాణము లరచేతిలో పెట్టుకొని, సర్వనాశనమునకు సంసిద్ధుడైయుండెను. ఆంగ్ల సేనలు బర్గండీ పక్షమువారి సహాయముతో ఆర్లియన్స్ (Orleans) కోటకు ముట్టడి వేసెను. ఈ కోట ఆంగ్లేయులకు వశపడినచో ఫ్రాన్సు దేశములోని తూర్పు భాగము కూడ విదేశ

పరిపాలనకు లోనై పోవును. ఈ విధముగ ఫ్రాన్సు దేశపు స్వాతంత్ర్యమునకు మిక్కిలి ప్రమాద పరిస్థితి యేర్పడెను. ఇట్టి ఉపద్రవమునుండి ఫ్రాన్సు దేశమును కాపాడుటకై పర మేశ్వరుడు తన దూత నొక్కతెను పంపి, ఫ్రాన్సు ప్రజలను పారతంత్ర్యమునుండి రక్షించెను.

ఫ్రాన్సు దేశపు చరిత్రయందతి ముఖ్య ఘట్టమని వర్ణింప దగిన ఈ యవసరమున రంగము పైకి వచ్చిన, జోన్ కన్య ఒక అవతారమూర్తి యని చెప్పుట కెంతమాత్రమును సంశయము లేదు. ఈమె ముఖ్యముగ సాధించిన ఘన విజయము ఆంగ్ల సేనల ముట్టడినుండి ఆర్లియన్స్ కోటను కాపాడుట. అందువలన ఆమెకు Maid of Orleans అను కీర్తినామము కూడ కలదు. సమకాలీనులైన మతాధికారు లీమెపై మంత్రకత్తె యని నేరారోపణ కావించి, సజీవముగ దహనము చేసిరి. సుమారు అయిదు నూర్ల సంవత్సరముల పిమ్మట పోపు మతాధికారి జోన్ కన్య ఒక ఋషియని ప్రకటించెను. జోన్ కన్య ఫ్రాన్సు దేశమునందలి ఒక కుగ్రామములో జన్మించెను. ఈమె రైతు పడుచు. బాల్యమునందును నవ యౌవనమునందును, తన గ్రామ పరిసరములందలి అడవులలో పశువులను కాచుచు ఈమె కాలము పుచ్చెడిది. మొదటి నుండియు ఈమెకు దైవభక్తి మెండు. తన కేవేవో అలౌకిక నాదములు, భగవదాదేశములు ఎల్లపుడును వినిపించెడివని జోను కన్య చెప్పుచుండెడిది. ఈమె తరచు మగవారి దుస్తులను ధరించి తిరుగుచు, తండ్రిచే చీవాట్లు

తినుచుండెడిది. ఇది యిట్లుండగా 15 వ శతాబ్ది ప్రారంభమున ఫ్రాన్సు దేశపు రాజులు ఆంగ్లేయులచే అనేక పర్యాయములు పరాజితులై తమ దేశములో చాల భాగమును శత్రువులకు వశపచిరి. ఆరవ ఛార్లెస్ రాజు కుమారుడు ఛార్లెస్ రాకుమారుడు తన యధికారములో మిగిలియున్న రాజ్యమును కూడ కోల్పోవు దుస్థితికి వచ్చెను. ఇట్టి సంకట పరిస్థితి యందు తనకు పరమేశ్వరుని నుండి ఒక ఆజ్ఞ లభించినట్లు జోను కన్య భావించెను. ఆర్లియన్స్ కోటను ముట్టడి వేసియున్న ఆంగ్లేయులను తరిమివైచి, రాకుమారుడైన ఛార్లెసును Rheims క్రైస్తవ దేవాలయమందు ఫ్రాన్సు దేశమున కేలికగ పట్టాభిషిక్తుని కావింప వలెనని భగవంతుడు తన్నాదేశించినట్లు జోను కన్య ప్రకటించెను. తక్షణమే ఆమె పురుషుల దుస్తులను ధరించి, ఛార్లెస్ రాకుమారుని సన్నిధకు పోయి, తన నిశ్చయము నాతనికి తెల్పెను. జోను మాటల నెవ్వరును నమ్మలేదు. కాని ఆమె కోరికను నిరాకరించుటకు కూడ ఎవ్వరును సాహసింప లేదు. రాకుమారు డొసగిన సేనతో జోను కన్య Orleans కోటవైపు సాగిపోయెను. దైవశక్తి ప్రేరితురాలైన యీ వీరయువతి ముందర ఆంగ్లసేనలు నిర్వీర్యములై పోయెను. ఆంగ్లేయులు ఆర్లియన్స్ కోటనుండి వెనుకకు తగ్గిరి (1429). అనతి కాలములోనే జోను కన్య ఇంగ్లీషు సేనలను Patay అను ప్రదేశమున నోడించెను. అటు పిమ్మట ఆమె ఛార్లెస్ రాకుమారుని Rheims దేవాలయములో రాజ్యాభిషిక్తుని కావించెను. ఈతడు ఏడవ

ఛార్లెసు అను బిరుదు వహించెను. అదృష్టదేవత ఇంతటితో జోను కన్యను విడనాడెను. Paris నగరమును వశపరచుకొనుటకై ఈమె కావించిన యత్నము నిష్ఫలమయ్యెను. బర్గండీ పక్షము వారిమెను చెరపట్టి తమ మిత్రులైన ఆంగ్లేయులకు వశపరచిరి (1430). ఆంగ్లేయులకు జోను కన్య యనిన పరమ ద్వేషము. తగు విధముగ శిక్షించ గలందులకు వారు ఆమెను మతాధికారులకు అప్పజెప్పిరి. పరమ మూఢులైన ఆ మత గురువు లీమె క్రైస్తవ మత ద్రోహియనియు, సైతాను దూత యనియు, మాంత్రికు రాలనియు నిర్ణయించి, మరణ దండన విధించిరి. 1431 వ సంవత్సరము మే నెల ముప్పదవ తేదీ నాడు ఈ మహావ్యక్తిని Rowen అను పట్టణమున, ఆ పట్టణాధికారి బహిరంగమగు సంత ప్రదేశమందు, చితిపై నిలున బెట్టి, సజీవముగ దహనము చేయించెను. హృదయ విదారకమైన జోను కన్య విలాపము పాషాణ హృదయులైన ఆనాటి ప్రజల గుండెలను కరగింప లేదయ్యెను. తమ పరమ శత్రువు రూపు మాసినదని ఆంగ్ల సైనికులు సంతసించిరి. మరణ కాలము నాటికి ఈ కన్య పందొమ్మిది సంవత్సరముల వయస్సుకలది,

జోను కన్య మరణించినను ఆమె ఫ్రెంచి వీరులలో పురికొల్పిన దేశభక్తి భావములును, ధైర్యోత్సాహములును నశింపలేదు. ఫ్రెంచి సేనలు క్రమక్రమముగ తమ దేశపుగడ్డనుండి ఆంగ్ల సేనలను తరిమి వేయ సాగెను. ఆరవ హెన్రీకి ఫ్రాన్సు దేశముపై గల రాజ్యాధికారమును వదలుకొనుట కాంగ్ల

పక్షమువా రంగీకరింప నందున, ఈ రెండు దేశములకును సంధి కుదుర లేదు. ఆంగ్లేయుల మొండి పట్టుదల వలన ఇంతవరకును వారికి మిత్రులైన బర్గండీ పక్షము వారు విసువు చెంది, ఫ్రెంచి రాజైన ఛార్లెసు పక్షమును చేరిరి (1435). దీని వలన ఆంగ్ల పక్షము వారి బలము ఇంకను క్షీణించెను. అదే సంవత్సరము ఫ్రాన్సు దేశము నందాంగ్ల సేనల కధిపతిగనున్న Bedford ప్రభువు మరణించెను. ఆ పిమ్మట ఆంగ్లసేనలకు Bedford డ్యూక్ వంటి సమర్థుడైన నాయకుడు లభింప లేదు. 1436 వ సంవత్సరమున ఫ్రెంచి రాజు తన రాజధానియగు ప్యారిసు నగరమును వశపరచుకొని, ఆంగ్లేయులను తరిమివైచెను. ఫ్రెంచిసేనలుక్రమముగ Normandy రాష్ట్రమందును, Gascony రాష్ట్రమందును కూడ ప్రవేశించెను. 1450 వ సంవత్సరము నాటికి ఫ్రెంచివారు Normandy రాష్ట్రమును మరల ఆక్రమించిరి. మూడునూర్ల సంవత్సరములుగ ఆంగ్లేయుల అధీనములో నున్న Gascony రాష్ట్రమును కూడ 1453 వ సంవత్సరమున ఫ్రెంచి వారు మరల ఆక్రమించిరి. శతసంవత్సర యుద్ధమునకు ఫలితముగను, వీరులైన మూడవ ఎడ్వర్డు రాజు, ఆతని కుమారుడు Black Prince, ఐదవ హెన్రీగార్ల మహావిజయముల వలనను, నిర్మింపబడిన ఫ్రెంచి సామ్రాజ్యము ఇసుక మేడవలె పూర్తిగ కూలి పోయెను. రేవు పట్టణమగు కెలే నగరము మాత్రము ఆంగ్లేయులకు దక్కెను. ఖడ్గ సహాయమున సాధింపబడిన ఆంగ్లేయుల విజయములు మరల ఖడ్గముతోడనే రూపు మాసెను.

ఫ్రాన్సు దేశములోని తమ సామ్రాజ్యము నశించుటయు, అచ్చట తమకు సంభవించిన పరాజయములును, జాతీయావమానమును, ఆంగ్లేయులలో చాల అసంతృప్తి కల్గించెను. వారి విదేశాంగ నీతి సంపూర్ణముగ విఫలమయ్యెను. ఇంగ్లండులోని ఆంతరంగిక వ్యవహారములు కూడ ఆనాడు మిక్కిలి అస్తవ్యస్తముగ పరిణమించెను. ఆరవ హెన్రీ రాజునకు రాజ్య కార్య నిర్వహణము నందెంత మాత్రమును సమర్థత లేదు. అందువలన ఇంగ్లాండులోని జమీందారులు రెండు పక్షములుగ చీలిపోయి, ఒకప్పు డొకపక్షము వారును, వేరొకప్పుడు మరియొకపక్షము వారును, రాజును తమవంకకు త్రిప్పుకొని, రాజ్యవ్యవహారముల నడుపసాగిరి.ఇది యిట్లుండగా జమీందారులలో నెలకొనియున్న విభేదములను మరింత గాఢతరము కావింపగల మరియొక కారణము కూడ ఉత్పన్నమయ్యెను. రెండవ రిచర్డురాజును పదభ్రష్టుని కావించి, నాల్గవ హెన్రీరాజు రాజ్యాధికారము పూనిన నాటినుండియు, ఇంగ్లాండునందు లంకాస్టరు వంశమువారి పరిపాలన సాగుచుండెను.లంకాస్టరు వంశమువారు మూడవ ఎడ్వర్డు రాజు మూడవ కుమారుడైన John of Gaunt, Duke of Lancaster యొక్క సంతతివారు. నాల్గవ హెన్రీరాజు పార్లమెంటు సభవారి యనుమతి తోడనే రాజ్యాధికారమును పూనినను, ఇతడు ఆంగ్లరాజ్యమునకు న్యాయసమ్మతుడైన వారసుడు కాడనియు, లంకాస్టరు వంశమువారు దురాక్రమణ కావించిరనియు, ఆంగ్లేయులలో పలువురు భావించుచు వచ్చిరి. ఇందు

లకు కొంత కారణము లేకపోలేదు. మూడవ ఎడ్వర్డు రాజు రెండవ కుమారుడు Lionel, Duke of Clarence అను నాతడు. ఈతనికి ఫిలిప్పాయను కుమార్తె మాత్రమే కాని పురుష సంతానము లేదు. ఫిలిప్పా రాకుమారికి కుమారులు జన్మించిరి. వారికికూడ మరల పురుషసంతానము కల్గెను. జ్యేష్ఠత్వ కారణమున Lionel, Duke of Clarence వంశమువారి కాంగ్ల రాజ్య సింహాసనము సంక్రమింపవలెను. కాని స్త్రీద్వారా కల్గిన వారసత్వమును రాజ్యాధికారవిషయమున నంగీకరించుట కా కాలము వారు విముఖులుగ నుండిరి. అయినను ఈ వంశమువారికి కూడ ఇంగ్లాండు రాజ్యమును పాలించుట కొక పర్యాయము అవకాశము లభింపవలెనను భావము పెక్కండ్రు జమీందారులలో ప్రబలియుండెను. ఆరవ హెన్రీకాలమున పైన పేర్కొనబడిన Duke of Clarence సంతతికి చెందిన Duke of York అను బిరుద నామముగల రిచర్డు అను నాతడు ఒక ప్రముఖ ఆంగ్ల రాజనీతిజ్ఞుడుగ నుండెను. ఈ యార్కు ప్రభువు మూడవ ఎడ్వర్డురాజు సంతతితో మిక్కిలి సన్నిహిత సంబంధము కలవాడు. ఈతని తండ్రియైన Richard, Earl of Cambridge అను నాతడు మూడవ ఎడ్వర్డురాజు నాల్గవ కుమారుడైన Edmund, Duke of York యొక్క పుత్రుడు. కేంబ్రిడ్జి ప్రభువు Lionel, Duke of Clarence మునిమనుమరాలైన Anne అను రాజపుత్రికను వివాహ మాడెను. ఈ విధముగ Richard, Duke of York అను నాతడు మూడవ ఎడ్వర్డు రాజు కుమారు

లలో ఇరువుర సంతతికి చెందియుండెను. మూడవ ఎడ్వర్డురాజు నాల్గవ కుమారుని సంతతికి చెందినను, కనిష్ఠ సోదరుని ముని మనుమడగుట వలన ఈతనికి పురుషులద్వారా బలమైన హక్కు లభింపలేదు. కాని ఈ యార్కు ప్రభువు తల్లి Anne అనునామె మూడవ ఎడ్వర్డురాజు రెండవ కుమారుని మునిమనుమరాలు. కావున ఆతనికి తల్లిద్వారా ఆంగ్ల సింహాసనము నధిష్ఠించుటకు హక్కు ఏర్పడియుండెను. ఈ యార్కు ప్రభువు మిక్కిలి యోగ్యుడు. సత్ప్రవర్తనయు, రాజభక్తియు కలవాడు. అంతేకాక ఈతడు రాజ్యకార్య నిర్వహణయందు మిక్కిలి నేర్పరియై, ఐర్లాండునందును, ఫ్రాన్సుదేశమందలి నార్మండీ రాష్ట్రమందును రాజప్రతినిధిగ వర్తించి, తన శక్తి సామర్థ్యములచే చాల కీర్తి ప్రఖ్యాతులు సంపాదించి యుండెను. అసమర్థుడైన ఆరవ హెన్రీకి వివాహమైన ఆరు సంవత్సరముల వరకును సంతానము కలుగలేదు. సంతానప్రాప్తి కల్గునను ఆశకూడ లేకుండెను. కావున ఆరవ హెన్రీ యనంతరము యార్కు ప్రభువు ఇంగ్లాండు సింహాసనము నధిష్ఠింపవలెనని 1450 వ సంవత్సరమున పార్లమెంటు సభయందు ఒక సభ్యుడు ప్రతిపాదించెను. పార్లమెంటు సభ్యులు పలువురు ఈ ప్రతిపాదన నంగీకరించిరి. కాని రాజైన ఆరవ హెన్రీకాని, ఆతని భార్యయైన మార్గరెట్ రాణికాని ఈ యేర్పాటు నెంతమాత్రమును అంగీకరింపలేదు. తమకు సంతానము తప్పక కలగగలదని వారి విశ్వాసము. హెన్రీ రాజెంతటి అసమర్థుడో ఆయన భార్యయైన

మార్గరెట్ రాణి అంత సమర్థురాలు. ఫ్రాన్సుదేశపు రాకుమారి యైన ఈమె మిక్కిలి ఉత్సాహవంతురాలు. ఆత్మవిశ్వాసమును ధైర్యసాహసములును గలది. యుద్ధనిర్వహణమునందు కాని, శత్రు నిర్మూలనమునకై కావలసిన కాఠిన్యమునందు కాని ఈమె పురుషుల కే మాత్రమును తీసి పోవునది కాదు. హెన్రీ రాజు ఆమె చేతిలో కీలు బొమ్మ. కావున రాజ్యాధికారము వహించి యున్న లంకాస్టరు వంశము వారు, తమకు జ్ఞాతియైన యార్కు ప్రభువుతో రాజీకి రాగల సావకాశము చాల తక్కువగా యుండెను. యార్కు ప్రభువును, ఆతని కుమారుడగు ఎడ్వర్డు ప్రభువును (Edward, Earl of March), వారి మిత్రులును, అనుయాయులును తాము యార్కు పక్షము (Yorkist Party) వారమని ప్రకటించుకొన సాగిరి. యార్కు పక్షము వారికి తెల్లగులాబీపువ్వు చిహ్నము. లంకాస్టరు పక్షము వారికి ఎఱ్ఱగులాబీ పువ్వు గుర్తుగ నుండెను. ఈ కారణముచే ఈ రెండుపక్షముల వారికిని సంభవించిన యుద్ధములను చరిత్రలు "గులాబీల యుద్ధము"లని వర్ణించుచున్నవి. గులాబీల యుద్ధముల కాంగ్లమున "Wars of the Roses" అను నామము వాడబడు చున్నది. ఈ గులాబీల యుద్ధములకు సంబంధించిన వివరములను, ఆయా పక్షముల వారి బలాబలములను, యుద్ధములు సాగుటకు గల ప్రత్యక్ష పరోక్ష కారణములను వర్ణించుటకు పూర్వము, ఆనాటి ఆంగ్లదేశ పరిస్థితులను పాఠకుల దృష్టికి తేవలసి యున్నది.

ఆరవ హెన్రీ రాజు రాజ్యకాల మనేక అనర్థములకు దారి తీసినది. కాని ఆతని యుగమందే పార్లమెంటు సభ ఒక నిర్దిష్ట స్వరూపమును గై కొనుట గమనింప దగిన యంశము. 1429 వ సంవత్సరమున పార్లమెంటు సభవారు ఒక అతి ముఖ్యమైన రాజ్యాంగ శాసనము కావించిరి. ఈ శాసనము ప్రకారము ప్రభుత్వము వారికి సంవత్సరమునకు నలుబది షిల్లింగుల పన్నును చెల్లించు స్వతంత్ర భూస్వాములకు మాత్రమే పార్లమెంటు సభ్యుల నెన్నుకొను అధికార మొసంగబడెను. ఎట్టి ఆస్తిపాస్తులును లేని వ్యర్థులైన ప్రజలను ఎన్నికలలో పాల్గొన నిచ్చినచో, ఆ యేర్పాటు అల్లకల్లోలములకు దారితీయునని పార్లమెంటు ప్రముఖు లభిప్రాయపడిరి. పై విధముగ పార్లమెంటుసభ కొక ప్రమాణ స్వరూపము సిద్ధించెను. పార్లమెంటు సభ్యుల ఎన్నికకు సంబంధించిన ఈ యేర్పాట్లు నాల్గునూర్ల సంవత్సరముల వరకును మార్పు చెందలేదు. ఆంగ్లదేశ చరిత్రలోని అతి ముఖ్యమైన పెక్కు మార్పులు, ఈ పార్లమెంటుసభ ద్వారానే జరిగెను. 19 వ శతాబ్ది యారంభమున ఆంగ్లప్రజలు పార్లమెంటు సభకు ఎన్నికల జరుపు పద్ధతిని మార్పు కావింపవలెనని, సంవత్సరముల తరబడి తీవ్రమైన ఆందోళన జరిపిన పిమ్మట 1832 వ సంవత్సరమున మొదటి పార్లమెంటు సంస్కరణ శాసనము జరిగినట్లు మనము ముందుముందు చూడగలము. పదునేనవ శతాబ్దియందు పార్లమెంటుసభ కొక నిర్దిష్ట స్వరూపమేర్పడిన యంశము నిజమే కాని, ఈ సభయందలి సభ్యులు వట్టి

మట్టిబొమ్మలుగ నుండిరి. ఏ విషయమును స్వతంత్రముగ నిర్ణ యించు అధికారము వారికి లేకుండెను. ఆ కాలమున ప్రబల ముగనున్న జమీందారులు పార్లమెంటు సభను తమతమ ప్రయోజనములను సాధించుటకొరక సాధనముగ నుపయోగించు కొనుచుండిరి. యార్కు పక్షము వారధికారములోనికి వచ్చి నప్పుడు పార్లమెంటుసభ వారి పాట పాడెడిది. లంకాస్టరు పక్షమువారు పైచేయిగ నున్నప్పుడు పార్లమెంటు సభ్యులు యార్కు పక్షముపై కత్తులు దూసి లంఘించెడివారు. జాతీయ క్షేమమును సాధించవలెనను భావ మానాడు పార్లమెంటు సభ కెంతమాత్రము లేకుండెను.

ఆంగ్లదేశపు ప్రభుత్వ మానాడు మిక్కిలి దురవస్థ యందుండెను. ప్రభుత్వ కార్యకలాపములు రాజశాసనముల ప్రకారము నిర్వహింపబడుట అరుదయ్యెను. అందుకు మారుగ కుట్రలద్వారా ఎవరి స్వార్థప్రయోజనములను వారు సాధింప దొడగిరి. జమీందారులు నిర్భయముగ శాసనములను ధిక్క రించెడివారు. వారి నదుపులో పెట్టగల శక్తి రాజున కెంత మాత్రమును లేకుండెను. రాజ్యాంగ విధానమునందలి ఏర్పా ట్లను దుర్వినియోగము కావించి, బలవంతులైన పౌరులు సామా న్యులను బాధింపదొడగిరి. బీదప్రజలు ఎవరైన ప్రబలుడగు జమీందారును తమకు రక్షకునిగ ఎన్నుకొని, ఆతని పోష్యవర్గ ములో చేరవలసియుండెను. లేనియెడల అట్టిప్రజల ప్రాణములు కాని, ఆస్తిపాస్తులుకాని, కనీసపు హక్కులుకాని వారికి దక్కె

డివి కావు. రెండవ హెన్రీ కాలమునుండియు ఇంగ్లాండు దేశము విద్యాసంస్కృతుల యందును, తదితర రంగములందును కొంత అభివృద్ధిని సాధించి యుండెను. ఆ యభివృద్ధియంతయు, ఈ గులాబీల యుద్ధముల కాలమందును, తత్పూర్వము కొంత కాలమునుండియు మరగుపడిపోయెను. రాజమార్గములపై ప్రయాణముచేయు వారికెట్టి సంరక్షణయు లభించెడిది కాదు. రాజాజ్ఞలను కూడ రాజ సేవకులు బహిరంగముగ ధిక్కరింపసాగిరి. 1450 వ సంవత్సరమున హెన్రీ రాజు తన మిత్రుడైన Earl of Suffolk అను తన మంత్రి నొకనిని పార్లమెంటు సభవారి ఆగ్రహమునుండి రక్షింపవలెనను ఉద్దేశ్యముతో, అయిదు సంవత్సరముల కాలము ప్రవాసమున కంపెను. ఈ ఉద్యోగి తనకుగల ధనమును పెట్టెలలో ఇముడ్చుకొని, రెండు చిన్న పడవలలో ఫ్రాన్సుదేశమునకు పోవుచుండెను. ఈతని ధన ప్రాణములకెట్టి ప్రమాదమును లేదని రాజు హామీ ఇచ్చియుండెను. కాని ఇంగ్లీషు సముద్రములో ఈ రెండు పడవలును ప్రయాణము చేయుచుండగా, ఆంగ్ల నౌకా సేనకు చెందిన ఒక యోడ ఈ నౌకలపై దాడిచేసి, Earl of Suffolk ను ఖైదీగ పట్టుకొనెను. రెండు దినములు గడచిన పిమ్మట ఆ యోడ కప్తాను ఆజ్ఞానుసారము నావికులు Suffolk మంత్రిని తుప్పు పట్టిన ఒక కత్తితో ఆరు వేట్లు వేసి అతి క్రూరముగ వధించిరి. రాజ సంరక్షణలో ప్రయాణము చేయుచున్న ఒక మంత్రి, రాజ సేవకులచేతనే బహిరంగముగ వధింపబడుట,

ఆనాటి అరాజక పరిస్థితుల కొక ప్రబల తార్కాణము. రాజునకు గల మహోన్నతాధికారముల నానాడు గంభీరముగ ప్రకటించుట పరిపాటిగనుండెడిది. కాని ఆ రాజు వట్టి వ్యర్థుడై, తన సలహాదారు లెట్లాడించిన నట్లు ఆడుచుండు దుస్థితిలో నుండెను. నిష్పక్షపాతముగ ప్రవర్తింపవలసిన న్యాయాధిపతులు లంచములు గైకొని, తప్పుడు తీర్మానముల నిచ్చుచుండెడివారు. న్యాయసమ్మతమైన తీర్మానములను బలవంతులైన పౌరులు నిర్భయముగ ధిక్కరించి, వ్యవహరింపసాగిరి.

ఇప్పుడు మేము వర్ణింపబోవుచున్న గులాబీల యుద్ధములు సుమారు ముప్పది సంవత్సరముల వరకును చెలరేగి, ఇంగ్లాండు దేశమును చాల అల్లకల్లోలమునకు గురికావించెను. ఈ యుద్ధములను పదునేడవ శతాబ్దియందు స్టూవర్టు రాజవంశమువారికిని పార్లమెంటు సభవారికిని నడుమ ప్రవర్తిల్లిన అంతర్యుద్ధముతో పోల్చవచ్చును. గులాబీల యుద్ధములకు ముఖ్యకారకులు జమీందారులు. ఆ కాలమందు ఫ్రాన్సు దేశములో సాగుచుండిన యుద్ధములలో పాల్గొని, మాతృభూమికి మరలివచ్చిన పెక్కండ్రు సమర్థులైన సైనికులను ఈ జమీందారులు తమ కొలువులోనికి తీసికొనుచుండిరి. ఈ విధముగ ప్రతి పెద్ద భూస్వామివద్దను స్వంతసేనలుండెడివి. అంతేకాదు. ప్రతి జమీందారుడును తన జాగీరులోను, పరిసరములందును నివసించెడి సన్నకారు ప్రజలను అదలించి, బెదరించి, తన పక్షమునకు త్రిప్పుకొనుచుండెను. ఈ కారణముచే మన కథా కాల

కాలమున ఇంగ్లాండు దేశములో స్వతంత్ర రాజ్యములవంటి పెక్కు జమీందారీలు ఏర్పడియుండెను. జమీందారులలో పెక్కండ్రు ఆనాటి రాజకుటుంబమునకు సమీపబంధువులు. తగినంత దౌర్జన్యము నుపయోగింపజాలిన పక్షమున, వారిలో నెవరైన ఇంగ్లాండు సింహాసనము నధిష్ఠించుటకు సావకాశ ముండెడిది. ఏదోవిధముగ రాజ్యాధికారమును హస్తగతము కావించుకొనిన ప్రభువు, పార్లమెంటు సభవారి సహకార మును పొందగల్గెడివాడు. ఆనాటి జమీందారులలో అత్యధిక సంఖ్యాకులు వట్టిస్వార్థపరులు. జాతీయ ప్రయోజనములను, ప్రజాక్షేమమును గుర్తునందుంచుకొనిన జమీందారు లానాడు చాల అరుదు. ఈ జమీందారులందరును కూడ వీరులు. యుద్ధ ప్రియులు. విద్యాసంస్కారములు వీరిలో శూన్యము. పీ రించు మించు ప్రతిదినమును ఎవరో ఒకరితో కలహించి, రక్తము కండ్ల చూచెడివారు. దయాదాక్షిణ్యములు వీరి వద్ద ఎంత మాత్రమును లేకుండెను. అంతేకాదు. జమీందారు లందరిదిని పాము పగ. ఒక పర్యాయము వేరొక కుటుంబములోని వాడెవ డైన తమ కుటుంబమువారి కెవరికైన హాని కల్గించినచో, జమీందారులు దీర్ఘమైన పగపట్టెడివారు. అపకారిని హత మార్చువరకును జమీందారు ఊరకుండెడివాడుకాడు. ఒక జమీందారు శత్రుపక్షములోని పదిమందిని చంపినచో, బాధి తుడైన జమీందారుడు ఆవలి పక్షమువారి నిరువదిమందిని చంపినకాని నిద్రపోవడు. ఈ విధముగ రక్తపాతము మరింత

రక్తపాతమునకు దారితీసెడిది. గులాబీల యుద్ధములకు ముఖ్య హేతువు ఇట్టి ద్వేషములేయని పండితులైన చారిత్రిక ప్రముఖు లభిప్రాయ పడుచున్నారు. లంకాస్టరు పక్షమును, యార్కు పక్షమును సమర్థించెడివారు దేశమం దన్ని ప్రాంతములలోను కూడ ఉండిరి. కాని స్థూలముగ విభాగము చేయవలసినచో, లంకాస్టరు పక్షము వారికి ఇంగ్లాండు దేశమందలి ఉత్తర భాగ మందును, వేల్సు దేశమందును చాల పలుకుబడి యుండెను. యార్కు పక్షము వారి నింగ్లాండు నందలి మధ్య ప్రాంతము వారును, దక్షిణ ప్రాంతము వారును సమర్థించెడి వారు.

సామాన్యులైన ప్రజలకును, పట్టణములలో నివసించు వర్తకులు, పారిశ్రామికులకును ఈ గులాబీల యుద్ధములం దెట్టి ఆసక్తియు లేదని చెప్పినచో అం దతిశయోక్తి ఏదియును లేదు. వారికి కావలసినది దేశమున శాంతిభద్రతలను కాపాడగల బల వత్తరమైన ప్రభుత్వము. యార్కు పక్షము వారును, లంకాస్టరు పక్షమువారును, ఇరువురును కూడ వారి కిష్టులే. ఇరుపక్షముల వారును కూడ ప్రసిద్ధుడైన మూడవ ఎడ్వర్డు రాజు సంతతి వారే కావున వారిలో ఎవ్వ రాంగ్ల సింహాసనము నధిష్ఠించినను అది న్యాయసమ్మతము కాగలదు. ఈ గులాబీల యుద్ధములలో ఏ పక్షమువారు విజయము సాధించిన వారికి రాజధానీ నగర మగు లండనునందు ఘనమైన స్వాగతము లభించెడిది. జమీం దారుల ధూర్తవర్తనమును సామాన్య ప్రజలు బాగుగా ఎరుగు దురు. కావున ఈ జమీందారులతో ఎంతమంది తెగటారిన తమ

కంత క్షేమదాయకమని ప్రజలు భావించుచు వచ్చిరి. సామాన్యు లగు ప్రజ లిట్టి తటస్థభావమును వహించిన కారణమున గులాబీల భయంకర యుద్ధములలో కూడ ఇంగ్లాండులోని పట్టణము లేవియు నష్టమునకు గురికాలేదు. జిల్లాలలోను, గ్రామీణ ప్రాంతములందును, స్థానిక స్వపరిపాలనా సంస్థ లెట్టి మార్పుల కును లోనుగాక యథాతథముగ పనిచేయుచు వచ్చెను.

## గులాబీల యుద్ధములు (1455-1485)

ఇంగ్లాండు దేశమును ముప్పది సంవత్సరముల కాలము మిక్కిలి కలవర పరచిన ఈ యుద్ధములు నామమాత్రమునకు 1455లో ప్రారంభమైనను, అంతకుపూర్వమే సుమారు అయిదు సంవత్సరములనుండి వీనికి హేతువులైన కారణములు బలపడు చుండెను. కొన్ని సంవత్సరములుగ ఇంగ్లాండు దేశమునందు సాగుచున్న అసమర్థ పరిపాలన నంత మొందించుటకును, దుర్బలు డైన ఆరవ హెన్రీ రాజు చుట్టునుచేరి ఆతనిని తమ పలుకు బడిలో నుంచుకొనిన మంత్రులను తరిమివేయుటకును, నిశ్చ యించి Richard, Duke of York అను రాజవంశీకుడు ఐర్లాండు లోని తన ఉద్యోగమును విరమించుకొని ఇంగ్లాండునకు వచ్చెను (1450). యోగ్యుడును, సమర్థుడును, మితవాదియు నగు ఈ రాజపుత్రుని ఇంగ్లాండులోని పెక్కుండ్రు జమీందారులు సమ ర్థించిరి. ఆతని చుట్టును చేరిన దుష్ట మంత్రులను తొలగించి, సమర్థులును, స్వార్థరహితులును, అగువారిని మంత్రివర్గములో

చేర్చుకొనవలసినదని యార్కు ప్రభువు హెన్రీ రాజునకు విన్న పము పంపెను. కాని గర్విష్ఠియైన మార్గరెట్టురాణి రాజుచే ఈ మనవిని తిరస్కరింపజేసెను. 1453 వ సంవత్సరమున ఆంగ్లే యుల సేనలు ఫ్రెంచివారిచే పూర్తిగా పరాభవము చెందెను. ఇందువలన ఇంగ్లీషు వారికి ఫ్రాన్సు దేశమున గల రాజ్యము నశించెను. ఆంగ్లప్రజ లందరును దీని నొక జాతీయావమానముగ భావించిరి. ఇదే సంవత్సరమున హెన్రీ రాజునకు తాత్కాలిక ముగ మతి చాంచల్యము సంభవించెను. అక్టోబరు నెలలో మార్గరెట్టు రాణి కొక కుమారుడు జనించెను. ఈ విధముగ ఆరవ హెన్రీ యనంతరము యార్కు పక్షమువారికి రాజ్యాధి కారము సిద్ధించగల అవకాశము నశించెను. అయినను దేశ భక్తుడును, స్వామి భక్తుడును అగు యార్కు ప్రభువు చింతించి నట్లు కానరాదు. దేశక్షేమమును దృష్టియం దుంచుకొని, రాజ్యకార్య నిర్వహణాధికారమును వశపరచుకొని, హెన్రీ రాజు మతిభ్రష్టుడుగ నున్నంత కాలమును, యార్కు ప్రభువు మిక్కిలి సమర్థతతోడను, నిస్వార్థ బుద్ధితోడను పరిపాలన సాగిం చెను. హెన్రీ రాజునకు ముఖ్య సలహాదారుడును, స్వార్థపరుడు నగు Duke of Somerset అను మంత్రిని యార్కు ప్రభువు అను చరులు చెరపట్టిరి. కాని యార్కు ప్రభువు తన ప్రతిస్పర్ధి కెట్టి హానియు కల్గింపలేదు. యార్కు ప్రభు వనతికాలములోనే ప్రభుత్వమును సంస్కరించి, దేశ పరిస్థితులను చక్కపరచెను. కాని ఈతని అధికారము చాల కాలము వరకును సాగలేదు.

హెన్రీ రాజునకు సంభవించిన తాత్కాలిక మతిభ్రష్టత తొలగెను. రాజు యథాస్థితికి వచ్చిన పిమ్మట యార్కు ప్రభువు రాజ్య సంరక్షకుడుగ నుండుట కెట్టి కారణమును లేదయ్యెను. ఆ కారణముచే 1455 వ సంవత్సరమున యార్కు ప్రభు వధికారము నుండి తనంత తానే తప్పుకొనెను. మార్గరెట్టు రాణియు, ఆమె కిష్టుడగు Duke of Somerset మంత్రియు మరల అధికార సూత్రముల గైకొనిరి. లంకాస్టరు పక్షమువారి బలము మరల స్థిరపడెను. యార్కు పక్షమునకు శాశ్వతముగ పదవీ భ్రష్టత కలిగినట్లు కానవచ్చెను. లంకాస్టరు పక్షమునకు చెందిన ఒమీందారులు యార్కు ప్రభువుపై లేనిపోని నేరములు కల్పించి, ఆతనిని శిక్షించుటకుకూడ పథకములు వేసిరి. ఈ పరిస్థితులను గమనించి, యార్కు పక్షమువారు యుద్ధమువలన కాని తమ పక్షమున కధికారము లభింపదని నిశ్చయించుకొని, సైన్యముల నాయత్తము చేసిరి. రాజు పక్షమువారు కూడ యుద్ధ సన్నాహముల కావించిరి. గులాబీల యుద్ధములు ప్రారంభమయ్యెను.

యార్కు లంకాస్టరు పక్షములవారికి లండను నగరమునకు సమీపమందున్న St. Albans అను పట్టణములో మొదటి యుద్ధము సంభవించెను (1455). ఇందు హెన్రీరాజు పక్షము పూర్తిగా పరాభవము చెందెను. మంత్రియైన Somerset ప్రభువు యుద్ధ భూమిలో మరణించెను. ఆతని కుమారుడు తీవ్రముగ గాయపడెను. రాజు యార్కు పక్షము వారికి వశపడెను. మార్గ

రెట్టు రాణియు ఆమె కుమారుడును, ఒక క్రైస్తవ మఠములో తలదాచుకొనిరి. యార్కు పక్షమువారు 1456 నుండి 1460 వరకును హెన్రీరాజు పక్షమున రాజ్యాంగ వ్యవహారముల నిర్వహించిరి. మార్గరెట్టు రాణియు, యార్కు పక్షమునకు నాయకుడగు యార్కు ప్రభువును, తమ పగను విస్మరించినట్లు కానవచ్చెను. కాని 1460 వ సంవత్సరమున Northampton అను ప్రదేశమున ఇరుపక్షముల వారును యుద్ధమునకు దిగిరి. మరల రాజుపక్షమువారోడిపోయిరి. హెన్రీరాజు యార్కు పక్షమునకు బందీగా చిక్కెను. తన ప్రాణముల కాపాడుకొనుటకై హెన్రీరాజు యార్కు పక్షమువారితో ఒక ఒప్పందమును కుదుర్చుకొనెను. తన జీవితకాలమందు యార్కు ప్రభువు రాజ్యసంరక్షకుడుగ నుండునట్లును, తన యనంతరము ఆతడు రాజగునట్లును, హెన్రీ అంగీకరించెను. ఈ విధముగ రాజు తన కుమారుడు రాజ్యభ్రష్టు డగుటకు తనంత తానే ఏర్పాటుచేసెను. కాని ధైర్య సాహసములకు పుట్టినిల్లైన మార్గరెట్టు రాణి ఈ అన్యాయమున కంగీకరింపలేదు. ఆమె తన సేనలను సమకూర్చుకొని, Wakefield అను ప్రదేశమున శత్రుపక్షము వారిని సంపూర్ణముగ ఓడించెను (1460). అనేకులు సైనికులు మడసిరి. లంకాస్టరు పక్షపు నాయకులు పాతపగలను తీర్చుకొనుటకై తమ శత్రువులను నిర్దాక్షిణ్యముగ తెగటార్చిరి. యార్కు ప్రభువును, ఆతని కుమారుడు Ratland ప్రభువును యుద్ధభూమిలో ప్రాణముల కోల్పోయిరి. మార్గరెట్టు రాణి యార్కు ప్రభువు తలను తెగగొట్టించి, దానిని యార్కు నగరపు కోట గుమ్మమునకు కట్టించెను.

ఈ యుద్ధము తరువాత గులాబీల పోరాటములలో ఒక నూతనాధ్యాయము ప్రారంభమయ్యెను. ఇంతవరకును యుద్ధములను నడపినవారు రాజ నీతిజ్ఞులును, అనుభవశాలురును, అగు వయోవృద్ధులు. దూరదృష్టి కలవారు. వారు యుద్ధములు సాగించినను అకారణ క్రూరత్వమునకు దిగలేదు. కాని ధూర్తురాలైన మార్గరెట్టురాణి నిష్కారణముగ తన శత్రువులలో పలువురను చంపించెను. అందువలన ద్వేషములు బాగుగా ప్రబలెను. యార్కు లంకాస్టరు పక్షములకు రెండింటికిని ఉష్ణరక్తముగల యువకులు నాయకత్వము వహించిరి. వీరందరును సుమారు ఇరువది సంవత్సరముల వయస్సు కలవారు. యార్కు పక్షమునకు Richard, Duke of York కుమారుడు Edward, Earl of March నాయకత్వము పూనెను. అట్లే లంకాస్టరు పక్షములో క్రొత్త Duke of Somerset రంగములోనికి వచ్చెను. వీరందరును తమ తండ్రుల మరణమునకు కారణమైన వారిపై పగ దీర్చుకొనవలెనను భీషణ నిశ్చయముతో యుద్ధమునకు దిగిరి. రాజకీయ లక్ష్యములు మరగుపడి, వ్యక్తిగత ద్వేషములు పైచేయి వహించెను. యార్కు పక్షమునకు నాయకుడైన Edward, Earl of March, 1461 వ సంవత్సరమున తన సేనలను శత్రువులపై నడిపించి, Mortimer's Cross అను ప్రదేశమున ఒక విజయమును సాధించుటయేకాక, తనకు చేజిక్కిన వారి నందరను, శత్రువులు తటస్థులు అను విచక్షణ లేకుండ చంపించెను. ఇట్లు చంపబడిన వారిలో Owen Tudor అను

నిరపరాధి యొకడు. ఈతడు అయిదవ హెన్రీరాజు మరణించిన పిమ్మట ఆతని భార్యయైన కాథరీనును పెండ్లి యాడెను. ఇది యిట్లుండగా యార్కు పక్షమునకు చెందిన Warwick అను జమీందారు లండను నగరమునకు సమీపమున తన సేనలను సమీకరింపసాగెను. కాని ఆ సేనలు బలపడుటకు పూర్వమే మార్గరెట్టు రాణి తన వాహినులతో శత్రువుల నెదిర్చి St. Albans అను ప్రదేశమున గొప్ప విజయమును సాధించెను (1461). ఇది రెండవ St. Albans యుద్ధము. ఈ యుద్ధములో కూడ మార్గరెట్టురాణి రాక్షస యోగ్యమగు క్రూరత్వముతో శత్రువులను పెక్కండ్రను చంపించెను. వృద్ధుడైన హెన్రీరాజు ఇప్పుడు రాణి చేతియందుండెను. శత్రువులు హతమయ్యిరి. కాని ఈమె లండను నగరమునకు మరలిపోయి, రాజ్యమును వశపరచు కొనుటకు మారుగ, తన సేనలతో ఇంగ్లాండు దేశపుటుత్తర ప్రాంతములకు వెడలిపోయెను. Mortimer's Cross యుద్ధమున విజయలక్ష్మిని చేపట్టిన Edward, Earl of March లండను నగరమును ప్రవేశించెను. ప్రజలాతనికి ఘనమైన స్వాగతము నిచ్చిరి. 1461 వ సంవత్సరము మార్చి నెలలో ఈతడు నాల్గవ ఎడ్వర్డు అను బిరుదుతో ఇంగ్లాండు సింహాసనము నధిష్ఠించెను. అనతి కాలములోనే, ఈ రాజు లంకాస్టరుపక్షము వారందరును, రాజద్రోహులని ప్రకటించెను. లంకాస్టరు పక్షము వారి యదృష్టము సంపూర్ణముగ తారుమారయ్యెను.

## నాల్గవ ఎడ్వర్డు (1461 - 1483)

అధికారమును పూనిన వెంటనే ఎడ్వర్డురాజు తన సేనల నుత్తరముగ నడపి, Towton అను ప్రదేశమున లంకాస్టరు పక్షము వారితో యుద్ధమునకు తలపడెను. భయంకరమైన ఈ సంగ్రామములో సుమారు ముప్పదివేలమంది లంకాస్టరు వీరులు మరణించిరి. మార్గరెట్టు రాణి తన భర్తను, కుమారుని వెంట బెట్టుకొని స్కాట్లండు సరిహద్దుకు పారిపోయెను. యార్కు పక్షమువారికి ఘనమైన విజయము లభించెను. మార్గరెట్టురాణి స్కాట్లండునుండి ఫ్రాన్సు దేశమునకు పోయి చేరెను. అచ్చట తనకుగల పలుకుబడి నంతను ఉపయోగించి, కొంత సేనను సమకూర్చుకొని, ఆమె ఇంగ్లాండుపై దండెత్తి వచ్చెను. కాని ఫలితము లేదయ్యెను. రాజు పక్షమువారు మార్గరెట్టు సేనల నోడించిరి. తాత్కాలికముగ ఆమెకు వశపడిన కోటలను మరల ప్రభుత్వసేనలు ఆక్రమించెను (1462). రాణి తన భర్తయైన హెన్రీని ఇంగ్లాండులో విడచిపెట్టి పలాయనము కావించెను. ఈ విధముగ మార్గరెట్టు రాణియు,ఆమె భర్తయు శాశ్వతముగ విడిపోయిరి. 1463, 64 సంవత్సరములలో లంకాస్టరు పక్షము వారు మరికొన్ని తిరుగుబాట్లు కావించిరి. కాని అవి నిరర్థకము లయ్యెను. ఎడ్వర్డురాజు వస్తుతః క్రూరుడు కాడు. కాని శత్రువులు మరల మరల తిరుగుబాట్లు జరిపినందున, ఓరిమి కోల్పోయి, లంకాస్టరు పక్షము వారిని పెక్కండ్రను ఆతడు శిరచ్ఛేదము చేయించెను. అడవులలో కాలము పుచ్చుచున్న

ఆరవ హెన్రీరాజు ప్రభుత్వపక్షము వారికి చిక్కెను. ఆతనిని వారు లండను నగరమునకు తీసికొనివచ్చి, చెరసాలయందు బంధించిరి. మందభాగ్యుడైన హెన్రీరాజు కారాగారమందే తన జీవిత శేషమును గడపెను.

నాల్గవ ఎడ్వర్డు రాజు గొప్ప వీరుడు. ప్రమాద పరిస్థితు లేర్పడినప్పు డెట్టి కష్టములకును జంకక, శత్రువులతో పోరాడి విజయమును సాధించగల మేటి యోధుడు. రాజనీతియందు కూడ ఈత డపారమగు సామర్థ్యముగలవాడు. కాని ఈ రాజు అలసుడు, భోగలాలసుడు. నవయువకుడైన ఈ రాజు వేట, మద్యపానము, స్త్రీ సాంగత్యము మున్నగు సుఖములం దోలలాడుచు, రాజకార్యములం దభిరుచి యెంతమాత్రమును చూపెడివాడుకాడు. యార్కు పక్షమునకు చెందిన ముగ్గురు ఆంగ్ల ప్రముఖు లానాడు ఆంగ్ల రాజ్యాంగములందు ప్రముఖ స్థానము వహించిరి. వీరు ముగ్గురును Neville అను కుటుంబ మునకు చెందినవారు. ఇందు Richard అను నాతడు Warwick జమీందారు. ఈతడు గొప్ప వీరుడు. రాజనీతిజ్ఞుడు. ఇంగ్లాండు దేశమునం దన్ని ప్రాంతములందును కూడ చాల భూవసతిగల వాడు. ఎంత ధనాఢ్యుడో అంత వితరణ గుణము కలవాడు. అనేకులు జనులు సంవత్సరమంతయు ఈ జమీందారున కతిథులై ఆతని జాగీరులలోనే నివసించుచుండెడివారు. వారంద రును సహజముగ Warwick జమీందారునకు కృతజ్ఞులై, కాకిచే కబురుపెట్టినచో ఆతని సహాయమునకు వచ్చి వ్రాలెడివారు.

ఈ జమీందారుని యొక్కయు, ఆతని సోదరుల యొక్కయు సహాయము వలననే నాల్గవ ఎడ్వర్డు రాజు ఆంగ్ల సింహాసనము నధిష్ఠింపగల్గెను. కావున Warwick ప్రభువును ప్రజలందరును సగౌరవముగ King–Maker అనగా "రాజ నియామకుడు" అని వర్ణించుచుండిరి. ఈ Warwick ప్రభువు సోదరుడు Montagu అను నాతడు Northumberland అను జాగీరుకు అధిపతి. మూడవ సోదరుడు యార్కు పీఠము నధిష్ఠించిన ఉన్నత మతాధికారి (Archbishop of York). ఈ సోదరులు ముగ్గురును మిక్కిలి పలుకుబడిగల్గి, ఎడ్వర్డు రాజును నామమాత్రమునకు ప్రభువుగ మన్నించుచు, రాజ్యపరిపాలనను తామే సాగించుచు వచ్చిరి. యువకుడును, విలాస ప్రియుడును అగు ఎడ్వర్డురాజిందులకు ఎంతమాత్రమును అభ్యంతరము తెలపక, రాజకార్య నిర్వహణ భారమును Neville సోదరులకు విడచిపెట్టి, తాను సుఖముగ కాలము పుచ్చసాగెను. ఈ యేర్పాటు కొంత కాలము వరకును చక్కగనే సాగెను. కాని ఇంతలో రెండు బలవత్తర కారణములవలన రాజునకును, ఆతని మంత్రులకును తీవ్రమైన అభిప్రాయభేదము లేర్పడెను. యువకుడైన ఎడ్వర్డు రాజు ఒకానొక సందర్భమున Elizabeth Woodville అను సుందరీమణిని చూచి, మోహించి, రహస్యముగ ఆమెను వివాహమాడెను. ఈ పడుచు వితంతువు. లంకాస్టరు పక్షమున పోరాడి ప్రాణముల గోల్పోయిన ఒక వీరుని భార్య. పరువు మర్యాదలుగల సామాన్య కుటుంబమునకు చెందినది. రాజ

పదవి నలంకరించు ప్రభువు సామాన్య జనులతో వివాహ బంధములు కల్పించుకొనరాదని కొందరు హితచింతకులు కావించిన సదోధనలను పెడచెవినిపెట్టి, ఎడ్వర్డురాజు Elizabeth సుందరిని భార్యగా స్వీకరించెను. Warwick మంత్రికి కొంత కాలము వరకును ఈ రహస్యము తెలియదు. రాజ్యక్షేమమును దృష్టియందుంచుకొని, ఆతడు ఫ్రాన్సు, స్పెయిను దేశముల రాజకుటుంబములలోని ఒక యోగ్యురాలైన కన్యను రాజునకు వివాహము చేయవలెనని యోచించుచుండెను. రాజు కావించుకొనిన రహస్య వివాహమును గూర్చి తెలియవచ్చు సరికి, Warwick మంత్రి కపారమగు ఆశాభంగమును, ఆగ్రహమును కలెను. కాని ఏమియును చేయజాలక మిన్నకుండెను తన వివాహమును గూర్చి అందరకును తెలిసినపిమ్మట ఎడ్వర్డురాజు తన మామను, బావలను, రాణి బంధువులలో కొందరను, ప్రభువుల హోదాతో గౌరవించి, వారికి జాగీరుల నిచ్చెను. ఈ విధముగ అనామకులైన వారు అకస్మాత్తుగ ప్రభువులుగ మారిపోయి, తమతో సమానమగు హోదా నలంకరించుట Warwick మంత్రికిని, ఇతర జమీందారులకును ఎంతమాత్రమును అంగీకారము కాలేదు. మరియొక ముఖ్య విషయమున కూడ రాజునకును, ప్రబలుడైన Warwick మంత్రికిని అభిప్రాయభేదము లేర్పడెను. ఫ్రాన్సుదేశపు రాజు బలవంతుడైన ప్రభువు. కావున అతనితో మైత్రిని, వివాహ బంధములను కల్పించుకొనవలెనని మంత్రి రాజునకు సలహా యిచ్చెను. కాని ఈ పద్ధతి

ఎడ్వర్డు రాజునకు రుచింపలేదు. ఫ్రాన్సుతో సంధి చేసికొనిన పక్షమున ఇంగ్లాండు దేశము ఫ్రెంచి రాజునకు లోబడిపోవలసి వచ్చుననియు, ఫ్రాన్సు దేశముతో ఆ కాలమున వైరము పాటించుచున్న బర్గండీ ప్రభువుతో నెయ్యము కావించుకొనుట శ్రేయస్కరమనియు రాజు అభిప్రాయపడెను. బలవంతుడైన బర్గండీ ప్రభువు సహాయ సంపత్తితో, ఇంగ్లాండు ప్రభువు ఫ్రెంచి రాజు బలము నడుపులో పెట్టవచ్చునని ఎడ్వర్డురాజు భావించెను. ఈ యుద్దేశ్యముతో ఎడ్వర్డురాజు తన సోదరియైన మార్గరెట్టును బర్గండీ ప్రభువును, వీరుడును అగు Charles the Bold అను నాతనికిచ్చి పెండ్లి చేసెను. ఇందువలన Warwick మంత్రి కపార మగు ఆగ్రహము కలిగెను. రాజు అవలంబించిన నీతి దేశమున కును, తమ యార్కు పక్షమునకును, మిక్కిలి ప్రమాదము తెచ్చి పెట్టగలదని Warwick మంత్రి తలంచెను. Lancaster పక్షము వారింకను ప్రబలురుగ నుండిరి. ఫ్రాన్సురాజు సహాయ ముతో వారు ఇంగ్లాండుపై దండెత్తి వచ్చినచో, బర్గండీ ప్రభు వెట్టి సహాయమును చేయలేడు. అట్టి దండయాత్రవలన యార్కు రాజకుటుంబము పదవీభ్రష్టత చెందుటయే కాక తమ వంటి గొప్ప జమీందారుల ఆస్తులు కూడ పోవచ్చునని Warwick మంత్రి భావించెను. మొత్తముమీద ఎడ్వర్డు రాజునకును ఆతని ముఖ్య సహాయకులైన Neville కుటుంబము వారికిని పూర్తిగ విరోధ మేర్పడెను.

రాజ నీతిజ్ఞుడైన Warwick జమీందారు ఎడ్వర్డు రాజు సోదరులలో నొకడైన Duke of Clarence అను వానిని తన వంకకు త్రిప్పుకొని, ఆతనికి రాజ్యాధికారము కలదని బోధించెను. అంతే కాక తన కుమార్తెయగు Isabella ను Clarence ప్రభువున కిచ్చి వివాహము చేసెదనని కూడ వాగ్దానము కావించెను. అటుపిమ్మట Warwick మంత్రి పక్షమునకును, రాజునకును బహిరంగముగ విరోధ మేర్పడెను. ఈ తగవులలో ఒక పర్యాయము Warwick ప్రభువు ఎడ్వర్డు రాజును బందీగ కావించి, Middleham కోటలో నిర్బంధించెను. ఎడ్వర్డు రాజు మార్గాంతరము లేక Neville కుటుంబము వారి సలహాల ప్రకారమే తాను రాజ్య వ్యవహారముల నడుపగలనని వాగ్దానము చేసి, అతి కష్టముపై చెరనుండి బయట పడెను. ఆంగ్ల ప్రజలలో పలువురు యువకుడును, వీరుడును, సుందరుడును, ఉదార స్వభావుడును, ప్రజా సులభుడునైన ఈ రాజు నెడ అనురక్తులై యుండిరి. ఎడ్వర్డు రాజీ యంశమును బాగుగ నెరుంగును. 1470 వ సంవత్సరమున ఎడ్వర్డు ప్రభువు తన పక్షము నపారముగ బలపరచు కొనెను. ఆతని ప్రాబల్యమునకు భయపడి Warwick ను, అతని పక్షము వారును ఫ్రాన్సు దేశమునకు పారిపోయిరి. అచ్చట Warwick ప్రభువునకును ఆరవ హెన్రీ భార్యయైన Margaret రాణికిని సమావేశ మయ్యెను. ఇప్పుడు నాల్గవ ఎడ్వర్డు రాజు వా రిరువురికిని కూడ ప్రబల శత్రువు. కావున తమ పాతపగల నన్నిటిని మరచి, వారు

మైత్రి కావించుకొనిరి. ఆరవ హెన్రీని మరల రాజును కావింతు నని Warwick ప్రభువు మాటయిచ్చెను. ఇంగ్లాండుపై దండెత్తి పోవు నిమిత్తము మార్గరెట్టు రాణి సన్నాహములు చేయ దొడగెను. మరల 1470 వ సంవత్సరమందే Warwick ప్రభువు తన అనుచర వర్గముతో ఇంగ్లాండులో దిగెను. ఆతని కప్పుడు మిగుల మిత్రకోటి యుండెను. వారందరును ఇప్పుడు ఎడ్వర్డు రాజుపై తిరుగుబాటు కావించిరి. రాజు ఈ సంక్షోభము నెదుర్కొన జాలక దేశమునుండి పారిపోయెను. బర్గండీ ప్రభువు ఎడ్వర్డు రాజు సోదరిని వివాహమాడి యుండెను. ఆతని సహాయముతో కొంత సేనను సేకరించుకొని, 1471 వ సంవత్సరమున ఎడ్వర్డు ఇంగ్లాండునకు మరలి వచ్చెను. రాజున కాతని మిత్రులు పలువురు సాయపడిరి. రాజు సోదరుడైన Duke of Gloucester అన్నకు కుడిభుజమువలె పని చేసెను. Warwick పక్షము వారి సేనలకును, ఎడ్వర్డు రాజు సేనలకును Barnet అను ప్రదేశమున యుద్ధము సంభవించెను. ఎడ్వర్డు రాజు విజయమును సాధించెను. Warwick ప్రభువును ఆతని పక్షము వారు పలువురును రణభూమిలో మడసిరి. Barnet యుద్ధము సమాప్తము కానేలేదు. ఇంతలో లంకాస్టరు కుటుంబమునకు నాయకత్వము వహించుచుండిన మార్గరెట్టు రాణి పదునెనిమిది సంవత్సరముల వయస్సుగల తన కుమారుని వెంట బెట్టుకొని, ఇంగ్లాండుపై దండెత్తి వచ్చెను. యార్కు పక్షము వారికిని లంకాస్టరు పక్షము వారికిని Tewkesbury అను ప్రదేశమున

పోరాటము సాగెను. మార్గరెట్టు రాణి కుమారుడైన బాల వీరుడు అభిమన్యునివలె యుద్ధము చేసి రణరంగమున మడసెను. లంకాస్టరు సేనలు పూర్తిగా పరాభవము చెందెను. మార్గరెట్టు రాణి శత్రువులకు చిక్కెను. కొంత కాలము గడచిన పిమ్మట వారామెను విడుదల చేసిరి. లంకాస్టరు పక్షము వారి ఆశ లడుగంటెను. Tewkesbury యుద్ధము ముగియగానే అన్న యైన ఎడ్వర్డు రాజు అనుమతితో ఆతని సోదరుడు Gloucester ప్రభువు, చిరకాలమునుండి నిర్బంధములో నవయుచున్న ఆరవ హెన్రీ రాజును చంపించెను. ఎడ్వర్డు రాజు మార్గ మిప్పుడు పూర్తిగ నిష్కంటక మయ్యెను. ఏ జమీందారుని ఒత్తిడియు లేకుండ ఎడ్వర్డు ప్రభువు తన యిష్టానుసారము రాజ్యపాలన సాగింప జొచ్చెను.

నవ యువకుడుగ నున్నప్పుడు నాల్గవ ఎడ్వర్డు భోగ లాలసుడై రాజ కార్యములతో నెట్టి ప్రసక్తియు పెట్టుకొనెడి వాడు కాడు కాని కాలము గడిచిన కొలదియు ఈతడు పెక్కు కష్టపరంపరల నెదుర్కొన వలసివచ్చెను. తత్ఫలితముగ ఆతని అలసత్వము నశించి, జాగరూకత హెచ్చెను. లోకానుభవము బాగుగా సంపాదించి, ఎడ్వర్డు రాజు స్వయముగ ప్రభుత్వ నిర్వహణము సాగింప జొచ్చెను. రాజు సోదరులలో నొకడైన Duke of Clarence ప్రభువు విరోధులతో కుట్రలు పన్ని, అన్నకు చాల హాని చేకూర్చెను. అందువలన ఎడ్వర్డు రాజు సమీప బంధువులను కూడ నమ్ముట మాని వేసెను. Duke of

Gloucester అను నాతడు ఎడ్వర్డు రాజునకు మరియొక సోదరుడు. ఈతనిని మాత్రము రాజు నమ్మెడివాడు. ఈ రాజు పార్లమెంటు సభవారిపై ఏ విధముగను ఆధారపడకుండ స్వతంత్రముగ రాజ్యపరిపాలన సాగించవలెనని నిశ్చయించుకొనెను. అందువలన ఆతడు పార్లమెంటు వారిని నూతనమగు పన్నుల విధించుటకై ఎన్నడును అనుమతి యడుగలేదు. తనకు గల ఆదాయముతోడనే ఈతడు పొదుపరితనముతో రాజ్యపరిపాలన సాగించెను. యుద్ధములు ధన సాధ్యములు. ధనముకొరకై పార్లమెంటు సభవారి నర్థించుట కిష్టములేక ఎడ్వర్డు రాజు ఎవరితోడను యుద్ధమునకు దిగలేదు. ఈతడు ఫ్రాన్సు దేశముతో సంధిచేసికొని, ఫ్రెంచి రాజునుండి సంవత్సరమునకు 50,000 బంగారు నాణెములు కప్పముగా గైకొన సాగెను. ఈ విధముగ ఈ రాజు తాను స్వతంత్రుడుగ మెలగుచు, దేశమునకు శాంతిని చేకూర్చెను. శత్రురాజైన ఫ్రాన్సు ప్రభువునకు ఎడ్వర్డు రాజనిన సింహస్వప్నముగ నుండెడిది. ఈ ప్రభువు వివాహమును గూర్చి ఈ వరకే తెలుపబడినది. Elizabeth అను భార్యవలన ఈతని కైదుగురు కుమార్తెలును, ఇరువురు కుమారులును కల్గిరి. 1483 వ సంవత్సరము నాటికి ఎడ్వర్డు రాజు పెద్ద కుమారుడు పండ్రెండేండ్ల వాడయ్యెను. ఈ కుమారుడు తన యనంతరము రాజు కావలెనని ఎడ్వర్డు రాజు ఆశయము. కాని ఆతని మనోరథము సఫలము కాలేదు. అకస్మాత్తుగ రోగగ్రస్తుడై, పది దినములు మాత్రము మంచము పట్టి, దృఢ శరీరు

డైన ఎడ్వర్డు 1483 నందు మరణించెను. బాలురైన ఈతని కుమారులకు పినతండ్రియైన Duke of Gloucester సంరక్షకు డయ్యెను.

## మూడవ రిచర్డు (1483 - 1485)

నాల్గవ ఎడ్వర్డురాజు మరణానంతరము ఆతని పెద్ద కుమారుడును, పండ్రెండు సంవత్సరముల బాలుడును, అగు ఎడ్వర్డు అయిదవ ఎడ్వర్డు అను పేరుతో రాజు కావలసియుండెను. కాని అట్లు జరుగలేదు. అన్న కుమారులను శత్రువుల బారి నుండి రక్షించెదనని ప్రకటించి, రాజ్య సంరక్షకుడగు Richard, Duke of Gloucester, ఆ రాకుమారుల నిరువురను తన అధీనములోనికి తెచ్చుకొనెను. వారి నాతడు Tower of London అను కోటలో విడిది చేయించెను. ఈ కోట అత్యంత భయానకమగు చరిత్ర కలది. ఇందు ప్రవేశపెట్టబడిన మానవు లెవ్వరును కూడ మరల ప్రాణములతో బయటపడలేదు. అనేక కారణములు చెప్పి, రాజ్య సంరక్షకుడగు రిచర్డు ప్రభువు బాల రాజైన ఎడ్వర్డు పట్టాభిషేకమును ఆపుచేయించెను. రాకుమారుల మేనమామలు, రాణియొక్క యితర బంధువులను Gloucester ప్రభువు నిర్బంధించి, వీలైనంతవరకు చంపించెను. బాలురైన రాజకుమారుల కెచ్చటినుండియు సహాయము లభింప కుండునట్లుగ ఈతడు కట్టుదిట్టము కావించెను. ఆ పిమ్మట రిచర్డు తనకు రాజ్యాధికారము లభించుటకై మరియొక పెద్ద ఎత్తు వేసెను. తన అన్నయైన నాల్గవ ఎడ్వర్డు Elizabeth

Woodwille అను స్త్రీతో కావించుకొనిన వివాహము సక్రమ మైనది కాదనియు, అందువలన ఆ సంబంధమువలన కల్గిన సంతతి అశాస్త్రీయ సంతానమనియు, రిచర్డు ప్రభువు తనకు మిత్రు లైన మతాధికారులచే ధర్మోపన్యాసములు చేయించెను. నాల్గవ ఎడ్వర్డురాజును గూర్చి కూడ అపవాదులు ప్రచారము లోనికి వచ్చెను. కాని ప్రజలలో పలువురీ దుష్ప్రచారమును నమ్మినట్లు లేదు. తుదకు రిచర్డుప్రభువు మిత్రులలో నొకడైన Buckingham అను నాతడు రాజ సంరక్షకుని సమీపించి, ఆత నినే రాజ్యాధికారము పూనవలసినదిగా ప్రార్థించెను. తనకు రాజ్యాభిలాష యెంతమాత్రమును లేదనియు, కాని ప్రజల కోరికల మన్నించియు, దేశము నరాజకత్వమునుండి కాపాడుట కొరకును, తాను రాజపదవి నంగీకరించినట్లు నటించి, రిచర్డు ప్రభువు మూడవ రిచర్డు అను బిరుదుతో రాజయ్యెను. అధి కారము పూనిన అనతి కాలములోనే రిచర్డురాజు లండను కోటలో విడిది చేసియున్న బాలురైన రాకుమారుల నిరువు రను తన సేవకులచే చంపించెను. ఈ దారుణ కృత్యము ప్రజ లలో అసంతృప్తిని, ఆగ్రహమును కల్గించెను.

భ్రాతృద్రోహము కావించి, సింహాసన మధిష్ఠించి, రాజ్యాధికారము వహించిన, ఈ రిచర్డు చాల సమర్థుడైన వీరుడు. పరిపాలనాదక్షుడు. అధికారము పూనినది మొదలుగ ఈతడు పరిపాలనా విధానమును చాల సంస్కరించెను. లోపములను సవరించెను. ప్రజల కష్టనిష్ఠురములను స్వయముగ విని, వారికి

న్యాయము చేకూర్చసాగెను. ఎడ్వర్డు రాజు కాలములో పార్ల మెంటు సభకు ప్రాధాన్యత తగ్గెను. ఆ రాజు పార్లమెంటును సమావేశ పరచెడివాడే కాడు. రిచర్డు ఆ పద్ధతిని మార్చి, పార్ల మెంటు సభను తరచు సమావేశ పరచసాగెను. కాని ఎంత చేసినను ప్రజ లీతనియెడల అనురక్తులు కాలేదు. ఈతడు బాల హంతకుడనియు, న్యాయ సమ్మతుడగు ప్రభువు కాడనియు ప్రజలు తలంచసాగిరి. దుష్టుడైన ఈతనిని తొలగించి వేరొకరిని రాజుగ చేయవలెనని జమీందారులు నిశ్చయించిరి. Henry Tudor, Earl of Richmond అను లంకాస్టరు పక్షపు జమీం దారు ఆంగ్ల సింహాసనమునకు సమీప వారసుడు. ఈతడు మూడవ ఎడ్వర్డు రాజు సంతతికిని, ఫ్రాన్సుదేశపు రాజుల సంత తికిని చెందినవాడు. ఆంగ్ల జమీందారులు పలువురీతనిని సమ ర్థించిరి. Richmond జమీందారైన Henry చాల సమర్థుడు. ఈతడు సేనల కూర్చుకొని, రిచర్డు రాజుతో యుద్ధమునకు సంసిద్ధుడయ్యెను. Bosworth అను ప్రదేశమున ఇరువాగుల వారును తలపడిరి. రిచర్డురాజు అత్యంత పరాక్రమముతో పోరా డియు, తుదకు పరాజితుడై, ప్రాణముల గోల్పోయెను (1485). Henry జమీందారు ఏడవ హెన్రీ బిరుదముతో ఇంగ్లాండునకు ప్రభువయ్యెను. Bosworth యుద్ధము గులాబీల యుద్ధములలో తుది పోరాటము. యార్కువంశము అంత మొందెను. ట్యూడరు వంశమువారి పరిపాలన ఆరంభ మయ్యెను.

---

తొమ్మిదవ ప్రకరణము

# ఉపసంహారము

## స్కాట్లండు దేశము

స్థలాంతరమున మనము రెండవ ఎడ్వర్డురాజు కాలము వరకును ఇంగ్లాండు స్కాట్లండు దేశములకు గల సంబంధమును తెలిసికొని యుంటిమి. Bannockburn యుద్ధములో విజయమును సాధించిన పిమ్మట స్కాట్లండు ప్రభువులు సర్వ స్వతంత్రులుగా వ్యవహరింప జొచ్చిరి. 1328 వ సంవత్సరమున ఇంగ్లాండు దేశ ప్రభుత్వము స్కాట్లండు రాజుల సర్వ స్వాతంత్ర్యమును గుర్తించెను. స్కాట్లండు దేశపు స్వాతంత్ర్యమును సాధించిన రాబర్టు బ్రూసు రాజు 1329 వ సంవత్సరమున మరణించెను. ఈతని మరణానంతరము ఆరు సంవత్సరముల బాలుడైన యీతని కుమారుడు రెండవ David అను బిరుదుతో సింహాసనము నధిష్ఠించెను. ఈతని బాల్యకాలమున స్కాట్లండు దేశమునం దల్లకల్లోలములు ప్రారంభమయ్యెను. జమీందారులు చెలరేగి రాజ్యాధికారమును ధిక్కరించిరి. పదచ్యుతుడైన John Balliol పక్షమువారు ఇంగ్లాండులో నివసించసాగిరి. వారందరును అప్పుడు స్కాట్లండులో ప్రవేశించి, తమకు పూర్వ ముండుటగల భూవసతులను మరల స్వాధీన పరచుకొనుటకై యత్నింప సాగిరి. సంప్రాప్త వయస్కుడైన పిమ్మట కూడ డేవిడు రాజెట్టి ప్రత్యేక సామర్థ్యమును ప్రదర్శింపలేదు. ఈతడు ఫ్రాన్సు దేశముతో మైత్రిని

ప్రాకటించి. 1346 వ సంవత్సరమున ఇంగ్లాండు దేశముపై
దండెత్తి పోయెను. కాని ఇంగ్లీషువారీతని నోడించి చెరపట్టిరి.
పదకొండు సంవత్సరములు ఇంగ్లాండులో ఖైదీగానుండి, ఆటు
పిమ్మట ఒక పెద్ద మొత్తము ధనమును చెల్లించి, ఈ రాజు విడు
దల పొందెను. ఈ రాజు అనంతరము ఈతని సమీపబంధువైన
Robert అను నాతడు స్కాట్లండునకు ప్రభువయ్యెను. ఈతనిం
రెండవ రాబర్టురాజు అను పేరుదు [illegible]చెను. ఈతడు స్కాట్లండు
ఇంగ్లాండు దేశముల చరిత్రలలో తరచుగ వినవచ్చు స్టూవర్టు
సంతానమునకు స్థాపకుడు. ఈతడును, ఈతని యనంతరము
రాజ్యాధికారియై ప్రాసిన మూడవ రాబర్టు ప్రభువును
కూడ అసమర్థులు. మూడవ రాబర్టు రాజు తన కుమారుడైన
మొదటి జేమ్సును విద్యాభ్యాసము కొరకై ఫ్రాన్సు దేశము
నకు పంపుచుండగా ఆంగ్ల నౌకలు రాకుమారుని బందీగ పట్టు
కొనెను (1406). పదునెనిమిది సంవత్సరము లాంగ్లేయుల
వద్ద ఖైదీగనుండి, ఈ రాజు ఆ పిమ్మట స్వదేశమునకు రా
గలెను. మొదటి జేమ్సు రాజు చాల సమర్థుడు. ఇంగ్లాండు
దేశమునందు రాజు తన జమీందారుల నణచివైచి, ఎట్లు బల
వంతుడుగ నున్నదియు, అతడు స్వయముగ చూచి యుండెను.
కావున తన దేశములో కూడ పెద్ద భూస్వాములను తన అదుపు
ఆజ్ఞలలోనికి తెచ్చుకొనుటకై ఈతడు గట్టి ప్రయత్నములు
చేసి. అందు చాల వరకు కృత్యుడయ్యెను. జేమ్సు రాజు
కాఠిన్యమునకు కినిసి, జమీందారు లాతనిని 1437 వ సంవత్సర

మును చంపి వేసిరి. ఈతని కుమారుడైన రెండవ జేమ్సు రాజు తండ్రి మరణించునపుడు ఏడు సంవత్సరముల బాలుడు. ఈతని కాలమున Douglas కుటుంబమునకు చెందిన జమీందారులు చాల ప్రబలులైరి. యుక్తవయస్కుడైన పిమ్మట ఈ జేమ్సు రాజు డగ్లసు కుటుంబముపై కత్తి కట్టి, వారి నోడించి, వారి కోటలను ధ్వంసము చేసి, ఆ జమీందారులను దేశము నుండి పారద్రోలెను. అందువలన ఈ కుటుంబము వారు జేమ్సు రాజునకు పక్కలో బల్లెమువలె ఇంగ్లాండునందు నివసింప సాగిరి. 1460 వ సంవత్సరమున ఒక ఫిరంగి ప్రమాదములో జేమ్సు ప్రభువు మరణించెను. ఈతని కుమారుడైన మూడవ జేమ్సు రాజు తొమ్మిది సంవత్సరముల వయస్సున రాజ్యాధికారమునకు వచ్చి, ఇంగ్లాండు దేశములోని ట్యూడరు రాజులకు సమకాలీనుడుగ పరిపాలించెను. ఈతనికి సంగీతము, శిల్పము మున్నగు, లలితకళల యందు చాల ఆసక్తి యుండెను. కాని రాజ్యకార్య నిర్వహణము నందెట్టి ప్రత్యేక సామర్థ్యమును లేకుండెను. అందు వలన ఈ రాజు కాలమున స్కాట్లండు దేశములో అల్లరులు, అంతర్యుద్ధములు చెలరేగెను. ఈ రాజు డెన్మార్కు దేశపు రాజుకుమార్తెను వివాహమాడినందున, ఈతనికి Orkeny, Shetland అను దీవులు కట్నముగ లభించెను. ఈ ద్వీపములు స్కాట్లండు దేశమునకు సమీపమున నున్నవి. కావున జేమ్సు రాజు వివాహమువలన స్కాట్లండు రాజ్యపు పరిమితి విస్తరించెను. ఈ రాజ్యమునకు నేటి స్వరూప మానాటినుండియే యేర్పడినదని చెప్పవచ్చును.

ప్రకృతి సిద్ధముగ బ్రిటను దేశ మంతయు ఒక్క ప్రతి (Unit) అని చెప్పవచ్చును. ఇందు పశ్చిమభాగమున గల వేల్సు భూభాగమును ప్రసిద్ధుడైన మొదటి ఎడ్వర్డురాజు జయించి, ఇంగ్లాండులో చేర్చుకొనెను. ఈ విధముగ ఈ రెండు భూఖండములకును రాజకీయైక్యత సిద్ధించెను. ఇంగ్లాండున కుత్తరమున నున్న స్కాట్లండు దేశమును కూడ తన స్వాధీనములోనికి తెచ్చుకొనవలెనని మొదటి ఎడ్వర్డు ప్రభువు కావించిన తీవ్ర యత్నములు ఫలవంతములు కాలేదు. ఈ యత్నముల సాగించునప్పుడు ఎడ్వర్డు రాజు పెక్కు యుద్ధములుచేసి, స్కాట్లండు దేశమున కపారమైన జననష్టమును, ధననష్టమును కల్గించెను. అందువలన స్కాట్లండు ప్రజలలో ఇంగ్లాండు రాజుల యెడలను, ఇంగ్లాండు ప్రజల యెడలను తీవ్రమగు ద్వేష మేర్పడెను. ఎట్టి కష్టములు వచ్చినను, ఆంగ్ల ప్రభుత్వమును ధిక్కరింపవలసినదే కాని దానికి తలయొగ్గరాదను దృఢనిశ్చయము వారిలో యేర్పడెను. ఆంగ్ల దేశమును ద్వేషింపనివాడు నిజమైన స్కాట్లండు దేశభక్తుడు కాజాలడను భావము ప్రబలెను. అందువలన 18 వ శతాబ్దము వరకును ఈ దేశములకు రెండింటికిని రాజకీయమైత్రి ఏర్పడలేదు.

ఆంతరంగిక విషయములలో స్కాట్లండుదేశ మింగ్లాండు దేశముయొక్క ఉన్నత స్థాయికి చిరకాలమువరకును రాలేక పోయెను. ఇచ్చట స్థిరమైన కేంద్రప్రభుత్వము కాని, సువ్యవస్థితమగు స్థానిక ప్రభుత్వసంస్థలు కాని, శాంతి భద్రతలుకాని

నెలకొనలేదు. ఇందులకు పెక్కు కారణములు కలవు. భౌగోళికముగ స్కాట్లండు భూమి రెండు ఖండములుగ ఏర్పడి యున్నది. దక్షిణమున నిమ్న ప్రాంతములును (Lowlands), ఉత్తరమున Highlands అనగా ఉన్నతభూములును వ్యాపించి యున్నవి. ఇచ్చటి ప్రజలు భిన్నజాతులకు చెందినవారు. భిన్న భాషలను వాడుచు, వీరు భిన్నసంస్కృతుల పెంపొందించుకొనిరి. ఈ రెండు విభాగములందును సాంఘికవ్యవస్థ వేరుగ నుండెను. స్కాట్లండు ప్రజలలో కొందరు ఇంగ్లీషు భాషను, ఉన్నత భూములలోని వారు Yaelic అను ప్రాంతీయభాషను వాడుచుండిరి. ఈ దేశములోని కొందరు ఇంగ్లాండులో వలెనే Anglo-Saxon లు, డేనులు, నార్మనులు, మున్నగు వారి సంతతివారు. మరికొందరు ప్రాచీనులైన Celt జాతి వారినుండి ఉద్భవించిన వారు. ఈ కారణముచే వారి సంస్కృతుల యందు కూడ భేదము లుండెను. Bruce రాజవంశీయులు తొమ్మిదవ శతాబ్దిలో స్కాట్లండు భూమిని పరిపాలించిన Kenneth Mac Alpin యొక్కయు; సుప్రసిద్ధ ఆంగ్లప్రభువైన ఆల్ఫ్రెడురాజు యొక్కయు వంశమునకు చెందినవారు. స్టూవర్టు వంశము వారు Macbeth రాజునకు సమకాలీనుడైన Banqno అను వీరుని వంశమున నుద్భవించినారమని చాటుకొనెడి వారు. ఈ యంశము సత్యదూరము కాకపోవచ్చును. Macbeth వీరుడు మహాకవి షేక్స్పియరు రచించిన ప్రసిద్ధ దుఃఖాంత నాటకమునకు కథా నాయకుడను నంశమును పాఠకు తెరింగి యే

యుండుచు. ప్రాచీనమగు వంశములకు చెందిన ఈ రాజులను స్కాట్లండు ప్రజలు చాల భక్తి గౌరవములతో మన్నించెడి వారు. కాని ప్రజల కపారమగు రాజభక్తి యున్నంత మాత్ర మున దేశమున నుత్తమమగు ప్రభుత్వము నెలకొనజాలదు. ఇంగ్లాండులోవలె స్కాట్లండు దేశములో ప్రజా ప్రాతినిధ్యము వహింపగల పార్లమెంటుసభ యేర్పడలేదు. పార్లమెంటుసభ స్థాపితమైన పిమ్మట ఆంగ్ల సమాజమందలి వివిధ వర్గములతో సామరస్యము, ఐకమత్యము ఏర్పడెను. అట్టి పరిణామములు స్కాట్లండులో సంభవింపలేదు. స్కాట్లండు దేశమునందలి జమీం దారులు, ఇంగ్లీషు జమీందారులకంటె హెచ్చు స్వాతంత్ర్యము ననుభవించుచు, తమతమ జాగీరులలో న్యాయసభలను కూడ ఏర్పాటు చేసి యుంచెడివారు. రాజు నెలకొల్పిన న్యాయ స్థానము లీ జమీందారుల న్యాయ సభలతో పోటీ చేయ లేక పోయెడివి. ఇంగ్లాండు దేశములోవలె స్కాట్లండులో శాంతి భద్రతల కాపాడుటకొరకు రాజుగారి తరఫున ఎట్టి గౌరవోద్యోగులును పనిచేసెడివారు కారు. స్కాట్లండు దేశపు జమీందారులలో కూడ రెండు తరహాలవారుండిరి. కొందరు ఇంగ్లాండు దేశములోవలె రాజుగారివద్దనుండి పెద్ద జాగీరు లను పొంది, రాజునకు విధేయులై యుండుచు వచ్చిరి. స్కాట్లండు నందలి ఉన్నత భూములలో నివసించు జమీందారు లట్టివారు కారు. వారి సంఘ వ్యవస్థ ప్రాచీనతరమైనది. ఆ జమీందారులు వేరు వేరు తెగలకు నాయకులై, తత్కారణ మున గొప్ప భూవసతులు కల్గియుండిరి. ఈ తెగవారు నివ సించు ప్రదేశములు చిన్న స్థానిక రాజ్యములు. ఈ తెగల నాయ

కులు స్కాట్లండు రాజును తమ యేలికగ మన్నించుచుండిన కారణమున, ఈ చిన్న రాజ్యము లన్నియు ఒక సమాఖ్యగ నేర్పడియుండెనని చెప్పవచ్చును. ఉన్నత భూముల జమీందారు లలో **Gordon, Campbell** వంశముల వారు ప్రఖ్యాతులు.

స్కాట్లండు దేశ మీవిధముగ రాజకీయ రంగమున అల్ల కల్లోలములకు గురియై యుండినను, సామాన్య ప్రజలు మాత్రము క్రమముగ అభివృద్ధి చెందుచు వచ్చిరి. స్కాట్లండు దేశీయులు చాల కష్టజీవులు. మిక్కిలి శ్రమపడి పనిచేయు వారు. పొదుపరులు. కావున అచ్చటి కృషీవలురును, వర్తకులు, మున్నగు వారలును ఆర్థికముగ ముందంజవేసిరి. క్రైస్తవ మత సంఘము, వారి యందు నెలకొనియుండు ఘూర్తతను, క్రూరత్వ మును చాలవరకు తగ్గించగల్గెను. మధ్యమ యుగమందు స్కాట్లండు దేశమున నెందరో ఉత్తములైన క్రైస్తవ మతాధికారు లును, పాదిరీలును ఉద్భవించిరి. పదునేనవశతాబ్దములో స్కాట్లండు దేశమున **St. Andrews, Glasgow, Aberdeen** అను మూడు విశ్వవిద్యాలయములు వెలసి, విద్యాప్రచారము కావించెను.

## ఐర్లాండు

బ్రిటను దీవులలో ఒకటియైన ఐర్లాండు బ్రిటను దేశము నకు పశ్చిమ దిశయందు నెలకొని యున్నది. ఈ ద్వీపపు మధ్య

యున చరిత్రలో ముఖ్యముగా తెలుపదగిన యంశము క్రైస్తవ
మత వ్యాప్తి. క్రైస్తవేతరులైన జర్మను అనాగరిక జాతుల
వారు ఇంగ్లాండు దేశము నాక్రమించుకొనుటకై పెనగు
లాడుచున్న కాలమునందే, ఐర్లాండు ప్రజలు క్రైస్తవ మతమును
స్వీకరించియుండిరి. పండ్రెండవ శతాబ్ది వరకు ఈ దేశమున
ఇతర ఐరోపాదేశములలోవలె జమీందారీ విధానము వ్యాపింప
లేదు. ఇచ్చట వేరు వేరు తెగలవారు నాయకుల యాజమాన్య
మున కాలము పుచ్చుచు వచ్చిరి. రాజనామకులైన వీరందరి
పైనను ఒక రాజరాజు అధికారము నెరపుచుండెడివాడు.
ఈ సార్వభౌముండొక మత గురువని మనము పరిగణింపవచ్చును.
ఈతనిని "High King of Tara" యని వ్యవహరించుచుండెడి
వారు. ఈ "టారా" యనునది ఒక పవిత్రమైన కొండ. దీని
మీద మిక్కిలి ప్రాచీనమైన మట్టిప్రాకారములుండెడివి. ఈ
రాజరాజున కెట్టి రాజకీయాధికారములును ఉన్నట్లు కానరాదు.
తెగలకు నాయకులలో వారివంశావళులను గూర్చి అభిప్రాయ
భేదములుత్పన్నమైనచో ఈ సార్వభౌముడు వానిని పరిష్క
రించుచుండెను. స్థానికులగు ఈ ఐర్లాండు ప్రజలే పట్టణమును
నెలకొల్పి యుండలేదు. వారు పల్లెలలోనే నివసించుచుండిరి.
ఐర్లాండు దేశ చరిత్రలో తరువాత ఘట్టము ఔత్తరాహజాతుల
వారి దండయాత్రలు. స్కాండినేవియా దేశములలో నివసించు
అనాగరకులగు దోపిడిదారులు ఐర్లాండుపై దండెత్తి వచ్చి,
స్థానిక ప్రజలను పలుతెరగుల బాధించిరి. కాని ఈ అనాగరకు

ఈ దేశమున కొంత సేవకూడ గావించిరి. వారు నేటికిని ఐర్లాండు ద్వీపమున ప్రసిద్ధిగాంచియున్న Dublin, Waterford, Limerick, Cork అను పట్టణముల స్థాపించిరి. అయినను మొత్తము మీద ఐర్లాండు దేశపు స్థితిగతు లీదండయాత్రల మూలముగ మారినట్లు తెల్పుటకు వలనుపడదు. ఇతర దేశములలోవలెనే ఐర్లాండు ద్వీపమునందు కూడ రాజరాజు పదవిని పొందుటకై స్థానిక ప్రభువులలో అంతఃకలహములు చెలరేగెను. పన్నెండవ శతాబ్దియందు Leinster ప్రాంతపు ప్రభువు ఇంగ్లాండు దేశపు రాజైన రెండవ హెన్రీ సహాయము నర్థించెను. ఆ సహాయముతో ఐర్లాండులో తన యాధిపత్యమును నెలకొల్పుకొనవలెనని ఆతని యాశయము. తన రాజ్యమునందలి ఆంగ్లో-నార్మను వీరుల సహాయమును పొందుటకై హెన్రీ రాజు Leinster ప్రభువు కనుమతి యొసంగెను. తత్ఫలితముగ 1169 వ సంవత్సరమున Anglo-Norman వీరులు పలువురు ఐర్లాండు ద్వీపమునకు పోయిరి. ఈ సంఘటన ఐర్లాండు దేశపు ఇతిహాసములో ఒక అతిముఖ్యమైన ఘట్టము. ఈ విధముగ ఐర్లాండు దేశమును ప్రవేశించిన ఆంగ్లేయవీరులకు నాయకుడు Pembroke జమీందారైన Richard de Clare అను నాతడు. ఈతనికి Strongbow అనగా మహాధన్వి యను బిరుదనామముండెను. ఈ జమీందారు అనుచరులు నార్మండీ ప్రాంతమునుండియు, వేల్సు దేశమునుండియు వెలువడిరి. ఈ వలసయందు పాల్గొనిన వారికి నాయకులు నార్మనులు. సైనికవర్గము వేల్సు ప్రాంతీ

గలరు. ఈ నూతనాగంతకులలో. ఆ నాటి ఐర్లాండువారి విధా
నము వ్యవస్థ స్థాపించియుండెను. ఈ గంతకులు రాజ్యపాల
నమునం బాగెరిగినవారు కావున, వారు స్థానికులైన ఐర్లాండు
సామాన్యులను సులభముగ నోడింపగల్గిరి. ఐర్లాండు ద్వీపమును
కొంత భాగములచే జయించియు. పెంబ్రోకు జయించినారు
నా ప్రాంతములో స్వతంత్రమగు రాజరికమును స్థాపింపలేదు.
అందులకు మారుగ ఆతడు తాను జయించిన రాష్ట్రమును
తన యేలికయగు రెండవ హెన్రీకి సమర్పించెను. 1171 వ
సంవత్సరమున రెండవ హెన్రీ ఐర్లాండు దేశమునకు పోయి,
స్వల్పకాలమచ్చట గడపి, స్థానిక ప్రభువుల నందరను తనకు
సామంత రాజులుగ నంగీకరించి, స్వదేశమునకు మరలివచ్చెను.
రాజకీయ వ్యవహారములందు హెన్రీ రాజునకు లోబడిన ఐర్లాండు
దేశము మతవిషయికముగ కూడ ఇంగ్లాండు ప్రభువునకు లోను
కావలసివచ్చెను. చిరకాలమునుండి ఐర్లాండు మత సంఘము
పోపుమతాధికారి యాధిపత్యము నంగీకరింపక స్వతంత్రముగ
నుండుచువచ్చెను. ఈ యంశము రోము మతాధికారి కెంత
మాత్రమును రుచింపకుండెనని వేరుగ తెలుపనక్కరలేదు.
ఈ కథాకాలమున నాల్గవ Adriun అను ఆంగ్లేయుడు పోపు
పదవి నలంకరించియుండెను. ఆతనియందు స్వజాత్యభిమానము
దృఢముగ నుండియుండవచ్చును. ఏది యెట్లున్నను ఆతడు
1155 వ సంవత్సరమున నొక శ్రీముఖము జారిచేసి, ఐర్లాండు
మత సంఘము ఇంగ్లాండు దేశపు రాజునకు లోబడియుండవలె

నని ప్రకటించెను. ఈ విధముగ పరిస్థితులు అనుకూలముగా నున్నను, ఐర్లాండు ద్వీపమునంతను సంపూర్ణముగ తన యాధిపత్యములోనికి తెచ్చుకొనుటకు కాని, అచ్చటి సమస్యలను గూర్చి చింతించుటకు కాని రెండవ హెన్రీ రాజు తగినంతగ శ్రద్ధవహింపలేదు. పదమూడవ శతాబ్దియందు ఆంగ్ల జమీందారులు కొందరు ఐర్లాండు ద్వీపములోని కొన్ని భాగములను తమ యాధిపత్యములోనికి గైకొనివచ్చిరి. ఈ జమీందారీ కుటుంబములలో Fitzgerald కుటుంబ మొక్కటి. Kildare కుటుంబమునకు చెందిన ప్రభువులు Fitzgerald కుటుంబమున కొక శాఖ. Kildare ప్రభువులు ఐర్లాండు ద్వీపమందలి మధ్య ప్రాంతములోను, దక్షిణ ప్రాంతములోను, విశాలమైన భూఖండములను జయించి, స్వాధీనపరచుకొనిరి. William De Burgh అను నార్మను వీరుడు Ulster జమీందారుల వంశమునకు మూల పురుషుడు. Ormond జమీందారీలో Butler వంశము వారు తమ అధికారమును నెలకొల్పుకొనిరి. జాను రాజునకు వంటవాడైన (Butler) Theobald Walter అను నాతడీ కుటుంబములో మొదటి పురుషుడు. ఇంగ్లాండు రాజు పక్షమున వ్యవహరించుచు వచ్చిన ఈ జమీందారుల అధికారము, ఐర్లాండు ద్వీపము యొక్క దక్షిణ ప్రాంతము అందలి పట్టణములలోను, Dublin పట్టణపు పరిసరము అందును సాగుచుండెడిది. ఐర్లాండు రాజ్యపు ముఖ్య పట్టణమైన డబ్లిన్ నగర పరిసర ప్రాంతములను "Pale" అని వ్యవహరించెడివారు. ఈ ప్రదేశ మాంగ్ల రాజు నధికారమునకు లోబడిన

దక్షిణ ప్రాంతమని మనకు మర్ధము చెప్పుకొన వచ్చును. ఈ దక్షిణ ప్రాంతమునకు వెలుపల పెద్ద పెద్ద జమీందారుల జాగీరు భూములును, దానికి పశ్చిమమున సరిక్రొత్త పరిష్కృతమగు అనాగరిక ప్రాంతములను వ్యాపించి యుండెను. ఇచ్చట ఇంగ్లాండు నుండి వలసవచ్చిన ఆంగ్లో నార్మనులును, వేల్సు ప్రాంతీయులును, స్థానికులగు ఐర్లాండు నివాసులును, ఇంచుమించు సమాన బలముతో నివసించుచు వచ్చిరి. పదమూడవ శతాబ్ది తుదిభాగమందు ఐర్లాండులో ఒక పార్లమెంటు సభ ఏర్పాటయ్యెను. అందు ఐర్లాండు ద్వీపములో నివాసముగనున్న ఆంగ్లేయులకే కాని, స్థానిక ప్రజలకు ప్రాతినిధ్యము లేకుండెను. ఈ కారణము వలన స్థానికులకును, వలస వచ్చిన వారికిని గల విభేదములు మరింత తీవ్రముగ పరిణమించెను.

ఇంగ్లాండు దేశమునుండి యేతెంచిన విజేతల ధాటికి నిలువజాలక స్థానికులైన చిన్న చిన్న రాజులు కొంతకాలము వరకు పరాజయములకు తలయొగ్గి మిన్నకుండిరి. అటు పిమ్మట వారిలో ఆత్మ విశ్వాసము మరల అంకురించెను. ఈ స్థానిక ప్రభువులు స్కాట్లండు దేశమునుండి వీర సైనికులను రావించి, తమ కొలువులో చేర్చుకొనసాగిరి. ఈ స్కాట్లండు యోధులు గండ్ర గొడ్డలిని ధరించి, భయంకరముగ పోరాడెడి వారు. వీరి సహాయముతో ఐర్లాండు రాజులు తాము కోల్పోయిన రాజ్యమును మరల సంపాదింప జొచ్చిరి. కాలము గడచిన కొలదియు ఇంగ్లాండునుండి యేతెంచిన ఆంగ్లో నార్మను

జమీందారుల భావములలో మార్పు సంభవింప జొచ్చెను. వారిలో కొందరు స్థానిక ప్రభువులతో వివాహ బాంధవ్యముల నెరపి, శాశ్వతముగ ఐర్లాండు నివాసమున కంగీకరింపసాగిరి. వీరి కైర్లాండు భూమియే మాతృభూమి అయ్యెను. కాల క్రమమున ఈ ప్రభువులకు సుదూరమందలి లండను ప్రభుత్వము పరప్రభుత్వముగ కానరాసాగెను. పరప్రభుత్వము వారి యధి కారమునుండి తప్పించుకొనవలెనని వీరుకూడ వాంఛింప సాగిరి. ఐర్లాండు రాజ్యములో స్వతంత్ర భావములు చెల రేగుటకు ఆంగ్లరాజుల అశ్రద్ధయే కొంతవరకు కారణము. ఇంగ్లాండు ప్రభువులు తమ పక్షమున రాజ్యపరిపాలన సాగించు టకై ఐర్లాండు దేశమునకు రాజ కుటుంబము వారి నెవరినైన తప్పకుండ పంపుచు వచ్చినచో, ఐర్లాండు దేశము కాలక్రమ మున ఇంగ్లాండు ప్రభుత్వమునకు లోనయ్యెడిది. కాని అట్లు జరుగలేదు. మొదటి ఎడ్వర్డు రాజువంటి సమర్థుడైన రాజు ఆంగ్ల శాసనములను, పరిపాలనా విధానమును, ఐర్లాండులో ప్రవేశ పెట్టగల్గినను దానివలన నెట్టి శాశ్వత పరిణామములును కలుగలేదు. రెండవ ఎడ్వర్డురాజు కాలమున స్కాట్లండు దేశము స్వతంత్ర మగుటచే, తాముకూడ అట్లే విడుదల సాధింపవలెనని ఐర్లాండు ప్రజలు ఉత్సాహపడిరి. కాని ఆ యత్నములు కొనసాగలేదు రాబర్టు బ్రూసు సోదరుడైన David Bruce అను నాతడు ఐర్లాండు దేశముపై దండెత్తివచ్చి, 1316 వ సంవత్సరమున అచ్చట నొక స్వతంత్ర రాజ్యమును

స్థాపించి, పట్టాభిషేకము కూడ కానించుకొనెను. కాని అనతి కాలములోనే ఇంగ్లీషు జమీందారు లాతనిని యుద్ధములో పరాభవించిరి. డేవిడు బ్రూసు రణరంగమునకు బలియయ్యెను. ఆంగ్లో నార్మను జమీందారులు స్కాట్లండు రాజుల ప్రభుత్వ మైర్లాండులో నెలకొనకుండ చేయగల్గిరేకాని, ఇంగ్లీషు ఆచారములు, ఆంగ్ల శాసనములు, ఆంగ్లభాషను వ్యాప్తిలోనికి తేజాలకపోయిరి. Ulster ప్రాంతములో స్థానికులైన O' Neill వంశమువారు బాగుగా బలపడిరి. ఈ ప్రాంతములోనే తమ యధికారమును నెలకొల్పుకొనిన De Burgh వంశము వారిలో పురుషసంతతి నశించెను (౧౩౩౩). ఒక్క బాలికమాత్రము వారి ప్రతినిధిగ నిలచెను. మూడవ ఎడ్వర్డు రాజు ఈ బాలికను తన రెండవ కుమారుడైన Lionel, Duke of Clarence అను రాజపుత్రునకిచ్చి వివాహము చేయించెను. ఈ విధముగ ఐర్లాండు రాజ్యములో తన యధికారము శాశ్వతముగ నిలచి యుండగలదని ఎడ్వర్డు ప్రభువు భావించెను. కాని ఆతని యాశయ మీడేరలేదు. ఐర్లాండుదేశపు స్థానిక సాంప్రదాయముల ప్రకారము స్త్రీలద్వారా ఎవ్వరికిని ఆస్తిపాస్తులు కాని, అధికారము కాని, సంక్రమింపవు. అందువలన De Burgh వంశమువారి ఇతరజ్ఞాతులు లా జమీందారీనంతను తమలో తాము పంచుకొనటయే కాక, తాము ఐర్లాండు ప్రజాసంఘములో లీనమైపోయిరి. వారు తమ పాత పేర్లను విడనాడి Burke, Mac William మొదలైన ఐర్లాండు నామములను స్వీకరించిరి. వీరు ఆంగ్ల ప్రభుత్వ

ప్రతినిధులను బహిరంగముగ ధిక్కరించిరి. ఐర్లాండు ద్వీపము లోని పశ్చిమ ప్రాంతములలో ఫ్రెంచిభాషయు, ఐరిష్ భాషయు మాత్రము వాడుకలో నుండెను. ఆంగ్లభాష సంపూర్ణముగ అచ్చటినుండి అదృశ్యమయ్యెను.

ఇంగ్లాండురాజు అధీనములోనున్న "Pale" అను ప్రాంతములోను తత్పరిసరములందును ఆంగ్ల సభ్యతయు, ఆంగ్ల జీవన విధానమును, శాశ్వతముగ నుండుటకొరకు విధానముల నారయుటకై, ఆంగ్ల పార్లమెంటు పదునాల్గవ శతాబ్దములో సమావేశ మయ్యెను. ఇంగ్లాండు దేశమునుండి ఐర్లాండునకు వలసపోయిన ప్రజలు ఐర్లాండు జీవిత పద్ధతుల నవలంబింప రాదనియు, ఇంగ్లీషువారి యాజమాన్యములో నున్న ప్రాంత ములలో నివాసముగ నున్న స్థానికులగు ఐర్లాండుప్రజ లాంగ్ల పద్ధతుల స్వీకరింపవలెననియు, పార్లమెంటువారు శాసనముల కావించిరి. కాని ఇందువలన నెట్టి ఫలితమును లేదయ్యెను. ఇంగ్లాండురాజు అధీనములో నున్న నార్మను జమీందారులు కూడ స్థానికులగు ప్రజ లాంగ్ల శాసనములను, జీవిత పద్ధతులను అవలంబించుట కెంత మాత్రమును అంగీకారము చూపలేదు. "Pale" అను ప్రాంతమున కావలనున్న భూభాగములో స్థాని కులగు రాజులును, Fitzgerald కుటుంబపు శాఖలవారును, తమ యిచ్చవచ్చిన చొప్పున రాజ్యపరిపాలనము సాగింపజొచ్చిరి. ఐర్లాండు ద్వీపములో స్థానిక ప్రభువుల పరిపాలనకాని, నార్మను జమీందారుల యాధిపత్యముకాని శాశ్వతముగ నెలకొనకుండ

ఇంగ్లీ ప్రభుత్వమువారు కట్టుదిట్టములు చేసిరి. కాని వానికి ప్రత్యామ్నాయముగ మరియొక్క పరిపాలనా విధానమును వారు ఏర్పాటు చేయజాలరైరి. తుదకు తమ ప్రజలు స్థానిక ప్రజలలో లీనమై పోకుండునట్లుగ కూడ వీరు అరికట్ట లేరైరి. ట్యూడరు రాజుల పరిపాలనలో ఇంగ్లాండు ప్రభువులు పెక్కు కష్ట నిష్ఠురముల నెదుర్కొని ఐర్లాండు దేశమును మరల జయింపవలసిన వారైరి. ఎనిమిదవ హెన్రీరాజు కాలమున జరిగిన క్రైస్తవ మత సంస్కరణముపలన, ఐర్లాండు దేశమును ఇంగ్లండురాజుల పరిపాలనలోనికి గొనివచ్చుట ఇంకను కష్టతరము ఆయ్యెను.

## 1066 నుండి 1485 వరకు ఇంగ్లాండు దేశము
## ( సింహావలోకనము )

1485 వ సంవత్సరమున ట్యూడరు వంశమువా రింగ్లాండు దేశమున కేలికలైన యంశమును మనము గుర్తించి నారము. ఇది యీ దేశపు ఇతిహాసములో ఒక ముఖ్యఘట్టము. ప్రస్తుతాధ్యాయమును ముగించుటకు పూర్వము నార్మను రాజుల పరిపాలన ప్రారంభమైన పిమ్మట, ఇంగ్లాండు దేశచరిత్ర యందలి విశేషములను సింహావలోకనము కావించుట అనావశ్యకము కానేరదు. 1066 వ సంవత్సరమున నార్మను ప్రభువైన మొదటి విలియం రాజు (విజయభూషణుడు) రాజ్యాధిపత్యము వహించు సరికే ఇంగ్లాండు దేశమున సుస్థిరమగు ప్రభుత్వము నెలకొని యుండెను. వేల్సు స్కాట్లండు దేశము లింగ్లాండు దేశపు రాజునకు సామంత రాజ్యములను భావముకూడ ఆ నాడు వ్యాప్తిలో నుండెను. రాజులు తమ రాజ్యాంగ సలహాసంఘము వారి

సలహా ప్రకారము రాజ్యపరిపాలన చేయుచుండిరి. ఈ సలహా సంఘములో, విద్యావయోవృద్ధులగు శిష్టులు, రాజుగారి పరివార మండలి ఉద్యోగులు, ఉన్నత మతాధికారులు, మతాధిపతులు, జమీందారులును చేరియుండిరి. ఈ పరిస్థితులు సుస్థిరమగు ప్రభుత్వ స్థాపనమునకు చాల అనుకూలమైనవి. కాని ఆ కాలమునందే దేశైక్యతను విచ్ఛిన్నము కావించి, శాంతి భద్రతలకు ముప్పుతేగల ఒక ఏర్పాటు కూడ క్రమక్రమముగ వ్యాప్తిలోనికి రాజొచ్చెను. ఇంగ్లాండు దేశమునందును, తదితర ఐరోపా దేశములందును కూడ, ఫ్యూడలు విధానము లేక జమీందారీ విధానము అమలులోనికి రాసాగెను. ఈ జమీందారులు లేక భూస్వాములు ప్రభువర్గము వారని పిలువ బడెడివారు. వీరు చిన్న చిన్న రాజ్యములను స్థాపించుకొని, రాజును లక్ష్యము చేయక సర్వస్వతంత్రులై యుండవలెనని యత్నించెడివారు. కాని ప్రజాసామాన్య మీఫ్యూడలు జమీందారుల ఆదర్శమును బలపరచ లేదు. దేశమంతయు ఒక్కటియే యనియు, అందలి ప్రజలందరును కూడ రాజుగారి యధికారమును మన్నించి, రాజశాసనములకు లోబడి, దేశక్షేమమును శాంతిని కాపాడవలెననియు వారు (సామాన్య ప్రజలు) దృఢముగ నమ్మెడివారు. రాజ్యమునందలి ప్రజలందరికిని కూడ కొన్ని హక్కులును, కొన్ని బాధ్యతలును కూడ ఉండెడివి. అవి స్థానిక పరిస్థితులను బట్టియు, సౌకర్యముల బట్టియు మారుచుండెడివి. ఆనాడు దేశమునందున్న పెద్ద జమీందారులు రాజుగారి

సలహాసంఘములో సభ్యులుగా నుండెడివారు. చిన్న తరహా జమీందారులు స్థానిక సంఘములగు Shire-Moot, Hundred-Moot సభలలో సమావేశమై స్థానిక విషయములను చర్చించి, ప్రజలలో సంభవించిన వివాదములను కూడ పరిష్కారము చేయుచుండెడివారు. ఇది యిట్లుండగా నార్మను ప్రభువైన విలియం ఇంగ్లాండున కేలికయై, దేశీయైక్యతను విచ్ఛిన్నము చేయదలచిన జమీందారులను కఠినముగ దండించి, అదుపులోనికి తెచ్చెను. శాంతి భద్రతలను కాపాడెను. కాని ఈ రాజు కాలములో ఫ్యూడలు విధానము ఆర్థిక విషయములందును, సాంఘిక విషయములందును, బలపడెను. దేశమునందలి వేరు వేరు ప్రజల కౌండొరులతో గల సంబంధములును, వారికి సమాజమునగల హోదాయును, భూముల నిచ్చి పుచ్చుకొనుట వలనను, వారు నిర్వహించు నిత్యధర్మముల బట్టియు, నిర్ణయింపబడసాగెను.

1066 వ సంవత్సరము తరువాత ఇంగ్లాండు దేశము నేలిన ప్రభువులలో నలువురు రాజులు ముఖ్యముగా పేర్కొనదగిన వారు. విజయభూషణుడనబడు మొదటి విలియం, ఆతని కుమారుడు మొదటి హెన్రీ, మొదటి హెన్రీ మనుమడు రెండవ హెన్రీ, రెండవ హెన్రీ మునిమనుమడు మొదటి ఎడ్వర్డు. మొదటి విలియం రాజు దేశీయైక్యతను విచ్ఛిన్నము కావింపగల శక్తులను అణచివైచి, శాంతిభద్రతల నెలకొల్పెను. మొదటి హెన్రీ రాజ్య పరిపాలనయందు మిక్కిలి దక్షుడు.

ఆత డింగ్లాండు దేశ పరిపాలన కొరకై ఒక చక్కని రాజ్యాంగ యంత్రమును సిద్ధము చేసెను. రెండవ హెన్రీ రాజు చాల దూరదృష్టిగల రాజనీతివేత్త. ఇంగ్లాండు దేశమున సుస్థిరమైన రాజకీయైక్యత నెలకొన వలెనన్నచో రాజు బలవంతుడుగ నుండవలెనని ఆతడు గుర్తించెను. ప్రజానురాగము వలన రాజు బలవంతుడగును. అందులకై ఆతడు న్యాయసమ్మతముగ పరిపాలన చేయుచు, ప్రజల కెల్లరకును న్యాయము లభించునట్లు శ్రద్ధవహింపవలెను. హెన్రీ రాజు పై లక్ష్యముల సాధించుటకై ఘనమైన కృషి సల్పెను. రాజునకు ప్రతిస్పర్ధులై నిలువ దగిన వారు ఫ్యూడలు జమీందారులు. హెన్రీ రాజు ఈ జమీందారీ వర్గమును పూర్తిగ అదుపులోనికి తేగల్గెను. నార్మను రాజులకు పూర్వపు యుగములో రాజుగారి సలహా సంఘములో విద్యావయోవృద్ధులగు శిష్టులు కూడ చేరియుండిరి. వారిప్పుడు పూర్తిగ అదృశ్యులయిరి. వారికి మారు రాజుగారి పరివారము నందలి ఉన్నతోద్యోగులు రాజ్యాంగ సలహా సంఘములో మిక్కిలి ప్రాముఖ్యమును సంపాదించిరి. ఇది ఏమంత వాంఛనీయమైన పరిణామము కాదు. దేశప్రజలను కాపాడుటకై రాజు బలవంతుడుగ నుండుట ఆవశ్యకమే కాని ఆ రాజు తన అధికారములను, బలమును, ప్రజాక్షేమము కొరకై వినియోగింప వలెను కాని, స్వార్థప్రయోజనముల సాధించుటకు ఉపయోగింపరాదు. ఇదియొక పెద్ద సమస్య. రెండవ హెన్రీ కుమారులలో నొకడైన జాను రాజు మహాపత్రము Magna Carta అను రాజ్యాంగపు దస్తావేజుపై సంతకము చేయవలసి

వచ్చెను (1215). అందువలన రాజు అవమానము పాలయ్యెను. జమీందారులు విజయము సాధించిరి. మహాపత్రములో జమీం దారులకు గల హక్కులు ఉద్ఘాటింపబడెను. "చిరకాలముగ దేశము నందంగీకృతములై యున్న నియమముల కనుగుణ్యముగ రాజు పరిపాలన సాగించవలెను. ఆతడు తన పరిధిని దాటి, తన జమీందారులకు చెందవలసిన హక్కులను భంగపరచగాదు" అను సూత్రము మహా పత్రమునందు కానవగును. "ఇంగ్లాండు దేశమున రాజు నిరంకుశుడుగ వర్తించుటకు వలనుపడదు. ఆతడు మానవమాత్రుని కెవ్వనికిని లొంగి యుండనక్కర లేదు కాని భగవంతునికిని, ధర్మమునకును ఆతడు లొంగి యుండ వలయును" అను అత్యంత ప్రధానమగు రాజకీయ సిద్ధాం తము జానురాజు కాలములో అంగీకృతమైనట్లు గొప్ప చారి త్రికు లంగీకరించుచున్నారు. ఈ విధముగ రాజుయొక్క నిరంకుశాధికారమునకు సంకెళ్ళు తగిలెను. గొప్ప వీరుడును, శాసన నిర్మాతయు, పరిపాలనాదక్షుడును, అగు మొదటి ఎడ్వర్డురాజు పదమూడవ శతాబ్దాంతమున పార్లమెంటు సభను సృష్టించెను. అది పదునాల్గవ శతాబ్దియందును తదనంతరమును చక్కగ వ్రేళ్ళు నాటుకొని, బలపడెను. పార్లమెంటుసభ వికా సము వలన రాజుయొక్క నిరంకుశ పరిపాలనకు శాశ్వతమును, బలవత్తరమును అగు నిరోధ మేర్పడెను. కాని అది పదునేడవ శతాబ్దినాటి మాట. ఈ ప్రజా ప్రతినిధిసభ యేర్పాటువలన కల్గిన సద్యః ఫలితము జమీందారులకు రాజ్యాంగ విధానము

నందు నెలకొనియుండిన పలుకుబడి క్షీణించుట. ఇంతకు పూర్వము రాజ్యాంగ వ్యవహారముల నిర్వహించుటయందు రాజు గొప్పగొప్ప భూస్వాములతో సంప్రతించవలెనను సాంప్రదాయ మేర్పడి యుండెను. ఎడ్వర్డురాజు ఏర్పాటు చేసిన పార్లమెంటు సభయందు గొప్ప భూస్వాములును, ఉన్నత మతాధికారులును మాత్రమే కాక, చిన్నతరహా భూస్వాముల ప్రతినిధులును, వర్తకుల ప్రతినిధులును, తక్కువ తరహా మతాధికారులును కూడ చేరియుండిరి. ఆ కాలమునాటి వారి యేర్పాటును గూర్చి ఏమి చింతించినను, అయ్యది రాజ్యాంగ విధానములో చాల గొప్పమార్పుగ పరిణమించెను. ప్రజలకు ప్రాతినిధ్యము వహించు హక్కు జమీందారులకు మాత్రమే కాక ఇతరులకుకూడ కలదను యంశ మిందు అంగీకరింపబడెను. సామాన్య ప్రజలకు నిజమైన ప్రతినిధులు చిన్న చిన్న భూస్వాములు, వర్తకులు, పట్టణపౌరులు, చిన్నతరహా మతాధికారులును, అను భావము క్రమముగ బలపడెను. ప్రప్రథమమున నీ పార్లమెంటు సభవారి యధికారములు చాల సంకుచితముగ నుండెడివని యీ వరకే తెలుపబడినది. ఈ సభవారు మొట్టమొదట రాజుగారి యుద్దేశ్యము లెట్టివో ఆయన మంత్రులు వివరింపగా విని, ప్రభువుగారికి కావలసిన పన్నులను మంజూరు చేయుట మాత్రము కావించుచుండిరి. బహుశః దేశమందలి వేర్వేరు జిల్లాలలోని ప్రజలకుగల కష్టనిష్ఠురముల గూర్చి కూడ ఆ సభ్యులు తమలో తాము చర్చించుకొను చుండెడి

వారు. ఏది యెట్లున్నను మొదటి ఎడ్వర్డు రాజు కాలమున నీ పార్లమెంటుసభ రాజకీయ రంగమున జరిగిన యొక ప్రయోగమని మాత్రము చెప్పవలసి యున్నది. రాజు తలంచు కొనిన పక్షమున ఈ ప్రయోగాత్మక కృషిని విడనాడి యుండ వచ్చును. కాని అట్టిపని జరుగలేదు. క్రమక్రమముగ పార్లమెంటుసభ బలపడినది. రెండు మూడు శతాబ్దుల తరువాత ఇంగ్లాండు రాజ్య పరిపాలనకై రాజు ఎంతముఖ్యుడో పార్లమెంటు సభకూడ అంతే ముఖ్యమైనదను భావము రాజ నీతిజ్ఞులందరిలోను ప్రబలెను. కాలము గడచిన కొలదియు పార్లమెంటు సభవారి యధికారములు హెచ్చెను. ప్రభుత్వము వారు కావించు ముఖ్యమైన కార్యకలాపముల కన్నిటికిని పై సభవారి ఆమోదము కావలెను. ప్రాచీన సాంప్రదాయముల వేనినైన మార్చ దలచినచో పార్లమెంటువా రందుల కంగీకరింప వలయును. రాజు క్రొత్త పన్నులను విధింపదలచినచో ఆయన పార్లమెంటు సభయందలి ప్రజాప్రతినిధుల యనుమతిని పొందవలెను. తలవని తలంపుగ సంభవించిన కొన్ని సంఘటనలు కూడ పార్లమెంటు సభవారి బలిమికి సహాయపడెను. ఫ్రాన్సు దేశముతో తాను కావింప దలచిన యుద్ధ వ్యయముల కొరకై, మూడవ ఎడ్వర్డు రాజు పార్లమెంటు సభను అర్థించెను. నాల్గవ హెన్రీరాజు వంశక్రమాగతమగు హక్కు లేకుండ ఇంగ్లాండు సింహాసనము నధిష్ఠించెను. ఆతనికి పార్లమెంటు సభవారి సహాయము తప్పనిసరి యయ్యెను,

గులాబీల యుద్ధములు సాగిన కాలములో ఇరుపక్షముల వారును కూడ తాము కావించిన చర్యలను సమర్థించు కొనుటకై ప్రజాప్రతినిధి సభవారి సహాయము ముఖ్యమని భావించి, అందులకై చాల ప్రయత్నము చేసెడి వారు. ఈ విధముగ పార్లమెంటుసభ తలచూపి, క్రమక్రమముగ బలపడెను.

పదునేనవ శతాబ్దిలో జరిగిన గులాబీల యుద్ధములందు జమీందారులు చాల వరకు మరణించిరి. వారి బలము క్షీణించెను. ఇక ఆంగ్లరాజ్యాంగములో భాగములైన రాజును, పార్లమెంటు సభయు మాత్రము నిలచియుండెను. ప్రజా ప్రతినిధి సభలో జమీందారులును, సామాన్య ప్రజల ప్రతినిధులును కూడ ఉండెడి వారు కదా! జమీందారులలో పలువురు నశించుట వలన ప్రజాప్రతినిధుల బలము సహజముగ పెచ్చెను. ప్రజాప్రతినిధులు శాంతికాములు. శాంతిభద్రతలు కాపాడ బడినచో సామాన్య జనులు సుఖముగ నుండి, సర్వవిధముల అభివృద్ధి చెందగలరు. రాజు తనకు ప్రతిస్పర్ధులగు జమీందారుల నణగద్రొక్కి తన యధికారమును బలపరచుకొనుటకై యెల్లప్పుడును ఉవిళ్ళూరు చుండెడి వాడు. అతడే రాజ్యమునకు స్థిరత్వమును, దేశప్రజకు శాంతిని ప్రసాదించుటకు సమర్థుడు. కావున ప్రజాప్రతినిధులైన చిన్నతరహా జమీందారులు, వర్తకులు, పారిశ్రామికులు, పాదిరీలు మున్నగు వారు రాజును హృదయపూర్వకముగ బలపరచిరి. వారి సహాయముతో రాజు జమీందారులను పూర్తిగ క్రుంగదీయుటకై

ప్రయత్నించెను. ఈ యత్నములకు ప్రజాప్రతినిధు లెట్టి యస మ్మతియు తెలుపలేదు. స్థానిక ప్రభుత్వసంస్థలను రాజు ఏ విధముగను మార్పుచేయలేదు. స్థానిక పరిపాలనా రంగమున అచ్చటి పెద్దలు ప్రభుత్వ ప్రతినిధులుగ వర్తించుచు, నేరస్థులను పట్టి దండించి, శాంతిని కాపాడి, జనసామాన్యము తమ వృత్తుల నెట్టి అవరోధములును, బాధలును లేకుండ సాగించుకొనునట్లు ఏర్పాటు చేసిరి. భయంకరమైన గులాబీల యుద్ధములలో కూడ ఇంగ్లాండు నందు స్థానిక స్వపరిపాలనా విధాన మేవిధము గను తారుమారు కాలేదు

పదునేనవ శతాబ్ది అంతము నాటికి, ఆంగ్లేయుల భాష ఒక స్థిరమైన రూపము తాల్చినదని చెప్పవచ్చును. అయిదవ శతాబ్దములో ఇంగ్లాండు దేశముపై దండెత్తి వచ్చిన అనాగరక తెగలవారు వేరువేరు భాషలను మాట్లాడు చుండిరి. ఆ ఆదిమ జనుల భాషకు లిఖిత స్వరూపములేదని వేరుగ తెలుప నక్కర లేదు. నార్మనుల రాకకు పూర్వమే ఈ భాషకు క్రైస్తవ మత సంఘమునందు వాడబడు ల్యాటిను భాషతో సంపర్క మేర్పడెను. ఆ విధముగ ఆంగ్ల భాషకు స్థిరమైన స్వరూపమును, ఉదాత్తతయు లభించెను. మరికొంత కాలము గడచుసరికి ఇంగ్లాండు ప్రజలకు డేనులతో సంబంధ మేర్పడెను. ఈ విధ ముగ ఆంగ్ల భాషలోనికి నూతన పదములును, పదబంధ ములును, ప్రవేశించెను. నార్మనుల రాకతో ఫ్రెంచి భాష ఇంగ్లాండు దేశమునందు ప్రవేశించెను. ఇంగ్లీషు భాషపై ఫ్రెంచి

భాష యొక్క ప్రభావ మనివార్యముగ ముద్రిత మయ్యెను. పదమూడవ శతాబ్దినాటికి ఇంగ్లాండు దేశమంతంతటను ఒక సామాన్య భాష వాడుకలోనికి వచ్చెను. ఆ కాలమునాటి గ్రంథములు కూడ నేడు లభ్యమగు చున్నవి. ఆ గ్రంథముల లోని భాష ఈనాటి సామాన్యులైన ఆంగ్లేయునకు కూడ అర్థము కాక పోవచ్చును. కాని అది ఆంగ్ల భాష యొక్క ఒక ప్రాచీన స్వరూపమని వారు గుర్తింప గలరు. మూడవ ఎడ్వర్డు రాజునకు సమకాలీనుడైన జఫరీ ఛాసరు ఆంగ్ల భాషలో మొదటి ఉత్తమ కావ్యరచయితగ కొనియాడబడు చున్నాడు. పదునాల్గవ శతాబ్ద మంతమగు సరికి ఇంగ్లాండు దేశములోని పెద్దపెద్ద జమీందారులు కూడ ఫ్రెంచి భాషను విడనాడి, ఆంగ్లములోనే సంభాషించు కొనుట ప్రారంభించిరి. తన రాజ్యములో ఆంగ్లమే ప్రభుత్వ భాషగ వ్యవహరింప బడవలెనని మూడవ ఎడ్వర్డు ప్రభువు శాసించెను. ఈ విధముగ ఆంగ్లభాష ఇంగ్లాండు ప్రజల నందరను ఏకత్రము చేయగల భాషా బంధముగ నేర్పడెను.

ఈ కథాకాలమున ఆంగ్ల ప్రజలకు నిశిష్టత నొసంగిన యంశ మొక్క భాష మాత్రమే కాదు. ఐరోపాఖండము నందలి ఇతర దేశములవలె కాక ఆంగ్లేయులు శాసన నిర్మాణము నందొక ప్రత్యేకతను పునర్నిర్మించిరి. ఒకానొక కాలమున ఐరోపాఖండము నందలి దేశములన్నియు రోమను సామ్రాజ్యా ములో అంతర్భాగములుగ నుండెను. రోమనులు గొప్ప

శాసన నిర్మాతలుగ ప్రఖ్యాతి వహించిరి. అందువలన రోము సామ్రాజ్యము నశించిన పిమ్మట కూడ ఐరోపా జాతులవారు రోమను శాసనములను యథాతథముగ స్వీకరించిరి. బ్రిటను ద్వీపము కూడ నాల్గు శతాబ్దుల కాలము రోమనుల యాధిపత్యములో నుండినను, అనంతర కాలమున వారు శాసన నిర్మాణమునందు రోమనులను అంధప్రాయముగ అనుకరింప లేదు. తమ దేశమునకును, ప్రజలకును, అనుకూలమైన పద్ధతిలో వారు శాసన నిర్మాణము కావించు కొనిరి. ఆంగ్లేయుల శాసనము లందును, వారు నెలకొల్పిన సంస్థలందును, ప్రజాస్వామిక విధానపుఛాయలు స్పష్టముగ కానవచ్చును. పార్లమెంటు సభ, జ్యూరీవిధానము, ప్రజాప్రతినిధుల ద్వారా స్థానిక స్వపరిపాలనను నిర్వహించుట, రచనా స్వాతంత్ర్యము మున్నగునవి పదునేనవ శతాబ్దియందే తలచూపి, కొంత వరకు బలపడెను.

మనమింత వరకును పరామర్శ కావించిన యుగమును మధ్యమ యుగమని పండితులు పర్ణించుచున్నారు. ఈ యుగమందు క్రైస్తవ మతసంఘము మిక్కిలి ఉన్నతస్థితిలో నుండెను. ఆ కాలమున ప్రజానీకమునందు భక్తి విశ్వాసములు హెచ్చుగ నుండెడివి; స్వతంత్రాలోచన కావించి, మానవులలోను, సంస్థలలోను గల యథార్థతత్వమును గ్రహించునట్టి శక్తి ఆకాలపు ప్రజలలో లేదు. మధ్యమ యుగపు ప్రజలలో వ్రాతకోతలు నేర్చినవారు చాల అరుదు. ఇక ప్రామాణిక భాష

యగు ల్యాటినును అభ్యసించిన వారెంకను అరుదు. క్రైస్తవ మతాధికారులును, పురోహితులును, ప్రజలకగమ్యమైన ల్యాటిను భాషలో ఏవేవో వాక్యములను, పదములను ఉచ్చరించి, మత విషయిక క్రియాకలాపములను సాగించెడివారు. ఇట్టి కార్య కలాపములపైననే తమ ఆధ్యాత్మిక క్షేమమాధారపడియున్న దని ఆనాటి ప్రజలు నమ్మెడివారు. కావున క్రైస్తవ మత సంఘమున కా యుగమున సామాన్య ప్రజలలో అపారమగు పలుకుబడి యుండెడిది. మధ్యమ యుగమందు క్రైస్తవ మతాధికారులు, సన్యాసులు, పాదిరీలు మాత్రమే విద్య నేర్చి యుండిరి. కావున రాజులకు మంత్రులుగను, సలహాదారులు గను కూడ మతగురువులు వ్యవహరించుచు వచ్చెడివారు. ఇంగ్లాండు దేశ చరిత్ర యిందులకు సాక్ష్య మొసంగుచున్నది. ఆధ్యాత్మిక లౌకిక విషయములలో యావత్తు ఐరోపాఖండము నందును కూడ అత్యున్నత స్థానము సధిష్ఠించియున్న క్రైస్తవ మతాధికారుల కందరకును రోము నగరమునందలి పోపు గురువు సార్వభౌమునివంటి వాడు. ఆయనకు గల గౌరవ ప్రతిష్ఠలును, అధికార ధనబలములును, ఏ చక్రవర్తికిని తీసిపోవునట్టివి కావు. అందువలననే మతాధికారులైన పోపులు లౌకికాధికార సంప న్నులైన చక్రవర్తితో సుమారు రెండు శతాబ్దముల కాలము (1073-1250) తమ ఆధిక్యతకొరకై తీవ్ర వివాదముల సాగిం చిరి. ఇట్టి వివాదములే మొదటి హెన్రీ, రెండవ హెన్రీ రాజుల కాలములో ఇంగ్లాండు నందుకూడ సాగెను. రెండవ హెన్రీ

రాజువంటి బలవంతుడైన ప్రభువుకూడ క్రైస్తవ మతసంఘ మును లొంగదీయ జాలక, అవమానము పాలయ్యెను. ఆతని కుమారుడు జానురాజు పోపు మతగురువునకు పాదాక్రాంతు డయ్యెను. కాని క్రమముగ క్రైస్తవ మత గురువులకు ప్రజానీకము నందుగల గౌరవమును, పలుకుబడియు క్షీణించెను. మతాధికారులు ఉన్నత ఆధ్యాత్మిక లక్ష్యసాధనకై కృషి చేయుట మాని, సామాన్య జనులవలెనే ధనముకొరకును, అధి కారము కొరకును, పెనగులాడ సాగిరి. వారి వ్యక్తిగత జీవి తములో కూడ పెక్కు లోపములు ప్రవేశించెను. ఈ కారణ ములవలన మతాధికారుల మూలముగ మాత్రమే ఆధ్యాత్మిక క్షేమము సాధించబడునని ప్రజ లింతవరకును తలంచిన తలం పులు మార్పు చెందెను. ఈ మార్పునకు నిదర్శనముగ John Wyclif వంటి సంస్కర్త లుద్భవించిరి. ఆతడు ఆనాటి మత గురువుల జీవితమును తీవ్రముగ విమర్శించుటయే కాక, ప్రజలలో క్రైస్తవ మతమును గూర్చిన సత్యమైన జ్ఞానమును పెంపు కావించుటకై బైబిలు గ్రంథమును ఆంగ్లభాషలోని కనువాదము కావించెను. క్రైస్తవ మతసంఘము వారి గౌరవ ప్రతిష్ఠలు 14, 15 శతాబ్దులలో క్షీణించినట్లు తెల్పు టకు మరియొక నిదర్శనము చూపవచ్చును. తనపై తిరుగు బాటు కావించెనను నేరముపై నాల్గవ హెన్రీరాజు యార్కు మతాధికారి (Archibishop of York) తల కొట్టించెను. కాంట ర్బరీ మతాధికారియైన Thomas Becket ను చంపించి నందు

లకై రెండవ హెన్రీవంటి బలవంతుడైన రాజు చాల అవమాన మునకు గురి యయ్యెను. కాని అతనికంటె పెక్కు మడుం గులు తక్కువవాడైన నాల్గవ హెన్రీ ఇదేఅపరాధము కావించి నను, ఆతనిని ప్రజానీకము నిందార్హునిగ తలంచినట్లు కాన రాదు.

మధ్యమ యుగమునందు పోపు మతాధికారులు ఇరువురను తమ శత్రువులుగ భావించి, వారిపై నిరంతర యుద్ధములు సాగించవలసినదని క్రైస్తవ ప్రపంచమును సర్వవిధముల ప్రోత్స హించిరి. ఈ శత్రువులలో మొదటివారు మహమ్మదీయులు. వీరు క్రైస్తవ పుణ్యక్షేత్రమగు జెరుసలేమ్ నగరమును, పాల స్తీనా దేశమును ఆక్రమించు కొనిరి. మహమ్మదీయుల నా ప్రాంతములనుండి తరిమివైచి, జెరుసలేమ్ పాలస్తీనాలను క్రైస్తవుల పరిపాలనలోనికి తీసికొనివచ్చుటకు Crusades అనబడు మత యుద్ధములు సాగింపబడెను. పోపుమతాధికారు లీ యుద్ధ ముల ప్రోత్సహించుటకై తమసర్వశక్తులను ఉపయోగించిరి. ఆనాటి రాజులు, ఉన్నత వంశీకులు, జమీందారులు, యోధా గ్రేసరులు మున్నగువారు ఈ పవిత్ర యుద్ధములందు పాల్గొని, తమ ధన ప్రాణముల నర్పించిరి. పోపు మత గురువుల యాగ్ర హమునకు గురియైన వారిలో రెండవవారు మత సంస్కర్తలు. ఆనాటి మతసంఘపు ఏర్పాట్లకు విరుద్ధముగ ప్రచారము చేసిన వారును, ప్రతి క్రైస్తవునకును ఆధ్యాత్మిక విషయములలో తన అంతరాత్మ ప్రబోధము ప్రకారము వర్తించుటకు హక్కు

గలదని బోధించువారును, క్రైస్తవ మతవిరోధు (heretics) లని క్రైస్తవ మతసంఘము చాటెను. ఇట్టి మతవిద్రోహులను దండించుటకు ప్రత్యేకమగు మత న్యాయస్థానము లేర్పాటు కావింపబడెను. రాజులలో కొందరు ఇట్టి మతవిరుద్ధ ప్రచారము నరికట్టుటకై క్రూర శాసనముల కావించి, వాని నమలు చేయుటకు మతాధికారులకు సంపూర్ణ స్వేచ్ఛయిచ్చిరి. నాల్గవ హెన్రీరాజు మత విరోధులను సజీవముగ దహనము చేయవలె నని ఒక శాసనము చేసెను. ఆతని కుమారుడు ఐదవహెన్రీ Lollards అనబడు వాదిరీలను వెదకి వెదకి మంటలలో కాల్పించి చంపెను. దయాదాక్షిణ్యములు క్రైస్తవ మతమునకు పునాది రాళ్ళు అనదగిన ధర్మములు. ఈ ధర్మములను మధ్యమ యుగమునాటి క్రైస్తవు లెంత చక్కగ పాటించెడివారో పై యంశములు తేటతెల్లము చేయుచున్నవి.

మధ్యమ యుగమునాటి క్రైస్తవులలో అపారమైన మూఢత్వమును, తత్ఫలితముగ నిర్దాక్షిణ్యమును ప్రబలి యుండుట గమనింపదగినది. ఏ కారణమువలననో కాని ఆ యుగమునాటి ప్రజలు మంత్రగాండ్రు, మంత్రకత్తెలు, ప్రయోగములు చేయుట మొదలైన వానిని సత్యమని దృఢముగ నమ్మెడివారు. మంత్రకత్తెలు ప్రజానీకమున కపారమగు హాని కావింతురని విశ్వసించి, మధ్యమయుగపు క్రైస్తవ ప్రజలు, మంత్రకత్తెలని యనుమానమున్న వారిని వెదకి పట్టుకొని. చంపెడివారు. ఫ్రెంచిదేశభక్తురాలైన జోన్ ఆఫ్ ఆర్కు

కన్యను మంత్రకత్తె అను నేరారోపణచేసి, ఆంగ్లసైన్యాధిపతులు ఫ్రాన్సు దేశమందలి Romen పట్టణములో 1431వ సంవత్సరమున సజీవముగ దహనము చేయించిన విషయము చరిత్రజ్ఞానము కలవారి కందరికిని తెలియును. ఆరవ హెన్రీ రాజు కాలమున ఆతని పినతండ్రియైన Duke of Gloucester భార్యపై మంత్ర కత్తెయను నేరము మోపబడెను. ఆమె రాజైన ఆరవ హెన్రీ బొమ్మను మైనముతో చేసి, దానిని నిప్పుసెగకు దగ్గరగ పెట్టు చుండెడి దనియు, అందువలన క్రమముగ ఆ బొమ్మ కరిగి పోవ జొచ్చెననియు, మైనపు బొమ్మతోపాటు రాజుగారి ఆరోగ్యము కూడ క్షీణింపసాగెననియు ఆయన పక్షమువారు ఆరోపణచేసిరి. ఈ నేరముపై గ్లస్టరు ప్రభువు భార్యను నిర్బంధములో నుంచిరి. రాజుగారిపై మంత్రప్రయోగము చేసిన నేరమునకై గ్లస్టరు ప్రభ్విచే పశ్చాత్తాప సూచకములైన దుస్తులు ధరింపజేసి, ఆమెను పాదరక్షలు లేకుండ లండను నగరపు వీధులలో మూడుదినముల పాటు త్రిప్పించి, తుదకు ఆమెను శత్రువులు యావజ్జీవము కైదులో పడవేసిరి. ఈ మంత్రములలో ఆమెకు సహాయపడిన వారికి మరణ శిక్ష విధింపబడెను. మూడవ రిచర్డు రాజు తన యన్నయైన నాల్గవ హెన్రీ భార్య తనపై ప్రయోగము చేసిన దనియు, అందువలన తన దేహము ఎండి పోయెననియు వాపోయెను. అందులకు ప్రతీకారముగ ఆతడు తన జమీందారు లలో నొకడైన హేస్టింగ్సు ప్రభువును ఎట్టి విచారణయు లేకుండ మరణశిక్షపాలు గావించెను.

ఇతర విషయముల మాట యెట్లున్నను క్రైస్తవ మత సంఘము వారు మధ్యమ యుగమునాటి ప్రజలకొక మహోప కారము కావించిరి. క్రైస్తవ సన్యాసులు, మతాధికారులును స్వయముగ గొప్ప విద్వాంసులు. విద్యావ్యాప్తికొరకై వారు ఆయా ప్రదేశములలో విజ్ఞాన కేంద్రములను నెలకొల్పిరి. ఈ విజ్ఞాన కేంద్రములు కాలక్రమమున వికసించి, విశ్వవిద్యాలయ ములుగ పరిణమించెను. పండ్రెండు పదమూడు శతాబ్దులలో Boloqua, Paris, Oxford, Cambridge మొదలైన విఖ్యాత విద్యా కేంద్రములు నెలకొల్పబడెను. మధ్యమ యుగమందు St. Francis of Assissi (1182-1224) వంటి మహాత్మ దయాపరు లైన ఋషి పుంగవులు జన్మించిరి. ఆయన శిష్యులు Friars అనబడెడివారు. వీరు క్రైస్తవ మతధర్మములను ప్రచారము చేయుచు, ప్రజానీకమునకు మతధర్మములతో పరిచయము కల్గించిరి.

మధ్యమ యుగమునందు విఖ్యాతమైన దేవాలయములు, భవనములు నిర్మింపబడెను. ఈ నాటి శిల్పకళ నార్మను శిల్పకళ యనియు, Gothic శిల్పకళ యనియు రెండు విధములుగ నుండెడిది. లండను నగరమునందలి సుప్రసిద్ధమైన Westminster Abbey ఈ యుగమునకు చెందినది. Salisbury అను ప్రదేశమున గల క్రైస్తవ దేవాలయము. మధ్యమ యుగపు నిర్మాణముల కొక చక్కని నిదర్శనము. ఆక్స్ఫర్డు పట్టణమున నార్మనుల శిల్పకళా పద్ధతులను ప్రదర్శించు ఒక దేవళము పండ్రెండవ

శతాబ్దమున నిర్మింపబడి నేటికిని నిలచియున్నది. యార్కు నగరమున Gothic శిల్పకళకు నిదర్శనమైన చక్కని దేవాలయ మొకటి మధ్యమ యుగమున ఆవిర్భవించెను. ఇవి కాక ఆక్స్ఫర్డు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములలో ధనాఢ్యులు మున్నగు వారు తమ పేర కళాశాలా భవనముల నిర్మించిరి.

మధ్యమ యుగమునం దింగ్లాండు దేశములో పెక్కు నగరములు పెంపు చెందెను. ఈ పట్టణములలో చాలభాగము సాక్సను ప్రజల యుగమునాటి గ్రామములు. వివిధ కారణములవలన ఆ గ్రామములు పట్టణములుగ మార్పు చెందెను. వ్యాపార కేంద్రములుగ నుండుటవలనను, నదులపై నిర్మింపబడిన వంతెనలకు సమీపముగ నుండుటవలనను, రేవు స్థానములుగ నుండుటచేతను, గొప్పగొప్ప క్రైస్తవ దేవాలయములకుగాని, జమీందారుల గడీలకుగాని నిలయము లగుటచేతను, చిన్న గ్రామములు క్రమముగ నగరములుగ పరిణమించెను. Bristol, Southampton, Portsmouth, St. Albans, Warwick, Lincoln మొదలైనవి పై యంశములకు నిదర్శనములు. లండను నగరము జల మార్గములకును, స్థల మార్గములకును కూడలి స్థానము. ఇచ్చట సహజమగు గొప్ప రేవు ప్రదేశము కలదు. కావున రోమను చక్రవర్తుల కాలమునుండియు ఈ నగరము విఖ్యాతి చెందియుండెను. తొమ్మిదవ శతాబ్ది యందు ఇంగ్లాండు దేశముపై దండెత్తివచ్చిన డేనులు పెక్కు పట్టణముల స్థాపించిరి. వానిలో Derby, Nothingham,

Leicester, Stamford మున్నగు వానిని పేర్కొనవచ్చును. పూర్వకాలమున ఈ ప్రదేశము లన్నియు ఎవరో ఒక జమీందారు స్వాధీనములో నుండెడివి. జమీందారు ఆ పట్టణపు ప్రజలపై తన యిచ్చవచ్చినట్లు పన్నులు విధించెడివాడు. లేదా అప్పటి ప్రజలనుండి సేవలు కొనెడివాడు. ఉదాహరణముగ జమీందారు అధీనములోనున్న పట్టణపు ప్రజలు, జమీందారు సేద్యపు భూములలో, సంవత్సరమున కొకనాడు జీతబత్తెములు లేకుండ పని చేయవలెను. కొన్ని నగరములు రాజుగారి భూములలోను, మరికొన్ని క్రైస్తవ మతాధికారుల భూములలోను నెలకొని యుండెడివి. ఈ పట్టణవాసులు తమ యజమానులకు పెద్దపెద్ద ధనపు మొత్తములను చెల్లించి, క్రమక్రమముగ స్వాతంత్ర్యమును పొందిరి. అటుపిమ్మట ఆయా పట్టణములు స్వపరిపాలనము కొరకై స్థానిక సంఘముల నెన్నుకొని, స్థానికాధికారుల నియమించుకొని, ఆంతరంగిక విషయములలో సంపూర్ణ స్వాతంత్ర్యమును సాధించెను. స్థానిక స్వపరిపాలనము క్రమముగ జాతీయ స్వపరిపాలనమునకు దారి తీసెను. మధ్యమ యుగమునాటి పట్టణములు ఇరుకుగను, దుర్గంధ భూయిష్టముగను ఉండి, రోగములకు పుట్టినిండ్లుగ విలసిల్లెడివి. కాని ఆనాటి ప్రజలలో సౌందర్య పిపాస మిక్కుటముగ నుండెడిది. కావున వారు తమ నగరములలో అందమైన దేవాలయములను, భవనములను నిర్మించెడివారు. స్త్రీలును పురుషులును కూడ అందమైన రంగులు గల దుస్తులను ధరించి, చూడ ముచ్చటగ నుండెడివారు.

ఆనాటి పట్టణములు ఒక ప్రత్యేక జనావాసముగ వర్తించుచు, ఇతర పట్టణవాసులను తమ హద్దులలోనికి రానిచ్చెడివి కాదు. ఒక నగరమువారి కితర పట్టణములవారు విదేశీయులు. వారు మన పట్టణములోనికి రాదలచినచో కొంత పన్ను చెల్లించవలసి యుండెను. ప్రతి పట్టణమునందును Guilds అనబడు సంఘము లుండెడివి. వర్తక సంఘములు, వృత్తిసంఘములును వీనిలో ముఖ్యముగా పేర్కొనదగినవి. వర్తక సంఘములవారు ప్రజల కవసరమైన ఆహారపు దినుసులు, మద్యము మొదలైన నిత్యావసర వస్తువులను సేకరించి, వానిని అమ్మెడివారు. ఆహార పదార్థముల ధరలు ముఖ్య వస్తువుల ధరల ప్రకారము నిర్ణయింప బడెడివి. వర్తకులందరును నాణ్యమైన వస్తువులను, సరసమైన ధరలకు, అమ్మవలెను. వర్తక సంఘమువారి నిర్ణయములకు వ్యతిరేకముగ హెచ్చు ధరలను తీసికొనిన వర్తకులను, వర్తక సంఘము శిక్షించెడిది. వర్తక సంఘములతోపాటు వృత్తి సంఘములు కూడ ఆనాడు నెలకొని యుండెను. స్వర్ణకారులు, సాలెవాండ్రు, కుట్టుపని వాండ్రు, వడ్రంగులు మొదలైనవారికి ప్రత్యేక సంఘము లుండెడివి. ఆయా వృత్తులలో ప్రవేశింపదలచిన బాలురు, ఏడు సంవత్సరముల కాలము, ఒక వృత్తి నిపుణునివద్ద పని నేర్చుకొని, ఆ పిమ్మట స్వతంత్రముగ తమవృత్తి కేంద్రము నేర్పాటు చేసికొనెడివారు. ఆయా వృత్తులలో పనిచేయు వారి కే వేతనములు లభించవలెనో, వృత్తి సంఘములు నిర్ణ

యించెడివి. వర్తక సంఘములును, వృత్తి సంఘములును, తాము సంపాదించిన ధనములో కొంత భాగము ధర్మకార్యములకు వినియోగించెడివి. మఠములకును, క్రైస్తవ దేవాలయముల కును, వీరు విరాళము లిచ్చెడివారు. ప్రజల కానందమును చేకూర్చుటకును, నీతి బోధ కావించుటకును, ఈ వ్యాపార సంఘములవారు, మత ధార్మిక విషయికములగు నాటకముల ప్రదర్శింపించెడివారు. ఈ ప్రదర్శనములే కాలక్రమమున ఆంగ్ల నాటక రచనా వికాసమునకు దోహద మొసంగెను. వర్తక వృత్తి సంఘముల వారు సాంఘిక సేవకూడ చేసెడివారు. ఎవ రైన నగరపౌరుడు దురదృష్టము వలన నిరుపేదయై పోయిన పక్షమునను, లేక అంగవైకల్యము చెందినను, లేదా వార్ధక్యము చేతను రుగ్మతవలనను జీవనోపాధిని కోల్పోయినను, అట్టివారికి సంఘములు తమ ధర్మ నిధినుండి కొంత ధనసహాయము చేయుచు వచ్చెడివి.

మధ్యమ యుగమునందు ఇంగ్లాండు దేశపు పరిస్థితులను సూక్ష్మముగ గమనించినచో, ఆ కాలమున ప్రజానీకము క్రమ క్రమముగ అభివృద్ధిని సాధించినట్లే మనము భావింప వచ్చును. క్రైస్తవ మతమును స్వీకరించుట వలన ఆంగ్లప్రజలు తమ ధూర్తత్వమును, అనాగరక ప్రవర్తనమును విడనాడి, సభ్యత్వము గల ప్రజలుగ మారిరి. క్రైస్తవ మతము ఈ ప్రజ లను ఏకసూత్రముచే బంధించెను. మతగురువుల బోధనల వలన ప్రజానీకములో సత్యవర్తనము, సదసద్వివేకము, స్వార్థరా

హిత్యము, దేశభక్తి, రాజభక్తి, సంఘశ్రేయోభిలాష మున్నగు సద్గుణములు పెంపుచెందెను. వారిలో విద్యాధికులైన వారు కేవలము కూపస్థమండూకములవలె నుండక, మతసంఘము నందేర్పడిన లోపముల తొలగింప వలెననియు, సంస్కరణముల ప్రవేశపెట్ట వలెననియు ప్రయత్నించినట్లు చూపుటకు John Wyclif వంటి మత సంస్కర్తల కృషియే తార్కాణము. ఆంగ్లో సాక్సను రాజుల కాలమందే ఫ్యూడలు (జమీందారు) విధానము ఆంగ్ల సమాజమునందు ప్రవేశించెను. నార్మను ప్రభువుల కాల మందు ఈ జమీందారీ విధానము బాగుగా బలపడెను. ఈ పద్ధతి వలన భూస్వాములు ధనవంతులై బలపడుటయే కాక, భూవసతి లేని సామాన్య ప్రజలను ఇంచుమించు బానిసలుగ మార్చివేసిరి. జమీందారు తనకు లోబడియున్న ప్రజలనుండి అనేక విధము లైన పన్నులను, సేవలను గొని, వారిని పలువిధముల బాధించెడి వాడు. 14 వ శతాబ్దియందు చెలరేగిన నల్లజాడ్యము (Black Death) ఆంగ్ల సమాజమునందలి మూడవవంతు జనమును తన పొట్టబెట్టుకొని, దేశమున కపారమగు నష్టమును కల్గించెను. కాని ఈ మహానర్థమువలన సంఘములో గొప్ప సంచలనము కల్గెను. భూవసతి లేని వ్యవసాయ కూలీలు తొల్లింటివలె జమీం దారులకు బానిసలుగ నుండుటకు నిరాకరించిరి. వ్యవసాయ దారుల తిరుగుబాటు (Peasants Revolt) వంటి విప్లవాత్మకమైన సంఘటనలు పై మన స్తత్వమునకు ప్రతిధ్వనులే కాని మరేమియు కావు. మొట్టమొదటిలో భూస్వాములీ స్వాతంత్ర్యోద్యమమును

ప్రతిఘటించినను, తుదకు వారు ఫ్యూడలు యుగమునాటి బానిసతన మంతరించుట కంగీకరింపవలసి వచ్చెను. ఈ విధముగ మానవ సంఘమునకు కళంకమగు బానిసపద్ధతి రూపుమాసెను. పెద్ద జమీందారులతో పాటు చిన్నతరహా భూస్వాములు ఇంగ్లాండులో తలచూపిరి. వీరిని ఆంగ్లమున Gentry అని పిల తురు. ఒకవంక వీరును, వేరొకవంక పట్టణములలోని వ్యాపారులు, వృత్తినిపుణులు మొదలైన వారును చాల శ్రమించి పనిచేసి తమ ఆర్థికస్థితిని మిక్కిలి మెరుగు పరచుకొనిరి. ఈ విధముగ ఇంగ్లాండులో మధ్యతరగతి యొకటి యేర్పడెను. అదృష్టవశమున ఇంగ్లాండు దేశములో శాశ్వతమగు జమీందారీ వర్గము ఏర్పడలేదు. ఈ ఉన్నతకుటుంబములలో జన్మించినవారే పలువురు సామాన్యకుటుంబములతో వివాహబాంధవ్యములు కల్పించుకొని, మధ్యమ తరగతి పౌరులుగ పరిణమించిరి. ఈ మధ్యమ తరగతులవారు చేయుటవలననే ఆంగ్ల దేశపు పార్లమెంటు జాతీయ మహాసభగ పరిణమించెను. ఈ మధ్యమతరగతుల వారే భావి కాలమున పార్లమెంటు సభ కపారమగు బలమును చేకూర్చి, ఆంగ్ల రాజ్యాంగమునందు దానికి ప్రథమ స్థానము సంపాదించిరి. ఉన్నత వర్గమునకు చెందిన జమీందారులు చాల వరకు స్వార్థపరులై నిరంతరము తమలో తాము కలహించుటయో, లేక రాజుపై తిరుగుబాటు చేయుటయో సాగించెడి వారు. గులాబీల యుద్ధములలో ఈ జమీందారులలో

అధిక సంఖ్యాకులు నశించుట ఇంగ్లాండు ప్రజల క్షేమమున కెంతయో సహాయకారి యయ్యెను.

మధ్యమ యుగమునాటి ఇంగ్లీషు రాజులలోను, జమీందారులలోను పెక్కండ్రు యోగ్యులుండిరనుట నిర్వివాదాంశము. ధైర్యసాహసములు, బలపరాక్రమములు, రాజనీతి చతురత మున్నగు లక్షణములు వారిలో సర్వసామాన్యముగ నుండెడివి. విద్యాసంస్కారములు, లలిత కళాభిమానము మున్నగు లక్షణములుకల జమీందారులు రాజులుకూడ ఆ కాలమున కొందరుండెడివారు. కాని ఆ కాలమున నున్నత సంగతుల వారిలో సార్వత్రికముగ వ్యాపించి యుండిన దుర్గుణము క్రౌర్యము. రాజులు తమపై తిరుగుబాటు కావించిన జమీందారులను తరచుగ తలలు కొట్టించెడివారు. ఇట్లు ప్రాణములు బాసిన భూస్వాములు లెక్కకు మించి యున్నారు. అయినను దేశక్షేమమును, శాంతి భద్రతలను దృష్టియందుంచుకొని రాజులు వహించిన ఈ కాఠిన్యము క్షంతవ్యమని అంగీకరింపవగును. కాని రాజపీఠము నలంకరించు ప్రభువులు తమ పిన తండ్రులను, ఏకోదరులైన సోదరులను, పినతండ్రి కుమారులను, అన్నదమ్ముల కుమారులను, నిర్దాక్షిణ్యముగ చంపించుట చాల బాధాకరమైన విషయము. ఇట్టి సంఘటనలు మధ్యమ యుగమునం దింగ్లాండు దేశమున నెన్నియో సంభవించెను. ముఖ్యముగ రెండవ రిచర్డురాజు కాలమునుండి ఈ దారుణ శిరచ్ఛేదములు విపరీతముగ పెరిగిపోయెను. లంకాస్టరు యార్కువంశ

ముల వారి రాజ్యకాలము జమీందారుల పరిపాలనా యుగమని వర్ణింపవచ్చును. ఈ యుగమునందు రాజులును, వారికి సలహాదారులైన మంత్రివర్గము వారును తరచుగ మారుచుండెడి వారు. అట్టి సందర్భములలో పరపక్షమునకు చెందిన జమీందారుల శిరస్సులు శిశిర ఋతువునందు నేలరాలు ఆకులకంటె హెచ్చుసంఖ్యలో నేలపడి పొర్లాడెడివి. ఆ కాలపు జమీందారులకు సోదర మానవులను చంపించుట, చీమలనో దోమలనో చంపునట్లుగ కానవచ్చెడిది కాబోలు. మధ్యమ యుగమునాటి సంఘటనలలో మరియొక అంశ మింతకంటెను జుగుప్సాకరమైనది కలదు. రాజులకు దయాగుణము ఉత్తమ లక్షణము. నిరపరాధులగు వారిని చంపుట వారి కెంతమాత్రమును తగదు. కాని మహావీరుడైన ఐదవ హెన్రీరాజు Agnicowt రణరంగమున తన చేజిక్కిన ఫ్రెంచి వీరులను పెక్కండ్రను మిక్కిలి క్రూరముగ చంపించెను. మూడవ ఎడ్వర్డురాజు జ్యేష్ఠ పుత్రుడైన నల్లరాకుమారు డాకాలమునాటి మహావీరులలో నొకడు. అట్టి యోధాగ్రేసరుడు ఫ్రాన్సు దేశముపై దండెత్తిపోయి, నోరులేని ప్రజలను నిర్దాక్షిణ్యముగ దోచుకొనుటయే కాక, వారి యిండ్లను పరశురామ ప్రీతి చేసెడివాడు. 1370 వ సంవత్సరమున ఈ ఆంగ్లవీరుడు Limoges అను పట్టణమును వశపరచుకొనెను. ఏ కారణమువలననో నల్లరాకుమారుని కా పురవాసులపై ఆగ్రహము కలిగెనట. క్రోధపిశాచావిష్టుడై ఈతడు

బాలురు, స్త్రీలు, వృద్ధులు, అను భేదము లేకుండ 3000 మంది పౌరులను చంపించెను. ఆ నిర్భాగ్యుల ఆక్రందనములు రాకుమారుని చెవిలో చొరలేదు. ఆతని హృదయమును కరగింపలేదు. ఇట్టి సంఘటనలు మానవుని కీర్తి ప్రతిష్ఠలకు చెరుపరాని కళంకమని వేరుగ తెలుప నవసరము లేదు.

—:o:—

# అకాడమీ ప్రచురణలు

1. తురుష్క ప్రజాస్వామికము — డా. అ. కాశేశ్వరరావు — రు 3-00
2. ఆఫ్రికా జాతీయోద్యమము — శ్రీ డి. వి. శివరావు — రు 4-00
3. ఈజిప్టుదేశ చరిత్ర – అరబ్బు జాతీయత — డా. అ. కాశేశ్వరరావు — రు 4-00
4. మన పార్లమెంటు — శ్రీ యం. అనంతశయనం అయ్యంగారు — రు 1-50
5. శ్రీకృష్ణదేవరాయలు — శ్రీ కె. రాఘవాచారి — రు 4-00
6. భూమి — డా. యస్. బాలకృష్ణ — రు 0-75
7. హర్షవర్ధనుడు — శ్రీ కె. రాఘవాచారి — రు 3-00
8. చైనా విప్లవము — డా. అ. కాశేశ్వరరావు — రు 6-50
9. జ్యోతిర్వేదము — కీ. శే. శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావు — రు 3-00
10. పిల్లల శిక్షణా సమస్యలు — ప్రొఫెసర్ కె. వేదాంతాచారి — రు 3-00
11. ఆంధ్రదేశమునందు ఖనిజములు - పరిశ్రమలు సంకలనము — రు 1-50
12. అమెరికా సంయుక్త రాష్ట్రములు - మొదటి సంపుటము — డా. అ. కాశేశ్వరరావు — రు 4-00
13. అమెరికా సంయుక్త రాష్ట్రములు – రెండవ సంపుటము — డా. అ. కాశేశ్వరరావు — రు 4-00
14. బ్రిటను దేశ చరిత్ర — శ్రీ కె. బాలేందుశేఖరం — రు